

కథా కార్యశాల ప్రారంభోపన్యాసం చేస్తున్న తెలకపల్లి రవి, వివిధ కథాంశాలపై మాట్లాడుతున్న ఓల్గా, పి. చంద్రశేఖర్ ఆజాద్, మహ్మద్ ఖదీర్‌బాబు




జనార్ధన్ మహర్షి, లెనిన్ ధనిశెట్టి, స్వీయ కథ విశ్లేషణ చేస్తున్న కుప్పిలి పద్మ, ఎడమ నుండి జి. ఉమామహేశ్వర్, యాళ్ల అచ్యుతరామయ్య, శిరంశెట్టి కాంతారావు, కె. ఆనందాచారి, బారహమతుల్లా, వేంపల్లి షరీఫ్



సాహిత్య ప్రకాశ్ కథాసంపుటి ఆవిష్కరిస్తున్న శిరంశెట్టి కాంతారావు

పేర్లు నమోదులో సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ బృందం జి. యాదగిరి రావు, శాంతిశ్రీ, టి. కిశోర్, రామకృష్ణారెడ్డి

కార్యశాల కార్యకర్తలు లక్ష్మయ్య, వొరప్రసాద్, తంగిరాల చక్రవర్తి వేదుల రామకృష్ణ, గేరా, వెంకటి, నరేష్, మోహనకృష్ణ



ఉదయం 11 గంటలకు మొదలైన కథాకార్యశాల రాత్రి 8.30 గంటల వరకు జరిగింది.
ఉత్సాహంగా పాల్గొన్న ఔత్సాహికులు, సాహిత్యాభిమానులు, రచయితలు

ఫోటోలు: గేరా

VPVMOLA109

సాహిత్య

# ప్రస్థానం

సంపుటి : 12 నవంబర్ & డిసెంబర్ 2013 సంచిక : 11

మా మాట
తెలకపల్లి రవి

## కథావలోకన వేళ...

సాహితీ స్రవంతి చేసిన మరో నూతన ప్రయత్నమే సాహిత్య ప్రస్థానం ప్రత్యేక సంచికగా మీ చేతుల్లోకి వస్తున్నది. హైదరాబాదులో జరిగిన కథా కార్యశాల ప్రసంగాలూ స్పందనలూ విశేషాలతో పాటు తెలుగు కథా పరిణామానికి సంబంధించిన వివిధాంశాలను ఈ సంచికలో పొందుపర్చే ప్రయత్నాలు చేశాం. వివిధ కోణాలను ప్రతిబింబించే విస్తృతాంశాలు కూర్చిన రీత్యా ఇది అరుదైన సంచిక అవుతుందనే అనుకుంటున్నాము.

రచన, శిల్పం, చరిత్ర, వైతాళికుల విశిష్టతలు తెలిపే కొన్ని రచనలు గత ప్రచురణల నుంచి తీసుకున్నా అవి ఒక చోట వుండటంలోని సౌలభ్యంతో ఎవరైనా ఏకీభవిస్తారు. పైగా మనం ప్రాంతీయ ఉద్యమాలు, అస్తిత్వ వాదోపవాదాలు సాగుతున్న ఘట్టంలో వున్నాము. వీలైన మేరకు వివిధ తరాల వేర్వేరు ప్రాంతాల ప్రముఖ కథకులను కథల వరవడిని క్రోడీకరించే వ్యాసాలను ఎంపిక చేసుకున్నాము. ఔత్సాహికులు, నూతన రచయితల కోసం రచన శిల్పం మెళకువల గురించిన సూక్తులు వ్యాసాలు కూడా అవసరమే అనిపించింది. ఈ క్రమంలో సంప్రదాయికంగా అనుసరించే పద్ధతులు పొందికల నుంచి కొంతవరకూ వైదొలగడం అనివార్యమైంది. ఇక ఈ సందర్భంలో కృతజ్ఞతలతో పాటు క్షమాపణలు కూడా చెప్పాల్సింది పునర్ముద్రించిన వ్యాసాల విశ్లేషణల మూల రచయితలకూ వాటి ప్రచురణ కర్తలకూ. వారి నుంచి అనుమతి కోరితే తప్పక లభిస్తుందనే భరోసాతోనే చివరి నిముషంలో వచ్చిన మా ఆలోచనలను చకచకా అమలు చేశాం.

గతంలో ప్రస్థానం ప్రచురించిన కొన్ని ప్రత్యేక సంచికలకు విశేష స్పందన వచ్చి పునర్ముద్రణలు కూడా అవసరమైనాయి. ఇది కూడా ఆ కోవలోనే ఆదరణ పొందాలని మా ఆకాంక్ష. ఇప్పటికీ అనేక మందికి సంబంధించిన ప్రస్తావనలూ రచనలూ చిత్రాలు ఇందులో పొందుపర్చడం సాధ్యపడలేదు. ఈ రీత్యా ముందు ముందు దీని కొనసాగింపుగా మరో సంచిక అవసరం కావచ్చు. కథా కార్యశాలకు హాజరైన వారు కొందరు పంపిన కథలు కూడా స్థలాభావం తదితర కారణాల వల్ల ముద్రించలేకపోయాము. అయితే వాటి జాబితా మాత్రం ఇచ్చాము. వాటిని క్రమేణా ముద్రిస్తూ వాటి మంచి చెడ్డలు చర్చించే ప్రయత్నం చేయగలము.

2013కు ఇది విలువైన వీడ్కోలుగా మిగిలిపోతే అంతకన్నా కావలసింది లేదు. దీనిపై మీ స్పందనలూ సూచనలూ విమర్శలూ పంపితే సంతోషం.

సంపాదకవర్గం

తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వొర ప్రసాద్
వల్లభాపురం జనార్దన

కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా

సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in
ssprasthanam@gmail.com
www.prasthanam.com

ముఖ చిత్రం : అక్బర్

# ఈ సంచికలో...

# 1





★ తెలకపల్లి రవి



# ప్రారంభోపన్యాసం



> నిర్మాణాత్మకమైనటువంటి పద్ధతుల్లో ఒక నిబద్ధమైనటువంటి ఒక విశాల దృక్పథంతో అందర్నీ సమావేశపరిచి ఒక అర్థవంతమైన ప్రక్రియ జరపటం సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ముందునించి మీరు చూస్తున్నారు. జనకవనం మొదలైంది. జనకవనం మొదలైన తర్వాత జనకథనం జరపాలని ఒక ఆలోచన అప్పుడే వచ్చింది.

ఎందరో మహానుభావులు ఎందరికని వందనాలు అని... మేము ఔత్సాహికుల కోసమే ఉద్దేశించినా చాలా మంది పెద్దలు, ప్రముఖులు వచ్చారు. విశేషం ఏమిటంటే ప్రసిద్ధ కథకులు వీళ్ళందరితోపాటు డాక్టర్లు, ఇంజనీర్లు లాంటి వృత్తినిపుణులు మన సమావేశంలో ఉన్నారు. వారందరికీ కూడా సాహితీస్రవంతి తరఫున స్వాగతం పలుకుతున్నాను. సాహితీ స్రవంతి గురించి మీకు తెలుసు. రాష్ట్రంలో ఇప్పుడున్న వాతావరణంలో ఈ సభ సాహితీస్రవంతి మాత్రమే నిర్వహించగలుగుతుందని అందరికీ తెలుసు. ఒక అనిశ్చితి ఒక విధమైనటువంటి అసౌకర్యమైన వాతావరణం ఏర్పడినటువంటి పరిస్థితుల్లో నిర్మాణాత్మకమైనటువంటి పద్ధతుల్లో ఒక నిబద్ధమైనటువంటి ఒక విశాల దృక్పథంతో అందర్ని సమావేశపరిచి ఒక అర్థవంతమైన ప్రక్రియ జరపటం సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ముందునుంచి మీరు చూస్తున్నారు. జనకవనం మొదలైంది. జనకవనం మొదలైన తర్వాత జనకథనం జరపాలని ఒక ఆలోచన అప్పుడే వచ్చింది. జనకవనం, కార్యశాల, సాహిత్యశాల ఇవన్నీ కూడా సాహితీస్రవంతి తెలుగు సాహిత్యరంగంలో ప్రవేశపెట్టినటువంటి పదాలు, పథాలు కూడా.

జనకవనం తర్వాత జనకథనం అనే ఆలోచన కూడా వచ్చింది కాని కవనానికి, కథానానికి ఎప్పుడూ ఈ సమస్య వుంది. శ్రీశ్రీ పదండి ముందుకు పదండి తోసుకు అంటే మనం ఉద్రుతలూగినట్టుగా అదే శ్రీశ్రీ రాసిన కోనేటి రావు కథలకు చేయలేం. వాటిని చదవటానికి వచ్చేసరికి దాన్ని ఎలా అర్థం చేసుకోవాలి. దాన్ని ఎలా రాశాడు అందులో అనుసరించిన శిల్పం ఏది ప్రశ్నలు మనకు వస్తాయి. కవిత్వం అక్షర ప్రధానం, ఆవేశ ప్రధానం, అనుభూతి ప్రధానం. కవిత తక్షణ స్పందనకు ఒక ప్రతీక అనుకుంటే కథ, నవలా ఇటువంటి అంతకంటే కూడా చాల విస్తృతమైన, విశాలమైన జీవన దృశ్యాల్ని ఆవిష్కరించేటటువంటి ప్రకియలు కాబట్టి వాటి సృజన, వాటి ఆస్వాదన, వాటి విమర్శన ఇవన్నీ కూడా లోతుగా తెలుసుకోవలసినటువంటి అంశాలుగా వుంటాయి కాబట్టి ఈ జన కథనం అనేది భిన్నంగా ఎలా జరపాలి అనే

ఆలోచన ఒక రూపం తీసుకోవడానికి హైదరాబాద్ నగర కమిటీ తలపెట్టిన ఈ ప్రయత్నం దోహదం చేస్తుందని నేను భావిస్తున్నాను. ఇందులో ఉపన్యాసాలు ఒక భాగం, స్వీయకథల విశ్లేషణ ఒక భాగం. ఆ తరువాత సందేహాలకు సమాధానాలు వీటన్నింటి ద్వారా జనకథనం అనే ఒక ప్రక్రియ కవనం చదివినట్టుగానే ఇక్కడ కొంత పూర్తి అవుతుంది. స్థానికంగా మొదలుపెట్టిన ఒక ఆలోచన ఇంత విస్తృతంగా పరిణమించి ఇంతమంది మీరు ఇక్కడికి వచ్చారు అంటే కథలు రాయాలి? ఆ కథలు ఎలా రాయాలి? లేకపోతే దానికి సంబంధించిన విషయాలు తెలుసుకోవాలి అనే కథన కుతూహలం ఎంత ఎక్కువగా వుందన్నది మిమ్మల్ని చూస్తే అర్థం అవుతుంది.

బహుశా దీనికి ఇంకొక కారణం కూడా వుండొచ్చు. కథలు చెప్పేవాళ్ళు ఎక్కువవుతున్నారు. కోదాడకు ముందు ఒక కథ చెబ్తున్నారు. కోదాడ దాటితే ఒక కథ చెబ్తున్నారు. మహబూబ్‌నగర్ వరకు ఒక కథ చెబ్తున్నారు. దాటి కర్నూలుకు పోతే ఒక కథ చెబ్తున్నారు. ఈ కథలు విని విని విసిగిపోయి అసలు మీ కథేంటో తెలుస్తాము అది తేల్చేటటువంటి చైతన్యం ప్రజలకి ఇస్తాము.. అంటే కథ బాగా ఎలా రాయాలి ఇతిహాసపు చీకటి కోణం అట్టడుగున పడి కాన్పించని కథలన్నీ కావాలిప్పుడు దాచేస్తే దాగని సత్యం అన్నట్టుగా దాచేస్తే దాగని సత్యాలకు కథనరూపం ఇవ్వాలి. దాన్ని మనం నిష్ణాతుల దగ్గర తెలుసుకోవాలి అనే ఆలోచన మిమ్మలందర్ని ఇక్కడికి రప్పించిందని భావిస్తున్నాను.

పదేళ్ళకిందట సాహితీస్రవంతి ఆధ్వర్యంలో మేం జన కవనాలు, సాహిత్యశాలలు జరిపినప్పటికీ ఇప్పటికి వాతావరణం చాలా మారింది. మత, మార్కెట్ తత్వాలు చాలా ప్రకోపిస్తున్నాయి. అప్పుడు కథలూ, కవితలూ గుజరాత్ గాయం పేరిట వచ్చాయి. ఇప్పుడు ఆ గుజరాత్ విధాతే దేశానికి ఆశాదూత అంటున్నారు. అంటే ఇటువంటి సమయంలో కథకుల మీద, రచనలు చేసే వాళ్ళ మీద, ఆలోచనాపరిధి విస్తరించాలని కోరుకునే వాళ్ళ మీద చాలా బృహత్తరమైనటువంటి బాధ్యత వుంటుంది. రాష్ట్రంలో మనం అనుకుంటున్నట్టుగా ఇప్పుడున్న అనిశ్చితిరీత్యా కూడా ఆలోచన ఇంకా లోతుగా చేయాల్సినటువంటి అవసరం కూడా వస్తుందనుకుంటున్నాను.



కథలు రాయటం, కథలు వినటం, కథలు చెప్పటం, కథలు చెప్పటం అందరూ చేస్తారు. ఏరా ఎందుకు స్కూలుకు పోలేదు అంటే కడుపునొప్పి వచ్చిందనే దగ్గర్నుంచి కథ మొదలవుతుంది. కాబట్టి కథలు చెప్పటం అందరూ చెబుతారు. కాని ఆ కథకు ముందు వెనుక ఏంటి? మధ్యలో వాస్తవం ఏంటి? అవాస్తవం ఏమిటి? ఇరవైఏళ్ళ కిందటి వరకు ఒక కథ చెబుతూ వుండేవాళ్ళు అనగనగా ఒక రాజు ఆ రాజుకు ఏడుగురు కొడుకులు ఏడుగురు కొడుకులు వేటకు వెళ్ళారు వేటకు వెళ్లి ఏడు చేపలు తెచ్చారు. ఏడు చేపల్లో ఒక చేప ఎండలేదు. చేప చేప ఎందుకు ఎండలేదు గడ్డిమోపు అడ్డం వచ్చింది. గడ్డిమోపు గడ్డిమోపు ఎందుకు అడ్డం వచ్చావు ఆవు నన్ను మేయలేదు. ఆవు ఆవు ఎందుకు మేయలేదు? గొల్లవాడు మేపలేదు. గొల్లవాడ గొల్లవాడ ఎందుకు మేపలేదు పిల్లవాడు ఏడుస్తున్నాడు పిల్లవాడ పిల్లవాడ ఎందుకు ఏడుస్తున్నావు చీమ కుట్టింది చీమా చీమా ఎందుకు కుట్టావు, నా బంగారు పుట్టలో వేలు పెడితే కుట్టనా.... కథ అయిపోయింది. అంటే కార్యకారణ సంబంధం మీరు ముందునించి చివరివరకు చూడండి. నా పుట్టలో వేలు పెడితే కుడతాను అని చెప్పినటువంటి చీమ సమాధానం చూడండి. చీమ కుట్టింది కాబట్టి ఏడ్చినటువంటి పిల్లవాణ్ని చూడండి. గడ్డిమోపు ఎందుకు నువ్వు అడ్డం వచ్చావు అంటే నన్ను ఆవు మేయలేదు అంది. అంటే ఒక చిన్న జీవితాన్ని తీసుకుంటే ఆ సంఘటన క్రమం ఆ వలయం పాత్రలు, పాత్రధారులు, ఆ పాత్రలు తారుమారు అవ్వడం అన్ని లక్షణాలు ఇంత చిన్న

**స్థానికంగా మొదలుపెట్టిన ఒక ఆలోచన ఇంత విస్తృతంగా పరిణమించి ఇంతమంది మీరు ఇక్కడికి వచ్చారు అంటే కథలు రాయాలి? ఆ కథలు ఎలా రాయాలి? లేకపోతే దానికి సంబంధించిన విషయాలు తెలుసుకోవాలి అనే కథన కుతూహలం ఎంత ఎక్కువగా వుందన్నది మనకు అర్థం అవుతుంది.**

కథలోనే కన్పిస్తాయి. ఇది మనం చిన్నప్పట్నించి విన్న కథ. ఇంకా చాలా ఇటువంటివి అన్నీ కొన్నయినా చెప్పుకునే ప్రయత్నం ఈ కథన శాల.

ఇంతకాలం గడిచిన తరువాత ఇంటర్నెట్ యుగంలోకి మనం ప్రవేశించిన తరువాత ఇంకా చీమల పుట్టలో వేలుపెట్టినటువంటి కథల దగ్గరే మనం ఆగిపోతామా? కథలు చదివేవాళ్ళ పెరుగుదల సంగతి అట్లా వుంచితే అసలు కథలు రాసేవాళ్ల సంఖ్యే అపారంగా పెరిగిపోతున్నటువంటి కాలంలో చదివేవాళ్ళతో చదివించడానికి చదివినవాళ్ళను కదిలించడానికి మరి ఎటువంటి ప్రయత్నం చేయవలసి వుంటుంది అనేది పెద్ద ప్రశ్న. నాకు ఈ పదేళ్ళ ప్రస్థానంలో గాని, అంతకు ముందు గాని ఇప్పుడు ప్రజాశక్తి, వివిధ రూపాల్లో అనేక వందల కథలు ప్రచురణకు ముందు చదివే అవకాశం లభిస్తూ వుంటుంది. బహుశా నాకు తెలిసి ఇప్పుడు ప్రముఖులైన కొంతమంది కథకుల మొదటి కథలు ప్రచురించినటువంటి అనుభవం కూడా వుంది. వాళ్ళతో మాట్లాడి వాళ్ళ కథల శీర్షికలు, ముగింపు మార్చడం వంటివి చేసినవి కూడా వున్నాయి. మౌలికంగా పాత్రికేయుణ్ణి అయినప్పటికి కూడా కథారచనకు సంబంధించి కథల్లో ఎదురయ్యే సమస్యలకు సంబంధించి అనేక ప్రశ్నలు అప్పటికి ఇప్పటికీ శేషప్రశ్నలుగానే వున్నాయి. జవాబులు మనవాళ్ళు చెప్పేటటువంటి వాటిలో మీకు లభిస్తాయి అని నేననుకుంటున్నాను.

మన కథకులు ముఖ్యంగా యువ కథకులు ఇప్పుడు జీవితం యొక్క క్లిష్టతను ఎంత బాగా ఒడిసిపట్టుకోగలుగుతారు దాన్ని ఎంతవరకు ప్రతిబింబించ గలుగుతారు అన్నదాని మీద భవిష్యత్‌లో వాటిని చదవడం, చదివించడం, పాఠకుల్ని పెంచు కోవడం ఆధారపడివుంటుంది. మనం జీవితాన్ని చదవడం, సాహిత్యాన్ని చదవడం, ఈ రెండింటిమీద భవిష్యత్‌లో మనం ఏ మేరకు కథా సృజన చేయగలుగుతాము అన్నది ఆధారపడి వుంటుంది. తెలుగులో చాలా పత్రికలు వున్నాయి. ఇప్పుడు ఇంటర్నెట్ కూడా వచ్చింది. ఇంటర్నెట్‌లో కూడా చాలా మంది కథలు పెడుతున్నారు. సీరియల్‌గా కూడా పెడుతున్నారు. కాని కథలన్నింటిలో ప్రధానంగా కనిపించే లక్షణాలు ఏమిటి? ఇంకా ఇంకా మన మానవ మేథా గవాక్షాలు తెరుచుకుని లోకాన్ని పరిశీలించి ఇంకా ఇంకా ఎక్కువ అంశాలు అందులో ప్రవేశపెడుతున్నామా? ఇంకా ఇంకా లోలోపల చూసుకుని మనము భావిస్తున్నటువంటి అంశాలు– లేకపోతే కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ, ప్రపంచపు బాధంతా శ్రీశ్రీ బాధ అన్నట్టుగా మన బాధను ప్రతిబింబించటానికి మన భావాన్ని ప్రతిబింబించటానికి రాస్తున్నామా అని చూస్తే మాత్రం ఎక్కువ సందర్భాల్లో మన మధ్యతరగతి భావజాలం ఒకవైపు లేదా దానికంటే కింద ఉన్నటువంటి దిగువ తరగతుల యొక్క అస్తిత్వ వేదనలు ఒకవైపు ఈ రెండు అంశాలే ఇప్పటికీ కూడా మన కథల్లో ప్రధానంగా కన్పిస్తున్న అంశం.



ఇంటర్నెట్‌లో కూడా చాలా మంది కథలు పెడుతున్నారు. సీరియల్‌గా కూడా పెడుతున్నారు. కాని కథలన్నింటిలో ప్రధానంగా కనిపించే లక్షణాలు ఏమిటి? ఇంకా ఇంకా మన మానవ మేథా గవాక్షాలు తెరుచుకుని లోకాన్ని పరిశీలించి ఇంకా ఇంకా ఎక్కువ అంశాలు అందులో ప్రవేశపెడుతున్నామా?

ఇందాక నేను చెప్పిన ఇరవై ఏళ్ళ పరిణామ క్రమం ఇది. జీవితాల్లో తెచ్చినటు వంటి ఘర్షణ ఇవన్నీ కనిపిస్తున్నాయా అంటే బాధ ఉన్నంతగా వివేచన కనిపిస్తుందా అంటే అంతగా కనిపించడం లేదనిపిస్తుంది. విశ్వనాధ గారు వేయి పడగలు రాసారు. వేయి పడగలు ఒక సమాజం నా కళ్ళముందే కూలిపోతుంది వేయి పడగలలో ఒక్క పడగే మిగిలింది నీవు మిగిలితివి, నేను మిగిలితిని అని ధర్మారావు అనడంతో ఆ కథ ముగుస్తుంది. నిజానికి ఆయనది వెనుకచూపైనా వేదన వుంది. కాని నేను అనుకోవడం 2013 లో మనం మాట్లాడుతున్నప్పుడు నీవు మిగిలితివి, నేను మిగిలితిని ఎవరేం పట్టించుకోవడం లేదు అనే పద్ధతిలో గనక మనం ఆలోచించేటట్లయితే అప్పుడు మన రచనలు

కానీయండి, దీనికి సంబంధించిన స్పందన కానీయండి దానికదే పరిమితులు ఏర్పడతాయి. కాబట్టే కదిలేది కదిలించేది మళ్ళీ అక్కడికి పోవాల్సివస్తుంది మనం. కదిలేది కదిలించేది, మారేది మార్పించేది పెనునిద్దుర వదిలించేది లాంటి రచనలు మనం గనక చెయ్యాలంటే దానికి ఒక అవగాహన కావాలి. అధ్యయనమూ జరగాలి. ప్రతి కథకి ఒక క్రమం ఎలా వుంటుంది? పాత్రలో శిల్పం ఎలా వుంటుంది? ఈ విషయాలను తెలుసుకోవలసిన అవసరం ఏర్పడుతుంటుంది.

ఇటీవల ముఖ్యంగా వస్తున్న కథలు చదువుతుంటే సగం మాత్రమే మంచి కథలు వస్తున్నాయి. ఉదాహరణకు చాలా ప్రసిద్ధమైన పత్రికలో ప్రతివారం కథ వస్తుంది. ఆ కథ మొదట్లో వాడు నన్ను అపార్థం చేసుకున్నాడు కథ చివరకి నన్ను అర్థం చేసుకున్నాడు. కథ మొదట్లోనే అర్థం అవుతుంది. వీడు అపార్థం తొలగించుతాడు. లేకపోతే అపార్థం కథ రాయాల్సిన అవసరం లేదు కదా! వాడు ఊర్లో దిగుతాడు వాళ్ళ నాన్న యొక్క రెండవ భార్యను ఏదో కలుసుకోవాలి అని. ఏదో తేల్చుకోవాలి తప్పనిసరి పరిస్థితుల్లో ఇక్కడికి వస్తున్నాను అనుకుంటూ వాడు బయలుదేరతాడు. వెళ్ళిన తరువాత వాడు కరుణ రసాన్వితంగా వాడు మళ్ళీ బయటికి వస్తాడు. కనీసం ఇట్లాంటి కథలు కూడా లేవు. వాస్తవంగా కుర్రాళ్ళ కథలు వస్తున్నాయి. కుర్రాళ్ళు వీళ్ళకేం బాధ్యత తెలియదు. మైనర్ బాబులో శోభన్‌బాబు లాగా వీళ్ళుంటారని వాడను కుంటాడు. కథ చివరికి వచ్చేసరికి యువకులు కూడా బాధ్యతగా వుంటారని తెలుసుకుంటాడు. ఇటువంటివి కూడా చాలా తక్కువ. యువతరం కథలు కూడా చాలా తక్కువ. ఎక్కువ భాగం ఒక మధ్య వయస్సుకు సంబంధించినటువంటి మధ్యతరగతి మనోభావాలకు మన దినపత్రికల, వారపత్రికల అనుబంధాలు ఎక్కువగా అవకాశం ఇస్తున్నట్టుగా కనిపిస్తుంది. ఈ మధ్య హాస్య సంజీవని అని వీరేశలింగం గారి ప్రహసనాలు ప్రజాశక్తి బుక్‌హౌస్ పక్షాన పునర్ముద్రించాం. కళ్ళు మిరుమిట్లు గొల్పుతాయి. నూటఇరవై ఏళ్ళ కిందట ఈ మనిషి ఇంత సంచలనాత్మక మైనటువంటి విషయాలు ఎలా రాయగలిగాడు? చిన్న ఖండికలే. ఇంతే వుంటుంది. వాటిలోనే నాటి చాదస్తపు మహిళలతోనే మూఢనమ్మకాలను ఖండించే సందేశం సహజంగా ఇప్పించాడు. కాని మూడు నాలుగేళ్ల కిందట...... చాలా పేరున్న విమర్శకుడు కూడా అయిన ఒకాయన రాసిన కథ. ఒక ఊరికి వెళ్తే ఆ ఊళ్లో తిరునాళ్ళ. చివరకు గణాచారిలో ప్రపంచీకరణ మీద పోట్లాడడానికి మార్గం కనిపిస్తుంది. ఆ కథ అంతా చదివిన తరువాత గణాచారిని చూసిన తరువాత ఓహో ప్రపంచీకరణ మీద పోట్లాడడానికి మనం చాలా సదస్సులు పెట్టాం. చాలా సమ్మెలు చేశాం. ఇదంతా తెలివితక్కువ. ఈ గణాచారిలాగా ఊగిపోతే మనకు పరిష్కారం లభిస్తుందనే నిర్ణయం చేసుకోవాలి! ఇలాటి రచయితల పేర్లు కూడా గుర్తున్నాయి నేను ఇప్పుడు చెప్పడం లేదు.



**మధ్యతరగతి భావజాలం ఒకవైపు లేదా దానికంటే కింద ఉన్నటువంటి దిగువ తరగతుల యొక్క అస్తిత్వ వేదనలు ఒకవైపు ఈ రెండు అంశాలే ఇప్పటికీ కూడా మన కథల్లో ప్రధానంగా కన్పిస్తున్న అంశం మనకు. ఇందాక నేను చెప్పిన ఈ పదేళ్ళ పరిణామ క్రమంలో ఇరవై ఏళ్ళ పరిణామ క్రమం ఇది జీవితాల్లో తెచ్చినటువంటి ఘర్షణ ఇవన్నీ కనిపిస్తున్నాయంటే బాధ ఉన్నంతగా వివేచన కనిపిస్తుందా అంటే అంతగా కనిపించడం లేదు అనిపిస్తుంది.**

పురోగామి భావన లేకపోవడం అటుంచి తిరోగామి భావన కూడా నెమ్మది నెమ్మదిగా ప్రవేశిస్తున్నటువంటి ఒకానొక పరిస్థితి కూడా మన దగ్గర వుంది. చివరగా చాలా మంది కథకులు చాలా ప్రసిద్ధులుగా, స్టార్ రైటర్స్‌గా వున్నటువంటి వాళ్ళు ఇప్పుడు పర్సనాలిటీ డెవలప్‌మెంట్ రాసేవాళ్ళుగా మారిపోయారు. పర్సనాలిటీ డవలప్‌మెంట్‌కు, పర్సనల్ డవలప్‌మెంట్‌కు చాలా తేడా వుంది. ఒక పర్సనాలిటీ రూపొందుతుంది. ఒక సామాజిక నేపథ్యంలో నుండి ఆ పర్సనాలిటీ ఆ సమాజాన్ని ప్రతిబింబిస్తుంది. మంచి లక్షణాలను పెట్టుకుని సమాజాన్ని ఒక అడుగు ముందుకు వేయిస్తుంది. పర్సనల్ డెవలప్‌మెంట్ అంటే అది కాదు. చుట్టూవున్న గుడిసెలన్నీ కూడా నేలమట్టం చేసి ఆ మధ్యలో ఓ పాతిక అంతస్థుల భవనం లేస్తే అది పర్సనల్ డవలప్‌మెంట్. గుడిశలు కూలిపోయాయి అనే

విషయం ఇక్కడ అనవసరం. ప్రసిద్ధ కథకులుగా వెన్నెలలో ఆడపిల్లలను నడిపించిన వాళ్ళు ఎందుకు పర్సనాలిటీ డవలప్‌మెంట్ రైటర్స్‌గా మారిపోయారంటే రెండు సమాధానాలు. ఇప్పుడు చదివే వాళ్ళు లేరు. చదివే వాళ్ళు లేకపోతే మానేస్తారా? చదివించే విధంగా రాయాలి కదా! రాయడం కోసం మీరు రాసుంటే, సమాజం కోసం మీరు రాసుంటే ఇప్పుడు ఆపరు. అమ్మ చేసినటువంటిది పిల్లవాడు తినకపోతే ఇంకోవిధంగా చేసి వాడికి ఎలా తినిపించాలి అని చూస్తుంది. పౌష్టికాహారం తినిపించాలని చూస్తుంది తప్ప వాడు తినడం లేదుకాబట్టి వంటింటికి తాళం వేయదు. బధిరులకు కూడా వినిపించేంత బ్రహ్మాండమైనటువంటి శబ్దంతో మేం వినిపిస్తాం అని రచయితలు అనుకుంటారు ఇది గిట్టుబాటు అనుకుంటే ఏది ఎక్కువ గిట్టుబాటు. సాహిత్య హింసావలోకనం ఏ రూపంలో చేస్తే బావుంటుందో అనేది... కాబట్టి ఇక్కడ చివరిది నేను చెప్పదలచుకుంది పర్సనాలిటీ డెవలప్‌మెంట్ గురించి రాసినా, సృజన ప్రక్రియల పేరుతో రాసినా గాని ఎంతసేపు కూడా వ్యక్తి ప్రధానంగా, వ్యక్తి లబ్ధి ప్రధానంగా, వ్యక్తి యొక్క శోకమే ప్రధానంగా లేదా వ్యక్తి యొక్క కేకలే ప్రధానంగా నడిచినటువంటి విషయాలు దీర్ఘకాలం నిలబడతాయా అంటే నిలబడలేవు. మాగ్జిం గోర్కీనో శరత్‌బాబో జీవితం యొక్క లోతులు చూశారు కాబట్టి చిరకాలం నిలిచే రచనలు చేయగలిగారు. మీరు శారద జీవితం చదవండి, శరత్‌బాబు జీవితం చదవండి. శరత్‌బాబు దేశదిమ్మరి ప్రవక్త అని ఆయన జీవిత కథను జ్వాలాముఖి గారు అనువాదం చేశారు. దేశ దిమ్మరి ప్రవక్త చదవండి. శరత్‌బాబు ఏ పరిస్థితుల్లో కథకుడు అయ్యాడు తన స్నేహితుడు రాజు అనేవాడు చేసేటటువంటి సాహసకృత్యాలను ముందు కథలుగా రాయడం మొదలుపెట్టాడు. చాలా చిన్నప్పుడే శరత్‌బాబు తన పేరుతో బయటకు వస్తే సిగ్గుపడి మేనమామ పేరుతో రాశాడు. అందరూ మేనమామను అభినందించడం మొదలుపెట్టారు. ఇంకా కొంతకాలం గడిచింది. అందరూ రవీంద్రనాథ్ టాగూర్‌కి లేఖలు రాయడం మొదలుపెట్టారు. టాగూర్ మీరు ఈ మధ్య కథలు కూడా రాస్తున్నారు. మాక్జిం గోర్కి ఒక నేలమాలిగలో పని చేస్తూ అప్పటికి కథలు కూడా రాసాడు ఆయన. అవన్నీ కూడా మనం తెలుసుకోవచ్చు. ఒక రైల్వేస్టేషన్‌లో కేవలం నలుగురు మాత్రమే ఉండి ఒక కుబ్జలాంటి ఒక అమ్మాయి ఉంటే ఆ అమ్మాయిని వాళ్ళు అందరూ కూడా ఏడిపిస్తే చివరికి ఆమె జీవితం ఎలా విషాదాంతం అయ్యిందనేది రాశాడు. టాల్‌స్టాయ్ యుద్ధం శాంతి శవాల పీనుగుల పక్కన రకరకాలైన యుద్ధాల్లో ఉండి చూసి రాసాడట. అందువల్ల జీవితాన్ని మించినటువంటి ముడి సరుకు లేదు.



**పురోగామి భావన లేకపోవడం అటుంచి తిరోగామి భావన కూడా నెమ్మది నెమ్మదిగా ప్రవేశిస్తున్నటువంటి ఒకానొక పరిస్థితి కూడా మన దగ్గర వుంది. చివరగా చాలా మంది కథకులు చాలా ప్రసిద్ధులుగా, స్టార్ రైటర్స్‌గా వున్నటువంటి వాళ్ళు ఇప్పుడు పర్సనాలిటీ డెవలప్‌మెంట్ రాసేవాళ్ళుగా మారిపోయారు.**

ఇప్పుడు మన కళ్ళముందు ఎంతెంత విధ్వంసం. కాని ఎక్కువ సందర్భాల్లో ఏంటంటే విస్తృత పరచుకునే దృష్టి మనకు లేకపోవడం వల్ల ..ఆరుద్రగారు రాశారు ఇప్పుడు వచ్చే కథల కంటే నేను రాసే కథలు ఎక్కువ బాగుంటాయని మనకందరికి అన్పిస్తుంది. నేను రాసే కథలు... ఎప్పుడు రాస్తావు అది ఇంకా రాయలేదు కదా అని.

ఆరుద్ర ఎప్పుడూ ఒకటి చెప్పేవారు. ఎవరో పిచ్చివాడు ఉత్తరం రాస్తున్నాడంట. ఎవరికిరా ఉత్తరం అంటే నాకే అన్నాడట. ఏముందిరా అందులో అంటే.. ఇంకా అందాలి కదా నాకు అన్నాడట. నేను పోస్టు చెయ్యాలి ఇంకా నాకు అందాలి..... అంటే ఇక్కడ కూడా మీరు చూడండి ఇందులో కూడా శిల్పం ఉంది. ఇందులో కూడా ఒక పిచ్చివాడు, వాడి ఆలోచన, కథ అది తప్పకుండా పోస్టు చేయాలి. పోస్టు చేసిన తరువాత అప్పటికి ప్రక్రియ పూర్తి అవుతుంది. కాబట్టి మిత్రులారా మనం ఏ ఉదాహరణ ఎటు నుంచి ఎటు చెప్పుకున్నా గాని కథ అనేది గనక మనం తీసుకుంటే దాన్ని ఒక వాక్యంలో చెప్పండి... లేదు ఒక పెద్ద పంక్తిలో మీరు

చెప్పండి. ఒక మొదలు, ఒక ముగింపు, ఒక శిల్పము, ఒక చమక్కు ఒక కొసమెరుపు ఇవన్నీ కూడా వుండాలి. అవన్నీ ఎలా వుండాలో ఇక్కడ ఆరితేరినటువంటి కథకులు అందరూ ఉన్నారు. అందులో ఒక ప్రత్యేకమైనటువంటి ఒరవడికి ఒక తరానికి స్వరానికి ప్రాతినిధ్యం వహిస్తున్నటువంటి ఓల్గా గారు ప్రారంభిస్తున్నారు కాబట్టి ఈ కార్యశాల చాలా జయప్రదమవుతుందని మీరందరూ కూడా ఈ కథనశాల నుంచి బయటికి వెళ్ళిన తరువాత కథన కుతుహలంతో మీరు రాసే స్థాయికి వస్తారని ఆశిస్తున్నాను. చివరగా ప్రస్థానం గాని, ప్రజాశక్తి గాని, ఇలాంటి వాటికి పూర్తి ప్రోత్సాహమిస్తాయి. 10 టివి అడ్వయిజర్ బోర్డులో ఓల్గాగారు వున్నారు నాతోపాటు. 10టివి అక్షర వంటి కార్యక్రమం నిర్వహిస్తోంది. ఈ కొత్త ఆరోగ్యకరమైన సాహిత్యం, ప్రత్యామ్నాయ భావజాలం మంచి కథకులు, కథకులు అంటేనే రావిశాస్త్రి, కథకులు అంటేనే కాళీపట్నం రామారావు తరువాత కూడా మనం చెప్పుకుంటాం. పెద్దింటి అశోక్‌కుమార్ అంటాం లేకపోతే శిరంశెట్టి కాంతారావు అంటాం. లేకపోతే ఇంకొకటంటాం. ఆజాద్‌గారికి తానా దగ్గరినుంచి, ఆయనకు అమెరికాలో కూడా ఎక్కువ బహుమతులు వస్తున్నాయి. ఇక్కడ ఆంధ్రప్రదేశ్‌లోనే కాదు. అందువల్ల మంచి కథకులు ఇప్పుడు చాలామంది వస్తున్నారు. మన జాబితాలో వున్న కథకులందరూ ఖదీర్‌బాబు కావచ్చు, నామిని కావచ్చు. ఒక తరం ఒక ఇరవై ఏళ్ళలో మనం చాలామందిని సృష్టించుకున్నాం. మళ్ళీ ప్రతి ఇరవై ఏళ్ళకు ఒక తరం అనుకుంటే మళ్ళీ ఒక కొత్తతరం. ఇది నడుస్తూ వుండాలి. ఇది నిరంతరాయంగా పదండి ముందుకు....పదండి త్రోసుకు.... అన్నట్టుగా పోతూనే వుండాలి



> *రచయిత అనేవాడు నిరంతరం ప్రవహిస్తూ వుండాలి. నిరంతరం పరిశీలిస్తూ వుండాలి. పరిశీలించిన దాన్ని గ్రహించదగిన రీతిలో దహించేరీతిలో పాఠకుడికి అందజేయగలగాలి. దానికి కావలిసినటువంటి ప్రజ్ఞను పెంచుకోవాలి అన్నది కీలకమైనటువంటి అంశం.*

* * *

గొప్ప ప్రసంగాలు విన్నారు. సినిమా బ్రేక్ కూడా తీసుకున్నారు. ఆ బ్రేక్ కూడా కమర్షియల్ బ్రేక్ కాదు. అది కూడా మనం గుర్తించాలి. ఇది కూడా బ్రేకే. ఇక్కడే కింద ఒక సభ జరిగింది. రకరకాల ప్రయోగాలు జరుగుతుంటాయి. ఖదీర్‌బాబుగారు ఇందాక చెప్పినట్టుగా... ఒకటి ఖదీర్‌బాబు అనగానే మళ్ళా లెనిన్‌బాబు గురించి కూడా మాట్లాడాలి. సాహితీ స్రవంతి సదస్సులు, సభలు ఇవన్నీ విషయం ప్రధానంగా జరుగుతాయి. వుయ్ కెన్ ఆల్‌వేస్ మీట్ పాయింట్ అంటే చర్చాగోష్ఠులు, లేకపోతే భిన్నాభిప్రాయాలు తప్పని కాదు. కాని మనం అంశానికి జవాబు చెప్తే సరిపోతుంది. ప్రతిసారి వ్యక్తులను, వ్యక్తుల యొక్క అంశాలను ప్రస్తావించవలసినటువంటి అవసరం లేదు నేను వాళ్ళని ఖండించడం లేదు. వాళ్ళు మన గౌరవనీయ అతిథులు, ఈ సభ రసవత్తరం కావడానికి చాలా దోహదపడ్డారు. కానీ లేవనెత్తిన అంశాలేంటి అనేది చూడాలి. ఖదీర్‌బాబు చెప్పినదాంట్లో ఒకటుంది. ఇప్పుడు మీరు యూట్యూబ్‌లోకి వెళ్తే ఇట్ ఈజ్ యువర్ మిస్టేక్ అని ఒక మహిళబొమ్మ ఇట్ ఈజ్ యువర్ మిస్టేక్ అని అదే మీరు సెల్‌ఫోన్‌లు ఎక్కువగా వాడుతున్నారు, మీరు రాత్రిపూట తిరుగుతున్నారు, మీరు పురుషులతో మాట్లాడుతున్నారు కాబట్టి మీ మీద అత్యాచారాలు జరుగుతున్నాయి అని ఒక మహిళ వస్తుంది. ఆ మహిళ అన్ని వేషాలలో అన్ని వస్త్రధారణలో ఆమెని చూపిస్తారు. ఆ తర్వాత ఆమె చాలా సాంప్రదాయకమైన దుస్తుల్లో వచ్చి మాట్లాడుతుంటుంది. ఒకడు వచ్చి ఆమె నగలు లాక్కుపోతాడు, ఒకడు వచ్చి ఆమె నోరు నొక్కుతాడు. కేవలం మనం ఆ రెండు నిమిషాలలో చూస్తే కూడా స్త్రీల గురించి ప్రచారంలో వున్నటువంటి అభిప్రాయాలు, ఈ అపవాదులు ఎంత ఘోరమైనవి అనేది మనకు యుట్యూబ్‌లో ఇప్పుడున్నటువంటి సరికొత్త లీడ్ కనిపిస్తుంది. ఇప్పుడు జనార్ధన్ మహర్షి కెమెరా నుంచి నాకు మెసేజ్ పెడితే నేను ఆయనకు జవాబు చెప్పాలని చూస్తే నా దగ్గర వున్న ఫోను టచ్ ఫోన్, ఛార్జింగ్ లేక వీరప్రసాద్ దగ్గర తీసుకున్న ఫోను అక్షరాలన్నీ కొట్టాల్సిన ఫోను. అది వాడాల్సి వచ్చేసరికి ఇబ్బందే. అదే సాంకేతిక ప్రభావం. బహుశా నేను అనుకుంటాను వాళ్ళిద్దరూ ఒకరినొకరు ఖండించుకున్నా,

మండించుకున్నా గాని రెండింట్లో వున్నటువంటి సారాంశం ఒక్కటే అప్‌డేటింగ్. రచయిత అనేవాడు నిరంతరం ప్రవహిస్తూ వుండాలి. నిరంతరం పరిశీలిస్తూ వుండాలి. పరిశీలించిన దాన్ని గ్రహించదగిన రీతిలో దహించేరీతిలో పాఠకుడికి అందజేయగలగాలి. దానికి కావలిసినటువంటి ప్రజ్ఞను పెంచుకోవాలి అన్నది కీలకమైనటువంటి అంశం. ఇంక భాష, పదాలు అది ఇది చాలా ముఖ్యమైనటువంటిది కాదు. నన్నయ్యభట్టారకుడినీ చదవాలి, తిక్కన సోమయాజులునూ చదవాలి ఇదంతా నిజమే. కాని మనం తిక్కన దగ్గర ఆగిపోము, నన్నయ్య దగ్గర ఆగిపోము. పరంపరానుగతంగా గ్రంధం చౌర్యం గ్రంధ చౌర్యం వుంది. ఇప్పుడెందుకు? కావ్యాలన్నీ కుకవి నింద కవి స్తోత్రం అయిన తర్వాతే మొదలవుతాయి. మనం చోరుల గురించి మాట్లాడడం కంటే ధీరుల గురించి మాట్లాడటం చాలా మంచిది.



ధీరుల గురించి మాట్లాడినప్పుడు ఉద్యమాల గురించి తప్పకుండా వస్తుంది. ఉద్యమాలనేవి మనను సజీవం చేస్తున్నాయి. ఉద్యమాలనేవి మనలను నడిపిస్తాయి. ఉద్యమాలనేవి మనలను కదిలిస్తాయి. రచన గురించి మనం ఎందుకు ఇంతగా చర్చిస్తున్నాము. నిద్రబుచ్చడానికి ఈ దేశంలో ఫార్ములా చిత్రాలు తీసేవాళ్ళున్నారు. యోగిపుంగవులు వున్నారు. వాళ్ళు నానారకాల పనులు చేస్తున్నారు. మన్మోహన్ సింగ్ గారు అమెరికాలో చాలా కష్టపడుతున్నారు. ఆయన సారంలోకి రావడానికి మోడీగారు మోడీఫికేషన్స్ కమాడీఫికేషన్స్ కమోడీఫికేషన్ నేను అప్పుడు సరదాగా అంటుండేవాణ్ణి ఇవన్నీ జరుగుతున్నాయి ప్రక్రియలు. నిద్రబుచ్చడానికి అయితే అమ్మ జోలపాడింది కదా అప్పుడు అక్కడ ఆ స్థితిలోనే వుండొచ్చు మనం. మేల్కొల్పడానికి మనం రచనలు చేస్తున్నప్పుడు ఈ మేల్కొలిపేటటువంటి శక్తులు, కదిలించేటటువంటి శక్తులు, నడిపించేటటువంటి శక్తులు అజ్ఞానపుటంధ యుగంలో తెలియని ఏ తీవ్రశక్తులో నడిపిస్తే నడిచి మనుష్యులు అన్నట్టుగా అంధయుగం నుంచి ఉన్నంతలో చీకటిని పారద్రోలి మేల్కొల్పడానికి రచనలు చేయాలనుకున్నప్పుడు ఆ శక్తులతోపాటు నడవాలి. ప్రసిద్ధ చిత్రకారుడు నైరుప్య చిత్రకళ గురించి చెప్పారు కదా! పికాసో కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం తప్పకుండా పంపించేవాడు. ఆయనేం చేయడు ఆయన ఉద్యమాల్లో పాల్గొనడు, ఎక్కడికి రాడు, స్పెయిన్ కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం మటుకు కొనసాగిస్తాడు. ఎందుకయ్యా నువ్వు ఎక్కడికి రావు కదా, ఏం చేయవు కదా అంటే దాహం వేసిన వాడు మంచి నీళ్ళకోసం వెళ్ళినట్లు నేను పార్టీ దగ్గరకు వెళ్తాను. నేను పునరుజ్జీవం పొందుతాను దాంతో ఉన్నటువంటి అనుసంధానం ద్వారా, అనుబంధం ద్వారా పునరుజ్జీవం పొందుతాను అని. శ్రీశ్రీని అడిగారు ఇదే ప్రశ్న కవివి కావాలన్నా, రచయితవు కావాలన్నా, సైంటిస్టువి కావాలన్నా కావాలి నువ్వు కమ్యూనిస్టువి అని శ్రీశ్రీ అన్నారు. శ్రీశ్రీ ఎలా ఉన్నాడు, ఇవన్నీ ఉద్యమాలు మనకు తెలుసు. ఉద్యమాలతో సంబంధం ఉద్యమం అంటే ఏమిటి? ఉద్యమం అంటే నిఘంటువులో వుండే అర్థం ఏమిటి? ఉద్యమం అంటే ప్రయత్నం. చుట్టూ వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి చిన్న దీపాన్ని వెలిగించడం మంచిదని ఏ సామ్యవాద భావజాలం లేని యువభారతి సంస్థ ఈ హైదరాబాద్ నగరంలో దాన్ని ఒక నినాదంగా పెట్టుకుని ఎన్నో గొప్ప గొప్ప ప్రసంగాలు ఇచ్చారు. అవన్నీ కూడా గొప్పగా వున్నాయి. కాబట్టి చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కాదు, చిన్న దీపాన్ని వెలిగించాలనే ప్రయత్నమే ఉద్యమం. కాబట్టి ఉద్యమించే శక్తులతో ఎముకలు కూడిన వయసు మళ్ళిన సోమరులారా చావండి... హరోంహర అని కదలండి అదే ఉద్యమం వీరేశలింగం గారు అన్ని చేశారంటే ఉద్యమం కాబట్టి ఉద్యమాలకు దూరంగా వుండాలా? దగ్గరగా వుండాలా? అన్న ప్రశ్న లేదు ఉద్యమాలు లేకపోతే ఉనికి లేదని చెప్పేటటువంటి పరిస్థితిలో మనం ఈరోజు వస్తున్నాం. ఎవరికైనా ఇంకా ఇదే విషయాల్లో ఏవైనా సందేహాలు ఉంటే ఏ ప్రజాఉద్యమమైనా మీ ఇష్టం చాలా గొప్ప గొప్పగా

*కవివి కావాలన్నా, రచయితవు కావాలన్నా, సైంటిస్టువి కావాలన్నా కావాలి నువ్వు కమ్యూనిస్టు అని శ్రీశ్రీ. శ్రీశ్రీ ఎలా ఉన్నాడు, ఇవన్నీ ఉద్యమాలు మనకు తెలుసు. ఉద్యమాలతో సంబంధం ఉద్యమం అంటే ఏమిటి? ఉద్యమం అంటే నిఘంటువులో వుండే అర్థం ఏమిటి? ఉద్యమం అంటే ప్రయత్నం.*

మేడిపండులాగా అబ్బో వచ్చేస్తుంది. అది వస్తే ఉద్యోగాలు వస్తాయి, ఇది వస్తే ఉద్యోగాలు వస్తాయి సాఫ్ట్‌వేర్ అన్నారు. సాఫ్ట్‌వేర్ ఇప్పుడు హార్డెస్ట్‌వేర్ అయిపోయింది. నేను ఎవర్ని ఖండించడం లేదు ఇప్పుడు. సాఫ్ట్‌వేర్ లేదు ఇప్పుడు హార్డ్‌వేరే. రచయిత మీద మొన్న హిందూ సంపాదకుడిపై డిజిపి కేసు పెట్టించినప్పుడు నేను అన్నాను. ఆల్ ది పార్‌ఫ్యూమ్స్ ఆఫ్ అరేబియా విల్ నాట్ స్వీటెన్ దిస్ లిటిల్ హేండ్ అంటాడు షేక్స్‌పియర్. కాబట్టి రాజ్యాన్ని, రాజ్యం యొక్క శక్తిని, రాజ్యం యొక్క దాడిని ధనాఢ్య వర్గాల యొక్క సామ్రాజ్య ఆధిపత్య శక్తుల్ని ఎదుర్కోవాలంటే ఉద్యమాలు అవసరం. కాబట్టి నిర్భయ మీద జరిగినటువంటి దాని గురించి దేశమంతా వచ్చిన దాన్ని ఏమంటాం మనం. ఒక ఉద్యమం కాదు అనేక ఉద్యమాలు కాబట్టి ఉద్యమం అనే పదం బహిష్కృతం కాదు. ఉద్యమం అనే పదం సాపేక్షం కాదు. ఉద్యమం అనే పదం నిరపేక్షం. మానవజాతి ఇంతవరకు సాధించిన అభివృద్ధి మొత్తం కింది కులాల వాళ్ళు చదువుకోకూడదు. స్త్రీలు చదువుకోకూడదు. ఫలానా వాళ్ళు వీధులోకి రాకూడదు. ఇవన్నీ వుండేవి ఒకప్పుడు అవన్నీ ఎందుకు పోయాయి. అన్నీ ఉద్యమాల వల్లే పోయాయి. ఇప్పటి వరకు మానవజాతి సాధించిన యావత్ పురోగతే ఉద్యమాల వల్ల, విప్లవాల వల్ల మాత్రమే సాధ్యమైంది తప్ప కేవలం కళానైపుణ్యాల వల్ల మాత్రం సాధ్యం కాలేదు. ఈ నైపుణ్యాలు, ఈ నైశిత్యాలు ఇవన్నీ కూడా దేనికి దోహదపడ్డాయి అంటే ఆ ఉద్యమాలకు పదును పెట్టడానికి, ఆ ఉద్యమాల యొక్క ఉధృతి తగ్గినప్పుడు ఉత్తేజాన్ని నిలబెట్టడానికి ఉపయోగపడ్డాయి.



ఎవరి ఆలోచనలు వాళ్ళకు ఉండొచ్చు కాని ఇంకొకటి చెప్పాలి. చాలా ప్రశ్నలు అస్తిత్వం మీద, వాదాల మీద ఓల్గాగారు వారి భావాలు వారు చెప్పారు. వారితో కూడా నాకేమీ తేడా ఏమి లేదు. కాని ఇప్పుడు మనం చూస్తున్న ప్రపంచం శకలీకరణం. అందుకనే నేను ఇంకా కొంచెం సాగదీస్తుంటాను. శకలీకరణ, వెకిలీకరణ, వికలీకరణ, మకిలీకరణ జరుగుతున్నటువంటి ఒక ప్రపంచం. వాడేమో సరిహద్దులకు వ్యతిరేకంగా ప్రపంచమంతా ఆక్రమిస్తాడు. వాషింగ్టన్‌లో కూర్చుని ఈ సభ ఎలా జరగాలో తెల్లవాడు శాసిస్తాడు. కాని ఈ సభలో ఉన్న మనకు మటుకు రకరకాలుగా వుండండి. మీ మీ సంగతులు మీరు చూసుకోండి. పక్కఆయన సంగతి మీకెందుకు. ఆయనేమో ప్రొఫెసరు, మీరేమో సాఫ్ట్‌వేర్, మీరేమో తెలంగాణా, వాళ్ళదేమో కోస్తా, వాళ్ళదేమో దక్షిణ కోస్తా, వీళ్ళదేమో రాయలసీమ ఇవన్నీ చెబుతూవుంటాడు. ఇలా ఇలా చూసుకోండి. మీ మీ సంగతులు మీకెంతో కొంత పెట్టుబడి నే పంపిస్తా కదా అంటాడు. అంటే ప్రపంచాన్ని రకరకాలుగా విభజించాలన్న ఒక వ్యూహం ఆధిపత్య వాదులది అయితే ఈ ఆధిపత్యాన్ని ఎదుర్కొటానికి వీలయినంత వరకు ప్రజల్ని కలపటం ముఖ్యం. నేను ఆంధ్ర, తెలంగాణ సమస్యలకు పోవటం లేదు. ఎవ్వరూ ఆ విషయంలో ప్రశ్నలు వెయ్యాలని ఉత్సాహపడకండి. అంతకంటే కూడా విస్తృతమైన అంశం నేను చెబుతున్నాను. అంతకంటే కూడా విస్తృతమైంది ఏమిటంటే ఈ మానవ సమాజాన్ని, మానవ సమూహాన్ని వికలీకరణ, శకలీకరణం చేసేటటువంటి ఒక పెద్ద ప్రయత్నం జరుగుతున్నప్పుడు రచయితలు ఎప్పుడైనాగాని చేసేటటువంటి పని ఒక ఏకోన్ముఖమైనటువంటి శక్తి ఇవ్వాలి. ప్రజలకు. ప్రశ్నించేటటువంటి, ప్రతిఘటించేటటువంటి, ప్రగతి సాధించేటటువంటి ప్రత్యామ్నాయ మార్గం రచయితలు చూపిస్తారు. ఆ పని తెలుగు రచయితలు చాలా చాలా శక్తివంతంగా చేశారు ఖదీర్ సబ్ ఎడిటర్ ఎడిటర్ల గురించి రాశారా? జనార్ధన మహర్షి సినిమాల గురించి రాశారా? అరిబండి ప్రసాదరావు గారు అగ్రికల్చరల్ యూనివర్సిటీ విషయాలు రాశారా? ద్వానా శాస్త్రి గారు అధ్యాపకుల గురించి రాశారా? రాసి వుండొచ్చు, రాసి ఉండకపోవచ్చు. శ్రీశ్రీ గారే రాయలేదు ఆ మాటకొస్తే. అయితే దాన్నించి మనం గనుక పొరపాటు పాఠం తీస్తే తన జీవితంలో కూడా నిజాయితీ వుండాలి. రచయితకు రెండు జీవితాలు ఉండకూడదు అన్నది

> ***మానవ సమాజాన్ని, మానవ సమూహాన్ని వికలీకరణ, శకలీకరణం చేసేటటువంటి ఒక పెద్ద ప్రయత్నం జరుగుతున్నప్పుడు రచయితలు ఎప్పుడైనాగాని చేసేటటువంటి పని ఒక ఏకోన్ముఖమైనటువంటి శక్తి ఇవ్వాలి.***

చాలా ప్రసిద్ధమైనటువంటి ఒక వ్యాఖ్య. ఆ మాటకొస్తే ఎవరికీ రెండు జీవితాలు ఉండకూడదు. ఎవరికైనా ఒక రుజువర్తన. ఒక నిజవర్తన. వుండాలి. దానిమీద ఎవరెవరి పద్ధతులు వాళ్ళు చూసుకోవచ్చు. కాబట్టి మిత్రులారా మనం ఆధునికులం మనం అభ్యుదయంగా ఆలోచించేవాళ్ళం. మనం నూతనత్వాన్ని ఆహ్వానించేటటువంటి వాళ్ళం. మనం సృజనశీలతకు పట్టాభిషేకం చేసేటటువంటి వాళ్ళం. అన్నింటిని మించి మనం ప్రజలను గౌరవించేవాళ్ళం. కాబట్టి ప్రజలనుంచి నేర్చుకుంటాం. ప్రజలకు కావల్సినటువంటి చైతన్యం ప్రజలకు అందిస్తాం. ప్రజల నుంచి చైతన్యం పొందుతాం. శ్రీ శ్రీ చెప్పిన ఒక్కమాటతో నేను ముగిస్తాను. ఏం శ్రీశ్రీ నువ్వు చాలా మాట్లాడుతున్నావు. రచయిత అంటే పెద్ద ఏముంది. నువ్వు బండి చక్రంలో ఈగలాంటి వాడివి. చక్రం తిరుగుతుంటుంది. ఈగ నేనే చక్రాన్ని తిప్పుతున్నాను అనుకుంటుంది. కాని నువ్వు బండి చక్రం మీద ఈగలాంటి వాడివి అంటే విషయం సరిగ్గానే వుంది కాని పోలిక సరిగ్గా లేదు అన్నాడు శ్రీశ్రీ. నిజమే చక్రాన్ని నేను తిప్పడం లేదు. అయితే నేను ఈగను కాదు మహానుభావా బండి చక్రంలో వున్న శతకోటి పరమాణువుల్లో నేను కూడా ఒక అణువును నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను అన్నమాట ఎక్కడినించి వచ్చింది అంటే ఆ తిరుగుతున్న బండిచక్రంలో నేను కూడా ఒక అణువు నేనూ కూడా ఒక పరమాణువును నేను సైతం ప్రపంచాగ్నికి అన్న పాట వేసుకున్నవాళ్ళు చివరిదాకా వుంటారని లేదు. నేనుసైతం హస్తారేఖకు కొత్త పాత్రకు మారిపోతాను అని ఇక్కడ తిరుపతిలో బయలుదేరినటువంటి రథం అక్కడ 10 జనపథ్ దగ్గర ఆగినటువంటి దృశ్యం మనం చూశాం. రచయితలకు ఈ పరిస్థితి రాకుండా వుండాలి అంటే సమాజాన్ని తన పరివారాన్ని అందులో తన స్థానాన్ని నూటికి తొంభై మందిగా వున్నటువంటి ప్రజలకు హితం చేకూర్చేవిధానాన్ని అనుసరించాలి. దాశరథి రంగాచారి గారు ఒకసారి అన్నారు. హితం కరోతి సాహిత్యం తెలుగు భారతదేశంలో సాహిత్యానికి నిర్వచనం చాలా సమగ్రంగా వుంది. ఇంగ్లీష్‌లో ఇది సమగ్రంగా లేదు వాళ్ళు కంప్యూటర్ లిటరేచర్ అంటారు. ఆటోమొబైల్ లిటరేచర్ ఏదైనా లిటరేచర్ అంటే దానికి వేరే మళ్ళీ నిఘంటువు. లిటరేచర్ అన్న పదం ఆంగ్లంలో చలామణి వున్నదానికి సాహిత్యం అన్న పదం తెలుగులో చలామణిలో వున్నదానికి చాలా తేడా కాబట్టి మిత్రులారా మంచి విషయాలు చాలా చెప్పారు. చివరిది ఏకంసత్ విప్రా బహుదా వదంతి విప్రా అంటే మళ్ళీ విప్రులు కాదు సుమా! విపులెల్లజేరి వెర్రికూతలు కూసే ఎప్పుడో వేమన ప్రశ్నించినటువంటి దేశం ఇది. కాబట్టి మనం వేమనను గుర్తు పెట్టుకుందాం. విప్రులు కాదు. సత్యం ఒకవిధంగానే వుంటుంది. దాన్ని పండితులు పరిపరి విధాల వ్యాఖ్యానిస్తూ వుంటారు. అంటే మనం ఇక్కణ్ణుంచి గనుక కొంచెం డైవర్షన్ తీసుకుని కాలంమార్పు దగ్గరికి వెళితే ప్రపంచాన్ని పరిపరి విధాల నిర్వచించారు కాని అసలు సంగతి దాన్ని మార్చటం అనేదాని దగ్గరికి మనం వెళితే -పండితులనేవాళ్ళు దాన్ని నిర్వచించటంతో ఆగిపోతారు కాని ప్రజల పామరుల మేలు కోరేవాళ్ళు దాన్ని మార్చడానికి ఉద్యుక్తులవుతారు. ఉద్యమాలతో మమేకం అవుతారు. అంకితమవుతారు. ఇది కూడా ఒక ఉద్యమమే. ఉద్యమం అంటే కొంతమంది సినిమాలోలాగా కాదు. ఉద్యమం అంటే ఒక ప్రయత్నంపూర్వకంగా చేసేటటువంటి ఏ పనైనా ఉద్యమమే అని చెబుతూ ఒకవేళ నేను చెప్పిన సమాధానాలు, నా వ్యాఖ్యానాలు, జోక్యాలు, మాట్లాడిన వక్తలకు ఏవైన నొప్పి కలిగివుంటే క్షంతవ్యుణ్ణి. కేవలం వివరణ కోసం మాట్లాడాను. సెలవ్.



> మనం ఆధునికులం మనం అభ్యుదయంగా ఆలోచించేవాళ్ళం. మనం నూతనత్వాన్ని ఆహ్వానించేటటువంటి వాళ్ళం. మనం సృజనశీలతకు పట్టాభిషేకం చేసేటటువంటి వాళ్ళం. అన్నింటిని మించి మనం ప్రజలను గౌరవించేవాళ్ళం.



★ ఓల్గా



# తెలుగు కథా ప్రస్థానం



**ఏ చరిత్రయినా మనకు కొన్ని విలువయిన పాఠాలు నేర్పుతుంది. సాహిత్య చరిత్ర కూడా సాహితీకారులకు, రచయితలకూ కొన్ని పాఠాలు నేర్పుతుంది. కథల చరిత్ర సాహిత్య చరిత్రలో ఒక భాగం. మొదటి కథ తెలుగులో ఎవరు రాశారు? ఎవరు రాస్తే ఏమిటి? అంత ముఖ్యమైన విషయమా? ఎవరో ఒకరు రాయాలి రాస్తారు. అది అంత ముఖ్యమైన విషయం ఎందుకయింది?**

తెలుగు కథా ప్రస్థానం గురించి ఎందుకు తెలుసుకోవాలి? తెలుగు కథ రకరకాల మార్గాల్లో ప్రయాణం చేసి ఇప్పుడున్న స్థితికి వచ్చింది. ఇప్పుడు కథలు రాయాలనుకునేవారికి ఆ ప్రయాణం గురించి తెలుసుకోవటం అవసరమా? ఊరికే విషయం తెలిసింది, కొంత ఇన్ఫర్మేషన్ తెలుసుకున్నాం అని తృప్తి పడటానికేనా? ఆ విషయం వల్ల ఇప్పుడు కథలు రాసేవారికి, రాయదల్చుకున్నవారికీ ఏదైనా ప్రయోజనం వుంటుందా?

ప్రయోజనం ఉంటుంది. ఏ చరిత్రయినా మనకు కొన్ని విలువయిన పాఠాలు నేర్పుతుంది. సాహిత్య చరిత్ర కూడా సాహితీకారులకు, రచయితలకూ కొన్ని పాఠాలు నేర్పుతుంది. కథల చరిత్ర సాహిత్య చరిత్రలో ఒక భాగం. మొదటి కథ తెలుగులో ఎవరు రాశారు? ఎవరు రాస్తే ఏమిటి? అంత ముఖ్యమైన విషయమా? ఎవరో ఒకరు రాయాలి రాస్తారు. అది అంత ముఖ్యమైన విషయం ఎందుకయింది? చాలాకాలం గురజాడ అనుకున్నాం. అనుకున్నందువల్ల మనం ఏం చేశాం. మొదటి కథలు రాసిన ఆయన వస్తువు దేనిని ఎంచుకున్నాడు? దాన్ని ఎలా చెప్పాడు. అంత గొప్ప నాటకం రాసినాయనా మొదటిసారిగా కథ కూడా అంత బాగా రాశాడా? అనే కుతూహలంతో ఆయన కథలు పరిశీలించాం. ఐతే మొదటి కథ రాసింది గురజాడ కాదు బండారు అచ్చమాంబ అనగానే ఒక స్త్రీ మొదటి కథ రాసింది అనే గర్వం స్త్రీలకు కలిగింది. విద్యలో, అవకాశాలలో చాలా వెనుక ఉన్న స్త్రీ వాటిని ఛేదించుకుని, రచన అనే ఒక సాహసవంతమైన చర్య చేపట్టి, కథ అనే కొత్త ప్రక్రియలో తన భావాలు చెప్పింది అంటే చాలా ఆసక్తి కలుగుతుంది, కలిగింది. 1898లో మొదలుపెట్టి ఆవిడ రాసిన కథలు స్త్రీ విద్య, భార్యభర్తల మధ్య మంచి అవగాహన ఉండాలనీ, స్త్రీలు చక్కగా ఇల్లు దిద్దుకుని భర్తలను మంచి మార్గంలో, నడిపించేంత ఉదాత్తులై ఉండాలని 12 కథలు రాసింది. ప్రతి కథ చెప్పటంలో కొత్తదనాన్ని ఎంచుకుంది.

స్త్రీల కోసం రాసేటప్పుడు స్త్రీల బలాలు, బలహీనతలు రెండూ చెప్పింది. కేవలం బలాలు, గుణాలు చెప్పి పొగడలేదు. స్త్రీలు ఎలా ఉండకూడదో కూడా చెప్పింది. అది మనం ఇవాళ నేర్చుకోవాల్సిన విషయం అని నేననుకుంటున్నాను.

అనేక అస్తిత్వ వాదాలు బయలుదేరి తమ కథలు తాము రాసుకునే సమయం ఇది. ప్రతి అస్తిత్వవాదము బలంగా వినిపిస్తున్న నేపథ్యం. తమ తమ బలాలను సగర్వంగా చాటి చెబుతున్న కాలం ఇది. ఈ సమయంలో బలాల గురించి గొంతెత్తి, బలహీనతలు అసలు లేనేలేవన్నట్టు వాటిని గురించి మాట్లాడకపోతే నష్టం ఎవరికి? మన బలహీనతలను గుర్తిస్తే కదా వాటిని ఒదిలి మనల్ని మనం కొత్తగా మార్చుకోగలిగేది. మొదటి కథకురాలి దగ్గర నుంచి మన నేర్చుకోగలిగింది ఉంది. మన బలహీనతలను, మన లోపాలను మనం గుర్తించగలగటం – వాటి గురించి మాట్లాడగలగటం, రాయగలగటం. అదీ సాహసవంతులైన కథకులు చేయవలసింది. ఆ సాహసం మనం తొలి కథకురాలి నుంచి కూడా నేర్చుకోవచ్చు.



గురజాడ రాసిన కథలలో సామాజిక విమర్శ కూడా ఉంది. స్త్రీ పురుషుల మధ్య సదవగాహన కావాలని, స్త్రీలపై హింస కూడదని చెప్పే కథలు రాసిన ఆయన 'దేవుళ్ళారా మీపేరేమిటి' కూడా రాశాడు. ఒక గ్రామంలోని ప్రధాన కమ్యూనిటీలను కథల్లోకి తెచ్చే ప్రయత్నం చేశాడు. మూఢ నమ్మకాలను హేళన చేశాడు. ఆనాటి సామాజిక విమర్శ తన కథలలో ప్రధానాంశంగా ఆయన చేసుకున్నాడు. అచ్చమాంబ, గురజాడ వీరిద్దరి నుంచి మనం నేర్చుకోవాల్సిందదే.

**మనకు బాగా తెలిసిన జీవితాన్నే రాయాలి. దానిని ప్రత్యేకంగా రాస్తూనే నేపథ్యంలో సామాజిక జీవితాన్ని ఉంచగలగాలి. అంటే రచయితలుగా మనకు బాగా తెలిసిన జీవితం ఉన్నప్పటికి అది రాస్తే చాల్లే అనుకోకుండా – సమాజాన్ని అధ్యయనం చెయ్యాలి.**

గురజాడ పురుషులలో ముఖ్యంగా అగ్రవర్ణ పురుషులలో ఉన్న కపటత్వాన్ని, మోసాన్ని, అహంకారాన్ని, నిష్ప్రయోజకత్వాన్ని బట్టబయలు చేశాడు. ఆనాడు సమాజంలో అధికారంలో ఉన్నది వాళ్ళు కాబట్టి వాళ్ళ కపటత్వాన్ని బైటపెట్టటం సాహసం. తనకు తెలిసిన జీవితాన్ని లోతుగా చూసి దానిని సమాజంతో అనుసంధానించి వ్యాఖ్యానించటం గురజాడ తన కథలలో చేశాడు. ఇవాళ మనం చేయవలసింది కూడా అదే – మనకు బాగా తెలిసిన జీవితాన్నే రాయాలి. దానిని ప్రత్యేకంగా రాస్తూనే నేపథ్యంలో సామాజిక జీవితాన్ని ఉంచగలగాలి. అంటే రచయితలుగా మనకు బాగా తెలిసిన జీవితం ఉన్నప్పటికి అది రాస్తే చాల్లే అనుకోకుండా – సమాజాన్ని అధ్యయనం చెయ్యాలి. సమాజంలోని ఆర్థిక, రాజకీయ, పితృస్వామిక, కుల, ప్రాంత కోణాలు మనకు బాగా తెలిసిన జీవితాన్ని ఎట్లా ప్రభావితం చేస్తున్నాయో తెలుసుకోవాలి. అంటే రచయితలుగా మనం చాలా పరిశ్రమ చెయ్యాలి. అనేక సామాజిక విషయాలను గమనించాలి. అధ్యయనం చెయ్యాలి. గురజాడ రచనలు చూస్తే ఆయన లోతైన చూపుకి ఆశ్చర్యం, భయం కూడా కలుగుతాయి. ఆయన గురించి తెలుసుకోవటం ఎందుకంటే సమాజం గురించి అంత లోతైన చూపు మనకున్నపుడే మనం కథకులుగా మనకున్న ప్రతిభను బాగా రాణింపుకు తెచ్చుకోగలుగుతాం.

గురజాడ తర్వాత చిన్న కథ చాలా తొందరలో బాగా ప్రాచుర్యంలోకి వచ్చింది. 30వ దశాబ్దం. అప్పటికి పత్రికలు పెరిగాయి. జీవితంలో అంతకు ముందుకంటే వేగం వచ్చింది. నవల కంటే చిన్న కథ రాయటానికి, చదవటానికి, ప్రచురణకి అనువుగా ఉంటుందనేది గ్రహించారు రచయితలు, పాఠకులు, ప్రచురణ కర్తలు. రెండు, మూడు దశాబ్దాలు చిన్న కథ రాజ్యమేలింది. కథకులు కూడా ప్రసిద్ధులు ఉన్నారా కాలంలో. చలం, చింతా దీక్షితులు, శ్రీపాద, కొడవటిగంటి, కనుపర్తి వరలక్ష్మమ్మ, ఆచంట శారదాదేవి, ఇలాంటి మహా రచయితలు బయల్దేరారు.

వీళ్ళలో ఒక్కొక్కరిదీ ఒక్కో మార్గం. స్త్రీ జీవితాల్లోని హింసను, స్త్రీ పురుష వివక్షను, స్త్రీల లైంగిక పునరుత్పత్తి హక్కులను గురించి రాయటమే ప్రధాన ధ్యేయంగా పెట్టుకుని కథలు రాసినవాడిగా చలం కనిపిస్తాడు. ఐతే ఆయన జాతీయోద్యమాన్ని, సంస్కరణోద్యమాన్నీ కూడా పట్టించుకున్నాడు. వాటిలోని గొప్పతనాన్ని, బోలుతనాన్నీ

కూడా విమర్శిస్తాడు. చలం కథలు రాస్తున్న నాటికి ఆ రెండు ఉద్యమాలు ఆంధ్రదేశంలో తీవ్రస్థాయిలో ఉన్నాయి. ఐతే చలానికి ఆ రెండు ఉద్యమాలూ పరిమిత లక్ష్యాల కోసం పని చేస్తున్నవిగా కనిపించాయి. చలం సంస్కర్త కాదు, రాజకీయవేత్తా కాదు. తాత్త్వికుడు. తాత్త్వికులు పరిధులు, పరిమితులు పెట్టుకోకుండా ప్రశ్నలు అడుగుతారు. ఉన్న సిద్ధాంతాలనూ, ఆలోచనలనూ ఖండించి ప్రశ్నించటం అన్వేషించటం. ఆ అన్వేషణే ఆ ప్రశ్నలే ఆయన కథా వస్తువులయ్యాయి. ప్రశ్నలు అడగటంలో తీవ్రత, చిత్తశుద్ధి చలం నుంచి మనం నేర్చుకోవాల్సింది. ఎవరూ అడగని ప్రశ్నలు అడగటానికి ముందు మన మీద మనం న్యాయం అనుకుంటున్న దాని మీదా నమ్మకం ఉండాలి. స్త్రీలకు తమ మీద తమకు అధికారం కావాలనటంలో చలానికున్న నమ్మకం అచంచలం. అందుకే ఆయన రచనల్లోకి అంత వాడి, వేడి, ప్రతి కథా కొత్తగా రాయటం మనల్ని తనతోపాటు లాక్కుపోవటం, ఉక్కిరిబిక్కిరి చేయటం డిస్టర్బ్ చేయటం ఇది చలం కథల ప్రధాన లక్షణాలు. ఇవి నేర్చుకుంటే వచ్చేవి కాదు. విషయం మీద మనకున్న నమ్మకం, మనకు కలిగే ఆవేశం వీటి స్థాయిలను బట్టే ఆ లక్షణాలు వస్తాయి. నీ కథలో నువ్వెంత వరకూ మునగ గలిగావు అనే దాన్నిబట్టి ఆ లక్షణాలు వస్తాయి. ఆయన దృక్పథం, వ్యంగ్యం, కోపం, హాస్యం తీవ్ర స్పందన ఇవన్నీ కలిసి ఆయన చేత కథ రాయిస్తాయి. ఆయన కథలు చదువుతుంటే ఆయనో కథా వస్తువుని ఎంచుకుని, ఆలోచించి, ఎలా మొదలెట్టాలి, ఎలా ముగించాలి అని ప్లాన్ చేసుకుని రాశాడని అనిపించదు. కొ.కు. అంటాడు ఆయనకు ఒక అన్యాయం మీద కలిగిన ఉద్రేకమే ఒక కథ అయిపోతుంది. వాక్యాలు ఏ ఎడిటింగు అవసరం లేకుండా దొర్లుకొస్తాయి. జీనియస్ అంటారు కొ.కు. ప్రయత్నించి జీనియస్‌లం కాలేం కానీ చలం నుంచి నేర్చుకోవలసింది సత్యం కోసం అన్వేషించే లక్షణాన్ని. ప్రతిదాన్ని, తనతో సహా చీల్చి చూడగల తెగువని, మానవ స్వభావాన్ని చాలా నిర్దాక్షిణ్యంగా చీల్చి చూస్తాడు. ఎందుకంటే మానవుల మీద అపారమైన ప్రేమతో. ప్రేమ, నిర్దాక్షిణ్యం – విరుద్ధంగా కనిపించే ఈ రెండు విషయాలు చలం కథలో విడదీయలేని రీతిలో కలగలవటం వల్ల ఆ కథలకు గొప్ప సౌందర్యం వచ్చి పడుతుంది. బోలెడు ప్రయోగాలు చేసి తర్వాతి రచయితలకు విశాలమైన ఆవరణ ఏర్పరిచాడు. వస్తువులో కథనంలో వచ్చిన ఆధునికతకు మార్గం వేసినవాడు చలం.



**ప్రశ్నలు అడగటంలో తీవ్రత, చిత్తశుద్ధి చలం నుంచి మనం నేర్చుకోవాల్సింది. ఎవరూ అడగని ప్రశ్నలు అడగటానికి ముందు మన మీద మనం న్యాయం అనుకుంటున్న దాని మీదా నమ్మకం ఉండాలి. స్త్రీలకు తమ మీద తమకు అధికారం కావాలనటంలో చలానికున్న నమ్మకం అచంచలం.**

30 దశాబ్దంలో చాలా వేగంగా కథలు రాసిన రచయిత కొ.కు. హంగ్రీ థర్టీస్ – సంక్షోభం – ఆర్థిక మాంద్యం. రెండవ ప్రపంచ యుద్ధం బీజాలు, ఫాసిజం విజృంభణ, సోవియట్ యూనియన్ పురోగమనం. వ్యక్తి స్వేచ్ఛ – భావకవిత్వం. ఐతే భావ కవిత్వం కంటే కథ ప్రజాజీవితాలకి మరింత సన్నిహితమైంది. ప్రజలలో కలిసింది. సామాన్య ప్రజల జీవితంలో ప్రతి అంశాన్ని కథకు వస్తువుగా స్వీకరించే అవకాశం ఉండటంతో కథను ప్రజల నుండి వేరు చేసే అవకాశం లేదు. దాంతో కథ చాలా సులభంగా వ్యక్తి స్వేచ్ఛ భావన నుండి సమష్టి భావనలోకి రాగలిగింది. వ్యక్తుల సమస్యలకు మూలాలు సామాజిక రాజకీయ రంగాలలో ఉన్నాయనే ఆలోచన ఆ మూలాల అన్వేషణ కథలలో ప్రారంభమైంది. ఇదంతా కొ.కు. కథా నేపథ్యమైంది.

అంటే ఇవాళ మనకున్న కథా వాతావరణ ప్రారంభం కొ.కు. చేతుల మీదుగా ప్రారంభమైంది. ఆయన కథనొక ఉద్యమం చేశాడు. అంతర్జాతీయ రచయితల అధ్యయనం, మార్క్సిజం చదవటం, శాస్త్రీయ దృష్టి ఇవన్నీ కథా రచయితగా ఈయనకున్న బలాలు.

ఆయనకు కథకుడిగా బలాన్నిచ్చిన అంశాలను మనం

అధ్యయనం తప్పనిసరిగా చేయాలి. 30, 40 దశాబ్దాలలో కథలు రాసిన శ్రీపాద గారి కున్న ప్రత్యేకత ఆయన భాష, కథన పద్ధతి. ఆ భాష, ఆ పద్ధతి ఆయనకు ఎలా పట్టుబడ్డాయో ఆయనే చెప్పుకున్నారు. తన చుట్టుపక్కల ఉన్న స్త్రీల సంభాషణలను వారికి తెలియకుండా విని ఆ ధోరణిని అనుసరించాడట. అంటే స్త్రీల స్వరంలో (Tone) రాయటం ఆయన ప్రత్యేకత. స్త్రీల సంభాషణలోని సారళ్యం, కథన రీతి, పలికే పలుకుబడులు అనివార్యంగా శ్రీపాద కథలలోకి వచ్చి ఎంతో అందాన్ని, సరళతను, పఠనీయ గుణాన్ని ఇచ్చాయి. బుచ్చిబాబుగారు మనస్తత్వ శాస్త్రాన్ని తరచి చూసి సౌందర్య శాస్త్రాన్ని (ఈస్తటిక్స్) అధ్యయనం చేయటం వలన ఆయన కథలు కొత్త కోణాలను, వింత సౌందర్యాన్ని సంతరించుకున్నాయి.



దీనిని బట్టి కూడా మన పరిసరాలలోని మానవుల ప్రవర్తనను, సంభాషణలను గమనించి, జీవన విధానాలను పరిశీలించటం, వివిధ సామాజిక, సౌందర్య కళాశాస్త్రాల అధ్యయన సహాయంతో దానికి కథ రూపం ఇచ్చినపుడే నాలుగు కాలాలు నిలిచే కథ పుడుతుందని మనకు అర్థమవుతుంది.

***80వ దశాబ్దంలలో స్త్రీవాదం ఒక తాత్త్విక దృక్పథంగా, విశ్లేషణా పద్ధతిగా ముందుకు వచ్చి, స్త్రీల ఉద్యమాలతో బలపడినపుడు రచయిత్రుల కథలు అంతకు ముందుకంటే గుణాత్మకమైన మార్పుని పొందాయి. స్త్రీల దృష్టికోణం, జండర్ స్పృహ కథలలోకి వచ్చాయి.***

60, 70 దశాబ్దాలు ప్రధానంగా నవలలతో నిండిపోయాయి. రచయితలు, పాఠకులు కూడా కథ మీదకంటే నవల మీద దృష్టి ఎక్కువ పెట్టారు. ఐతే 70వ దశాబ్దంలో రాచకొండ విశ్వనాథశాస్త్రి, బీనాదేవి, కాళీపట్నం రామారావుల చేతిలో కథ మళ్ళీ తాజా వస్తు శిల్పాలతో ప్రకాశించింది. రావిశాస్త్రి అంతవరకు సాహిత్యంలోకి సగౌరవంగా ప్రవేశించని అధోజగత్ సహోదరులను, స్త్రీలను ఒక ధిక్కారస్వరంతో, వారిదైన భాషతో ప్రవేశపెట్టారు. మాండలిక భాష అందరినీ ఆకర్షించటం మొదలైంది. బీనాదేవి ఆ భాషలోనే వర్గ దృక్పథపు కథలు రాసి కథారంగాన్ని మిరుమిట్లు గొల్పారు. కాళీపట్నం రామారావు గారి "యజ్ఞం" కథ తెలుగు సాహిత్యాన్నంతా ప్రభావితం చేసిన కథ. ఒక కథలో మొత్తం దేశం స్వాతంత్ర్యానంతరం నడిచిన అభివృద్ధి పథాన్ని చెప్పి, అందులో బోలుతనాన్ని, ధనికవర్గ పక్షపాతాన్ని విప్పి చూపించి కథ ఎంత లోతుగానైనా, ఎంత విస్తృత వస్తువుతోనైనా నిర్వహించవచ్చని నిరూపించాడు. ఆయన చావు, భయం, జీవధార, ఆర్తి, కుట్ర కథలు కథా సాహిత్యాన్ని 70వ దశాబ్దంలో ఎంతో ప్రభావితం చేశాయి. ఆ సమయంలోనే కాలువ మల్లయ్య, కొలకలూరి ఇనాక్‌లు దళిత జీవనంలోని శ్రమదోపిడీని, వివక్షను చూపిస్తూ మంచి కథలు రాశారు.

ముళ్ళపూడి వెంకటరమణ గారి హాస్యవ్యంగ్య వైభవంతో కూడిన కథలు, పురాణం సుబ్రహ్మణ శర్మ గారి కథలు కూడా 60, 70 దశాబ్దంలోనే వచ్చాయి. 90ల నుంచీ రాస్తున్న శ్రీ రమణ గారి కథలు చదివిస్తాయి. చమత్కార ధోరణితో రాసే పద్ధతి నేర్పుతాయి.

80వ దశాబ్దంలో అస్తిత్వ వాదాలు ముందుకు వచ్చాయి. వాటిలో స్త్రీవాదం గురించి ముందు చెప్పుకోవాలి. 60, 70 దశాబ్దాలలో స్త్రీలు నవలలు ప్రధానంగా రాసినా ఆచంట శారదాదేవి, ఇల్లిందల సరస్వతీదేవి, అబ్బూరి ఛాయాదేవి, వాసిరెడ్డి సీతాదేవి, డి. కామేశ్వరి మొదలైన వారు మంచి కథలు రాసి స్త్రీల దృష్టితో జీవితాన్ని చూసే ప్రయత్నం చేశారు. అబ్బూరి ఛాయాదేవి గారి 'బోన్సాయ్ బతుకులు' కథ దానికి మంచి ఉదాహరణ. ఐతే 80వ దశాబ్దం లో స్త్రీవాదం ఒక తాత్త్విక దృక్పథంగా, విశ్లేషణా పద్ధతిగా ముందుకు వచ్చి, స్త్రీల ఉద్యమాలతో బలపడినపుడు రచయిత్రుల కథలు అంతకు ముందుకంటే గుణాత్మకమైన మార్పుని పొందాయి. స్త్రీల దృష్టికోణం, జండర్ స్పృహ కథలలోకి వచ్చాయి. స్త్రీల శరీరాలలోని రాజకీయాలు "రాజకీయ కథలు" (ఓల్గా)గా రూపం దాల్చాయి. స్త్రీ పురుష సంబంధాలలోని వివిధ కోణాలు, స్త్రీల లైంగిక పునరుత్పత్తి

హక్కులు కథా వస్తువులయ్యాయి. ఓల్గా, పి.సత్యవతి, కె.వరలక్ష్మి, కుప్పిలి పద్మ, గీతాంజలి, అబ్బూరి ఛాయాదేవి, ఇంద్రగంటి జానకీబాల, ప్రతిమ ఇలా ఎందరో రచయిత్రులు కొత్త కథా కథనాలతో రాశారు. స్త్రీవాదం గురించి తెలియకుండా, తెలుసుకోకుండా ఇవాళ కథలు రాస్తే అవి చాలా తేలిపోతాయి. తేలికయిపోతాయి. విలువలేని వయిపోతాయి. ఇతర అస్తిత్వవాదాల నేపథ్యంలో రాసినా అందులోనూ జండర్ స్పృహ ఉండవలసిన అంశమే అవుతుంది.



దళిత ఉద్యమాల నేపథ్యంలో దళితవాదం పదునెక్కింది. దళితులు తరతరాలుగా అనుభవిస్తున్న కులవివక్ష గురించి, అగ్రవర్ణాలు చేసే దోపిడీ అణిచివేతల గురించి రాయసాగారు. "నల్లపొద్దు" సంకలనం వచ్చి దళిత స్త్రీల రచనలకు గుర్తింపుని, గౌరవాన్ని తెచ్చింది. జాజులగౌరి, జూపాక సుభద్ర, గోగు శ్యామల, వినోదిని, చల్లపల్లి స్వరూప వంటి రచయిత్రులు తమ కథలతో కొత్త ప్రపంచాన్ని చూపించారు. భాషలో మాండలికాన్ని సమర్థవంతంగా ప్రవేశపెట్టారు. అంబేద్కర్ ఆలోచనలు, తాత్త్వికతలను భూమికగా చేసుకుని దళిత కథ అభివృద్ధి చెందుతోంది. ఇవాళ మన కుల వ్యవస్థను సరిగా అర్థం చేసుకోవాలంటే అంబేద్కర్ రచనల అధ్యయనం కూడా తప్పనిసరి.

ఇక 1992లో బాబ్రీ మసీదు విధ్వంసం తర్వాత భారతదేశంలో ముస్లింల పట్ల మెజారిటీ హిందువుల వైఖరి ఎలా ఉందో, ఆలోచించాలనే వాదం, చర్చ మొదలయ్యాయి. దేశంలో తమది రెండవ తరగతి పౌరసత్వం అనే విషయం గ్రహించిన ముస్లింలు తమ అస్తిత్వ ప్రశ్నలతో రాజకీయాలనూ, సాహిత్యాన్ని ప్రభావితం చేశారు. గుజరాత్ నరమేధంతో వారి ప్రశ్నలు ఎంత అత్యవసరంగా సమాధానమివ్వాల్సిన తెలిసి వచ్చింది. ఖాదర్ మొహియుద్దీన్, స్కైబాబా, గౌస్, షాజహానా, ఖాజా, అన్వర్, వేంపల్లె షరీఫ్, ఖదీర్‌బాబు ఇంకా అనేకమంది రచయితలు ముస్లిం ప్రజల జీవితాలను కథలుగా రాసి వారనుభవించే క్షోభను అర్థం చేయించారు. 'వతన్' అనే కథల సంపుటం ఈ శతాబ్దంలో వచ్చిన కథల సంపుటాలలో ముఖ్యమైనది.

ఇక ప్రాంతీయ స్పృహ కలిగిన కథలు కూడా 90వ దశాబ్దం నుంచీ వస్తున్నాయి. రాయలసీమ కథలు, తెలంగాణా కథలు తమదైన భౌగోళిక అస్తిత్వాన్ని, సామాజిక జీవన శైలిని మాండలిక భాషను కథలలోకి తీసుకొచ్చి కథల పంట పండించారు. ప్రాంతీయతలో కూడా ఒక ప్రత్యేక గ్రామానికో, మండలానికో చెందిన కథలు రావటం మొదలైంది. అమరావతి కథలతో 70వ దశాబ్దంలోనే మొదలైనా ఈ తరహా కథలు 90వ దశాబ్దం నుంచే బాగా ప్రాచుర్యంలోకి వచ్చాయి. రాయలసీమ కథకులలో మధురాంతకం రాజారాం, కేతు విశ్వనాధరెడ్డి, సింగమనేని నారాయణ, చిలుకూరి దేవపుత్ర, శాంతి నారాయణ మొదలైన వారు ఆ ప్రాంత సమస్యలను అందరికీ కథారూపంలో పరిచయం చేశారు. ఖదీర్‌బాబు దర్గామిట్ట కథలు, పోలేరమ్మ బండ కథలు, సుశీల గారి ఇల్లేరమ్మ కథలు, సం.వెం.రమేశ్ ప్రళయకావేరి కథలు, గోపిని కరుణాకర్ దీపం చెప్పిన కథలు, ఎండ్లూరి సుధాకర్ కథలు ఇవన్నీ ఒక చిన్న భౌగోళిక ప్రాంతంలోని ప్రజల జీవన వైవిధ్యాన్ని, అక్కడికే పరిమితమైన కొన్ని ఆచార వ్యవహారాలను తెల్పుతాయి.

**ప్రాంతీయ స్పృహ కలిగిన కథలు కూడా 90వ దశాబ్దం నుంచీ వస్తున్నాయి. రాయలసీమ కథలు, తెలంగాణా కథలు తమదైన భౌగోళిక అస్తిత్వాన్ని, సామాజిక జీవన శైలిని మాండలిక భాషను కథలలోకి తీసుకొచ్చి కథల పంట పండించారు. ప్రాంతీయతలో కూడా ఒక ప్రత్యేక గ్రామానికో, మండలానికో చెందిన కథలు రావటం మొదలైంది.**

ప్రస్తుతం కథలు విస్తృతంగా రాస్తున్న వారిలో బి.ఎస్.రాములు, పెద్దింటి అశోక్ కుమార్, సన్నపురెడ్డి వెంకట్రామరెడ్డి, మల్లీశ్వరి, సామాన్య, ఉమామహేశ్వర్ మొదలైన వారున్నారు. ప్రపంచీకరణ నేపథ్యంలో వీరి కథలు అనేక సామాజిక అంశాలను ఇముడ్చుకుని పాఠకులకు సమాజాన్ని అర్థం చేయిస్తున్నాయి.

ఇవాళ తెలుగు కథ రాయాలన్నా, తెలుగు కథను పూర్తిగా అర్థం చేసుకోవాలన్నా అనేక సామాజిక, రాజకీయ, తాత్త్విక విషయాల మీద కనీస అవగాహన ఉండాలి. అలా ఉన్నప్పుడు మ్యాజిక్ రియలిజాన్ని తెలుగు కథల్లోకి అత్యద్భుతంగా ప్రవేశపెట్టి పాఠకులకు కొత్త ఆలోచనను అనుభూతిని ఇచ్చిన డా॥ వి. చంద్రశేఖరరావు కథలను బాగా ఆనందించగలుగుతారు. అలాంటి కథలు రాయడానికి ఎంతో సాధన కూడా కావాలి.

మొత్తం మీద 115 ఏళ్ళ వయసున్న తెలుగు కథ అనేక వాదాలను, స్పృహలను ఇముడ్చుకుని మంచి శిల్ప పరిణితి సాధించి ఇతర భారతీయ భాషలలో సగర్వంగా నిలబడగలుగుతోంది. కథలో ఇన్ని ప్రత్యేక అంశాలు (అస్తిత్వ, ప్రాంతీయ, మైనారిటీ, దళిత) రావటం వల్ల కథ పాఠకులలో మానవీయతకు సంబంధించిన సంస్కారాన్ని, సున్నితత్వాన్ని పెంచగలుగుతోంది.

కొత్తగా కథలు రాసేవాళ్ళూ రాయాలనుకునేవాళ్ళూ అధ్యయనం తప్పనిసరిగా చెయ్యాలి. అప్పుడే కథకు ఒక చూపు, మానవీయమైన సున్నితత్వం అబ్బుతాయి. అవి పాఠకులను ప్రభావితం చేసి వారిలో సంస్కారాన్ని పెంచగలుగుతాయి.

**.....కొన్ని వందల మంది కథకులు, లక్షల కథలు ఉన్నప్పుడు అందరి గురించీ ప్రస్తావించలేని నా అశక్తతను మన్నించండి. ఇది కొత్త రచయితలకు, కథలు రాయటం మొదలుపెట్టే వారికోసం గాని సాహిత్య విమర్శో, పరామర్శో కాదు. - ఓల్గా**






*నేను కొన్ని సంఘటనలకు ఎదురుగుండా వెళతాను. వాళ్లచేత ఆ సంఘటనని మీకు తెలియజేస్తాను. ఈ సంఘటనలో పాత్రలు సహజంగా వుండాలి. నూటికి నూరుపాళ్లూ నిజాయితీగా ఆc.. వాస్తవికంగా వాళ్లు వ్యవహరిస్తారు. పాత్రలన్నీ వ్యవహరిస్తాయి. వాళ్ల భాష మాట్లాడుతాయి. ఆ పాత్రలూ, వాళ్లు ఏ భాష మాటాడాలో ఆ భాషే మాట్లాడతాయి. ఏ సంఘటన జరిగిందో చెప్పబడుతుంది. నాకూ దానికీ ఏ సంబంధం లేదు. దాని వెనకాతలుంటాను. అయితే ఏవిcటంటే, ఆ పాత్రల్ని నడిపిస్తున్నదెవరూ? నేనే కదా! నా సిద్ధాంతమొకటుంటుంది కదా, ఆ సిద్ధాంత రీత్యా వాళ్లు నేను చెప్పినట్టు నడుస్తూ ఉంటారు. నా చేతిలో వారు పావులుగా వ్యవహరిస్తూ వుంటారు. కుటుంబరావు ఓ మాటు నా మీద ఏవంcన్నాడంటే, జీవితాన్ని జిడ్డులా పట్టుకున్నాడని. అంత జిడ్డుగా జీవితాన్ని చూపించడానికి ప్రయత్నిస్తాను. అవన్నీ మరి నా చేతిలో పావులే. నేన్చెప్పినట్టవి వ్యవహరించాలి. నేనే సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నానో ఆ సిద్ధాంతాన్ని వ్యక్తం చెయ్యాలి. సిద్ధాంతమెక్కడా వుండదు. ఆ జీవితం తాలూకు సంఘటన చెప్పి పూర్తి చేసిన తర్వాత కథల్లోంచి ఆ సిద్ధాంతం బయటకొస్తుంది.*

*నేను చిన్నప్పట్నుంచీ ఒకటి చేశేను. మనుషుల్ని పరిశీలించడం. మనుషుల తాలూకు ప్రవృత్తులూ అవీ తెలీడానికి మనుషులు మాటాడుకుంటూ వుంటే మనకి బోధపడుతుంది. చాలా లోతైన విషయాలు తెలుస్తాయ్ దీనివల్ల. ఆ విధమైన మాస్ అబ్జర్వేషన్ చేశేను. తరవాత, లోకంలో మనం తిరుగుతుంటాం కదా! ఎవరు ఏం మాటాడినా పరిశీలిస్తూ వుంటుంది బుద్ధి. ఆ విధంగా మనుషుల్ని చూసే రాశేన్ తప్ప పుస్తకాలు చదివి కాదు. భాష కూడా అంతే. పుస్తకాల భాష కాదు. ఇప్పుడు చలం రాసిన బాషే నేన్రాయను. గ్రాంథికవేc కాదు. వాడుక భాషలో రాసిందీ నేను రాయను. నా చెవితో నేను గేదర్ చేసిందే రాస్తాను. ఈ భాషంతటికీ కారణం చెవి లాగిందే. శబ్దమూ అర్థమూ కూడా చెవి లాగుతుంటుంది.*

**- చాసో**



★ మహమ్మద్ ఖదీర్‌బాబు

# కథలెవరు రాస్తారు ?

మనకు చాలా నిర్భయత్వం కూడా కావాలి. నచ్చనిది నిర్మొహమాటంగా చెప్పగలగాలి. నచ్చింది శిఖరం ఎక్కి అరిచి వినిపించాలి. ఏమనుకుంటారో అనే అతి మర్యాదని, ఏమీ అనకుండా ఏమీ అనకుండా అనే అతి జాగ్రత్తని పాటించి రాసే లక్షణాలు ఉంటే అలాంటివాటిని చెప్పుల స్టాండ్‌లో పెట్టి మర్చిపోవాలి. మరీ ఫిల్టర్ చేసి రీఫైన్ చేసి పెట్రోలు వరకూ ఆగి చూడకుండా ఒకసారి కిరసనాయిల్‌తోనే అగ్గెట్టాలి. మరోసారి తారు కుమ్మరించి నిప్పెట్టాలి. సమాజానికి లాలిపాడ్డం మన పని కాదు. మెచ్చేది చెప్పడం మన పని కాదు. దానికి ఇష్టం లేనివి మానుకోవడమూ మన పని కాదు. అలాంటివి చేసి పైకి వచ్చి జీవితంలో చక్కగా సెటిల్ కావాలంటే దానికి వేరే పన్లున్నాయి.

దీని మీద మాట్లాడ్డానికి పిల్చినప్పుడు - తెలకపల్లి రవిగారు, లక్ష్మయ్య పాత మిత్రులు కనుక ఒప్పుకున్నాను. పైగా ప్రజాశక్తి వంటి ఒక సుదీర్ఘమైన చరిత్ర కలిగిన ప్రచురణాలయం సాహిత్యపత్రిక అయిన ప్రస్థానం... దీని నుంచి ఆహ్వానం వచ్చినప్పుడు రాను అని చెప్పడం పొగరు అవుతుంది. అయితే రాను అనే చెప్పాలి. ఎందుకంటే నాకు మాట్లాడ్డం రాదు. ఒకవేళ వచ్చినా థియరీ చెప్పడం రాదు. కథలెలా రాస్తారు? ప్లాట్ అంటే ఏమిటి? థీమ్ అంటే ఏమిటి? కాన్‌ఫ్లిక్ట్ అంటే ఏమిటి? ఇవన్నీ వివరించి చెప్పడం తెలీవు. ఎందుకంటే అవి తెలుసుకొని నేను కథలు రాయలేదు. అయితే నేను రాసే కథల్లో అవన్నీ ఉండే ఉండాలి. స.ప.స.లు తెలియకపోయినా బాగా పాడినామంటే పాడినట్టే కదా! సరే, ఏదో మాట్లాడేశామని అనుకుంటే అదంతా పేపర్ మీద పెట్టమనీ దానిని అచ్చేస్తామని మరో విన్నపం. ఈ పని చేయటం అంటే నా ఆప్తమిత్రులకు చేతినిండా పని అప్పజెప్పడమే. ఎందుకంటే ఇలాంటి విషయాల మీద మాట్లాడదగ్గ నిపుణులు చాలా మంది ఉన్నారు. నేను మరీ సరిగ్గా రాసేస్తే వాళ్లంతా గాయపడతారు.

అసలు కథల్ని ఎవరు రాస్తారు? ఈ నీళ్లలోకి ఎవరు దిగుతారు? అది తెలియాలంటే ముందు మనం మత్స్యమో కాదో తెలియాలి. అసలు మత్స్యమే కాదని తెలిసినప్పుడు నీళ్లలోకి దిగడం అనవసరం. పోనీ మండూకంలాంటి శక్తి కలిగి అప్పుడప్పుడు దిగి, ఈది, బయటపడే లాఘవమైనా ఉండాలి. పోనీ సర్పంలాగానో, మొసలిలాగానో, తాబేలూ... నది దాటే సమయంలో ఏనుగులాగానో మొత్తం మీద ఎలాగోలా ఈదగలిగే స్వతఃసిద్ధమైన గుణం మనకు ఉందా? లేదా? అనేది మొదట కనిపెట్టాలి. అది ఉంటే అప్పుడు దిగాలి. అప్పుడే ఆ రంగంలో ఇష్టమైన పని చేయగలం. ఎదుటివారు ఇష్టపడేలా చేయగలం. లేదంటే ఎడారిలో తేలులాగానో, కయ్యల్లో ఎలుకలాగానో... అలాంటి పనుల్లోకి వెళ్ళిపోవాలి. అంతే తప్ప ఇక్కడ కన్పడరాదు.

అయితే మనకు కొంచెం యాంగ్జయిటీ న్యూరోసిస్ లాంటిది ఉండాలి. అంటే ఏమిటంటే ప్రతిదానికీ చిలువలు పలువలుగా ఊహించుకుంటూ ఉండాలి. పిల్లలు స్కూల్ నుంచి ఇంకా రాలేదంటే బస్సు పంక్చర్ అయ్యిందేమో, ట్రాఫిక్ జామ్ అయ్యిందేమో, వాళ్ళ నాన్న వచ్చి బజారుకు తీసుకెళ్ళారేమో, క్లాస్‌రూమ్‌లో హోమ్‌వర్క్ చేసుకుంటూ ఉండిపోతే చూసుకోకుండా తాళాలు వేసేశారేమో టీచర్ పనిష్మెంట్ ఇస్తే స్పృహ తప్పి ... ఇలా ఊహలు చిలవలు, పలవలుగా వెళ్లిపోతూ ఆందోళన చెందేవాళ్లు ఈ పనిలో రాణిస్తారు. చాలామంది గొప్ప రచయితలకు ఈ గుణం కొద్దో గొప్పో ట్రీట్‌మెంట్ అవసరం అనే స్థాయిలోనో ఉంటుంది. అలాంటివాళ్ళు కథను మొదలెట్టి మొదటి పేరా రాసి తర్వాతేమిటి అని తెల్లమోహం వేయరు. ఎందుకంటే తర్వాతి పేరా అప్పటికే సిద్ధమై ఉంటుంది.



అయితే మనకు కొంచెం భావుకత్వం ఉండాలి. అంటే డాబా మీద పడుకుని చందమామలోకి చూసి ఆ మచ్చకు అర్థం వెతుకుతూ, అందులో ఉండే ముసలామె ముఖాన్ని ఊహించుకుంటూ, ఆమె కనుక దోసెలు పోస్తూ ఉంటే ఆ చుర్రుచుర్రుమనే శబ్దాన్ని వింటూ, రాత్రిశ్వాస సోకితే చాలు ఆయువు వదిలేసి రాలిపోయే పూల మృత్యు సౌందర్యాన్ని పరికిస్తూ, పాతకాలపు కిటికీ మీద ఒక నగిషీ, చిన్నపిల్లల అరిచేతుల్లో గోరింటాకుతో పెట్టిన నెలవంక, నిట్టనిలువుగా తాకుతున్న ఎండకు తల వొంచకుండా మెరుస్తున్న తాటిముంజ తడి, చొరవగా ఇంట్లోకి చొరబడిన పిచిక నడిచే వొంకర టింకర నడక, వయసొచ్చిన ఆడపిల్ల పాదాల మొత్తటి ధ్వని, ఒక కొస గర్జిస్తూనే ఒక కొస కుంచెగా మారి కడలి అల దిగవిడిచే నురగచార... ఇవన్నీ చూసి మురిసిపోయే లక్షణం ఉండాలి. లోలోపల ఆనందిస్తూ పరవశిస్తూ అలాంటి వాటితో జన్మకు సరిపడా ఆయువు పోసుకుంటూ... అప్పుడు మన కథలో ఆ జీవం వచ్చేస్తుంది. ఆ సౌందర్యం వచ్చేస్తుంది. చల్లగాలిలో చుక్కలన్నీ కలిసి ఛక్‌ఛక్‌మని మెరుస్తూ మన కథల్లో కిలకిలమని నవ్వుతూ పాఠకులకు గుండె ఝల్లుమనిపిస్తాయి. మనక్కూడా.

అయితే మనకు ఓం ప్రథమంగా చాలా పెద్ద కరుణ కూడా ఉండాలి. లోకులకు మనం ఎలా కనపడ్డా లోకులు మనతో ఎలా తలపడ్డా మనం చాలా పెద్ద కరుణతో ఉన్నవాళ్లము అని ముందు మనకు తెలియాలి. తాకితే కన్నీరొలికే ఆ పసిహృదయాన్ని జాగ్రత్తగా కంచెగట్టి పరుల కన్ను సోకకుండా నరదృష్టి తగలకుండా కాపాడుకోవాలి. ఆ కరుణే మన కథ. ఆ కన్నీరే కథలు పొంగే ఊట. దారిన పోతుంటే ఏ అనామకుడో అలమటిస్తుంటే, ఆవేళ దినపత్రికలో గుండెలవిసేలా ఒక వార్త కనిపిస్తే, తెలిసినవాళ్లకు తీర్చలేని కష్టం దాపురిస్తే మనకు మాత్రమే తెలిసిన మన ముందు మనం నిజాయితీగా ఏడ్వగలిగిన ఏడుపు మనకు రావాలి. అరె అనుకునే దుఃఖం మనలో ఉండాలి. ఆ దుఃఖం దొంగది కాదని నిజమైనదే అని మనకు తెలుస్తూ ఉండాలి. అప్పుడు ఆ దుఃఖమంతా మన కథల్లో వచ్చేస్తుంది. అది నిజమైనదే అయితే పాఠకులను నిజంగా కదిలిస్తుంది. అది దొంగది అయితే ఆ రచయితను దొంగవేధవను చేసి ఈసడింప చేస్తుంది.

***ఆవేళ దినపత్రికలో గుండెలవిసేలా ఒక వార్త కనిపిస్తే, తెలిసినవాళ్లకు తీర్చలేని కష్టం దాపురిస్తే మనకు మాత్రమే తెలిసిన మన ముందు మనం నిజాయితీగా ఏడ్వగలిగిన ఏడుపు మనకు రావాలి. అరె అనుకునే దుఃఖం మనలో ఉండాలి. ఆ దుఃఖం దొంగది కాదని నిజమైనదే అని మనకు తెలుస్తూ ఉండాలి. అప్పుడు ఆ దుఃఖమంతా మన కథల్లో వచ్చేస్తుంది. అది నిజమైనదే అయితే పాఠకులను నిజంగా కదిలిస్తుంది.***

అయితే మనకు చాలా నిర్భయత్వం కూడా కావాలి. నచ్చనిది నిర్మొహమాటంగా చెప్పగలగాలి. నచ్చింది శిఖరం ఎక్కి అరిచి వినిపించాలి. ఏమనుకుంటారో అనే అతి మర్యాదని, ఏమీ అనకుండా ఏమీ అనకుండా అనే అతి జాగ్రత్తని పాటించి రాసే లక్షణాలు ఉంటే అలాంటివాటిని చెప్పుల స్టాండ్‌లో పెట్టి మర్చిపోవాలి. మరీ ఫిల్టర్ చేసి రీఫైన్ చేసి పెట్రోలు వరకూ ఆగి చూడకుండా ఒకసారి కిరసనాయిల్‌తోనే అగ్గెట్టాలి. మరోసారి తారు కుమ్మరించి నిప్పెట్టాలి. సమాజానికి లాలిపాడ్డం మన పని కాదు. మెచ్చేది చెప్పడం మన పని కాదు. దానికి ఇష్టం లేనివి మానుకోవడమూ మన పని కాదు. అలాంటివి చేసి పైకి వచ్చి జీవితంలో చక్కగా సెటిల్ కావాలంటే దానికి వేరే పన్లున్నాయి.

అయితే మనకు - సరే - పై లక్షణాలన్నీ ఉండి - రాయాలనుకుంటే మొదట మనకు రాయడం తెలియాలి. అంటే దానికి ముందు చదవడం తెలియాలి. అవంతీపుర రాజ్యాన్ని విక్రమవర్మ అనే రాజు పరిపాలించే రోజులవి. ఫట్‌మనే దెబ్బ మెరుపు వేగంతో తాకింది. ఆగంతకుడి కళ్ల ముందు పంచరంగుల నక్షత్రాలు మెరిశాయి. మళ్లీ అదే వేగంతో పిడికిలి విసిరాడు షాడో. అప్పాయమ్మగారు పక్కింటి కుర్రవాడు గదిలో ఉన్నాడన్న సంగతి మర్చి స్నానానికి బయలుదేరారు. చీర విప్పి తడిక మీద వేశారు. సరిగ్గా రాత్రి పన్నెండు గంటలు. శ్మశానం నిశ్శబ్దంగా ఉంది. దాదాపు పన్నెండేళ్ల తర్వాత ఒళ్లు విరుచుకుని కాష్మోరా నిద్ర లేస్తున్న సమయం. చిక్కుడు గింజల వేపుడు ఇష్టం పరాంకుశానికి. భార్య అది చేసిన ప్రతిసారీ చిన్న నవ్వు వస్తుంది. అతడి పెదాల మీద. ఒక శతఘ్ని పేలినట్టయ్యింది గుండెల్లో. పోస్ట్ అన్న కేకతో పడక్కుర్చీలో ఉన్న పరంధామయ్య ఉలిక్కిపడి భార్యవైపు చూశారు. యాభయ్యేళ్ల సుమిత్‌బాబు గంగ ఒడ్డుకు వ్యాహ్యాళిగా బయలుదేరిన ప్రతిసారీ నౌకర్ గోవింద్‌దాస్ వెన్నంటే ఉంటాడు. నాగర్ కోయిల్ స్ట్రీట్‌లో తంగముత్తును ఎరగనివారు లేరంటే ఇందులో ఎటువంటి విడ్డూరము లేదు. ధూసరవర్ణపు మేఘాలు సైప్ మైదానం పై దట్టంగా పేరుకున్నాయి. ఏం గోవిందప్పా యాడకి యీ యాళప్పుడు యెల్లబారినావు? అడిగినావా.... థూ అని వక్కాకు ఊంచి అరుగు మీద కూచున్నాడు గోవిందప్పా... ఇలా దొరికినవి దొరికినట్టుగా చదివేసే పిచ్చి మనకు ఉండి ఉండాలి. అదంతా లోలోపల ఎక్కడో చేరి ఉండాలి. అది ఇటుక మీద ఇటుక పేర్చినట్టుగా తయారుగా ఉండి ఇక మీద కథ కట్టడానికి అనువైన సామగ్రిగా చేతికి అనువుగా ఉండాలి. లేటు వయసులో రాయడం మొదలుపెట్టి మహా రచయితలు అయినవారు ఉన్నారు. కాని చిన్నప్పటి నుంచి చదవడం అలవాటు లేనివాళ్లు మహా రచయితలు అయిన దాఖలాలు లేవు. అలా చదివామా లేదా తిరిగి చూసుకొని - తేల్చుకొని - ముందుకు అడుగు వేయాలి.



**లేటు వయసులో రాయడం మొదలుపెట్టి మహా రచయితలు అయినవారు ఉన్నారు. కాని చిన్నప్పటి నుంచి చదవడం అలవాటు లేనివాళ్లు మహా రచయితలు అయిన దాఖలాలు లేవు. అలా చదివామా లేదా తిరిగి చూసుకొని - తేల్చుకొని - ముందుకు అడుగు వేయాలి.**

అయితే మనకు ఇప్పుడు కాసింత చూపు కూడా కావాలి. అంటే కళకళలాడుతున్న నూరుమంది అన్నదమ్ముల్ని సర్వనాశనం చేసి, తోబుట్టువులూ, బంధువులూ అని చూడకుండా ముక్కుపచ్చలారని వారసులను కూడా శత్రుశేషం పేరుతో నిర్మూలించి చాలా పుణ్యాత్ములుగా చెలామణి అవుతున్న పాండవులు పుణ్యాత్ములేనా అనే మీమాంస కొంచెం రావాలి. బొడ్డు కింద బాణం కొట్టి అన్నను చంపు అని సలహా ఇచ్చేవాడు ఉత్తముడైన తమ్ముడు కాదని ఉత్త వెధవ అవుతాడని విభీషణుణ్ణి చూసి తెలుసుకోవాలేమో అనే సందేహం తట్టాలి. గ్రీన్‌కార్డులూ, పాస్‌పోర్ట్‌లూ తీసుకుని దర్జాగా దేశాలు తిరిగే ఆసాములు అలా ఎందుకున్నారో మురికివాడల అంచు దాటక ఆధార్ కార్డ్ కోసం భయం భయంగా దేబిరించే బుక్కాఫకీర్లు ఇలా ఎందుకున్నారో తరచి చూడమనే ఆలోచన బుర్రలో తొలగాలి. భావోద్వేగాలను రెచ్చగొట్టి వందలాది ఆత్మహత్యలకు పురిగొలిపే వాళ్లు, మతాలను వాడుకొని వేలాది మందిని కత్తికొక కండగా నరికినవారూ లల్లాయిపాటలు పాడుకుంటూ సరదాగా తిరిగేస్తుంటే ఒకటీ అరా నేరానికి పూటకు ఠికానాలేని దౌర్భాగ్యులకే చకచకా ఉరిశిక్షలు ఎందుకు పడిపోతాయో గమనించి ఆలోచించి ఈ నిష్పాక్షికమైన న్యాయవ్యవస్థను శ్లాఘించే వాక్యాన్ని సాదడానికి వ్యంగ్యపు ఆకురాయిని అందుకునే తెగువ కలగాలి. ఇవన్నీ ఉన్నవాళ్లు అవి తమలో ఉన్నాయని తెలియకనే కథలు రాయడం మొదలుపెడతారు.

ఇవన్నీ లేనివాళ్లు అవి తమలో లేవు అని తెలిసి కూడా కథలు రాసేస్తూ ఉంటారు.

అయితే - వంద గబ్బిలాలు కలిసినా ఒక్క మిణుగురుకు సాటి రావు కదా.

కథ
ప్రత్యేకసంచిక



★ డా॥ లెనిన్ ధనిశెట్టి



# వస్తుపరామర్శ కొన్ని ఆలోచనలు



> కథా రచనాక్రమంలో వస్తువు కీలకమైన పాత్ర పోషిస్తుంది. రచనకు వస్తువే ప్రాధమికం, ప్రాముఖ్యం - కాబట్టి శిల్పం ఎప్పుడూ ద్వితీయాంశమే. కేవలం వస్తువిశ్లేషణ ద్వారా మాత్రమే ఒక రచన/కళారూపం ఏ వర్గ దృక్పధాన్ని అనుసరిస్తుందో అర్థం చేయిస్తుంది.

వ్యాకరణంలో వస్తువు అనే పదం వుకారాంత నపుంసకలింగం. తరబడి, తరము, దినుసు, రకము, సరుకు, ద్రవ్యము, వస్తువు, పదార్థము, సత్‌పదార్థము, ఆత్మ అనేవి నిఘంటుకారులు 'వస్తువు' శబ్దానికి ఇచ్చిన అర్థాలు. ఆంగ్లంలో వస్తువును **Content** గా వారి సాహిత్యంలో వ్యవహరిస్తారు. **1. Some thing is contained, 2 . The subject or Topics coverd in a book 3. some thing that is to be expressed through some medium, as speech, writing, or any of various arts. 4. The am ount Contained** యిలా రకరకాల అర్థాలు ఆంగ్ల నిఘంటుకారులిచ్చారు. ఒక్కో కళారూపంలో ఒక్కొక్క విధంగా వస్తువు కంటెంట్ వ్యక్తం అవుతాయి.

సాహితీవిమర్శలో ప్రధానంగా వస్తు - శిల్పాలు రకాలుగా నిర్వచించారు. స్వల్పమైన తేడాలతో

1. సాహిత్యంలో వ్యక్తం అయ్యే ప్రధాన భావాన్ని వస్తువు అంటారు. 2. రచయిత సాహిత్యంలో / రచనలో వివరించిన అంశాన్ని వస్తువు అంటారు. 3. ఒక రచన ఏం చెబుతుందీ అనేదే ఆ రచనా వస్తువు 4. రచనలో వుండే ప్రధాన కథ స్వభావం వస్తువు. యిలా వస్తు పదాన్ని నిర్వచించినవారంతా పదాల తేడాతో ఒకే భావాన్ని వ్యక్తం చేశారు.

కథా రచనాక్రమంలో వస్తువు కీలకమైన పాత్ర పోషిస్తుంది. రచనకు వస్తువే ప్రాధమికం, ప్రాముఖ్యం - కాబట్టి శిల్పం ఎప్పుడూ ద్వితీయాంశమే. కేవలం వస్తువిశ్లేషణ ద్వారా మాత్రమే ఒక రచన/కళారూపం ఏ వర్గ దృక్పధాన్ని అనుసరిస్తుందో అర్థం చేయిస్తుంది. ఆ రచన ఏ విలువల్ని నేర్పిస్తుందో అవగతం చేయిస్తుంది. వస్తువెప్పుడూ సామాజిక వాస్తవికతను నిండుగా ప్రదర్శించాలి. రచనారూపంలో నిర్ణయాత్మక పాత్ర వస్తువుదే. రచయితకాగోరేవాడు వస్తువు ఎంపిక విషయంలో జాగ్రత్తగా, మెలకువతో వ్యవహరించాలి.

చారిత్రకంగా ఆయా కాలాలలో ఆయా వర్గాల ప్రయోజనం మేరకు వస్తువు అనేక రకాలుగా ఉనికిలోకి వచ్చింది. రాచరిక వ్యవస్థలో పురాణాలు, కావ్యాలు, ఫ్యూడల్ వ్యవస్థలో శృంగారకావ్యాలు పుంఖానుపుంఖాలుగా వెలువడ్డాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ, శాస్త్రవిజ్ఞానం వస్తువులో

మౌలికమైన మార్పును తీసుకువచ్చాయి.. గ్రాంధికం వచనమై ప్రవహించి ఆధునిక సాహిత్యం ఆరంభంకావడంతో మనిషికి సంబంధించిన విస్తృత అంశాలు కథా వస్తువులయ్యాయి.

కొత్తగా రాసే / రాయాలనుకునే రచయితలు వస్తు/రూప చర్చల గురించి కేవలం ప్రాథమిక పరిజ్ఞానం కలిగివుంటే మంచిది. నిజానికి ఈ అంశాలు విమర్శల పరిధిలోవి. అనుక్షణం దోపిడీ పరమావధిగా నడిచే సమకాలీన సమాజంలోని అనుభవాలకు వస్తుపరంగా రచయిత స్పష్టతనిచ్చే ప్రయత్నం చేస్తే చాలు. రచయిత ఎన్నుకొన్న వస్తువు / అంశం రచనాక్రమంలో శిల్పాన్ని సంతరించు కొంటుంది. రచయిత అధ్యయనం, మానసిక విస్తృతి ఎంత విశాలంగా వుంటే అంత చక్కని శిల్పం సాధ్యమయ్యే స్థితి వుంది.



కొత్తగా రాసే / రాయాలనుకునే రచయితలు వస్తు/రూప చర్చల గురించి కేవలం ప్రాథమిక పరిజ్ఞానం కలిగివుంటే మంచిది. నిజానికి ఈ అంశాలు విమర్శల పరిధిలోవి. అనుక్షణం దోపిడీ పరమావధిగా నడిచే సమకాలీన సమాజంలోని అనుభవాలకు వస్తుపరంగా రచయిత స్పష్టతనిచ్చే ప్రయత్నం చేస్తే చాలు. రచయిత ఎన్నుకొన్న వస్తువు / అంశం రచనాక్రమంలో శిల్పాన్ని సంతరించు కొంటుంది.

ఏ రచనైనా వస్తు పరంగా నూతనత్వాన్ని కలిగివుండాలి. వస్తువులో కొత్తదనం నవ్యత్వం లేని రచనా రూపం పాఠకుడికి గాఢనిద్ర వచ్చేందుకు అద్భుతంగా పనికివస్తుంది. రచయిత తన పాఠకులకు ఎన్నిక చేసుకొన్న వస్తువులో వారికి తెలియని కొత్త కోణాలను చూపించగలగాలి. ఇందుకు భాష, కథన నైపుణ్యం, వస్తువుకు సంబంధించిన సమాచారం. పరిజ్ఞానం వంటి అంశాలపై రచయితకు పూర్తి అవగాహన వుండాలి.

1970ల వరకూ వివిధ ఉద్యమాల, సంక్షోభాలనేపథ్యంలో వచ్చిన కథలన్నీ చాలా వరకూ వస్తువైవిధ్యాన్ని ప్రదర్శించినవే. ఆ తర్వాత కాలంలో తెలుగు కథారచనలో వస్తువైవిధ్యం వేళ్ళ మీద లెక్కబెట్టగలిగిన కథలు తప్ప మిగిలిన వాటిలో క్షీణించి పోయింది. ఇది కఠోరవాస్తవం. కథల్లో వస్తువైవిధ్యం వికసించి వర్ధిల్లడం 70ల తర్వాత ఆగిపోవడానికి ప్రధానకారణాలు ఆర్థికవిధానాలలో మార్పులు, సాంకేతిక, శాస్త్ర విజ్ఞానరంగాలలో వచ్చిన మార్పులు ప్రధాన కారణాలు. ఆయా అంశాలపై రచయితలకు అవగాహన వుండాలి.

మనం జీవితం అనుకునేదంతా వర్గసంఘర్షణలో నుంచి స్థల కాలాల్లో నిరంతరాయంగా మన మనస్సులో ప్రవహిస్తున్న భావాల సమాహారమే. దీన్ని జాగ్రత్తగా గమనించి సంఘర్షణలోని వైరుధ్యాలను చక్కని శిల్పంలా మలచగల సత్తా వున్నవాడే మంచి రచయిత అనిపించుకోగలడు. వీటిని యాంత్రికంగా నమోదు చేసేవాడు పోలీసుస్టేషన్‌లో రైటర్ కాగలడేమో కానీ రచయిత మాత్రం ఎన్నటికీ కాలేడు.

సమాజంలో ఆదర్శాలు, నమ్మకాలు, నీతులూ, రూల్సు, చట్టాలూ, శరవేగంతో మారిపోతున్న కాలం ఇది. ఇవన్నీ రకరకాల సంఘటనలూ, కార్యాల రూపంలో నిరంతరం పరిణామంలో వుంటాయి వీటి వెనుక వున్న కారణాలను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించకుండా రచనలు సాగిస్తే అవి కాలక్షేపానికి తప్పకుండా పనికివస్తాయి.

రచయితలు తమ జీవితం నుండి ప్రాథమికంగా ఇతరుల జీవితాల నుండి ద్వితీయంగా కథావస్తువులు తీసుకొని రచన చేయడం మంచిది.

ఎవరైనా తమ జీవిత అనుభవాలను దుఃఖాన్నీ, సంతోషాన్ని ఆశనూ, భయాన్ని చాలావరకూ స్పష్టంగా వ్యక్తం చేయగలగుతారు. అయితే ఇందుకు అతీతంగా ఎంతోమంది రచయితలు తమకేమాత్రం సంబంధం లేని వ్యవహారాల గురించి పేజీలకు పేజీల కథలు రాయడం అంటే హైదరాబాద్‌లో కూర్చుని నల్లమల అడవిలో విప్లవ పోరాటం గురించి రాయడం లాంటిది.

ఇంకో ఉదాహరణ పనిచేసేచోట వ్యక్తి తను పనిచేసే రంగంలో తనకెదురైన అనుభవాల గురించీ, అక్కడ సాగే దోపిడీ గురించీ, అక్కడి మంచి గురించీ, ఒక కథ రాయక పోగా ఒక మెకానిక్ గురించో, కార్మికుడి గురించో, విధవ గురించో అద్భుతమైన (?) కథలు రాస్తూ రచయితగా చలామణీలో వుంటాడు. మన సమకాలీన కథాసమాజంలో

యిదో గొప్ప వైరుధ్యం. స్వంత వాస్తవికతను విస్మరించినవాడెవడు సమాజవాస్తవికతను దర్శించలేడు. సాధ్యమైనంతవరకూ రచయిత తన జీవితానుభవంలో వస్తువులనే కథారచనకు ఎంచుకోవాలి.

తమ నిరంతర రచనల ద్వారా రచయితలు సమాజంలో ఒక స్టీరియోటైప్ వస్తు రచనా కోణాన్ని ఏర్పరుస్తారు. ప్రతి దేశం, సమాజ సాహిత్యరంగాల్లో ఇది అనివార్యంగా సంభవించే ఒక విపత్తు (కొడవటిగంటి లాగే ఇప్పటికీ తెలుగులో మెజారిటీ రచయితలు రాస్తుండడం మీరు గమనిస్తున్నారా?) ఈ విపత్తు పాఠకుల మస్తిష్కాన్ని మొద్దుబార్చి వారిని మానసిక మెనోపాజ్ దశకు చేరుస్తుంది. ఫలితంగా పఠనాసక్తి తగ్గిపోయే దారుణ ప్రమాదమేర్పడుతుంది. (యిప్పుడు నడుస్తున్న చరిత్రే ఇది) కొత్తగా రాసే వారు ఈ విధానాన్ని బ్రేక్ చెయ్యాల్సిన అవసరం ఉంది. ఇందుకు భిన్నంగా రాయడం గురించి మననుపెట్టి ఆలోచించవలసి వుంది.



**సమకాలీన సమాజంలోని అసమానతలూ, అన్యాయాలు, దుఃఖాఃలూ, పీడనా, సుఖాలు సంతోషాలకూ కారణమైన చారిత్రాత్మక పరిణామాలను వర్తమానంలో విశ్లేషిస్తూ భవిష్యత్తును చూపేది గొప్పవస్తువుకు వుండే వొకానొక లక్షణం. కథా సాహిత్యానికి ప్రధాన వస్తువెప్పుడూ మనిషే మానవజీవితంలో, ఆలోచనలతోనో, భావాలతోనో సంబంధం లేని కథావస్తువును యెవరైనా సృజించగలరా?**

సమకాలీన సమాజంలోని అసమానతలూ, అన్యాయాలు, దుఃఖాలూ, పీడనా, సుఖాలు సంతోషాలకూ కారణమైన చారిత్రాత్మక పరిణామాలను వర్తమానంలో విశ్లేషిస్తూ భవిష్యత్తును చూపేది గొప్పవస్తువుకు వుండే వొకానొక లక్షణం. కథా సాహిత్యానికి ప్రధాన వస్తువెప్పుడూ మనిషే మానవజీవితంలో, ఆలోచనలతోనో, భావాలతోనో సంబంధం లేని కథావస్తువును యెవరైనా సృజించగలరా? యెప్పటికైనా ఇంపాసిబుల్. యిప్పుడు సాహిత్యానికీ మార్కెట్ ఎకానమి సూత్రాలు వర్తిస్తున్నాయి. సాహిత్యం పూర్తిస్థాయిలో సరుకుగా మారిన అత్యున్నత కాలం యిది. కాబట్టి వైయుక్తిక అనుభవాల నేపథ్యంలో ఎవడి అనుభవాలను వాడే పాటలు కట్టి ఏకాంతంగా పాడుకొంటూ.... ఎవడికి వాడే తనకు తానే రచయితగా, పాఠకుడిగా, పబ్లిషర్‌గా, అమ్మకందారుడిగా ఇలా రకరకాలుగా మారిపోతూ రచయితలుగా హరాకెరీకి వొడిగట్టి అంతిమంగా మరణిస్తున్నారు. ఈ క్రమంలో వస్తువైవిధ్యాన్ని సాధ్యమైనంత ధ్వంసం చేసి తరువాత తరానికి దారులు, దిక్కులు లేకుండా చేసే విధ్వంసకారులౌతున్నారు.

నేడు కథాసాహిత్యం పేరుతో మార్కెట్‌లో వెలువడుతున్న 99 శాతం కథల్లో కథావస్తువేదో? తేల్చడానికి వీల్లేని పరిస్థితి. కేవలం ఒక్కశాతంలో మాత్రమే కథావస్తువును అంచనా వేయగలిగిన స్థితి నేటి సమకాలీన సాహితీ దృశ్యం. ఒక సాంఘిక దశ శిథిలమై కొత్తశక్తులు వికసించని దశల్ని క్షీణయుగాలు అంటాం.... బాగా పాతబడిపోయి, ప్రభావం చూపే వస్తుశిల్పాలు క్షీణ యుగంలో వుంటాయని త్రిపురనేని మధుసూధనరావు అంటారు. ఇప్పుడా దశలో వున్నాము. వస్తువైవిధ్యం, విమర్శ తెలుగుసాహిత్యంలో నత్తనడక కూడా నడవలేక, ఆవిరయ్యే ముందు దశలో వున్నాము. యిందుకు రచయితలు చాలావరకూ, పాఠకులు కొంతవరకూ బాధ్యత వహించాలి.

యువ రచయితలు 'వ్యక్తీకరించే శక్తి'ని ఎంత అభివృద్ధి చేసుకొంటే అంతమంచిది. యిందుకు అధ్యయనం మినహా మరో మార్గం లేదు. వస్తువును తన ముందు వారికంటే భిన్నంగా, ఆలోచనాత్మకంగా చెప్పగలిగిన రచనలే పాఠకులను కదిలించి, విదిలిస్తాయి. మిగిలినవన్నీ చరిత్ర గార్బేజ్‌లో పడి నలిగిపోతాయి.

తన రచనలో రచయితలు ఉపాధ్యాయుడిగా, న్యాయాధికారిగా, తీర్పరిగా వుండకూడదు. తను ఎన్నుకొన్న వస్తువును పాఠకులకు స్పష్టాతిస్పష్టంగా కమ్యునికేట్ చేయించగలిగే శక్తీ, సత్తా వుండాలి. రచనలోని అంశాలు పాఠకులను ఆలోచనలో పడవేయాలి. ఈ క్రమంలో పాఠకులే వస్తువిషయాన్ని / సారాంశాన్ని అర్థం చేసుకొని నిర్ణయాలు / అభిప్రాయాలు ఏర్పరచుకొంటారు. రచయిత – రచయితగానే వ్యవహరిస్తే చాలా మంచిది.

వస్తువు కొన్ని సంఘటనల రూపంలో వ్యక్తం అవుతుంది. ఈ సంఘటనల మధ్య ఒక క్రమబద్ధతను వ్యక్తీకరించే సామర్థ్యాన్ని రచయితలు లఅలవరుచుకోవాలి. ఈ ప్రక్రియలో సాధించే నైపుణ్యం మాత్రమే వ్యక్తిని రచయితగా మారుస్తుంది. ఈ క్రమబద్ధతను క్రమరాహిత్యంగా వ్యక్తీకరించినా పాఠకుడికి వస్తువులోని సామాజిక వాస్తవికత ఎంతగా కమ్యూనికేట్ అయితే అదంత మంచి రచనగా మారుతుంది.

నిస్సందేహంగా యిప్పుడు నడుస్తున్నవి క్షీణ సాహిత్యకాలమే. మాతృభాషలూ, సాహిత్యరూపాలూ, విమర్శలూ మొత్తంగా మనవైనవన్నీ కూలిపోతున్న ఈ సంక్షోభకాలంలో కొత్త రచయితలు సామాజిక బాధ్యతతో రాయకపోతే పతనాన్ని మరింత వేగవంతం చేసినవాళ్ళవుతారు. వస్తువుకూ, శిల్పానికి మధ్య వుండే సేంద్రియ సంబంధాన్ని వీరు అవగాహన చేసుకోవాలి. ప్రభుత్వమూ, ఎన్.జి.వోలు జీవివైవిధ్యాన్ని కాపాడినట్టు కాకుండా వస్తువైవిధ్యాన్ని రచయితలే రక్షించుకోవాలి. వస్తువైవిధ్యం నశిస్తుందంటే జీవివైవిధ్యం నశిస్తుందనే గుర్తుంచుకోండి... రచనల ద్వారా ప్రజల్ని కదిలించడమేకాదు... అంధకారంలో వున్న తెలుగు సాహిత్యాన్ని రక్షించాల్సిన అదనపు బాధ్యత కూడా వర్ధమాన రచయితల తలపై వుంది. యిందుకు వ్యవస్థీకృతమైన పెట్టుబడీదారి సాహితీ విలువల్ని నిర్ధాక్షిణ్యంగా హత్య చేయగలిగిన స్థిత ప్రజ్ఞతను రచయితలు అలవరుచుకోవాలి.

**మిత్రుడు డా॥ కాకుమాను శ్రీనివాసరావుకు కృతజ్ఞతలతో**






ఏదో ఓ కాయితం, ఏదో ఒక పాతకలం చేతపట్టుకుని కూచో, ఏదన్నా కథ వొచ్చిందా రాయి. రాలేదా కాయితం చించేసి రాజకీయ నాయకుడివయ్యే ప్రయత్నం చేసుకో. కథ వొచ్చిందా, కాపీలు తీసి పత్రికలకి పంపు. వాళ్ళు అచ్చు వెయ్యలేదా, వాటినో కవరులో పెట్టి ముందు తరాల వారికోసం దాచెయ్యి.

\- చలం

'కల్పనా సాహిత్యం వాస్తవ జీవితాన్ని చిత్రించాలి, విశ్లేషించాలి. వ్యాఖ్యానించాలి, విమర్శించాలి. వాస్తవికత అంటే అసలుకు సరైన నకలు దించటం ఏమాత్రమూ కాదు- జరిగినది మాత్రమే కాకుండా, జరగటానికి అవకాశం వున్నదీ, జరగదగినదీ కూడా వాస్తవికతలో చోటుచేసుకుంటుంది. ముఖ్యమైనదేమంటే జీవితసత్యాన్ని వ్యక్తం చెయ్యటం'.

'ఈ యుగపు సాంఘిక పరిస్థితులను మార్క్సు సిద్ధాంతాల నుండి వేరు చేయడం సాధ్యం కాదు. మార్క్సిస్టు సాహిత్యం కొంతయినా చదవకపోతే ఈనాటి సమాజాలనూ, ఆర్థిక పరిస్థితులనూ, రాజకీయాలను, వీటి మధ్యగల సంబంధాలను సమగ్రంగా అర్థం చేసుకోవడం సాధ్యం కాదు.....'

\- కొడవటిగంటి కుటుంబరావు

\- 'చిన్న కథకి ప్రధాన లక్షణం కేంద్రీకరణం. కథలో ప్రతిచిన్న విషయమూ ఆ కేంద్రాన్ని సూచిస్తూ వుండాలి. కథానికకు కేంద్రంగా ఒక విస్పష్టమైన సంఘటన, ఒక విచిత్రమైన వ్యక్తి, ఒక మనఃస్థితి, రెండు స్వభావాల తారతమ్యం వల్ల వచ్చే నాటకీయత ఇలా ఏదో ఒకటి వుండాలి. కథానిక ఒక మెరుపువంటిది. దానిలో వేగం ప్రధానం. వైచిత్రి కథానికకు ప్రాణం. కథానికకు ప్లాట్ అనేది అనవసరమని నా అభిప్రాయం. శిల్పం మీద దృష్టిని కేంద్రీకరించి మరీ రాయాలి. లేకపోతే కళ్లెంలేని గుర్రంలా అది తిరిగి తిరిగి, దిక్కులేని ప్రదేశాన్ని చేరుకుంటుంది.

\- పాలగుమ్మి పద్మరాజు

## ★ జనార్ధన మహర్షి



# జనార్ధనుడికి - మహర్షి చెప్పింది





"నోరు ఉన్న ప్రతిజీవి... చెవులున్న ప్రతిజీవికీ పూటకో కథ చెబుతూనే ఉంటారు." అందుకే ప్రపంచమంతా కథలతో నిండి ఉంది. కాబట్టి... "కథ చెప్పడం కడుపులో పిండంగా ఉన్నప్పుడే నరనరాల్లో నరులకి వచ్చిన వరం".

అయ్యా... అమ్మా... అందుకే కథ చెప్పడం అసలు నా దృష్టిలో ఓ కళే కాదు.. కానీ అసలు కళ "కథ రాయడమే".

ఇది చాలా విలువైంది, ఖరీదైంది, అమూల్యమైంది.

**ఎంతంటే...**

ఆలశ్యంగా వస్తే ఆఫీసర్‌కి... ఫ్యూన్ ఓ కథ చెబుతాడు.

తాగొచ్చిన మొగుడు పెళ్ళానికో కథ చెబుతాడు

మార్కులు తక్కువొస్తే పిల్లాడు తండ్రికో పిట్టకథ చెబుతాడు.

రెండు రోజులు ఎగ్గొట్టిన పనిమనిషి పకడ్బందీగా కథ చెబుతుంది.

"నోరు ఉన్న ప్రతిజీవి... చెవులున్న ప్రతిజీవికీ పూటకో కథ చెబుతూనే ఉంటారు." అందుకే ప్రపంచమంతా కథలతో నిండి ఉంది. కాబట్టి... "కథ చెప్పడం కడుపులో పిండంగా ఉన్నప్పుడే నరనరాల్లో నరులకి వచ్చిన వరం".

అయ్యా... అమ్మా... అందుకే కథ చెప్పడం అసలు నా దృష్టిలో ఓ కళే కాదు.. కానీ అసలు కళ "కథ రాయడమే".

**రాయడమే**

రాయడమే కష్టం...

మరి కథ రాయడం ఎలా? .... నాకు తెలీదు.

తెలుసుకోవాలనే ప్రయత్నంలో ఉన్నాను.

అందుకోసమే చాలా కథలు చదివాను... ఆ తర్వాత

ఇంకొన్ని కథలు చదివాను... ఆ తర్వాత...

చాలా, చాలా, చాలా కథలు చదివాను, చదవగా చదవగా కథలు రాశాను. రాయగా... రాయగా.. కథలు వచ్చేశాయనుకున్నాను. ఇంకా రాయగా... రాయగా... ఏమీ రాదని తెలిసింది.

**రాదు...**

కథలు రాయడం రాదు.

చదివినంత మాత్రాన రాదు.

రాసినంత మాత్రానా రాదు.

అనుభవం చెందినంత మాత్రాన రాదు

పరిశీలిస్తే రాదు.

పరిశోధించగా రాలేదు

లోపల, బయట యాత్రలు చేసినా రాలేదు.

అసలు... ఎలా వస్తుందో అని వెతికినా ఏ దారిలోనూ రాలేదు.

అయినా వెతకడం నేను మానలేదు.

వెతికాను.. వెతికాను... బాగా వెతికాను.

**వెతికాను...**

గురజాడ లాంటి మంచి గురువులో వెతికాను..

వీరేశలింగం, విశ్వనాథ, శ్రీపాద, చలం, చాసోలలో వెతికాను. దొరికింది. కథలకి పెద్ద బాలశిక్ష దొరికింది.

ఆగలేదు.

తిలక్, శ్రీశ్రీ, మధురాంతకం, మునిమాణిక్యం, కొడవటిగంటిలని చూశాను.. ఆహాఁ కథ కొమ్మలపై కోకిలగానాలు చేశారు.

రావిశాస్త్రి, కాళీపట్నం, బీనాదేవి, భమిడిపాటి, ఇంద్రగంటి, అళ్వారుస్వామి, మునిపల్లె, బాపిరాజుల్ని... కథాకాశంలో నక్షత్రాలుగా నిలిచారని గమనించాను.



గోపిచంద్, బుచ్చిబాబు, పాలగుమ్మిల కథా విశ్వరూపం కనుగొన్నాను.

అల్లం రాజయ్య, అల్లం శేషగిరియ్య, బోయ జంగయ్య, కాలువ మల్లయ్య, పెద్దిబొట్ల సుబ్బరామయ్య, వల్లంపాటి సుబ్బయ్యల లాంటి అయ్యలెందరో కథలని 'అయ్యారే' అనే స్థాయికి పెంచడం చూశాను.

ముళ్ళపూడి వెంకటరమణైనా, శ్రీరమణైనా, నవ్వులు పండించారు. మల్లాది రామకృష్ణశాస్త్రి నించి మల్లాది వెంకటకృష్ణమూర్తి వరకూ పువ్వులు పూయించారు.

**వీళ్ళని చదివాక.. చదువుతూనే ఉండాలనిపిస్తుంది కానీ, నాకు రాయాలనిపించదు. కానీ రాయాలి. ఎందుకు ? తెలీదు. అయినా రాయాలి.. ఎలా..? తెలీదు మరింకేం తెలుసు...? "సప్తస్వరాలతో సంగీతంలో లక్షల రాగాలు పుడుతూనే ఉన్నప్పుడు, యాభై అక్షరాలతో సాహిత్యంలో కోట్ల కథలు ఎందుకు పుట్టవు."**

తల్లావఝ్ఝల పతంజలైనా, కెవెన్వై పతంజలైనా....కారాలు నూరారు. నామిని నాయుడైనా, చిన్న వీరభద్రుడైనా, వీరేంద్రనాథుడైనా, ఇనాకైనా, విశ్వనాథరెడ్డయినా, కేశవరెడ్డయినా, సుబ్రమణ్యం, జగన్నాథశర్మలైనా కథ కీర్తిని ఖండాంతరాల్లో చాటారు.

త్రిపుర, నగ్నముని, ఇస్మాయిల్, శంకరమంచి సత్యం, బివియస్ రామారావు, పులికంటి, శారద, నరేంద్ర, మహేంద్ర, మహర్షి జిఆర్, ఖదీర్, షరీఫ్, నారాయణులెందరో... ఇంకా ఎందరెందరో మగధీరుల కలం కథల దాహాన్ని తీరుస్తూనే వస్తున్నారు.

అచ్చమాంబ, అబ్బూరి, రంగనాయకమ్మ, కుప్పిలి, సత్యవతి, సీతాదేవి, తులసి, వసుంధర, ఓల్గా, సుజాత, శ్రీదేవి లాంటి వారెందరో కథకి తోబుట్టువులుగా బొట్టుపెట్టారు.

ఇలా.. ఇలా.. నా అజ్ఞానంలో పేరు మరచిన వారు, సదా చిరస్మరణీయులు ఎందరెందరో... కథలు రాశారు.... రాస్తున్నారు... ఈ కథాసాహిత్యాన్ని విస్తరింపజేసి, పరిమళింపజేసి. సజీవంగా శాశ్వతంగా నిలుపుతూనే ఉన్నారు.

**రాయాలా? ...**

వీళ్ళని చదివాక.. చదువుతూనే ఉండాలనిపిస్తుంది కానీ, నాకు రాయాలనిపించదు. కానీ రాయాలి.

ఎందుకు ? తెలీదు. అయినా రాయాలి.. ఎలా..? తెలీదు మరింకేం తెలుసు...?

"సప్తస్వరాలతో సంగీతంలో లక్షల రాగాలు పుడుతూనే ఉన్నప్పుడు, యాభై అక్షరాలతో సాహిత్యంలో కోట్ల కథలు ఎందుకు పుట్టవు."

**పుడతాయి ...**

అందర్నీ చదివాకా నాకు అర్థం అయ్యిందేమిటంటే... ఏ ఒక్కరూ, ఇంకొకరిలా రాయలేదు. కానీ అందరూ రాసింది... కథలే. అంటే కథకి నిర్దిష్టమైన పద్ధతిలేదు. కథలు ఎక్కడైనా పుట్టొచ్చు. ఎలాగైనా పెరగొచ్చు. ఇలా ప్రారంభించాలని, ఇలా ముగించాలని, మధ్యలో ఇలా సాగాలని, భాష సరళంగా ఉండాలని, భావం గంభీరంగా ఉండాలని, మాండలీకంలో మాట్లాడాలని, స్వచ్ఛమైన గ్రాంధికంలోనే ఉండాలని, ప్రతివాక్యం అర్థం కావాలని, అర్థం కాకపోయినా ఫర్వాలేదని, యాసలోనైనా, ప్రాసలోనైనా, పేరాగ్రాఫ్ లుగానైనా, చిన్న చిన్న వాఖ్యాలుగానైనా, రెండుపేజీలైనా, ఇరవై రెండు పేజీలైనా.. ఏ సూత్రామూ, ఏ ముద్ర, ఏ నిర్బంధమూ లేకుండా వీరంతా ఒకరిని మించి మరొకరు, వారి ఇష్టానుసారంగా.... వారి అనుభవాల సిరాలో, అనుభూతుల కలంతో, అద్దాల కాగితంపై...., నిప్పులు కక్కారు. నిజాలు చెక్కారు.

సరేఁ... గతం గొప్పది. గతంలో రాసినవాళ్ళూ గొప్పోళ్ళు. కానీ గతాన్ని తల్చుకొంటే గంటలో అయిపోతుంది. జీర్ణించుకుంటే గమనం సాగిపోతుంది. ఇప్పుడు గతాన్ని అవగతం చేసుకొని వర్తమానానికి కలం పట్టాలంటేఁ... ఏం చేయాలి?

**ఏమన్నా చెయ్యి...**

వందమంది వందరకాలుగా ఒకే విషయం గురించి కథలు రాసినా, నాకో వందసార్లు అవకాశం ఉంది. దశాబ్దానికోసారి

కొన్ని అదృశ్యమయిపోయి, కొన్ని అంతరిస్తుంటాయి. అందరి స్పందనలు, అన్ని అనుభూతులు, ఒకలా ఉండవు. నాకు కనబడే సూర్యోదయాన్ని ఆ కథకుడు మరోలా చూస్తాడు. చంద్రోదయ వర్ణన ఇంకోలా కనబడుతుంది. సమస్య, పరిష్కారం, ప్రభావం, శైలి, భాష, వ్యాకరణం, పద్ధతి... ఒక్కక్కరికీ ఒక్కోలా తోస్తుంది. అందుకే కథకుడికీ, కథకుడికీ ఇంత తేడా... కాలాన్ని బట్టి కథలు మారాయి. తరతరాలుగా తండ్రులు, తాతలు మారారు. వారి కథలు మారుతాయి. ఆత్మకూడా కథకుణ్ణి బట్టి మారుతుంది. అందుకే కథకి ఆరంభం లేదు. అంతం లేదు. ఎవరి కథ వారిదే.



**ఎవరి కథ వారిదే ...**

అవును నిజం. ఎవరి కథ వారిదే. కానీ రాసేటప్పుడు.. అందరికీ కలం, కాగితం ఎంత అవసరమో... ఇంగితజ్ఞానం, భాషా పరిజ్ఞానం, సమాజంపై బాధ్యత, సంస్కారం, సృహ ఉండటం అంతే అవసరం. ఎందుకంటే కథ ప్రభావం పాఠకుడి మీదే చాలా ఎక్కువ ఉంటుంది. అలాగే మరో సమస్య కూడా ఉంది. పాఠకుడు రచయితని అన్నిసార్లు పూర్తిగా అర్థం చేసుకోడు.

**ఎవరి కథ వారిదే. కానీ రాసేటప్పుడు.. అందరికీ కలం, కాగితం ఎంత అవసరమో... ఇంగితజ్ఞానం, భాషా పరిజ్ఞానం, సమాజంపై బాధ్యత, సంస్కారం, సృహ ఉండటం అంతే అవసరం. ఎందుకంటే కథ ప్రభావం పాఠకుడి మీదే చాలా ఎక్కువ ఉంటుంది.**

ఆ కథలోని పాలని హంసలా తీసుకోవచ్చు. నీళ్ళతో సరిపెట్టుకోవచ్చు. అందుకే పాఠకుడిని ఏమాత్రం బేరీజు వేయకుండా అతన్ని మెప్పించకుండా... హృదయ సంకేతాలని, మెదడుచే పరిశీలింపజేసి పంచేంద్రియాలకి పని కలిపిస్తే... కథ సజీవంగా నిలుస్తుంది. ఏ కథకైనా... కథకుడు సవ్యసాచిగా ఉండాలి.

"సాని దాని గురించైనా, సంసారిగురించైనా, సాములోరి గురించైనా సన్యాసిగురించైనా, సూర్యచంద్రుల సమదృష్టితో రచనా కిరణాల్ని ప్రసరింపజేయాలి".

**ఎందుకంటే...**

కథ.. చాలా విలువైంది. ఖరీదైంది. అమూల్యమైంది. అందుకే దాన్ని అందరికీ ప్రేమతో అందించాలి. రాసేటప్పుడు 'కథ' విలువ రచయితకి తెలిస్తే... పాఠకుడు కూడా దానికి విలువ ఇస్తాడు. వందసార్లు రాసి "అర్థమైందా? అర్థమైందా?" అని పదేపదే పాఠకుడ్ని ప్రశ్నించకుండా... 'అందులో అర్థం ఉందా' అని ఒక్కసారి ఆలోచిస్తే....నాలాంటి కథా రచయితకి చెయ్యి తిరుగుతుంది. కాలు జారకుండా ఉంటుంది.

**అతి తెలివితేటలు....**

రచయితగా నా అతి తెలివితేటలు ఇప్పుడు చూడండి.

"ఒక కారుకీ, ఒక స్కూటర్‌కీ యాక్సిడెంట్ అయ్యింది" ఇది సంఘటన.

కారులోని డ్రైవర్ చనిపోతే.... ఒక కథ.

స్కూటర్‌లోని వ్యక్తి చనిపోతే..... ఒక కథ

వాళ్ళిద్దరూ చావకుండా,అది చూసి షాక్‌తో పక్కవాడు గుండాగి చచ్చిపోతే అదో కథ.

కారులో ఉన్నది ఆడపిల్ల. స్కూటర్ వ్యక్తి మగపిల్లాడయితే ప్రేమ పుడితే ఓ కథ.

ద్వేషం పుడితే ఓ కథ.

ఒకరు ధనికులు, మరొకరు పేద వర్గం వారైతే ఇంకో కథ. ఈ ఘటనని.... విప్లవాత్మకంగా... వినోదాత్మకంగా, ఆధ్యాత్మికంగా. మానవతా విలువల కోణంలో, విధి ఆడిన వింత నాటక ధోరణిలో, రకరకాల స్పందనలతో, పలు కథలకు ప్రేరణగా మార్చొచ్చు. ఈ కథలో రక్తం గురించి రాయొచ్చు. ట్రాఫిక్ సిగ్నల్స్ గురించి రాయొచ్చు. ప్రభుత్వం నిర్లక్ష్యం చేసిన రోడ్ల గురించి రాయొచ్చు. తాగి వెళితే తప్పని, ఇలా తప్పదని రాయొచ్చు. స్పీడుగా వెళ్ళడం పాపమని చెప్పొచ్చు. సెటైర్‌గా రాయొచ్చు. శూలాలతో గుచ్చుతూ రాయొచ్చు. సమాజంపై విరుచుకు పడి రాయొచ్చు. కారు మంత్రిదని, స్కూటర్ శ్రామికుడుదని చెప్పొచ్చు. కారువాడు హత్యకోసం అలా చేశాడని అనొచ్చు. స్కూటర్ అతను విరక్తితో ఆత్మహత్యకోసం వచ్చాడని రాయొచ్చు.

ఈ విషయాన్ని ... విశ్వరూప దర్శనం కంటే గొప్పదిగా కథకుడు మలచవచ్చు. మైమరపించవచ్చు.

ఇలా సంఘటన ఏదైనా..

వాటిని ఏ కోణంలోనించి ఎత్తుకున్నా...

"చివరికి మాత్రం, చెప్పాలనుకున్నది చెప్పగలిగి, చదువరిని చేరగలిగితే... కలం పట్టినందుకు, కాగితాలు నింపినందుకు, కథ కంచికి, కాళహస్తికి, కాణిపాకానికి వెళ్ళినంత పుణ్యం వస్తుంది.

**రాయొచ్చు ...**

ఇలా దేన్నయినా రాయొచ్చు. చూసింది రాయొచ్చు. విన్నది రాయొచ్చు. ఊహించి రాయొచ్చు. కథలో వర్ణన ఉంటేఁ ఆ ప్రదేశమంతా పాఠకుడి కళ్ళముందుకి రావాలి. వర్ణన లేకుండా ఉంటే పాఠకుడు తనే ప్రదేశాన్ని కళ్ళముందు తెచ్చుకునేలా పాత్రల మాటలుండాలి.

"పాఠకుడి నైపుణ్యం.... రచయిత పుణ్యమే" కావాలి. చావు గురించి రాస్తే... చావుపై భయం వేయాలి. ఆలోచన రావాలి. ప్రేమ పుట్టాలి. ఏదైనా సరే... పాఠకుడికి చచ్చేంత అనుభూతి రావాలి.



ఒక పెళ్ళి గురించి రాస్తే... ఆ పెళ్ళి పాఠకుడికే జరుగుతుందన్నంతగా కళ్యాణమండపంలోకి పరిగెత్తుకెళ్ళి కూర్చోవాలి. భీష్ముడు గురించి రాస్తే "పెళ్ళి" అక్కర్లేదనిపించాలి. రాముడిపై కథరాస్తే "ఒక పెళ్ళే" చాలనిపించాలి. కృష్ణుడిపై రాస్తే "పదిసార్లు పెళ్ళి" చేసుకోవాలని పించాలి. "అంటేఁ కథా ప్రభావం పాఠకుడి మీద పది కాలాలపాటు నిలవాలి." అలా నిలిచేలా రాయడం అద్భుతం.

**ఒక పెళ్ళి గురించి రాస్తే... ఆ పెళ్ళి పాఠకుడికే జరుగుతుందన్నంతగా కళ్యాణమండపంలోకి పరిగెత్తుకెళ్ళి కూర్చోవాలి. భీష్ముడు గురించి రాస్తే "పెళ్ళి" అక్కర్లేదనిపించాలి. రాముడిపై కథరాస్తే "ఒక పెళ్ళే" చాలనిపించాలి. కృష్ణుడిపై రాస్తే "పదిసార్లు పెళ్ళి" చేసుకోవాలనిపించాలి.**

**అద్భుతం...**

నేనోచోట చదివాను "రామాయణం జరిగితే అద్భుతం. ఒకవేళ రచయిత రాసిన కథే అయితే మహా అద్భుతం" అని. వాల్మీకి లాంటి కథకుడు... మనకు మార్గదర్శకుడు. తమాషా ఏంటంటే... వాల్మీకినే మళ్ళీ రాయమన్నా రామయణం అంత గొప్పగా రాయలేడు. వందల కథలు రాసిన సుప్రసిద్ధులైన కథకులు సైతం... వాటిలో గొప్పవిగా నాలుగైదు కథలు నిలిచాయని ఒప్పుకోక తప్పదు. ఆ ఐదులో కూడా రెండు కొందరికి గొప్పవిగా అనిపిస్తే, మరో రెండు మరి కొందరికి గొప్పవిగా అనిపించాయి. మిగిలిన ఒకటి అది రాసిన రచయితకే గొప్పగా అనిపించకపోయినా ఒప్పుకొని తీరాల్సిన పరిస్థితులు వస్తాయి.

అంటే...

"ఎవరెన్ని కథలు రాసినా, కొత్త కథ రాసేటప్పుడు, అతను ఖచ్చితంగా కొత్తగా రాస్తున్న రచయిత మాత్రమే" కాబట్టి, గత అనుభవం ఈ కథకి సరిపోదు. అందుకే కథలెలా రాయాలని ఖచ్చితంగా ఎవరైనా చెప్పినా, ఇలాగే రాయాలని నేర్పినా, నేనువారితో పూర్తిగా ఏకీభవించలేను.

**ఆఖరిమాట ...**

అఖరిగా నామాటేంటంటే..ఎవ్వరిమాట వినకండి. కానీ అందరిమాట వినడానికి సిద్ధంగా ఉండండి. చుట్టూ ఉన్నవాటిని, ముఖ్యంగా నీలో ఉన్నవాటిని ... శ్రద్ధగా వినండి. చదవండి. తర్వాత రాయాలనిపించేదేదైనా మిగిలితే రాయండి. మీరు చదివినవి... తిరిగి రాయకండి. మీరు రాసినవి కూడా... తిరిగి రాయకండి. చదివినవే రాయాలనిపిస్తే... మళ్ళీ చదివించేలా రాయండి. రాసినవే తిరిగి రాయలనిపిస్తే... 'రాయల్'గా రాయండి. మీకు నచ్చేలా రాయండి. (రాసినవన్నీ నచ్చితే మంచిది కాదండీ). మీరు మెచ్చేలా రాయండి. (రాసినవేవి మెచ్చకపోయినా తప్పండీ)

చివరిగా ఇంకోమాట... 'తెలిసింది రాయండి. తెలియనివి రాయండి, తెలియనివాటిని తెలునుకొని రాయండి. తెలిసిన వాటిల్లో తెలియనివి వుంటే లాగి రాయండి. తెలిసీ, తెలియకుండా రాయకండి...

తెలుగులో రాయండి

అన్ని భాషల కథలు చదవండి..

**ఎప్పుడు రాస్తారంటే....**

బాధేసినప్పుడు రాయండి

ఆనందమేసినప్పుడు రాయండి

కోపం వచ్చినప్పుడు రాయండి

రిలాక్స్ కావాలన్నప్పుడు రాయండి

బిజీగా రాయండి

ఖాళీ దొరికితే రాయండి

"అందర్ని చదవండి... అందరూ చదివేలా రాయండి" అప్పుడే, నీకూ, నాకూ, కథకీ "శుభం" అండి

***(ఇది "జనార్ధన' అను బుల్లి కథకుడికి, 'మహర్షి' అను మరో అతి తెలివి బుల్లి కథకుడు చెప్పిన "కధాఖండం" సమాప్తం.)***



## పి. చంద్రశేఖర్ అజాద్



# బాలల ప్రపంచంలోకి అడుగులు



ఇప్పుడు నేను బాలల కథల గురించి మీ ముందు నిలబడి నా అనుభవాలు చెప్పటం వెనుక తెలుగు బాలసాహిత్యంలో నేను ప్రయోగాత్మకంగా రాసిన 'అందమైన పూలతోట' 'మా హృదయం' పుస్తకాలతోపాటు 'జమీందారుకోట' దేవతా - ఓ - దేవతా నవలలు, కొన్ని పదుల కథలూ, రేడియో నాటికలు, టెలిఫిల్మ్స్, ఫీచర్స్ వున్నాయి. చిన్నప్పటి నుండి చదువుకున్న 'చందమామ' నుండి అనేక పత్రికలు, కథలు వున్నాయి.

బాలల కథల గురించి మనం మాట్లాడుకునే ముందు ప్రపంచదేశాల్లోని మహా రచయితలు పిల్లల కోసం సృష్టించిన గొప్ప సాహిత్యాన్ని తలుచుకుంటూ, వారికి మనం అభివందనలు అందించుదాం. రేపటి తరాన్ని తయారు చేయటంలో ఈ సాహిత్యానికున్న అవసరాన్ని వారు గుర్తించారు. ఆయా రచయిత (త్రు)లు కేవలం ఈ బాలసాహిత్యం మాత్రమే సృష్టించలేదు. అన్ని రకాల సంఘర్షణలనూ జీవితపు గాఢతని కూడా పట్టుకున్నారు అనేది కూడా మన దృష్టిలో వుంచుకోవాలి. మనదేశంలోను తెలుగులోనూ కూడా ఎందరో మహానుభావులు పిల్లల కోసం గొప్ప సంపదను వదిలివెళ్లారు.

అలాగే అతి సామాన్య రచయితలు, సాహిత్యరంగంలో తమ పేర్లు ప్రముఖంగా కనిపించకపోయినా బాలల కోసం నిరంతరం రాస్తూ పాఠకుల్ని తయారుచేయటం తమ కర్తవ్యంగా భావిస్తున్నారు. అలాంటి రచయితలందరికీ ప్రత్యేక అభినందనలు చెబుదాం.

సోవియట్ యూనియన్ పతనం అయ్యాక ఎక్కువగా నష్టపోయింది బాలలు - బాల సాహిత్యం. అత్యంత తక్కువ ధరలో నాణ్యతతో, ఆకర్షణీయంగా వారు పుస్తకాలు ప్రచురించారు. ప్రత్యేకంగా పిల్లల కోసం ఎన్నో పత్రికలు నడిపారు. అవి కేవలం ఖాళీలు పూరించడానికి కాదు. ఓ ప్రణాళికాబద్ధంగా జరిపిన కృషి. అలానే ఇంకెన్నో దేశాల్లో ఆ కృషి జరిగింది.

ఇప్పుడు నేను బాలల కథల గురించి మీ ముందు నిలబడి నా అనుభవాలు చెప్పటం వెనుక తెలుగు బాలసాహిత్యంలో నేను ప్రయోగాత్మకంగా రాసిన 'అందమైన పూలతోట' 'మా హృదయం' పుస్తకాలతోపాటు 'జమీందారు కోట' 'దేవతా - ఓ - దేవతా' నవలలు, కొన్ని పదుల కథలూ, రేడియో నాటికలు, టెలిఫిల్మ్స్, ఫీచర్స్ వున్నాయి. చిన్నప్పటి నుండి చదువుకున్న 'చందమామ' నుండి అనేక పత్రికలు, కథలు వున్నాయి.

**మనం ఎందుకు రాయాలి?**

ఇప్పుడు విజువల్ మీడియా వచ్చింది. ఎలాంటి

అద్భుతాల్నయినా కళ్లముందు ఆవిష్కరించే యానిమేషన్, గ్రాఫిక్స్ ఇంకా రకరకాల టెక్నాలజీ అందుబాటులోకి వచ్చింది. వాటి అవసరాన్ని, ఆవిర్భావాన్ని మనం తిరస్కరించలేం. అయితే అవి చూస్తున్నంతసేపు ఓ ట్రాన్స్‌లో వుంటాం. అక్కడ అప్పుడు ప్రశ్నించటానికి ఊహకి తావులేదు. మళ్లీ మళ్లీ అవే చూడటానికి పిల్లలు ఇష్టపడతారు. క్రమంగా అదో బలహీనతగా మారుతుంది.

పుస్తకం అలా కాదు. ఆయా కథలు చదువుతున్నప్పుడు బాల పాఠకుల్లో కొన్ని అనుభూతులు, ప్రశ్నలు, ఇంకా రకరకాల భావాలు చుట్టుముడతాయి. పుస్తకాలు ఎక్కడ కూర్చునయినా చదువుకోవచ్చు. కొంతవరకు చదివి మళ్ళీ ప్రారంభించవచ్చు. అలాగే ఈ కథలు చదివే వారే రేపటి రచయితలు, కళాకారులు, క్రీడాకారులు, శాస్త్రవేత్తలుగా తయారుకాబోతున్నారు అనేది మనం దృష్టిలో వుంచుకుంటే, బాలలకోసం రాయటంలోని ఆనందం, ఉద్వేగాలు మనల్ని ఆవరిస్తాయి. మన కథలు మన పాఠకుల్ని అలరించేముందు రచయితలుగా రైటింగ్ ప్లెజర్‌ని మనం పొందగలిగినపుడే వాటికి సార్థకత లభిస్తుంది. రచయితలుగా మనం ఓ క్రమ పరిణామంలో ఎదుగుతాం.



ఏ పనికయినా, రచనకయినా ప్రారంభం ఓ అవస్థ. చాలామందికి రాయాలనే ఆరాటం వుంటుంది. అయితే ఆ అవస్థని అధిగమించలేరు. క్రమంగా పాఠకులుగా మిగిలిపోతారు. మన భావాలను ముందు రాయాలి. అది మొదటి అంశం. బాగోగులు తర్వాత ఎవరో ఒకరు చెబుతారు.

## ఎలా రాయాలి?

ఏ పనికయినా, రచనకయినా ప్రారంభం ఓ అవస్థ. చాలామందికి రాయాలనే ఆరాటం వుంటుంది. అయితే ఆ అవస్థని అధిగమించలేరు. క్రమంగా పాఠకులుగా మిగిలి పోతారు. మన భావాలను ముందు రాయాలి. అది మొదటి అంశం. బాగోగులు తర్వాత ఎవరో ఒకరు చెబుతారు.

ఇంకొంత మంది 'పిల్లల' స్థాయికి దిగి రాయటం కష్టం అంటారు. 'సుహ్లోహ్మన్స్క' అనే రష్యన్ రచయిత అందుకు ఒప్పుకోడు. బాలల సాహిత్యం సృష్టించటం అంటే పిల్లల స్థాయికి దిగటం కాదు. వీళ్లు మనకంటే ఎత్తులో వున్నారు. వారి స్థాయికి మనం ఎదగాలి అంటాడు ఇది వాస్తవమే.

## A story is what. Writing is how

ఏ ప్రక్రియలో సృజన అయినా మేడ్ ఈజీ కాదు. కొందరు పిల్లల కోసం చాలా సులభంగా రాసేస్తుంటారు. గతకాలంలో ప్రతి కథ చివర్లో 'నీతి' గురించి చెప్పేవారు. ఇప్పుడు రచన పద్ధతులు మారాయి.

అనగనగా 'Long Long Ago నుండి Many Moons Ago తో ఆరంభం అవుతున్నాయి. 'పేదరాసి పెద్దమ్మ' ఇప్పుడు అంతర్ధానం అయినా 'పరోపకారి పాపన్న'లు కనిపించకపోయినా కొత్త పాత్రలు పిల్లల ముందు కొస్తున్నాయి. పౌరాణిక కథల్లోని పాత్రలు ఆధునిక రూపంలోకి మారుతున్నాయి. ఈ సాహిత్యాన్ని సీరియస్‌గా రాయాలనుకున్నవారు ఇవన్నీ అధ్యయనం చేయాలి. ప్రధానంగా పిల్లలకోసం రాసేటపుడు ఏది చెప్పాలి. ఎంత వరకు చెప్పాలి, ఎంత సరళంగా చెప్పాలి. భాష పట్ల ఎంత జాగ్రత్తగా వుండాలి అనేది ప్రధానం. ఇవన్నీ మనం ఇతర ప్రక్రియల్లోకి వెళ్లేటప్పుడు మనల్ని ముందుకు నడిపిస్తాయి.

## కథలు ఎక్కడి నుండి పుడతాయి!!

మనందరం కథ అయిపోయాక 'కథ కంచికి - మనం ఇంటికి' అనేది విన్నాం, అన్నాం. కథ ఆకాశం నుంచి పుట్టినా భూమి మీద పుట్టినా - అవన్నీ కల్పనలు కాదు. ఆకాశం- భూమి అన్నీ భౌతిక వాస్తకాలు. అలాగే మానవుల ఆవిర్భావం జరిగాక ప్రకృతిని గురించిన అవగాహన రానప్పుడు కలిగిన ఊహలు, భ్రమలు, అనుమానాలు ఆనందాలే వస్తువులు. ఏ మేరకు శాస్త్రీయ అవగాహన కుదిరితే ఆమేర వాస్తవిక కథనాలు వస్తాయి.

పిల్లలు ప్రతిదీ నేర్చుకుంటారు. అది చూడటం, వినటం - తర్వాత కాలంలో చదవటం ద్వారా జరుగుతుంది. నా వరకూ నాకు కథలకు బీజం పిల్లలే. వారిని నిశితంగా గమనించటం వారి హావభావాలు గమనించటం, వారితో మాట్లాడటం వల్ల నాకు ఎన్నో సీరియస్ కథలకు, నవలలకి వస్తువు దొరికింది కథనం ఏర్పడింది.

అలాగే పుస్తకాలు చదవటం 'ఫిలాసఫీ' రాసే వారికయినా 'సోర్స్' గా ఎప్పుడూ నిలుస్తాయి.

ప్రతిరోజు మనం ఏ పని చేస్తున్నా, కొన్ని పదుల ఆలోచనలు మనల్ని తాకుతుంటాయి. అందులో కొన్ని మనకు అద్భుతంగా అనిపిస్తాయి. అయితే వాటిని మనం నోట్ చేసుకోకపోతే మరిచిపోతాం. రచయితలు కాదలుచుకున్నవారు ఎవరయినా జేబులో నోట్‌బుక్‌ని వుంచుకోవాలి. వచ్చిన ఆలోచనని, సంభాషణని ఆ చిన్న పుస్తకంలో నమోదు చేసుకోవాలి. తర్వాత పాత డైరీల్లో పెద్ద నోట్‌బుక్‌లో రాసిపెట్టాలి కాగితాలు మిస్ అయ్యే అవకాశం వుంది.



అంటే ఓ బీజం పడింది. అక్కడ నుండి ఆలోచన ప్రక్రియ మొదలు అవుతుంది. అది మనల్ని ఎంతగా వేధిస్తుందంటే కథ నిర్మాణం పూర్తయ్యేంత వరకు వదిలిపెట్టదు. కొన్ని వస్తువులు ఆ రూపంలోకి రావటానికి కొన్ని సంవత్సరాలు పట్టవచ్చు. బీజంలో బలం వుంటే అది మనల్ని అంటిపెట్టుకునే వుంటుంది.

**కొన్ని జాగ్రత్తలు - క్రమాలు**

మనం కథ రాసిన వెంటనే అచ్చులో చూసుకోవాలనే తాపత్రయం వద్దు. దాన్ని ఓ పక్కన పడేయండి. కథ ఓ ప్రత్యేక మానసిక స్థితిలో రాయవచ్చు. ఒకానొక ఉద్వేగం - ఉద్రేకం మనల్ని నడిపించవచ్చు. అందుకే పదిరోజులు ఆగి చదువుకుంటే అందులో బలాలు - బలహీనతలు, లోపాలు తెలుస్తాయి. అప్పుడు తిరిగి రాయండి. మన రచనలు వెనక్కి తిరిగి వస్తుంటే అందుకు కారణాలు వెతకండి. లోపాలు సరిదిద్దటానికి ఎన్నిసార్లయినా రాయండి. కొన్ని పత్రికలకి ఓ పాలసీ వుంటుంది. ఆ రకం కథలే ప్రచురిస్తారు. అంటే మన రచన బాగుండ లేదని మాత్రమే వెనక్కి పంపరు. అలాంటి ఎన్నో రచనలు తర్వాత కాలంలో గొప్ప గౌరవాలను అందుకున్నాయి.

మీ రచనల్ని దాన్ని నిర్దేశించుకున్న పాఠకుల్ని బట్టి మీ తల్లిదండ్రులకి- మీ స్నేహితులకి - పిల్లలకి ఇచ్చి చదవమనండి. అప్పుడే కొన్ని అభిప్రాయాలు వస్తాయి. మీరు బిగ్గరగా చదవండి. వాక్యాలు బలహీనంగా వున్నాయా? వాటి మధ్య సంగీతం వుందా! మీరు చెప్పాలనుకున్నది చెబుతున్నారా? అనేది తెలుస్తుంది.

మీ రచనల్ని దాన్ని నిర్దేశించుకున్న పాఠకుల్ని బట్టి మీ తల్లిదండ్రులకి- మీ స్నేహితులకి - పిల్లలకి ఇచ్చి చదవమనండి. అప్పుడే కొన్ని అభిప్రాయాలు వస్తాయి. మీరు బిగ్గరగా చదవండి. వాక్యాలు బలహీనంగా వున్నాయా? వాటి మధ్య సంగీతం వుందా! మీరు చెప్పాలనుకున్నది చెబుతున్నారా? అనేది తెలుస్తుంది.

ముందు మనం రాయబోయే కథను మనం అనుభూతి చెందాలి. దాన్ని గురించి తెలుసుకోవాలి. మనకి పరిచయం లేని వారి గురించి రాయటం, బహుమతుల కోసం ఎక్కడా కనిపించని ఆదర్శాలు చెప్పటం, రచనకి బలాన్నివ్వవు. 'మేక్‌బిలీవ్' పద్ధతుల్లో రాయాలి. అందుకు తర్కం అవసరం. డ్రామా వుండాలి తప్ప దాన్ని పూర్తిస్థాయికి తీసుకువెళ్ళి కంగాళీ చేయకూడదు.

పిల్లల సాహిత్యంలో 'ఫ్యాంటసీ' ఎప్పుడూ అగ్రస్థానమే. దేవుడూ - దెయ్యాలు - భూతాలు లాంటివి సైంటిఫిక్ ఆలోచనలకు వ్యతిరేకం. అయినా ఓ గ్రూప్ పిల్లల కథల్లో వాటిని విడదీయలేని స్థితి. చందమామ కథల్లోనూ ఇవన్నీ వుంటాయి. ఆ స్థితిలో పిల్లలు చెడు మీద మంచి విజయం సాధించాలని మాత్రమే చూస్తారు. తర్వాత కాలంలో వారు గొప్ప సైంటిస్టులవుతారు కొందరైనా. అంటే కథలు ఏ వయసులో చదువుతున్నారు. ఏ జ్ఞానంతో చదువుతున్నారు అనేది ముఖ్యం రచయితలకీ ఇది వర్తిస్తుంది.

అలాగే మనం ఏ కాలంలో వున్నాం. ఏ కాలం కథలు రాస్తున్నాం అనేది కూడా ముఖ్యమే.

ఇంక ఏ రచనకయినా ప్రారంభం ముఖ్యం. మొదటి వాక్యంతోనే పాఠకుడ్ని మనలోకి లాక్కోగలిగితే సగం సక్సెస్ అయినట్లే అలాగే కథలకి మిడిల్, ఎండింగ్ వుంటాయి. ఇవన్నీ సమపాళ్లలో కుదిరితే పాఠకుల హృదయాల్లోకి నేరుగా కథ వెళ్లిపోతుంది.

మనం రాసే కథలన్నీ గొప్పవి కావాలనే లేదు. అది ఎవరు నిర్ణయించాలి? ముందు చెప్పి ఎవరూ గొప్పవి రాయలేదు. ఆయా సందర్భాలు ఒక్కో రచనని అగ్రభాగాన వుంచుతాయి. దానర్థం మిగతా రచనలన్నీ పేలవమైనవి కాదు. దేని

ప్రయోజనం దానికి వుంటుంది. అదే సమయంలో రాసిన కథలు రాయటం, కొత్తదనం కోసం ప్రయత్నం చేయకపోవటం, రచనని కేవలం ఆదాయవనరుగా చూడటం వల్ల కూడా రచనలకి గౌరవం కలగదు. అది హృదయంతో రాసారా. అందులో నిజం ఎంతవరకు వుంది. ఇవన్నీ కాల పరీక్షలో తేలిపోతాయి.

ఇంక చాలా మంది మా రచనలకు స్పేస్ లేదంటారు. అది ఎప్పటినుంచో వున్నదే. తెలుగులో వేలాదిమంది రచయితలున్నారు. అదే సమయంలో స్థానిక పత్రికలు వందల్లో వున్నాయి. అందరూ పేరుపొందిన సర్క్యులేషన్ వున్న పత్రికల్లోనే రాయాలనుకుంటే చోటు వుండదు. ముందు రచయితలుగా పేరు తెచ్చుకుంటే తర్వాత వారే ప్రముఖులవుతారు. అందుకే చిన్న పత్రికలు, లిఖిత పత్రికలు, గోడపత్రికలు, ఇలా ఎక్కడ అవకాశం వుంటే అక్కడ మీ రచనలను చదవండి. ప్రచురించండి. అలాగే ఇప్పటి నుండీ పిల్లల చేత రచనలు చేయించండి. నిజానికి ఏ పేరున్న రచయితని కదిలించినా, వారిని కదిలించిన రచనలు జన జీవితం నుండి వచ్చినవే. అవి ఎవరు రాసారో తెలియని సందర్భాలు వున్నాయి. జానపద కథలు దేశాలన్నింటిని చుట్టుముట్టాయి. అవే ఆధునిక క్లాసిక్స్‌గా రూపుదిద్దుకుంటున్నాయి.



పిల్లలకు అన్నీ ఒకేసారి చెప్పేయాలనే బలహీనతకి లొంగకుండా సాహసం నుండి అద్భుతాల వరకు పరిమితుల్లో చెప్పాలి. హారీపోటర్ నవలలు ఓ రచయిత్రిని అత్యంత సంపన్నురాలని చేసాయి. మనకి అలాంటి అవకాశాలు రాకపోవచ్చు.

కానీ పిల్లలు మన రచనల్ని చదివి, ఆ కళ్లలో కాంతిని నింపుకున్నప్పుడు బాల సాహిత్యం రచయితలకు ఏ సంపదలూ అవసరం లేదు అనిపిస్తుంది.

**చివరిగా...**

బాలల కోసం ఆలోచించేవారు, బాలల కథలతో ప్రారంభమయ్యేవారు ఓ సంపూర్ణ రచయిత(త్రి)గా ఎదుగుతారు. అందుకే ఈనాటి రచయితలు రకరకాల వాద వివాదాల్లో మునిగిపోయినా పిల్లల కోసం ఓ కథన్నా రాయండి. అలాంటి బాధ్యతనీ, సంస్కారాన్ని తర్వాత తరాలకు వారసత్వంగా అందచేయమని మనవి చేస్తున్నాను.



**కథాసూత్రాలు**

**రం**గుల్ని సమర్థంగా ఉపయోగించలేని వ్యక్తి చిత్రకారుడూ, స్వరాలను సమర్థంగా ఉపయోగించలేని వ్యక్తి సంగీత విద్వాంసుడూ కాలేడు. అలాగే భాషను సృజనాత్మక నైపుణ్యంతో ఉపయోగించలేని వ్యక్తి రచయిత కాలేడు. కళాకారుడికి - శ్రీశ్రీ అన్నట్టుగా తన మాధ్యమం మీద చక్కని నియంత్రణ ఉండాలి. అంతే కాకుండా మానవుని ఆలోచనకు వాహిక భాష. భాష సహాయం లేకుండా మానవుడు తార్కికంగా ఆలోచించలేడు. భాషా సామర్థ్యం పెరిగిన కొద్దీ మానవుని ఆలోచనా సామర్థ్యం పెరుగుతుంది. రచయిత భావాలకు మాధ్యమం భాష. అతడు భాష ద్వారానే తన కథా వస్తువు మీద పాఠకుడిలో నమ్మకాన్ని కలిగిస్తాడు. ఇంత ప్రాధాన్యత ఉన్న భాషను గురించి చాలామంది రచయితల్లో కనీస శ్రద్ధ కూడా ఉండటం లేదు. పద స్వరూపాన్ని (స్పెల్లింగ్) లక్ష్య పెట్టకుండా, భావ ప్రకటనలోని సామంజస్యాన్ని గురించి ఆలోచించకుండా, వాక్యనిర్మాణం మీద శ్రద్ధ లేకుండా వీరు రాస్తున్నారు. "The limits of my language are the limits of my world" అన్న Wittgenstein భాషకూ, మనిషి ఆలోచనకూ ఉన్న సంబంధాన్ని చక్కగా చెప్పాడు. "తప్పు నడక ఉన్న ఒక్క వాక్యం చాలు కథను ధ్వంసం చేయటానికి" అన్నాడు కథలో భాషకున్న ప్రాధాన్యతను గురించి చెబుతూ సుప్రసిద్ధ కథా రచయిత ట్రూమర్ కపోట్. ఈ అభిప్రాయాల విలువను మన కథా రచయితల్లో చాలామంది గుర్తించాలని నేను గట్టిగా నమ్ముతున్నాను.

**- వల్లంపాటి వెంకటసుబ్బయ్య**



★ తెలకపల్లి రవి

# కథా రచనలో భిన్నకోణాలు

మన ఇంటి ముందుకు వచ్చేవాళ్ళు రకరకాలుగా సోది చెబుతానమ్మ సోది చెబుతాను అనేవాళ్ళు, దంపుడు పాటలు వీళ్ళందర్నీ, వీటన్నింటినీ మన పండితులు సాహిత్యంగా పరిగణించలేదు. మన ప్రజాసాహిత్యాన్ని గ్రామ్యమని, దేశీయం అని రకరకాల పేర్లు పెట్టి పక్కన పెట్టారు.

ఒక కథ, ఒక రచన, ఒక ప్రసంగం, ఒక సినిమా, ఒక టీవి కార్యక్రమం బావుంది, బాలేదు అనే విచక్షణాయుతంగా చెప్పటమనేది అంత తేలికైన విషయం కాదు. దానికి సంబంధించినటువంటి కొలబద్ధలేమిటి? అది చెబుతున్నది నిబద్ధమా అబద్ధమా? నిబద్ది అంటే నిజం. నిబద్ధత అంటే సత్యనిష్ట, సత్యానికి కట్టుబడటం. విమర్శకు అతిపెద్ద కొలబద్ద ఏదైనా వుందంటే అది సత్యనిష్ట. ఒక రచన వాస్తవాన్ని ప్రతిబింబిస్తుందా లేదా? ఏ రచనైనా తీసుకోండి. మహాభారతాన్ని తీసుకోండి. అంటే మళ్ళీ అక్కణ్ణుంచి ఆదికవి అంతా తప్పుకోవాలని కాదు. తెలుగు భాష వెయ్యేళ్ళా కాదా అన్న చర్చ వచ్చినప్పుడు మనం ఆదికవులను తలుచుకుంటూ సోదికవులను మరిచిపోయాము అని నేనెప్పుడూ అంటుంటాను. ఈ కారణంగానే మన భాష చరిత్ర తగ్గింది. మన ఇంటి ముందుకు వచ్చేవాళ్ళు రకరకాలుగా సోది చెబుతానమ్మ సోది చెబుతాను అనేవాళ్ళు, దంపుడు పాటలు వీళ్ళందర్నీ, వీటన్నింటినీ మన పండితులు సాహిత్యంగా పరిగణించలేదు. మన ప్రజాసాహిత్యాన్ని గ్రామ్యమని, దేశీయం అని రకరకాల పేర్లు పెట్టి పక్కన పెట్టారు. అదే ప్రాచీనకాలంలో వచ్చినటువంటి సంగం సాహిత్యం అనేదాన్ని తమిళులు నెత్తిన పెట్టుకున్నారు. సంగసాహిత్యం అన్నదంతా కూడా ప్రజల సాహిత్యం. ఎక్కువ భాగం జైన సాహిత్యం. బౌద్ధగ్రంధాల కాలంలో ఉన్న రచనలు మీరు గమనిస్తే అవన్నీ కూడా సమైక్యజీవితానికి సంబంధించినవి ఎక్కువగా వుంటాయి. ఆ కాలంలో బౌద్ధమతం బాగా విస్తరించింది. వాటి తాలూకు అవశేషాలు అన్ని ప్రాంతాల్లో మీకు కన్పిస్తాయి. కాని బౌద్ధమత సాహిత్యం అంత బలంగా కన్పించదు. కారణం ఏమిటంటే తరువాత వచ్చినటువంటి ఆధిపత్య భావజాలం అగ్రవర్ణ దురహంకారం దాన్ని అణగదొక్కాయి.

అప్పుడైనా ఇప్పుడైనా. మనం ప్రజాసాహిత్య దృష్టితో చూస్తే మన ప్రమాణం ఒక విధంగా వుంటుంది. నిబద్ధత అంటే ఇక్కడ ప్రజల పట్ల నిబద్ధత. ప్రజల పట్ల నిబద్ధతనే కొలబద్దగా తీసుకుని మనం సాహిత్యాన్ని చూడగలుగుతున్నాం. అలా చూస్తే దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్

అన్నది అది చిన్న వాక్యం కాదు నిజానికి. దేశమంటే ఎవరు.... దేశమంటే అశోకుడు, దేశమంటే అక్బర్... దేశమంటే కృష్ణదేవరాయలు, దేశమంటే రాజశేఖర్ రెడ్డి, ఈ దేశమంటే ఇప్పుడంటే జగన్మోహన్ రెడ్డి, దేశమంటే చంద్రబాబునాయుడు, దేశమంటే నరేంద్రమోడీ, దేశమంటే రాహుల్‌గాంధీ ప్రపంచమంటే ఒబామా ఇది సరైన దృక్పథం కాదు వాస్తవానికి. అందుకని జరిగిందంతా రాజుల చరిత్ర, సంపదల చరిత్ర అని రాస్తూ వచ్చాం. కాబట్టి ఆ దృష్టి కోణాన్ని పక్కనపెట్టి ప్రజల కోణాన్నుంచి సాహిత్యం చూడడం మొదలుపెట్టాలి.



ప్రజలు అంటే నువ్వూ, నేను, అందరం కూడా ప్రజలు అనుకుంటేనే నీ జీవితం, నా జీవితం. వీటన్నింటి వాస్తవాన్ని ప్రతిబింబించే ఏదైనా కథ అనుకుంటే అప్పుడు మనం సరైనటువంటి ఒక దిశలో వెళ్ళే అవకాశం వుంటుంది. ఇంత విస్తృతమైన అర్థంలో మనం చూస్తున్నామా అంటే చాలా సందర్భాల్లో మనం చూడ్డం లేదు.

**ప్రజలు అంటే నువ్వూ, నేను, అందరం కూడా ప్రజలు అనుకుంటేనే నీ జీవితం, నా జీవితం. వీటన్నింటి వాస్తవాన్ని ప్రతిబింబించే ఏదైనా కథ అనుకుంటే అప్పుడు మనం సరైనటువంటి ఒక దిశలో వెళ్ళే అవకాశం వుంటుంది.**

ఎవరు మాట్లాడుతుంది అనేదిపోయి ఎక్కడ్నుంచి మాట్లాడు తున్నారు అని అడుగుతున్నారు. పూర్వం ఎక్కడ్నుంచి మాట్లాడుతున్నారు అనే అవసరం లేదు కదా! వాడి ఇంట్లోనే ఫోను వుంటుంది కాబట్టి ఇంట్లోనుంచే అని చెప్పనవసరం లేదు. కాన ఇప్పుడు సెల్‌లో ఎవరు మాట్లాడుతున్నారు అని గాక ఎక్కడ్నుంచీ మాట్లాడుతున్నారు అని అడుగుతాం మనం. ఇవన్నీ మార్పులు. సాంకేతిక మార్పులు. ఈ సాంకేతిక మార్పులు ప్రజల జీవితంలో తెచ్చేటటువంటి మార్పులు. కాబట్టి ప్రజలనే వాళ్ళను, జనం అనేవాళ్ళను దేశ కాలాల్లో సక్రమంగా చూపించటం.

ఇక కథలెలా రాయాలి? ఆలోచన ఎక్కడ ప్రారంభం కావాలి? ఎక్కడైనా ఏదైనా ఎలాగైనా రాయొచ్చు. ఈ కథా కార్యశాలనే తీసుకోండి. కథ అనేది చాలా క్షీణదశలో వుందన్నప్పుడు ఈ సాహిత్యశాల దానికి ఊపిరిపోసింది అనే ఒక భావనతో ఒక కథ రాయొచ్చు. ఈ సభకు వచ్చినవాళ్ళు బాగా బోర్ కొట్టించారు. గొప్ప 'ఇద'నుకుని పిలుస్తారు కాని వీళ్ళు చెప్పేదేమీ ఉండదు. అందులో ఒకాయన మూడు నాలుగు సార్లు మాట్లాడి సతాయించాడు. దీన్ని ప్రధానంగా దృష్టిలో పెట్టుకుని మనం ఒక కథ రాయొచ్చు.....కాదు కథ గురించి ఇంతకాలం నేను అజ్ఞానంలో ఉన్నాను, ఈ కథాకార్యశాలకు వెళ్ళడం ద్వారా నాలో ఒక కొత్త చైతన్యం ఉదయించిందనే అర్థంలో మనం కథ రాయొచ్చు... కాదు ఈ కార్యశాల నుంచి సుందరయ్య విజ్ఞాన కేంద్రం నుంచి అడుగు బయటపెట్టగానే చూచినటువంటి ఒకానొక దృశ్యం మీద కథ రాసినట్టుగా ఒక కథ రాయొచ్చు. లేదు ఇక్కడ మీ దగ్గరికి వచ్చినటువంటి, కలిసినటువంటి ఒకానొక కథకుడు, లేదా ఒక యువ కథకుడు ఎదుర్కొన్నటువంటి మనస్థితిని మీరు ఒక కథ రాయొచ్చు. ఇందులో మీరు ఒక్కొక్క దీన్ని తీసుకుంటే దానికి ఒక భూమిక మీరు ఏర్పాటు చేసుకుంటారు. నేను కూడా కొన్ని కథలు రాసాను. రెండు ముద్రణలు పొందింది నా కథ సంపుటి అభద్ర కూడా. ఓసారి బస్‌లో వెళుతున్నా పాటలు వేస్తున్నారు. ఏవేవో పాటలు వేస్తున్నారు... ఆ తర్వాత హఠాత్తుగా మంచి పాట వేసారు కాసేపు గ్యాప్ తీసుకుని. అది చూసిన తర్వాత నేను గీత్ గాతా హు మై... అనే కథ రాసాను. అంటే వాడు చోలికే పీచే క్యాహే అనే పాట వేస్తుంటాడు. నా పక్కన ఉన్నవాడు అప్పటికే పాడుతూ వుంటాడు. అతనితో ఏదో కాసేపు నేను చెప్తూ ఉంటాను. అతను వెళ్ళి డ్రైవర్‌కి చెప్పి ఆ పాట ఆపేస్తాడు. ఆపేసిన తర్వాత కాసేపు నిశ్శబ్దం ఆవరిస్తుంది. హఠాత్తుగా గీత్ గాతాహు మై .... అనే పాట ఎత్తుకుంటాడు. ఒక్కసారిగా అందరూ ఆ పాట వింటారు. అంటే అప్పటి వరకు వేస్తున్న చెత్తపాట అనండి.....లేదా మత్తు పాట అనండి... వింటున్న స్థితిలోనించి ఒక వాస్తవికతలోకి వస్తారు. అది ఒక చిన్న ఉదాహరణ చెప్పాలంటే.

అయితే ఏదైనా రాయొచ్చా? రచనల్లో సమస్యలే వుండవా? వుంటాయి. ఎందుకుంటాయి... అంటే రాయడానికి శ్రద్ధ పెట్టకపోవడం వల్ల ఉంటాయి. రాయడానికి కావలసిన

ప్రణాళిక వేసుకోకపోవడం వల్ల ఉంటాయి. కాని ఉండాలోయ్ కవితావేశం.... కానీవోయ్ రసనిర్దేశం, దొరకదటోయ్ శోభాలేశం అన్నట్టుగా ప్రయత్నం చేస్తే పరిష్కారమవుతాయి.

ఒక కథ చెప్తాను. ఉదాహరణకు మా ఎదురింట్లో ఇప్పుడు కాదు ఇంతకు ముందు చాలా పెద్ద ఫ్యామిలీ ఒక ఐదారు తరాల ఉమ్మడి కుటుంబం. ఆ ఇంట్లో దాదాపు నూరేళ్ళ చరిత్ర ఉన్నటువంటి ఒక ముసలమ్మ ఉండేది. ఆమె పెద్దగా ఇల్లు కదిలేది కాదు. ఎక్కువ మంది ఆమెను వచ్చేటప్పుడు, వెళ్ళేటప్పుడు పలకరించి మళ్ళీ వెళుతుండే వారు. హఠాత్తుగా ఒకరోజు అందరూ ఒకచోట గుంపు గూడారు. ఏమంటే ఆ ముసలమ్మ మాట్లాడ్డం లేదు ఆమె అసలు కదలడం లేదు. మాట్లాడ్డం లేదు. రెండు రోజుల పాటు ఆ ఇంట్లో విపరీత మైన నిశ్శబ్దం. ఏమౌతుంది ? అందరూ అడిగారు. ఒక ఐదారు రోజుల తర్వాత ఆ ముసలమ్మ మళ్ళీ మామూలుగానే వచ్చింది. మళ్ళీ ఆ ఇంట్లో మామూలుగానే వుంది. ఇది ఒక అంశం. దీనికి కొనసాగింపు వుంది. ఒక మూడు నాలుగు నెలల తర్వాత ఆ ఇంట్లో వాళ్ళందరూ కూడా మెట్ల దగ్గర గుమిగూడి వున్నారు. ఏమిటి అంటే వాళ్లింట్లో అతి చిన్న యువ జంటకు ఒక చిన్నపాప పుట్టింది. ఆ పాప చూస్తుందో నవ్వుతుందో మొత్తం ఇంట్లోవాళ్ళందరూ కూడా అక్కడ చేరారు. ఇది కథ కూడా అయితే మిమ్మల్ని కదిలించగలిగితే ఈ రెండింటిని కలిపి మీరు కథలుగా రాయొచ్చు, విడగొట్టి కథగా రాయొచ్చు. ఉమ్మడి కుటుంబంగా కథ రాయొచ్చు. విడివిడిగా వుంటే రాయొచ్చు. ఒక మానవీయపరిమళం దీన్లోంచి మీరు తీసుకుని రాయొచ్చు.



*అసలు వస్తువు ఉంటే కదా శిల్పం. శిల్పం చెక్కడానికి ఒక రాయి ఉండాలి కదా! అక్కడ ఒక ఆకారం ఒక రాయి ఉంటే మీరు ఒక ఈశ్వరుణ్ణి చెక్కుతారా? విష్ణువును చెక్కుతారా, లేదు ఇంకొక అందాలరాశిని చెక్కుతారా? రాజును చెక్కుతారా, సామాన్యుణ్ణి చెక్కుతారా అనే ప్రశ్న ఉత్పన్నమవుతుంది. రాయి అక్కర్లేదు కాని నేను శిల్పం సృష్టిస్తానంటే... శిల్పం మీరు చెక్కలేరు.*

జాషువా అన్నాడు కదా! శిల్పిని మెచ్చుకోను గాని శిల్పాన్ని మెచ్చుకుంటాను అనడమేమిటి? శిల్పిని మెచ్చుకోకుండా శిల్పాన్ని మెచ్చుకోవడం సాధ్యమా? ఆయన తెలివితక్కువవాడే గాని భలే మాట్లాడతాడే అని అంటే మనం తెలివి తక్కువవాళ్ళమని అర్థం. అంతే కదా! కాబట్టి అసలు వస్తువు ఉంటే కదా శిల్పం. శిల్పం చెక్కడానికి ఒక రాయి ఉండాలి కదా! అక్కడ ఒక ఆకారం ఒక రాయి ఉంటే మీరు ఒక ఈశ్వరుణ్ణి చెక్కుతారా? విష్ణువును చెక్కుతారా, లేదు ఇంకొక అందాలరాశిని చెక్కుతారా? రాజును చెక్కుతారా, సామాన్యుణ్ని చెక్కుతారా అనే ప్రశ్న ఉత్పన్నమవుతుంది. రాయి అక్కర్లేదు కాని నేను శిల్పం సృష్టిస్తానంటే... శిల్పం మీరు చెక్కలేరు. కాబట్టి వస్తువు ప్రాథమికమైంది. ఎప్పుడు కూడా వస్తువు ప్రాథమికమైంది. ప్రాణప్రదమైంది కూడా. వస్తువు ఉన్న తర్వాతే శిల్పం అయిన ఇంకోటి అయిన వస్తుంది తప్ప ఇంకోటి రాదు. కథ లేకుండా ఇప్పటికి యాభై సినిమాలు తీసాను అన్నాడట ఒకాయన. సినిమాకి హీరో కావాలి, హీరోయిన్ కావాలి, పాటలు కావాలి, సెట్టింగులు కావాలి కాని కథ ఏంటయ్యా మరీ విచిత్రంగా మాట్లాడతావు నువ్వు అని. ఏదో ఒక కథ వుంది కదా! హీరోనో, విలనో, వీళ్ళు ఎక్కడ కలుసుకున్నారు, కథకు కాళ్ళు లేవు, ముంతకు చెవులు లేవు..... కథకు కాళ్ళు లేవు కాని రెక్కలున్నాయి. కథ ఎక్కడికైనా పోతుంది. కథ ఎక్కడినించైనా వస్తుంది. ఎందుకంటే కథకు కాళ్ళు అక్కరలేదు. కథకు ఊహలే, రెక్కలు లేవు. ఎక్కడో దేశదేశాల్లో జరిగిన కథలు మనం ఇప్పటికీ ఎందుకు చెప్పుకుంటున్నాం. విక్రమార్కుడికి బేతాళుడు కూడా కథే ఎందుకు చెప్పాడు. ఇంకేదైనా చెప్పివుండవచ్చుగా. కాలానికనుగుణంగా వెదికి పట్టుకుంటూ వుండాలి. ఆ వస్తువును పట్టుకోవడానికి నేనొకటి చెప్పాను. అదే 'వి' అక్షరంతో మొదలయ్యే జాబితా.

**విలువలు:** ఏ విలువలకీ ప్రస్థానం అన్నట్టుగా ఇందులో ఇమిడి వున్న విలువలు ఏంటి? మానవాళి పురోగమనానికి సమ భావనకు దోహదపడేవన్నీ మనం విలువలుగా తీసుకోవచ్చు. వీటికి ఆటంకం కలిగించేవన్నీ మనుషులు

ఆమోదించలేనివే. కాబట్టి విమర్శకు ప్రాతిపదిక విలువలు, విలువలకు ప్రాతిపదిక విధానాలు. ఏ విధానం మంచిది, ఏ విధానం చెడ్డది?

**విజ్ఞానం:** విజ్ఞానం కూడా చాలా ముఖ్యమైనటువంటిది. విజ్ఞానం పెంచేదాన్ని మనం ఆహ్వానిద్దాం తప్ప నేను చాలాసార్లు చెప్పాను వీరేశలింగం గారు దయ్యాలు లేవని నిరూపిస్తే వీరేంద్రనాథ్ దయ్యాలు ఉన్నాయని చెప్పడానికి కథ రాశారు. వీరేంద్రనాథ్ గారు గొప్ప ప్రతిభ ప్రజ్ఞ కలిగినవాడే. కానీ ఆయన ప్రజ్ఞాపాటవాలు దయ్యాలు ఉన్నాయని చెప్పడానికి ఉపయోగించాయి. దయ్యాలను గురించి భయం పోగొట్టడానికి విజ్ఞానం కావాలి. అందులోని మూఢత్వాన్ని ఎత్తిచూపడానికి విజ్ఞానం కావాలి.



**వికృతం:** అంతులేని అవినీతి ఒక వికృతం, శృతి మించిన మౌఢ్యం ఒక వికృతం. రఘోత్తమరెడ్డి రాసినట్టు మనిషి లోపల విధ్వంసం. మనిషి లోపల గాని బయట గాని మనచుట్టూ జరుగుతున్న విధ్వంసాలను మనం గుర్తించలేకపోతే ఇరాక్‌లో విధ్వంసం, ఇప్పుడు సిరియాలో విధ్వంసం. ద్వేషం విద్వేషాన్ని పెంచుతుందనేది చాలా ప్రసిద్ధమైన నూక్తి. ముఖ్యంగా మత,జాతిపరమైన అకారణ విద్వేషాలను ఖండించడానికి సామరస్య భావన. విద్వేషం కూడా వ్యక్తిగత లేదా సామూహికం కావచ్చు. మంచుబొమ్మలు అనే నవల వుంటుంది. బావుంటుంది కూడా. ఆ నవల మొత్తం కథానాయిక కథానాయకుణ్ణి ద్వేషిస్తూ వుంటుంది. చివరలో కళ్ళు తెరుచుకుంటుంది. ఇలాటి చిత్రాలు కూడా వచ్చాయి. కథానాయిక లేదా కథానాయకుడు ఒకరిని ఒకరు ద్వేషిస్తూ చివరకు అపార్థాలు తొలగించుకోవడం. ఇదీ ఒక ఇతివృత్తమే.

***విజయం అంటే ఈ రోజున చాలా సంకుచితమైన నిర్వచనాలు ఇవ్వబడుతున్నాయి. విజయం అంటే గొప్ప పదవి సంపాదించటం, డబ్బు సంపాదించడం అన్నట్టు చెబుతున్నారు. ఇవి విజయాలే. కాని మానవీయ విలువలను అంగుళం ముందుకు తీసుకుపోయినా అది విజయమనే చెప్పాలి.***

**విజయం:** విజయం అంటే ఈ రోజున చాలా సంకుచితమైన నిర్వచనాలు ఇవ్వబడుతున్నాయి. విజయం అంటే గొప్ప పదవి సంపాదించటం, డబ్బు సంపాదించడం అన్నట్టు చెబుతున్నారు. ఇవి విజయాలే. కాని మానవీయ విలువలను అంగుళం ముందుకు తీసుకుపోయినా అది నిజమైన విజయమనే చెప్పాలి. ప్రయాణంలో జరిగిన ఒక ఉదాహరణ చెబుతాను. చాలా కథలు ప్రయాణాల్లో పుడుతుంటాయి. ఈ రోజుల్లో కథలు ఎక్కువగా రాకపోవడానికి, సరైనవి రాకపోవడానికి. ప్రయాణాలు కూడా తగ్గడం, అహోరాత్రాలు పనిలో పరుగులు తీయాల్సి రావడం ఒక కారణం. గొప్ప గొప్ప కథకులందరూ ఒక నవల రాయాలంటే ఒక ఆరు నెలలో ఎనిమిది నెలలో ఒక టూర్ ప్రోగ్రాం పెట్టుకుని నవలలు రూపొందించుకుంటారు. ఒకసారి బస్సులో వెళ్తున్నాను. పక్కనున్నతనికి లేచి సీటు ఇస్తే బావుండునని నాకన్పిస్తుంది. కాని ఇవ్వడానికి సంకోచిస్తున్నాను. తీరా నేను కూచోమనే సరికి అతను దిగాల్సిన చోటు వచ్చింది. మా వీధిలో ఈ పిల్లాడు రోజు చొక్కా లేకుండా వున్నాడు. వీడికి నేను ఇవ్వాలి అంటే ఇది ఔదార్యం. కేవలం ఉదారతతో ఉపన్యాసాలతో ఆగిపోతే అది కూడా విజయం కాదు. అంగన్‌వాడీలు సమ్మె చేసి విజయం సాధిస్తే మనకు విజయంలాగా కనబడదు. ఒక టీచర్ చేస్తే మనకు విజయంలాగా కనబడదు. కంప్యూటర్ ఆపరేటర్ చేస్తే మనకు విజయంలాగా కనబడదు. అసలు ఇందిరా పార్క్ దగ్గర చౌక్ ధర్నా చౌక్‌గా మారిపోయింది. ఇన్ని పోరాటాలు జరుగుతున్నాయి. ఉద్యమాలు లేకపోతే ఉనికే లేదు. ఇంతకు ముందు ఉదయం పత్రిక మూతపడింది. వాళ్ళు సమ్మె చేశారు. సమ్మె చేస్తే వాళ్ళ టెంట్‌లో వేయించుకునే ఏ పత్రికల్లో కూడా సమ్మె వార్త వేయటం లేదు. వాళ్ళ వార్త వేసింది ప్రజాశక్తి, విశాలాంధ్ర పత్రికలో మాత్రమే. అందుకని వాళ్ళ సమ్మె టెంట్‌లో ఈ రెండు పత్రికలు వేయించుకోవడం మొదలుపెట్టారు. కనుక ఉద్యమం అనేది చాలా అవసరమైపోతుంది ఏదో ఒక దశలో. లేకపోతే మనం జర్మన్‌లో నాజీల గురించి చెప్పినట్టుగా ఆ పరిస్థితికి పోతాం మనం. వాళ్ళు కమ్యూనిస్టులను తిట్టారు, కొట్టారు నేనేం పట్టించుకోలేదు. వాళ్ళు యూదుల్ని కొట్టారు నేను

పట్టించుకోలేదు, వాళ్ళు ముస్లింలను కొట్టారు నేను పట్టించుకోలేదు. చివరకు నన్ను కొట్టడానికి వచ్చారు. నాకోసం మాట్లాడేవారు మిగల్లేదు అన్నట్టుగా ఆ కార్పొరేషన్ మూసేశారు, ఈ కార్యాలయం మూసేశారు, ఈ స్కూలు మూసేశారు, ఇవన్నీ నేను పట్టించుకోలేదు నేను రచయితను కదా! నా పని మెయిన్‌గా గొప్ప గొప్ప రసగుళికలు తయారుచేయటం కదా! అని నేనుంటే రేపు నా పనీ అంతే అవుతుంది. ఈ రోజుల్లో ఉద్యోగాలకు వెళ్ళే హక్కులు వచ్చాయన్నా జీతభత్యా లంటున్నారన్నా ఎలా ఎందుకు వచ్చాయి ఇవన్నీ... అనేక పోరాటాలు...ఈ విజయాలను కూడా మనం విజయాలుగా గుర్తించాల్సి నటువంటి వి. ఇందాక నేను 'వి' పరంపరలో విజయం అన్న దగ్గర ఈ అంశాలు మీకు చెబుతున్నాను.



**మళ్ళీ మనిషిని మనిషి ప్రేమించేవిధంగా మనిషి కోసం మనిషి నిలిచేవిధంగా వుండే ఒక విలువను ప్రతిష్టించటం ఈ రోజున రచయిత ముందుండే అతి పెద్ద కర్తవ్యం. దానికి కావాల్సిన ఇతివృత్తాలు ఎంచుకోండి.**

**విషాదం:** 'విషాదం' కూడా గొప్ప కథ . నేను అనంతశోక భీకర తిమిర లోకైక పతినంటూ ఏడ్చుకుంటూ కూర్చోమని కాదు విషాదం లేకుండా చేయాలంటే ముందు మనం విషాదాన్ని గుర్తించాలి. 'వి'షాదాన్ని నమోదు చేయాలి. అది లేకుండా చేసేటటువంటి మార్గాలు వెతకాలి. ముందు ఇతరుల బాధను మన బాధగా భావించటం మనం నేర్చుకోవాలి. ప్రపంచపు బాధంతా శ్రీశ్రీ బాధ అన్నట్టుగా నాకు బాధ అయితేనే తప్ప బాధ ఇతరుల బాధ నాది కాదు అనుకుంటే మీరెప్పటికీ 'వి'షాదాన్ని గుర్తించలేరు. చాలా కథలు ఆదివారం అనుబంధంలో అయితే చాలా కథలు ఫీల్ గుడ్ కథలు. ఇతరులు మనల్ని ఎవరూ ప్రేమించేవాళ్ళు లేరు నా కొరకు చెమ్మగిల్లు నయనం లేదు అంటే అది 'వి'షాదమే. కాని అంతకంటే పెద్ద విషాదం ఒకటుంది అన్నాడు బుచ్చిబాబు. ఇతరులను ప్రేమించలేకపోవటం. ఇతరుల్ని ప్రేమించడం అంటే ఏమిటి? ఈ మధ్య ప్రేమ కథాచిత్రం దయ్యం కథ తీసాడొకాయన. అది బాగా హిట్ అయ్యింది. దెయ్యాలను తప్ప మానవుల్ని ప్రేమించలేని స్థితికి చేరుకున్నాం మనం చివరకు. ఇతరులను అంటే సాటి మనుషులను ప్రేమించలేకపోవడం శృతిమించినటువంటి స్వార్థపరత్వం. అది అన్నింటిని మించిన విషాదం. చేగువేరా కూడా నేను మానవజాతిని నిరంతరం ప్రేమించాను అన్నాడు. గొప్ప గొప్ప యోధులు, గొప్ప గొప్ప సంస్కర్తలు, వీళ్ళందరూ ఎందుకు కృషి చేసారు. కారల్‌మార్క్స్ ఎందుకు సిద్ధాంతం కనిపెట్టాడు. మహాత్మాగాంధీ ఎందుకు చొక్కా కూడా వేసుకోకుండా బయలుదేరాడు. భగత్‌సింగ్ 23 ఏళ్ళ వయస్సులోనే ప్రాణాలు అర్పించాడు. చేగువేరా ఎందుకు క్యూబాను విముక్తి చేసిన తరువాత దేశ అధ్యక్షుడు కావడానికి అన్ని అవకాశాలు ఉన్నా గాని మళ్ళీ ఇంకో దేశం వెళ్ళి పోరాడి అక్కడెందుకు ప్రాణాలు అర్పించాడు. ఎందుకంటే వీళ్ళు విశ్వమానవులుగా ప్రేమించారు కాబట్టి ప్రేమించలేకపోవడమే ఇప్పుడు నేర్పిస్తున్నారు. ఇప్పుడు ప్రేమ నేర్పిస్తున్నది నిజానికి ప్రేమ కాదు. ఈ ప్రేమరాహిత్యాన్ని పటాపంచలు చేసి, మళ్ళీ మనిషిని మనిషి ప్రేమించేవిధంగా మనిషి కోసం మనిషి నిలిచేవిధంగా వుండే ఒక విలువను ప్రతిష్టించటం ఈ రోజున రచయిత ముందుండే అతి పెద్ద కర్తవ్యం. దానికి కావాల్సిన ఇతివృత్తాలు ఎంచుకోండి.

మనం ఏదైనా ఎంచుకోవచ్చు. ఇందాకా చెప్పుకున్న **'వి'** లు. వాటికి **విభిన్నత** అనేది కూడా ఒకటి కలుపుకోండి. దీనికి. కొంచెం విభిన్నంగా వుండే విషయం ఏదైనా అది కూడా కొంచెం ఆకర్షిస్తుంది. వీటి ప్రకారం మనం ఇతివృత్తాలు అల్లుకుంటూ వాటిని అలా అలా అట్టిపెట్టుకుంటూ వెళ్తే కథలు తప్పకుండా తయారౌతాయి.

**మొదటిది** మనం గుర్తించినదాన్ని నమోదు చేసుకోవాలి. **రెండవది** సమయం దొరికినప్పుడల్లా దాన్ని విస్తరించుకుంటూ వుండాలి. **మూడోది** మనం రూపొందించుకున్న భావనను మనం పరిశీలించుకుంటూ ఉండాలి.

**నాలుగోది** అటువంటివి ఇంకా ఎవరైనా రాస్తున్నారా? అటువంటి దిశలో ఇంకెవ్వైనా ఆలోచించి వున్నారా తెలుసుకోవాలి. వుంటే పరిశీలించాలి.

**అయిదోది** రాసిన తర్వాత కూడా శక్తి ఆసక్తి గలవారికి

ఇచ్చి అభిప్రాయాలు తెలుసుకోవాలి. అయితే ప్రతి అభిప్రాయానికీ కదిలిపోకుండా క్రోడీకరించుకోవడానికి ప్రయత్నించాలి.

**ఆరు** రాసింది అచ్చు కానంత మాత్రాన నిరుత్సాహపడాల్సిన అవసరం లేదు. ఎందుకంటే దానికి చాలా కారణాలుండొచ్చు.

* * *

వెనకటికి ఎవరో అడవిలో వుండి విపరీతమైన పరిశోధనలు చేసాడట. ఆక్సిజన్ ప్రాణవాయువు అని కనిపెట్టి వచ్చాడట. ఆక్సిజన్ ప్రాణవాయువు అని ఎప్పుడో కనిపెట్టారు. అలా ఇప్పుడు మన కథలు రాసుకుంటూ మనంతట మనం ఉష్ణపక్షుల్లాగా వుంటే బయట అవన్నీ చాలా సార్లు జరిగిపోతుంటాయి. అప్పుడు వాళ్ళు మనల్ని కాపీ కొట్టారు అలాంటివి పాత్రలు కొన్ని మనకు తగులుతుంటాయి. ఆలోచనల్లోనూ, కూర్పులోనూ క్లుప్తత ఉండాలి.



**ఏ రచన చేసినా సరే దానికి స్పష్టత, క్లుప్తత, ఆప్తత అనే మూడు లక్షణాలు వుండాలి అని. స్పష్టత అంటే మేం రాసేది కథ కదండీ ఇదేమైనా వార్తనా? అని కొంత మంది అడుగుతుంటారు. స్పష్టత అంటే చెప్పదలచుకొంది నువ్వు స్పష్టంగా చెప్పు చాలు. అంతకంటే నువ్వు స్పష్టంగా ఉండడం, క్లుప్తంగా ఉండడం అన్నింటికంటే ముఖ్యంగా ఆప్తంగా వుండడం టచింగ్‌గా వుండడం.**

నేను ఎప్పుడూ తారకమంత్రంలాగా చెప్పేది ఒకటుంది. ఏ రచన చేసినా సరే దానికి స్పష్టత, క్లుప్తత, ఆప్తత అనే మూడు లక్షణాలు వుండాలి అని. స్పష్టత అంటే మేం రాసేది కథ కదండీ ఇదేమైనా వార్తనా? అని కొంత మంది అడుగుతుంటారు. స్పష్టత అంటే చెప్పదలచుకొంది నువ్వు స్పష్టంగా చెప్పు చాలు. అంతకంటే నువ్వు స్పష్టంగా ఉండడం, క్లుప్తంగా ఉండడం అన్నింటికంటే ముఖ్యంగా ఆప్తంగా వుండడం టచింగ్‌గా వుండడం ఇవి చేయాలంటే సరైన పదం కావాలి కదా!

ఇప్పుడు మన రాష్ట్రంలో పరిస్థితి ఎట్లా వుందంటే ఉదయం కూడా ఎవరో అడుగుతున్నారు. మూలధాతువు లాంటి భాషాపదాల్ని ఎంచుకోవడం కంటే మనం మాండలికంలో రాయాలా? వద్దా? మా కులానికి సంబంధించిన భాషలో రాయాలా ? వద్దా? మా ప్రాంతానికి సంబంధించిన మా... ఈ చర్చ చాలా ఎక్కువగా జరుగుతుంది. నువ్వు బాగా రాయగలిగితే ఏ భాషలోనయినా రాయి మహానుభావా ఎవరు కాదన్నారు. ఏ భాషలోనయినా రాయి. ఎంత చిన్నదయినా రాయి, ఎంత పెద్దదయినా రాయి. ముందు అసలు రాయగలిగితే దానంతట అది రాత నడుస్తుంది. ఇన్ని ప్రశ్నలు వేసుకోవడం బుర్రపగలు కొట్టుకోవలసినటు వంటి అవసరం అంతగా వుండదు. రాసిన తర్వాత ఎవరిరైనా అనుభవంగల వాళ్ళకు చూపిస్తే ఆయన కొంచెం సలహాలు ఇస్తారు. ఈ విషయంలో కూడా ఒక అభిప్రాయం వుంది.

దత్తాదుర్గాప్రసాద్ అని కథారచయిత చాలా బహుమతులు పొందినాయన చాలా ఏళ్ళకిందట కథలు ఎలా రాస్తారు అనే పుస్తకం రాశారు. అది చాలామంది చదివేవాళ్ళు. ఆయన మీరు కథ రాయండి కాని దాన్ని చూపించకండి అని చెప్తాడు. చూపించారు అంటే ఇదేం బాలేదు అని వంద సలహాలు చెప్తారు. మీరు పత్రికకి పంపించండి నచ్చితే వేసుకుంటాడు లేకపోతే లేదు అని. కాని మన కథకులు అంత సంకుచితంగా వున్నారని నేను అనుకోవట్లేదు. చాలామంది సీనియర్లు కవులు, రచయితలు కొత్తవాళ్ళను ప్రోత్సహించటం, ఆదరించటం. లేకపోతే సాహితీస్రవంతి లాంటి సంస్థలు ఇవన్నీ వున్నాయి. అందుకని ఇందాకా నేను చెప్పినట్టుగా రాయాలి, నేను రాయాలి అని గాకుండా రాయండి. రాసేటటువంటి ఇతివృత్తాన్ని ముందు స్పష్టంగా ఎంచుకోండి. మళ్ళీ మధ్యలో విడదీయకండి.

రాష్ట్రంలో ఇప్పుడు ప్రాంతీయ సమస్య ప్రధాన మైంది. ప్రాంతీయ కోణంలో ఇప్పుడు రాస్తున్నారు. ఈ ప్రాంతీయ సమస్యకు ఈరోజు కాకపోయినా రేపయినా పరిష్కారం

లభిస్తుంది కదా! విదియ నాడు కనబడని చంద్రుడు తదియ నాడు తానే కనిపిస్తాడని అప్పుడు ఈ ఒక్క అంశం చుట్టూనే రాసినటువంటి సాహిత్యం దీని చుట్టూనే మునిగి తేలినవాళ్ళందరూ ఏమవుతారు. అసలు దేశానికి స్వాతంత్ర్యం రాకముందు రాసిన గురజాడ కథలూ మనకున్నాయి. స్వతంత్ర పోరాట కథలూ మనకున్నాయి. ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో ఉన్న కథలూ ఉన్నాయి. ఆంధ్ర తెలంగాణాగా ఉన్నప్పటి కథలూ ఉన్నాయి. హైదరాబాద్ రాష్ట్రంలో రాసినవి ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పటి కథలూ ఉన్నాయి. రేపొద్దున రెండు రాష్ట్రాలు ఏర్పడితే లేకపోతే ఇంకోవిధమైన దగ్గర్నుంచి అప్పుడు కూడా కథలు వున్నాయి. సాహిత్యం అనేది శాశ్వతంగా కొనసాగుతూ ఉంటుంది తప్ప కేవలం కాలాంతం___ఈ రోజే కాదుకదా! కాబట్టి సాహిత్యాన్ని ఈరోజుకే పరిమితం చేసి మనం ఆలోచించకూడదు. సాహిత్యమనేది ఒక సాగిపోయే నిరంతరమైన చిరంతనమైన విలువలు కలిగి వుంటుంది. నేను ఆంధ్రజ్యోతిలో నా కాలం గమనంలో అంబానీ అన్నదమ్ములు ఇద్దరూ పోట్లాడుకున్నారు అది రాయడానికి మహాభారతంతో మొదలుపెట్టాను.

ఏ కథలో ఏ శక్తులు ప్రధానంగా ఘర్షిస్తున్నాయి. ఈ కథలో తండ్రికి కొడుక్కి వైరుధ్యం ఉంది. ఈ కథలో అమెరికాకు, భారతదేశానికి వైరుధ్యం ఉంది. కార్పొరేట్లకు, స్థానిక ప్రజలకు వైరుధ్యం ఉంది. రోజుల్లో చాలా మంది అస్తిత్వవాదం అంటారు. ఎవరు కాదన్నారు. అసలు అస్తిత్వం అంటే ఏమిటి? ఏ మనిషి, ఏ బృందం విడిగా లేవు కాబట్టి మొత్తం సామాజిక చర్చల్లో చూడాల్సివస్తోంది. తర్వాత కొన్ని ప్రశ్నలు వచ్చాయి. నేను ముందే మీకు చెప్పినట్టుగా పత్రికల్లో వచ్చే విమర్శలు, వాదవివాదాల్నే మీరు గమనంలో ప్రధానంగా పెట్టుకోవల్సినంత అవసరం లేదు అనేది ఒకటి. రెండోది పత్రికల్లో ప్రచురించటం, అదికూడా మనం పంపిన వెంటనే ప్రచురించటం ఒకటే కూడా మీరు కొలబద్ధగా పెట్టుకోకూడదు. ఇది కూడా చాలా ముఖ్యమైంది. ఎందుకంటే పత్రికల వాళ్ళ దగ్గర నేను ఇందాక చెప్పినట్టుగా రోడ్డుమీద మన వెహికల్ ఒక్కటే కాదు చాలా వెహికల్స్ వుంటాయి.



రాజుగారి గంగాళంలో అందరూ నీళ్ళే పోసారు. వాళ్లు పాలు పోస్తారని వీళ్ళు. కాబట్టి చాలా కథలు అక్కడ వేరే ఎదురుచూస్తుంటాయి. రెండోది మనం చాలా గొప్ప కథ అని రాసింది ఉదాహరణకి ఒక ప్రేమికుడు ప్రేయసి కోసం తాగి మరణించాడని మీరు కథ రాస్తారు కానీ శరత్‌బాబు ఎప్పుడో దేవదాసు రాసాడనే విషయం మీకు గుర్తుండదు. కానీ అక్కడ చూసే సంపాదకుడికేమో ఆ విషయం తెలిసేవుంటుంది. కాబట్టి దేవదాసు కథ ఎప్పుడో వచ్చింది కదా! ఇంకోసారి చూద్దాం లే అంటాడు. మీరు ఒక వారం చూస్తారు, రెండు వారాలు చూస్తారు నాలుగు వారాలు చూసి ఇంత గొప్ప కథ ప్రచురించరా? రాంగోపాల్‌వర్మగారు ఆ మధ్య ప్రతిజ్ఞ చేసారు కదా! నేనింక తెలుగులో సినిమాలు తీయను అని అది కొంతవరకు మన అదృష్టం అనుకోవచ్చు...... అలాగే నేను ఇంక కథలే రాయను ఈ పత్రికలకు పంపను అని ఒక ప్రతిజ్ఞ పట్టడం వల్ల ఉపయోగం ఏమీ లేదు. మనం పంపిన కథేంటీ ఏ సమయంలో పంపాము ఆ తరువాత వచ్చిన కథలు మన కథకంటే మెరుగ్గా వున్నాయా? లేదా? ఇవన్నీ మనం పరిశీలించుకోవాల్సిన అవసరం వుంది. వాటినించి నేర్చుకోవాలి. ఇవన్నీ కోర్కెలు. మంచివే కాని కొంచెం కష్టం. మన పని మనం చేసుకుంటూ పోవాలి. మన స్పందనని మనం అక్షరీకరిస్తుండాలి. కథా ప్రస్థానం కొనసాగిస్తూ ఉండాలి. అందరికీ నమస్కారాలు.

***చాలామంది సీనియర్లు కవులు, రచయితలు కొత్తవాళ్ళను ప్రోత్సహించటం, ఆదరించటం. లేకపోతే సాహితీస్రవంతి లాంటి సంస్థలు ఇవన్నీ వున్నాయి. అందుకని ఇందాకా నేను చెప్పినట్టుగా రాయాలి, నేను రాయాలి అని గాకుండా రాయండి.***

# ౨





★ స్వీయ కథా విశ్లేషణ

# కుప్పిలి పద్మ

# టీ జంక్షన్

నగరం జీవితంలో నిలదొక్కుకునే అమ్మాయిల జీవితాల్లోని సంక్లిష్టతని అధిగమించటానికి ఆ జీవితాల్లో వారు వెలిగించుకొనే జీవన దీపాలు, ఆ వెలుగులో మిలమిలలాడే వర్తమానం, వేలవేల కాంతుల్లో మెరిసే భవిష్యత్‌ని రాసాను.

కథలు వినటమంటే భలే యిష్టం చిన్నప్పటి నుంచి సప్తసముద్రాలు దాటి రాజకుమారి కోసం ప్రయాణించే సాహసవంతుల కథలని వినటం చాలా ఉత్సాహంగా వుండేది. పేదరాసి పెద్దమ్మ కథలు ఆసక్తిగా వినేదాన్ని, సాయంకాలపు పండిన నారింజరంగు ఆకాశాన్ని చూపి పేదరాశి పెద్దమ్మ కుంకుమ ఆరబోసిందని విన్నప్పటి నుంచి పేదరాసి పెద్దమ్మంటే కుతూహలం. అలానే దయ్యం కథలంటే చెప్పలేనంత సరదా. దెయ్యాలంటే భయం లేకుండా ఆ కథలని అంతగా యిష్టపడటానికి కారణం చందమామ పత్రిక. పసితనంలో చందమామని చదివే అవకాశం లేకపోయివుంటే దెయ్యమంటే నా మనసు యెలా ఆలోచించేదో నేనిప్పుడు ఊహించలేను.

చందమామ పత్రిక నా పసిమనసుని ఎన్నెన్ని సుందర లోకాల చుట్టూ తిప్పిందో, ఎన్నెన్ని ఊహా ఉద్యానవనాల్లో విహరింప చేసిందో, రెక్కల గుర్రాలెక్కి వెన్నెలవిహారాలు చేయించిందో, నేలమీదా కాళ్లు ఆన్చి జీవితవిలువలని యెలా చూడాలో చెప్పిన చందమామకి ప్రేమికురాలిని. చందమామకి కృతజ్ఞతలు.

ఆ పసిచదువరి అలా అలా మరికాస్త పెద్ద కథలు మరింత పెద్దపెద్ద పుస్తకాలు చదువుతూ ఎన్నెన్నో ప్రపంచాలని, వ్యక్తుల జీవితాలని చూస్తూ చూస్తూ అలా వచ్చిన ఆలోచనలని, చూస్తున్న చుట్టూ ప్రపంచాన్ని కవితలుగా, కథలుగా రాయటం మొదలుపెట్టినప్పుడు ఎంత సంతోషమేసిందో, నా భావాలని ఎప్పుడు అచ్చులో చూసుకొన్నా నాకెంతో సంబరంగా వుంటుంది.

అలానే ఎన్నో ఏళ్లుగా కొన్ని సమస్యలు ఎప్పటికీ తగ్గకపోవటమే కాకుండా అవి మరింతగా మానవ సమాజాన్ని బాధిస్తుంటే చాలా దుఃఖంగా అనిపిస్తుంది. తిరిగి తిరిగి అవే సమస్యలపై మరింత బలంగా రాయాల్సిన అవసరాన్ని యీ సమాజమే కలిగిస్తుంది. అలాంటి సమస్యలో ఒక ముఖ్యమైన సమస్య స్త్రీలపై ఇంటా బయటా జరుగుతున్న హింస.

అలాంటి సమస్య మీద యీ మధ్య రాసిన కథ టీ జంక్షన్.

నేనెప్పుడో చిన్నప్పుడు చిన్ని చిన్ని కథలని పత్రికలకి రాసేదాన్ని. అంత చిన్న కథని చాలాకాలంగా రాయలేదు. ఎంచుకొన్న సబ్జెక్ట్‌కి అవసరమైనమేర చాలా చిన్ని చిన్ని డిటైల్స్ యివ్వటం... క్యారెక్టరైజేషన్ని బిల్డ్ చేయటం దాదాపు కథలన్ని పెద్దగా లేదా మీడియమ్ సైజ్‌లో రావటం జరుగుతోంది.

సాక్షిలో వచ్చిన టి జంక్షన్ కథ అచ్చులో బొమ్మతో కలిపి రెండు పేజీల కథ.



ప్రతి కథకి వున్నట్టే యీ టి జంక్షన్ కథకి కొన్ని నేపధ్యాలున్నాయి.

మొదటిది గత మూడు నాలుగేళ్లుగా పబ్లిక్ ప్లేసేస్‌లో స్త్రీలు కనిపించటం మీద అనేకానేక అభిప్రాయా లున్నాయి. అనేకానేక వాదోపవాదా లున్నాయి. ఏదైనా బాధించే సంఘటన జరగ్గానే కొంతమంది సెంటిమెంటల్‌గా కొన్ని మాటలు చెపుతారు. ఉదాహరణకి ఎప్పుడైతే అర్ధరాత్రి స్త్రీలు ఒంటరిగా నిర్భయంగా సంచరించగలుగుతారో అప్పుడు స్వాతంత్ర్యం వచ్చిందనే మాటలని పదేపదే చెపుతారు. లేదా స్త్రీలు తమ సేఫ్టీ కోసమే అర్ధరాత్రి బయటకి రాకూడదంటారు. యిలా అనేకానేక మాటలు వినిపిస్తుంటాయి.

**అసలు స్త్రీలు రాత్రి పూట చేసే ఉద్యోగాల్లోకి ప్రవేశించటం వెనుక వున్న ఆర్థిక నేపథ్యం ఏమిటంటే గ్లోబలైజేషన్ ప్రవేశించటం. అప్పుడు చిన్ని చిన్న ఊర్ల నుండి అధిక సంఖ్యలో స్త్రీలు నగరాల్లో ఉద్యోగం చెయ్యటానికి నగరాలకి వచ్చారు. రాత్రిపూట స్త్రీలు ఉద్యోగాలు చెయ్యాల్సిన పరిస్థితి వచ్చింది. స్త్రీలు క్యాబ్స్‌లో ఉద్యోగాలకి రాత్రిపూట వెళ్లిరావటం మొదలయింది.**

అసలు స్త్రీలు రాత్రి పూట చేసే ఉద్యోగాల్లోకి ప్రవేశించటం వెనుక వున్న ఆర్థిక నేపథ్యం ఏమిటంటే గ్లోబలైజేషన్ ప్రవేశించటం. అప్పుడు చిన్ని చిన్న ఊర్ల నుండి అధిక సంఖ్యలో స్త్రీలు నగరాల్లో ఉద్యోగం చెయ్యటానికి నగరాలకి వచ్చారు. రాత్రిపూట స్త్రీలు ఉద్యోగాలు చెయ్యాల్సిన పరిస్థితి వచ్చింది. స్త్రీలు క్యాబ్స్‌లో ఉద్యోగాలకి రాత్రిపూట వెళ్లిరావటం మొదలయింది.

నగరీకరణలో భాగంగా నైట్‌లైఫ్ వుండాలి. లేకపోతే సిటికి గ్లోబల్‌నేచర్ వుండదన్నది బలంగా ముందుకొచ్చిన అంశం. దాంతో అర్బన్ డిజైన్ పాలసీల రూపంలో వచ్చింది. మరోవైపు వచ్చిన మరో పెద్ద మార్పు కల్చరల్ మార్పు. అంటే బార్స్, పబ్స్, నైట్‌బజార్స్ వుంటాయి. పబ్స్‌లో ఆట పాటలుంటాయి. స్త్రీలు పబ్స్‌కి, బార్స్‌కి వెళ్లటం మెల్లమెల్లగా మొదలయింది. స్త్రీలని అధిక సంఖ్యలో ఆకర్షించడానికి పబ్స్‌లో లేడీస్ డే, లేడీస్ స్పెషల్ అని మొదలయింది. ఫ్రీగా బయటకి వెళ్లటం మొదలయింది. మారుతోన్న కాలంలో స్త్రీలు అనేక రంగాల్లోని ఉద్యోగాల్లోకి ప్రవేశించారు. ఒకప్పుడు5 లేదా 6 గంటలకి ఉద్యోగం నుంచి బయటపడి ఇంటికి బయలుదేరే వారు మహిళా ఉద్యోగులు. ఆ పరిస్థితి మారిపోయింది. రాత్రి తొమ్మిది, పది గంటల వరకు కూడా పనిచేసే సెక్టార్స్ వున్నాయి. అలానే రోడ్లని శుభ్రపరిచే ఉద్యోగాల్లోకి స్త్రీలు ప్రవేశించారు. నగరంలో మెహబూబ్ కా మెహందిని తీసేసినప్పట్నుంచి సెక్స్ వర్కర్స్ అర్థరాత్రి వేళ రోడ్లమీద పనిచేస్తున్నారు.

నగరంలో స్త్రీల సంచారమన్నది పెద్ద ఎత్తున అవసరమైనప్పుడు, పబ్లిక్ స్పేస్‌ని స్త్రీలు పెద్ద ఎత్తున ఆక్యుపై చేయాల్సిన పరిస్థితి వచ్చింది. చాలా మంది స్త్రీల జీవనాధారం పబ్లిక్‌స్పేస్‌లో వుండటం మొదలయింది. ఎప్పుడైతే స్త్రీలు రాత్రివేళల చేసే ఉద్యోగాల్లోకి వచ్చారో అప్పుడు ఆర్థిక స్థితిలో మార్పు వచ్చింది.

అలానే స్త్రీల జీవితాల్లో అనేక రకాలైన కల్చరల్ మార్పులు చాలా జరిగాయ్.

స్త్రీల జీవితాల్లో ఆర్థికంగా, కల్చరల్‌గా పెద్ద ఎత్తున వస్తున్న మార్పులపై చాలా రకాలైన రియాక్షన్స్ వచ్చాయి. స్త్రీల సేఫ్టీ మీదా, మారిపోతున్న కల్చర్ మీద అనేకానేక ప్రశ్నలు వచ్చాయి.

అసలు తమ జీవనాధారం యిలా పబ్లిక్ ప్లేసెస్‌తో ఎందుకు ముడిపడి వుంది. ఏ మాత్రం భద్రత లేని పబ్లిక్ ప్లేసెస్‌లో ఎందుకు పనిచెయ్యాల్సి వస్తుంది... యిలా ప్రశ్నించే స్త్రీల గొంతుకలతో పాటు వినపడని గొంతులు కూడా కొన్ని వున్నాయి. యివి పబ్లిక్ డిస్కషన్‌లోకి పెద్దగా రాలేదు. అంతే

కాకుండా పబ్లిక్ స్పేస్ అసలు స్త్రీల గురించి మనకున్న అవగాహన యేంటి... యివన్నీ ప్రశ్నలే.

యిలాంటి ప్రశ్నలు నిండిన వాయిస్‌లు బయటికి రావటం లేదని తెలుస్తుంది. ఎలా యీ స్వరాలు వినిపిస్తాయో కూడా తెలీదు.

మొదట్నుంచి ఏ విషయాన్ని తీసుకుని కథ రాసినా నా ప్రపంచదృక్పథం ఫెమినిస్ట్ ఫిలాసఫితో మిళితమైన మార్క్సిస్ట్ ఆలోచనసరళి నుంచి వుంటూ ప్రకృతి మనిషికి వున్న గాఢమైన అనుబంధాన్ని, సౌందర్యాన్ని మిళితం చేసి కథలని రాస్తుంటాను. దాదాపు నా కథలన్నీ అర్బన్ వాతావరణంలోనే వుంటాయి. నగర జీవితంలో నిలదొక్కుకునే అమ్మాయిల జీవితాల్లోని సంక్లిష్టతని అధిగమించటానికి ఆ జీవితాల్లో వారు వెలిగించుకొనే జీవన దీపాలు, ఆ వెలుగులో మిలమిలలాడే వర్తమానం, వేలవేల కాంతుల్లో మెరిసే భవిష్యత్‌ని రాసాను.



**ప్రపంచీకరణ ప్రపంచ విధానమే అయిపోయిన యీ సమయంలో నగరీకరణ, ప్రపంచీకరణ నేపథ్యంలో అనేక కథలని రాసిన నాకు, నాలోని అలానే నా చుట్టూ వున్న స్త్రీలలో బయటకి వినిపించని గొంతుల మీద కథ రాయాలనిపించింది. అసలు పబ్లిక్ స్పేస్‌లో మా స్పేస్ ఏంటి అని ఆలోచనలు ముసురు పట్టినట్టు నన్ను వదలటం లేదు. అప్పుడొచ్చింది టి జంక్షన్**

అలానే ప్రపంచీకరణ ఆరంభసమయంలో రాసిన ఇన్‌స్టెంట్ లైఫ్ కథలోని అరుంధతి తమ జీవితాల్లోని యిరుకుకి ప్రధాన కారణాలని మాట్లాడుతున్నప్పుడు తన కూతురుతో మునీరతో "గ్లోబలైజేషన్ బ్యాంక్‌ల దగ్గరే ఆగిపోలేదమ్మా బెడ్‌రూంలోకి వచ్చేసింది" అని అంటుంది. ప్రపంచీకరణ ప్రపంచ విధానమే అయిపోయిన యీ సమయంలో నగరీకరణ, ప్రపంచీకరణ నేపథ్యంలో అనేక కథలని రాసిన నాకు, నాలోని అలానే నా చుట్టూ వున్న స్త్రీలలో బయటకి వినిపించని గొంతుల మీద కథ రాయాలనిపించింది. అసలు పబ్లిక్ స్పేస్‌లో మా స్పేస్ ఏంటి అని ఆలోచనలు ముసురు పట్టినట్టు నన్ను వదలటం లేదు.

అప్పుడొచ్చింది టీ జంక్షన్

అసలు కథ రాయాలంటే హీరోయిన్ హీరో వుండాలి. వాళ్ల మాటలు వినిపించాలి. వాళ్లు ఎలా ఆలోచిస్తారో చెప్పాలి. వాళ్ళ నేపథ్యాలు రాయాలి. అసలు యివన్నీ పెట్టుకొంటే కథలో మాట్లాడాలనుకొన్న విషయం బలంగా వస్తుందా రాదనే సంశయం ఒకటి.

కురవాల్సినది వానో, ముసురో, జడివానో, తుఫానో నిర్ణయించుకొన్న మబ్బులు ఆకాశానికి చెప్పేస్తే ఆకాశం కురిపించడానికి సిద్ధమైనట్టు చెప్పాలనుకున్న విషయాన్ని ఎలా చెప్పబోతున్నానోననే నిర్ణయంలో ఒక స్పష్టత వచ్చాక అంతే వడివడిగా రాసేసాను.

తీసుకొన్న సబ్జెక్ట్‌కి యీ నగరంలో అమీర్‌పేట్ జంక్షన్ బాగ కుదురుతుందనిపించింది. కథంతా రాత్రివేళ జరుగుతుంది. రాత్రివేళ ట్రాఫిక్ వేగమంతా ఆగిపోయాక ఆ ప్రాంతమంతా ఎలా వుంటుంది. ఆ సమయంలో ఎవరెవరు రోడ్డు మీద కనిపిస్తారు. యేయే పనులు చేసే వాళ్లుంటారు. యేయే పనుల మీద మనుష్యులు బయటికి వస్తుంటారు. ఆ సమయంలో వీధి దీపాలు ఎలాంటి వెలుగు నిస్తుంటాయి. యిలాంటి విషయాలని గమనించి వాస్తవానికి చేరువగా ఆ కథలో పొందుపర్చాను. కథకి వ్యాసానికి వున్న తేడా తెలిస్తే, మన గమనింపులోని వాస్తవాలని పాత్రలని ఎక్కడ అవసరమో అక్కడ కథలో సమయానుకూలంగా పాత్రాను గుణంగా పొందుపరుస్తాం.

తీసుకున్న సబ్జెక్ట్ ఏంటంటే రాత్రిపూట ఒక అమ్మాయి ఒంటరిగా రోడ్డు మీద నిలబడి వుంటే ఆ సమయంలో ఆ అమ్మాయిని చూసిన వాళ్లు ఏమనుకుంటారు. వారి ఆలోచనా ధోరణి ఎలా వుంటుంది. వాళ్ల ప్రవర్తన ఎలా వుంటుంది. అసలు ఆ అమ్మాయి అలా నిలబడటానికి కారణాలని ఎవరెవరు ఏమేమి చెప్పుకుంటారు. మాట్లాడే భాష ఎలా వుంటుంది. బయటకి అనే మాటలేంటి... లోలోపల వ్యక్తీకరణలేంటి... యిలా అన్ని కోణాల నుంచి ఆలోచించి పరిశీలించి రాయటం జరిగింది.

రాత్రివేళ అప్పుడప్పుడు తిరిగే సిటి బస్సులు, రోడ్డు వూడ్చే స్త్రీలు, టీ బండి, పెట్రోలింగ్ తిరిగే రక్షక్ వాహనం, రాత్రులు పని ముగించుకొని ఇంటికి వెళ్ళే వివిధ రకాల ఉద్యోగస్థులు, తాగి ఫన్ కోసం డ్రైవింగ్‌కి వచ్చే యువకులు, బాగ పొద్దు పోయాక రాత్రివేళ దొరికే ఆహారాన్ని కొనుక్కొని తినటానికి బయలుదేరే మొగవాళ్లు, సెక్స్ వర్కర్స్ యిలా వివిధ రకాల వ్యక్తులని తీసుకొన్నాను.



యిప్పటి వరకు నేను రాసిన కథల్లో ప్రధానపాత్ర స్త్రీ గొంతు చాలా ప్రస్ఫుటంగా వినిపిస్తుంటుంది. ఆ తరువాతే మిగిలిన గొంతులు వినిపిస్తుంటాయి. అయితే యీ కథలో ప్రధాన పాత్రకి గొంతు లేదు. ఆ గొంతుని నొక్కేటప్పటికి మిగిలిన గొంతులు చాలా స్పష్టంగా వినిపించటం మొదలయింది. ఆ అమ్మాయి గొంతు మనకి చాలా దగ్గరగా వినిపించసాగింది. యీ కథలో టెక్నిక్‌లో ఓ చిన్న ప్రయోగం జరిగింది. యీ టెక్నిక్ వలన ప్రతి పాత్ర మీద వెలుతురు ప్రసరించింది. ఆ రోడ్డు మీద ప్రయాణిస్తున్న వాళ్లు, టీ బండి అతను, రోడ్లు వూడ్చే స్త్రీలు, సందులోంచి వచ్చిన అమ్మాయి, బట్టల దుకాణంలో పనిచేసే అబ్బాయిలు, కార్లో కుర్రాళ్లు యిలా ప్రతి ఒక్కరి వాయిస్ స్పష్టంగా వినిపించాయి. చకచకా దృశ్యాలు కదిలిపోయాయి. కథలో చమత్కారం వుంది.

**చీకటి గదిలో దీపం వెలిగించినప్పుడు అందులోని వస్తువులు ఒక్కొక్కటిగా కనిపిస్తాయి. మనం ఎంత దీపం వెలిగిస్తే అంత వెలుగు ప్రసరించి అంతే స్పష్టంగా మనకి అందులోని వస్తువులు కనిపిస్తాయి. కథ అంతే... మన దగ్గర వున్న విషయంపై మనం ఎంత వెలుగుని ప్రసరిస్తామన్న దాని మీద మనం రకరకాల అంశాలని వెలికితీస్తాం.**



అయితే యీ కథ రాయటానికి ముందు నాలో అనేక సందిగ్ధాలున్నాయి. అందులో ఒకటి ఎప్పుడు టెక్నిక్‌తో కథలు రాయని నాకు యిలా రాస్తే యెలా వుంటుందోననే ఆలోచన. కాస్త పెద్ద కథలు రాసే నేను యీ చిన్ని కథలో విషయాన్ని సమగ్రంగా చెప్పగలనా లేదా అనిపించింది. అంతేకాకుండా చాలా చిన్ని చిన్ని డిటైల్స్‌ని కూడా పొందుపరుస్తూ కథలు రాసే నాకు యేమైనా సరే యీ కథలో ఆ డిటైలింగ్ మిస్ కాకుండా రాయాలనే అనిపించింది. నా ప్రధాన పాత్ర వాయిస్ యిందులో అస్సలు వినిపించదు.... ఆ పాత్ర ఓ బొమ్మ... కానీ పాత్ర సంఘర్షణ పాఠకుల మనసులకి తాకాలని నేను కోరుకొంది జరుగుతుందా లేదానే చిన్న సందేహం వుండేది. అసలు పాఠకులు యీ కథని ఎలా తీసుకొంటారనే కుతూహలం వుంది.

యీ కథకి వచ్చిన రెస్పాన్స్ చూసి ఆశ్చర్యపోయాను. ఒక్కొక్కరి హృదయాలలో యీ విషయంగా వుండే బాధ, అవమానం, కన్సర్న్ పాఠకులు వ్యక్తపరిచిన తీరు ఎంతో ప్రశంసనీయం. అవును పబ్లిక్ ప్లేసెస్‌లో మా స్పేస్ ఏంటి? అని అడిగిన టీ జంక్షన్ కథ చూడటానికి చిన్ని కథ. నేపథ్యం చాలా విస్తారమైంది.

చీకటి గదిలో దీపం వెలిగించినప్పుడు అందులోని వస్తువులు ఒక్కొక్కటిగా కనిపిస్తాయి. మనం ఎంత దీపం వెలిగిస్తే అంత వెలుగు ప్రసరించి అంతే స్పష్టంగా మనకి అందులోని వస్తువులు కనిపిస్తాయి. కథ అంతే... మన దగ్గర వున్న విషయంపై మనం ఎంత వెలుగుని ప్రసరిస్తామన్న దాని మీద మనం రకరకాల అంశాలని వెలికితీస్తాం. యీ కథపై నేను ఎంత మేర లైట్‌ని ఫోకస్ చేసానో అంత మేర విషయాలు వెలుగులోకి వచ్చాయి. మరింత పెద్ద లైట్‌ని, ఫోకస్ చేసుంటే మరిన్ని విషయాలు వెలుగులోకి వచ్చి వుండేవి.

కథ చిన్నదైనా పెద్దదైనా హోంవర్క్ నిజాయితీగా, సోమరితనం లేకుండా యిష్టంగా చెయ్యటం, కథని ప్రేమగా రాసుకోవటం నాకలవాటు. మొదటిసారి అచ్చులో చూసుకొన్నప్పుడు మనసెంతో సంతోషంగా గెంతులేసిందో యిప్పటికి అచ్చులో కథని చూసుకొన్న ప్రతీసారి మనసలానే సంతోషంతో గెంతుతుంది.



★ స్వీయ కథా విశ్లేషణ

# యాళ్ల అచ్యుతరామయ్య



## గుప్పెడు గింజలు



*కథ రాయడాన్ని ఆషామాషీగా తీసుకోకూడదు. అది ఒక సామాజిక చర్య. ఎంతో నిబద్ధతతో, నిజాయితీతో చేపట్టాల్సిన పవిత్ర కార్యక్రమం. లెనిన్ చనిపోవడానికి ముందు భార్యతో జాక్ లండన్ కథలను చదివి వినిపించుకున్నాడంటే కథా సాహిత్యాన్నికున్న స్థానం ఏమిటో అర్థమవుతుంది.*

ఒక కథను పూర్తిగా చదివిన తర్వాతే విశ్లేషణ చేయడం ధర్మం. కానీ సమయానుభావం వల్ల ఇక్కడ కథను టూకీగానే పరిచయం చేయాల్సి వస్తోంది.

పావురాలు గుంపుగా వచ్చి బియ్యం లారీపై వాలుతూ ఉంటే 'నా క్కూడా రెక్కలుంటే ఎంత బావున్ను – ఓ పూటకి సరిపడా గింజల్ని మూటకట్టుకుని వచ్చేవోన్ని' అనుకున్నాడు చంటి. వాడికి 13 ఏళ్లు నిండాయంటే నమ్మడం కష్టమే. ఆ వయసుకు తగ్గ ఎదుగుదల లేదు. తిండికి మొహం వాచి, ప్రభుత్వ ఆహార గిడ్డంగి పరిసరాలలో టీ అమ్ముకుంటూ కాలం వెళ్లదీస్తున్నాడు.

గిడ్డంగి దగ్గరుండే వాచ్‌మెన్ సూర్యారావుకీ, అక్కడ పనిచేసే మేస్త్రీ గంగరాజుకీ చంటి అంటే జాలి. చంటికి తండ్రి ఎప్పుడో చనిపోయేడు. తల్లీ, కొడుకుల అరకొర సంపాదనతో రోజులు గడవడం కష్టంగా ఉంది.

ఓ పక్క ఆకలితో జనం చస్తూ ఉంటే, ఈ తిండి గింజలన్నిటినీ గిడ్డంగిలో దాయడమెందుకని చంటి గంగరాజును అడుగుతాడు. ప్రభుత్వం తిండిగింజల్ని కొనుగోలు చేయడం వలన మిల్లర్లూ, అధికారులూ బాగుపడటం తప్ప, పేదోళ్లకి ఉపయోగపడింది లేదనీ, ఎలుకలు వలన తిండిగింజలు చెడిపోతే, వాటిని గిడ్డంగి వాళ్లు సముద్రంలో పారవేస్తే, సుప్రీంకోర్టు చివాట్లు పెట్టిందని గంగరాజు చెబుతాడు.

చీకటి పడేసరికి చంటి ఇంటికి చేరుకుంటాడు. వాళ్లుండే రేకుల షెడ్డులో నుండి ఎవరో మగాడు బయటకు వస్తాడు. అది కాస్తా కొడుకు కంట్లోపడడం వలన, తల్లి ఏడుస్తుంది. 'అమ్మా, ఏడవకే' అంటూ చంటి వెక్కి, వెక్కి, ఏడుస్తాడు. తల్లి కొంత సేపటికి తేరుకుని గుడిసెలో గుప్పెడు గింజలు కూడా లేవురా... ఏ దారీ లేకనే.... ఇలా అంటూ బాధపడుతుంది.

'అమ్మని కష్టపెట్టకూడదు. తిండికి సరిపడే గింజల్ని నేనే సంపాదించాల' అనుకుంటాడు చంటి. తెల్లవారకుండానే చీకట్లో ఆహారగిడ్డంగిని చేరుకుంటాడు. గిడ్డంగి లోపల ఖాళీ లేక, ఆరుబయట బియ్యం బస్తాలను పేర్చి, వాటిపై తార్పలిన్‌తో కప్పి ఉంచారు. చంటి ఆ కవర్ కిందకి చేరి, ఓ ప్లాస్టిక్ సంచిలోకి బియ్యం పట్టుకుంటుంటే బస్తాలు ఒరిగిపోయి, చంటి మీద పడిపోయాయి. వాడి శరీరం మొత్తం బస్తాల కింద కూరుకుపోయింది.

తెల్లవారాక వాచ్‌మెన్ సూర్యారావు, గస్తీ తిరుగుతుంటే – బస్తాల మధ్యలో నుండి ఓ చిన్న చేయి బయటికి వచ్చి ఉంటుంది. గంగరాజు సాయంతో బస్తాలను తొలగిస్తారు. ఆ

పిల్లాడు ఎవరో కాదు - చంటేనని తెలుస్తుంది. ఇద్దరూ ఎంతో ఆందోళనకి గురవుతారు. గంగరాజు చంటిని చేతుల్లోకి తీసుకుని డాక్టరు దగ్గరకు పరుగుతీస్తాడు. నేలమీద గింజలేరుకుంటున్న పావురాళ్ళ గుంపు చెదిరి, ఒక్కసారిగా ఆకాశంలోకి ఎగిరింది.

ఈ కథ ఆంధ్రజ్యోతి నవ్య వీక్లీ (29-3-2009) లో ప్రచురింపబడింది.

**కథా విశ్లేషణ :**

పావురాల గుంపు లారీపై వాలడంతో కథ ప్రారంభమై, పావురాల గుంపు ఆకాశంలోకి ఎగరడంతో ముగుస్తుంది. ఈ విధంగా ఆద్యంతాల (ప్రారంభం, ముగింపు) మధ్య సమన్వయం జరిగింది. దీనివలన కథా శిల్పం ఒద్దికగా ఉంటుంది. (ఈ సూత్రాన్ని అన్ని కథలలోనూ పాటించడం సాధ్యం కాక పోవచ్చు ననుకోండి!)



ఇక్కడ పావురాళ్లను సింబాలిక్‌గా తీసుకోవడం జరిగింది. పక్షులకు ఆకలి వేయడం, పరిసరాలలోని తిండిగింజల్ని ఏరుకుని తినడమనేది ప్రకృతి సహజం. కానీ... దీనికి విరుద్ధంగా నేటి సమాజంలో జరుగుతోంది. రోజంతా కష్టపడే వాళ్లకి గుప్పెడు గింజలు కూడా దొరకని పరిస్థితి ఒక వైపు, ఏ మాత్రం శ్రమపడని కొద్దిమంది అధీనంలో తిండిగింజలు మురిగిపోవడం మరోవైపూ జరుగుతోంది. జనాభా మొత్తానికి సరిపడే తిండిగింజల ఉత్పత్తి జరుగుతున్నా వాటిని బయట మార్కెట్లోకి విడుదల చేస్తే - ధరలు తగ్గిపోయి, లాభాలు పడిపోతాయని పెట్టుబడిదారులు, వాళ్ళకి కొమ్ముకాసే ప్రభుత్వాలు భావిస్తాయి. అందుకనే తిండిగింజల్ని సముద్రంలో పారవేసేంత - అమానవీయ సంఘటనలు జరుగుతున్నాయి.

> ఇక్కడ పావురాళ్లను సింబాలిక్‌గా తీసుకోవడం జరిగింది. పక్షులకు ఆకలివేయడం, పరిసరాలలోని తిండిగింజల్ని ఏరుకుని తినడమనేది ప్రకృతి సహజం. కానీ... దీనికి విరుద్ధంగా నేటి సమాజంలో జరుగుతోంది. రోజంతా కష్టపడే వాళ్లకి గుప్పెడు గింజలు కూడా దొరకని పరిస్థితి ఒక వైపు, ఏ మాత్రం శ్రమపడని కొద్దిమంది అధీనంలో తిండిగింజలు మురిగిపోవడం మరోవైపూ జరుగుతోంది.

ఈ సామాజిక వాస్తవాన్ని కళాత్మకంగా ఆవిష్కరించడమే ఈ కథ లక్ష్యం.

కథ రాయడానికి ముందే రచయిత మనస్సులో పాత్రల స్వరూప, స్వభావాలూ, సంఘటనల వివరాలూ, రూపుదిద్దుకుని ఉంటాయి. వీటిని అన్నిటినీ కాగితం మీదకి బట్వాడ చేయకపోతే పాఠకుడికి అసంపూర్ణమైన సమాచారం వలన, అసంతృప్తి కలుగుతుంది. కాబట్టి - కథ ప్రారంభించాకా, వీలైనంత త్వరలో ఆ సంఘటన జరుగుతున్న స్థల కాలలు (ఈ కథ కాకినాడలో, ఉదయంపూట ప్రారంభమవుతుంది.) పాత్రల వయసు (చంటి 13 ఏళ్లవాడు) అతని వేషధారణ, మానసిక స్థితిగతులూ అన్నీ కళ్ళకు కట్టినట్లుగా చిత్రించాలి. ప్రాంతానికీ, పాత్రలకీ సరిపడే మాండలీకాన్ని ఎంచుకోవడం అవసరం.

వాస్తవ జీవితంలో ఆ బస్తాలక్రింద పడి ఓ అమ్మాయి చనిపోయింది. కథలో ఆ పాప చంటిగా మారింది. ప్రధాన పాత్రని చంపడం కంటే, బతికించడమే కరక్టు అనిపించింది. అతన్ని రక్షించుకునేది కూడా అతని వర్గం వాళ్లే కావాలనుకున్నాను. ఒక్కడే రచయిత ఎవరి పక్షానికి చెందిన వాడు అనేది స్పష్టమవుతుంది.

రచయిత నిజ జీవితంలోని ఓ సంఘటనకి నిజాయితీగా స్పందిస్తే, అంతే నిజాయితీతో దాన్ని కథలో చిత్రించగలగాలి. అప్పుడే పాఠకులు ఆ కథలో మమేకం కాగలుగుతారు.

కథ రాయడాన్ని ఆషామాషీగా తీసుకోకూడదు. అది ఒక సామాజిక చర్య. ఎంతో నిబద్ధతతో, నిజాయితీతో చేపట్టాల్సిన పవిత్ర కార్యక్రమం. లెనిన్ చనిపోవడానికి ముందు భార్యతో జాక్ లండన్ కథలను చదివి వినిపించుకున్నాడంటే కథా సాహిత్యాన్నికున్న స్థానం ఏమిటో అర్థమవుతుంది.

రోజు రోజుకీ జీవితంలో సంక్లిష్టత పెరుగుతోంది. రోజువారీ సమస్యలతో వేసారిపోతున్న ప్రజలకు వాళ్ల జీవితాల్లోని వైరుధ్యాలనీ, వాటి వెనుక దాగివున్న శక్తులనూ గమనించే తీరిక ఉండదు. అభ్యుదయ రచయితలు ఇటువంటి సున్నితమైన సామాజిక అంశాలను జాగ్రత్తగా గమనించి, వాటికి కళాత్మక రూపాన్ని జోడించి పాఠకులను ఆలోచింపజేయాలి.

అటువంటి ఆశయంతో వీరందరూ మంచి కథలు రాయగలరని ఆశిస్తున్నాను.

# కథాసూత్రాలు

ఒక సాహిత్య ప్రక్రియగా కథానిక వేరూనుకుంటున్న దశలో దీనిస్వరూప స్వభావాదులను గురించి సాహితీవేత్తలు పలువిధాల అభిప్రాయాలు వ్యక్తం చేశారు. ఒక్క కాలపరిమితికి సంబంధించిన అభిప్రాయాలను మాత్రమే తీసుకున్నా అవి పరస్పర విరుద్ధమై వుండడం గ్రహించవచ్చు. (1) చదవడానికి అరగంటనుంచి రెండు గంటల దాకా తీసుకునే గద్యరచనే కథానిక (2) కథ అనగా ఒక గ్రుక్కలో (లేదా ఒక సిటింగ్‌లో) చదివిముగించడానికి వీలైనది. (3) కథప్రవాహంలా సుదీర్ఘమైనదీగావచ్చు. లేదా ఈసఫ్ నీతి కథలా అత్యంత క్లుప్తమైనదీ కావచ్చు. వెరశీ కాలపరిమాణ మన్నది కథానికనొక చట్రంలో బిగించరాదన్నది సారాంశం.

అట్లాగే 'కథానిక' అనగా వాస్తవంగా జరిగిన విషయాన్ని గానీ, జరగడానికి వీలున్న విషయాన్ని గానీ వివరించేది, అన్న అభిప్రాయంతోనూ విభేదించిన వారులేకపోలేదు. కథానిక వాస్తవాన్ని దర్పణంలా ప్రతిబింబించనక్కరలేదనీ, వ్యంగ్యవైభవంతో అనుకోని మలుపులు తిరుగుతూ ఒక అతిశయ (విలక్షణ) వృత్తాంతాన్ని వివరించేదిగా వుండవచ్చునని కొందరు అభిప్రాయపడ్డారు.

కథారథానికి ఏకైక లక్ష్యమూ, ఏకైక ప్రయోజనమూ అనేవి రెండూ రెండు చక్రాలుగా వుండాలనుకోడంలో దాదాపుగా సాహితీ వేత్తలందరికీ ఏకీభావం కుదిరినట్టు తోస్తుంది. విజ్ఞులైన సాహితీ పరిశీలకులు అత్యంత ముఖ్యమైన కథాలక్షణాలుగా నాలుగింటిని పేర్కొన్నారు. (1) సంక్షిప్తత లేక క్లుప్తత (Brevity) (2) ఏకాగ్రత లేక ఏక సూత్రత లేక భావస్థిరత (Compataibility or Consistency) (3) విశ్వసనీయత (Dependability) (4) కథాన్యాయం లేక న్యాయసూక్ష్మత (Plausibility) 'ప్లాసిబిలిటీ' అన్న పదానికి 'మాటలసొంపు' అన్న అర్థం గూడా కనిపిస్తుంది. ('The Plausibility of the story made me believe him - వాని మాటలసొంపు నన్ను నమ్మేటట్టు చేసినది.' బ్రౌణ్య నిఘంటువు).

మొత్తంపైన రాజశాసనాలవంటి సాధికార లక్షణ గ్రంథాలేవీ లేకపోవడం వల్ల ఈ సాహిత్య ప్రక్రియకు మేలు చేకూరిందనే చెప్పాలి. సిద్ధాంతాల హద్దులకు ఒదిగి వుండవలసిన అవసరం లేకుండా ఇది స్వేచ్ఛగా విస్తరించడానికి వీలయింది. కథకు జనాదరణ లభించడంగానీ, సాహిత్య గౌరవం చేకూరడం గానీ కథకుడి కథనకౌశలం పైన మాత్రమే ఆధారపడి వుంటుంది. ప్రతిభావంతుడైన రచయిత చేతిలో సాదాసీదా కథావస్తువుగూడా అత్యద్భుత కళాఖండంగా రూపొందుతుంది. విస్తృతమైన లోకజ్ఞత, ఉన్నతమైన భావ సంస్కారం, మంచిని మానవతను ప్రేమించే హృదయనైర్మల్యం, అనేవి రచయితను విశిష్ట కథకుణ్ణిగా తీర్చిదిద్దగలుగుతున్నాయి. కథాపఠనమనగా పాఠకుడు కథకుడి దృక్పథంలో నుంచీ కంటికి కనిపించే బాహ్యప్రపంచంతోబాటు, బుద్ధికి మాత్రమే అందే పాత్రల మనోప్రపంచాన్ని గూడా తిలకించడమే! ఈ అనుభవాన్ని ఏ మేరకు ఒక మరపురాని మధురానుభవంగా దిద్దితీర్చగలదో, ఆ మేరకు కథానిక సాహిత్య ప్రపంచంలో కాంతులీనుతూ జీవించి వుంటుంది.

**- మధురాంతకం రాజారాం & సింగమనేని నారాయణ**

★ స్వీయ కథా విశ్లేషణ

# బారహమతుల్లా



## బా





> కథా వస్తువు, ఆ కథకు రూపం, ఆ కథలోని భాషా శైలులు గురించి పూర్తిగా ఆలోచించుకున్న తరువాతనే, ఏ ఒక్క కథ కూడా రాయలేదు. కథారచనకు ప్లానింగ్ చేయడం నా మైండ్‌కు సరిపడని విషయం. నేను రాసిన కథలన్నీ అవి ఎలా వస్తే అలా పూర్తి చేసినవే. పూర్తిగా రాసినాక ఒకటికి పదిసార్లు కొట్టివేసుకుంటూ, మార్చుకుంటూ, నానాయాతనలు పడుతూ, ఆ యాతనల్లోనే తృప్తిపడుతూ చాలా కష్టంగా రాసినవే.

మన కథారచనకు మనిల్లు, మన బజారు, మనూరు, మన పట్టణం, మన నగరం ప్రధానం కావాలి. మన కథలోని, స్థలాలు, పాత్రలు, వాతావరణము, భాష, యాస, సంఘటనలు, సన్నివేశాలు, మొదల్లు, ముగింపులు మొదలైనవన్నీ వీటిల్లో నుంచే రావాలి. మనం నడిచిన, నడుస్తున్న మన మట్టిలో నుంచి మన కథకు కావాల్సినవన్నీ తీసుకోవాలి. మనం పీల్చిన, పీలుస్తున్న గాలే మన కథకు ప్రాణవాయువు కావాలి. మన కథకు మన మట్టే, మన గాలే, మన మనుషులే ప్రాణం, రూపం, వస్తువు, అన్నీ కావాలి. పేగు సంబంధానికి మించిన ప్రేమ మన మట్టితో మనకుంటేనే అవన్నీ సాధ్యం. అప్పుడే గొప్ప కథ రాయగలం. అవే సహజంగా వచ్చేస్తాయి. అంతటి ప్రేమతో పాటు, మన మీద మన కళాత్మక శక్తియుక్తుల మీద మనకెంతో భరోసా, నమ్మకము, మితిమీరని గర్వమూ ఉండాలి. మంటో అన్నట్లు ప్రపంచలో ఇద్దరే ఇద్దరు మహాసృష్టికర్తలు ఉన్నారు. ఈ ఇద్దరిలో ఒకరు అల్లా అయితే, రెండోది నేనే (రచయిత) ఈ భావం సాదత్‌హసన్‌మంటో నిజాయితీగా అన్నమాటలు. నిజమైన ఒరిజినల్ రచయితలకు అంతరాంతరాల్లో ఉండే ఒక గ్రేట్‌ఫీలింగ్ ఇది. అందుకే రచయితలెవ్వరూ రాష్ట్రపతులు, రాజు, ఎవరైనాసరే తమకన్నా గొప్పవారిని ఏ మాత్రం ఇన్‌ఫీరియర్‌గా భావించరు.

కథా వస్తువు, ఆ కథకు రూపం, ఆ కథలోని భాషా శైలులు గురించి పూర్తిగా ఆలోచించుకున్న తరువాతనే, ఏ ఒక్క కథ కూడా రాయలేదు. కథారచనకు ప్లానింగ్ చేయడం నా మైండ్‌కు సరిపడని విషయం. నేను రాసిన కథలన్నీ అవి ఎలా వస్తే అలా పూర్తి చేసినవే. పూర్తిగా రాసినాక ఒకటికి పదిసార్లు కొట్టివేసుకుంటూ, మార్చుకుంటూ, నానాయాతనలు పడుతూ, ఆ యాతనల్లోనే తృప్తిపడుతూ చాలా కష్టంగా రాసినవే. అయినా ఎప్పుడూ ఏదో అసంపూర్ణ వెలితి ఆ కథలో కనిపిస్తుండేది. నా వ్యక్తీకరణలకు కొంత

తృప్తి చెందినా పూర్తి అసంతృప్తి ఉండేది కాదు. చాలా వరకు కథంటే ప్రధానంగా ఒక పాత్ర లేదంటే ఏదన్నా ఒక ఘటన.

**ఈ బా కథ ఒక పాత్ర ప్రధానంగా ఉన్న కథ**

కథలోని ప్రధాన పాత్రనో, సంఘటన్నో గట్టిగా పట్టుకుంటే వస్తువు, శిల్పము, శైలి, పాత్రలచిత్రణ, వాతావరణము, మంచి వ్యక్తీకరణలు మొదలైనవన్నీ వాటంతట అవే వచ్చేస్తాయి.



నా కథల్లో చాలా మందికి 'బా' నచ్చింది. స్వీయకథా విశ్లేషణకు ఆ కథనే ఎంచుకుంటే నేను రాయబోయే కథల్లో ఎక్కువ మందికి నచ్చే అంశాలేమిటో నాకూ, మీకూ తెలుస్తాయను కుంటాను.

**క్లుప్తంగా బా కథలోని విషయం ఇది**

ప్రకాశం జిల్లాలోని ఒక గ్రామంలో ఎద్దుబండి తోలుకునే ఒక పేద ముస్లిం కుటుంబజీవిత చిత్రణ ఈ కథ. అతని పేదరికం, వేషభాషలు, సమస్యలు, ఆలోచనలు, సంస్కృతి, సంస్కారం అన్నీ ఈ కథలో ఉన్నాయి. జంగ్లి అనే ఒక వ్యక్తి చిత్రణే ఈ కథ. ఇంకా ఈ కథలో చాలా వివరాలు చోటు చేసుకున్నాయి. దక్షిణ కోస్తా ప్రాంతపు ఒక పల్లె జీవితం ఎట్లా ఉంటుంది. అందులో కూడా పేదసాయిబుల కుటుంబాలు ఎలా ఉంటాయి, వాళ్ళు చనిపోతే చేసే కర్మకాండ ఎట్లా ఉంటుంది, వాళ్ళ ప్రాపంచిక దృక్పధాలు ఎలా ఉంటాయి. వాటికి సంబంధించిన పరిమితులకు, పేదరికాలకు ఏమన్నా సంబంధాలున్నాయా, ఇత్యాది ఎన్నో విషయాలకు సంబంధించిన వస్తువు ఈ కథలో మనం చూస్తాం. ఒక పెద్ద కథో, నవలికో రాయల్సినంత కాన్వాస్‌ను పది పేజీల కథగా రాసానేమో అని కూడా నాకు అప్పుడప్పుడు అనిపిస్తుంది. ద గ్రేట్ నవలా రచయిత కేశవరెడ్డి బాను నవలిక చేయమని కూడా అన్నాడు. కనుక కథావస్తువు పరిమితిని కూడా దృష్టిలో ఉంచుకుంటే మంచి కథలు ఎక్కువ రాయగలము అనిపిస్తుంది. కథకు మించిన వస్తువును తీసుకుని కథ రాయటం చాలా కష్టమైన పనని చాలా కష్టపడ్డాకా తెలిసింది. నా కథల్లోని బలహీనతా, బలమూ అదే అనుకుంటాను. బా అంటే నాయిన. మా బా చనిపోయాక చాలాకాలం నన్ను ఆయన జ్ఞాపకాలు వెంటాడాయి. వాటి నుంచి బయటపడే ఔట్‌లెట్ ఈ కథ. ఆ సమయమూ, ఆ సందర్భమూ ఈ కథ మంచిగా రావటానికి ఒక కారణమను కుంటాను. నా బా కథ నిజంగా మా బా కథనే. కాకుంటే దాదా, గలాట, సింగయ్యలాంటి ఆయన దోస్తుల జీవితం కూడా కొంత చోటు చేసుకుంది. వాళ్ళందరూ ఎద్దుబండి తోలి బాడుగ డబ్బుల్తో కుటుంబాలను నెట్టుకొచ్చినవాళ్ళే. కథారూపం మనం ప్లాన్ చేసినా చేయకపోయినా సహజంగా ఏదో ఒక నిర్మాణం జరిగిపోతుంది. ఇందులో ఒక కొడుకు పాత్ర కథ చెప్తుంది. తన తండ్రి జనాజాను శవపేటికను ఇంటి నుంచి మసీదుకు, మసీదు నుంచి ఖబరస్తాన్‌కు తీసుకుపోయి ఖననం చేసి తిరిగి ఇంటికి చేరటం ఈ కథా శిల్పం. శిల్ప నిర్మాణంలో కొన్ని సూక్ష్మ విషయాలు కూడా ఒక్కోసారి పాఠకుల్ని ఆకట్టుకుంటాయి. నేను ఆలోచించి రాయలేదు. ఇద్దరు ముగ్గురు మంచి విమర్శక మిత్రులు నాతో అన్న మాటలివి. నీ బా కథలో ముగ్గురు తండ్రులున్నారు. ఒకరు మీ తాత పెద్దపుల్లు, ఇంకోరు మీ బా జంగ్లి, ఇంకోటి నువ్వు. అంటే ఒక బా కథలో ముగ్గురు బా లను పరామర్శించటం మంచి శిల్ప చాతుర్యం అన్నారు. మూడు తరాల మనుషుల్ని రిఫర్ చేసినట్లయింది అన్నారు. ఒక్కో కథ ఒక్కో రకంగా వస్తుంది. అంటే ఒక్కో కథ ఒక్కో రకంగా దానికి అదే shape

**కథారూపం మనం ప్లాన్ చేసినా చేయక పోయినా సహజంగా ఏదో ఒక నిర్మాణం జరిగిపోతుంది. ఇందులో ఒక కొడుకు పాత్ర కథ చెప్తుంది. తన తండ్రి జనాజాను శవపేటికను ఇంటి నుంచి మసీదుకు, మసీదు నుంచి ఖబరస్తాన్‌కు తీసుకుపోయి ఖననం చేసి తిరిగి ఇంటికి చేరటం ఈ కథా శిల్పం. శిల్ప నిర్మాణంలో కొన్ని సూక్ష్మ విషయాలు కూడా ఒక్కోసారి పాఠకుల్ని ఆకట్టుకుంటాయి.**

చేసుకుంటుంది. అంటే కథావస్తువే తన రూపాన్నీ నిర్ణయిస్తుంది. కాని writing process మాత్రం అన్ని కథలకు ఒకే రకంగా ఉంటుంది. నా వరకు నాకైతే ఇప్పటివరకు అలాగే జరిగింది. ఏదో ఒక విషయం నన్ను ఫలానా కథ రాయమని ఏదో ఒక క్షణంలో motivate చేస్తుంది. అంతే ఒక దానికి సంబంధించినవి ఏవో అలా గుర్తొస్తుంటాయి. వచ్చినప్పుడల్లా రాసుకుంటూ ఉంటాను. కొన్ని రోజులకు చాలా వరకు రాసేస్తాను. గుర్తుకు రావాల్సినవన్నీ వచ్చేసాయి అనుకున్నాక ఆ కాగితాలన్నీ కలిపి scrutiny చేసుకుంటాను. modify మోస్తరుగా చేసుకుంటాను. ఫరవాలేదు ఒక shape వచ్చిందిలే అనుకున్నాక fair చేస్తాను. చాలా సార్లు అనుకున్నాను. mindwork బాగా చేయాలని కొన్ని రోజులన్నా mind లోనే ఆలోచించుకుంటూ, plan చేసుకుంటూ ఉండాలని, plan అయ్యాకనే రాయాలని, పూర్తయింది అనుకున్నాక కూడా ఓ వారం పదిరోజులు, రోజూ ఒకసారన్నా మళ్ళీ చదువుకోవాలని అనుకున్నాను. కాని ఈ రెండు పనులు ఇప్పటికీ చేయలేకపోతున్నాను.



నేనెప్పుడూ పెద్దగా కథానిర్మాణం గురించి ఆలోచించలేదు. ఎట్లా వస్తే అట్లా ఏ శైలిలో వస్తే అట్లా, ఏ యాసలో వస్తే అట్లా రాసాను. అయితే మీతో మాట్లాడటం కోసం ఆ వ్యవహారాలు, ఆ కథనం ముచ్చట్లు పరిశీలించాను. మనకు తెలియకుండానే అంటే నాలాంటి వాళ్ళకు తెలియకుండానే ఆ నిర్మాణపద్ధతులు వచ్చేస్తాయి.

దీన్ని బట్టి మంచి కథకుడికి ఓపిక, ఇంకా ఎక్కువ శ్రమించే గుణాలు ఉండాలని అనుకుంటాను. మా నాయిన చనిపోయాక నాకెందుకో బాధనిపించలేదు. ఆలోచనలు, జ్ఞాపకాలు కూడా రావటం ఆగిపోయినాయి. కృత్రిమంగా వస్తున్నాయి. సహజంగా రావటం లేదు. కథ రాయాలని అప్పుడనిపించింది. ఆలోచించటం మొదలయ్యాక ఎన్నో జ్ఞాపకాలు నాకు తెలియకుండానే వచ్చాయి. భావతీత స్థితిలో భావాలు రావాలి. ఆ వ్యక్తీకరణలు బాగుంటాయి. అదే సాహిత్యధ్యానం. నేనందు కొరకే ప్రధానంగా రాస్తాను. ఇదొక secret, ఇదొక magic, ఇదొక power secret, ఏందంటే ఈ కథ మా అమ్మకు విన్పించా. ఆమెకు తెలుగు చదవటం రాదు. మీ నాయిన గురించి నాకు తెలియనివి కూడా నీకెట్లా తెలిసినాయంది magic ఏందంటే ఈ కథ నా భార్యకు కొడుక్కు విన్పించాను. వాళ్ళకు చదవటం వచ్చు కాని ఫస్టు వాళ్ళకే విన్పించటం నా అలవాటు. చదువుతున్న మధ్యలో ఏడ్చేసాను. చనిపోయినప్పుడు ఏడవాల్సిన ఏడుపు అప్పుడొచ్చింది. మనం రాసిన కథలు పెద్దగా చదువుకోవాలి. మన వాళ్ళకు మంచిగా చదివి విన్పించాలి. సాహిత్యంలో సహజమైన భావోద్వేగాలను కల్గించే శక్తి ఉందని చాలాసార్లు నాకు అనుభవమైంది. ఈ బా అనే పది పేజీల కథ రాసి పదేండ్లయింది. మా నాయిన ఎలిజీ ఈ బా కథ. ఆయన చనిపోయాక ఆయన జ్ఞాపకాలను కథగా రాసుకున్నాను. నేనెప్పుడూ పెద్దగా కథానిర్మాణం గురించి ఆలోచించలేదు. ఎట్లా వస్తే అట్లా ఏ శైలిలో వస్తే అట్లా, ఏ యాసలో వస్తే అట్లా రాసాను. అయితే మీతో మాట్లాడటం కోసం ఆ వ్యవహారాలు, ఆ కథనం ముచ్చట్లు పరిశీలించాను. మనకు తెలియకుండానే అంటే నాలాంటి వాళ్ళకు తెలియకుండానే ఆ నిర్మాణపద్ధతులు వచ్చేస్తాయి. జానాజాతో ఎత్తుకోవటమే ఈ కథలోని ఎత్తుగడ. జానాజా అంటే ముస్లీములకు సంబంధించిన శవపేటికలాంటిది. జానాజాలో ప్రారంభించి ఖబర్‌తో ముగిసింది. ఖబర్ దగ్గర కూర్చుని ఒక ఉర్దూ poetic వాక్యం రాసి కథ ముగించాను. భాషా శైలి విషయాలు నా కథల్లో ఒక మిశ్రమంలా ఉంటాయి. నా కథలో కవితా వాక్యాలున్నాయి. ఉర్దూ పదాలున్నాయి. తెలంగాణ తెలుగు భాష ఉంది. కోస్తా భాషా ఉంది. నాకు తెలియకుండానే అవన్నీ ఈ కథలో అన్ని కథల్లోలాగానే చోటు చేసుకున్నాయి. నేనెప్పుడూ భాషాశైలి విషయం గురించి ఆలోచించలేదు.

వాటికి సంబంధించి ఏ సాధనా చేయలేదు. ఇరవై ఏండ్లు కోస్తాలో ఉన్నాను. 30 ఏండ్లు తెలంగాణాలో ఉన్నాను. కవిత్వం రాస్తుంటాను. నేను ఇంట్లో మాట్లాడే భాష ఉర్దూ. నేను MA English చేసాను. ఇవన్నీ సహజంగానే నా కథల్లో ఉన్నాయి. కాని ఇప్పుడు విశ్లేషణ చేసుకుంటూ ఉంటే రచన రచనకు ఒక్కో భాషాశైలిని అనుకుని సాధన చేస్తే నా రచనలకు అదనపు బలం వస్తుందనిపిస్తుంది. మోనాటనీ అనిపించదు. బా కథలో చివరి నాలుగు వాక్యాలు ఇవి;

హమారి దిల్‌కే ఖబర్‌మే
బాకి ప్యార్ ఝుర్నా జైసీ
మా మనో సమధిలో
నాన్న ప్రేమ నీటి ఊట

ముగింపు ఏ సుదీర్ఘ వర్ణనలతో కాకుండా ఇలా కవితాత్మకంగా ఉంటే బాగుంటుంది. పైగా ఉర్దూ కవిత్వ వాక్యాలతో వైవిధ్యభరితంగా, సృజనాత్మకంగా ఉంది. వీలుంటే అక్కడ మనదైన క్రియేటివిటీని కొత్తగా పెట్టడం బాగుంటుంది. మంచి కథంటే చదివాక కొంచెం సేపు పాఠకుడు ఆగిపోవాలి. తిరిగి మళ్ళీ చదవాలి. అట్లా జరగాలంటే ఆ కథ అంత లోతుగా మరెంతో కళాత్మకంగా ఉండాలి. అవి రావాలంటే రచయితకు చిత్తశుద్ధి, నిజాయితీ, ప్రేమ చాలా ఎక్కువ ఉండాలి. మనుషుల పట్ల, సమాజం పట్ల కృతజ్ఞతా భావం, ఒక నైతికబాధ్యత మనలో క్రమేపి పెంచుతూ పోవాలి.






కథలంటే పైపైని వున్నాయనుకున్నావేమో, అవి కల్పించడానికి చాలా గొప్ప ప్రతిభ వుండాలి. వాటి విలువ తెలుసుకోడానికి ఎంతో పరిజ్ఞానం వుండాలి. అవి చెప్పడానికి ఎంతో నేర్పు వుండాలి. అవి వినడానికి ఎంతో రుచి వుండాలి. అవి బోధపరుచుకోడానికి ఎంతో బుద్ధి సూక్ష్మత వుండాలి. కథలు కళ్ళకి వెలుగిస్తాయి. బుద్ధికి పదును పెడతాయి. మనస్సుకి ఉత్సాహమూ, ఉల్లాసమూ కలిగిస్తాయి.

– శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

కథ అనేది మొదట్లో కుతూహలాన్ని చివర ఆలోచనల్నీ కలిగించాలి. మధ్యలో చెప్పేది రక్తికట్టిస్తూ చెప్పుకుపోవాలి.

– ఆరుద్ర

కథ అనేది మనకి జీవితంలో జీవిత రహస్యంతో, జీవిత వైచిత్రితో కొంత కొత్త పరిచయం కలుగచెయ్యాలి. కథ చెప్పే విధానమే కథకి అందాన్ని బలాన్నీ ఇస్తుంది.

– దేవరకొండ బాలగంగాధర తిలక్

సహజం అనిపించే అసహజం కథ

– మల్లాది రామకృష్ణ శాస్త్రి

కథానిక అంటే మళ్లీ మళ్లీ చదివించే వచన ఖండకావ్యం. వెనక నుంచి సముద్రం హోరు వినిపిస్తూ చూడ్డానికి మాత్రం కెరటంలా కన్పించేది.

– బుచ్చిబాబు

సహజత్వం, ఉత్కంఠ అనే రెండు చక్రాలమీదే కథ సాగాలి

– మధురాంతకం రాజారాం

★ స్వీయ కథా విశ్లేషణ

# వేంపల్లె షరీఫ్



## పర్దా





***ఎలా కథ చేయాలో తెలిస్తే చాలు... దేన్నయినా కథ చేయొచ్చు. అది అందరూ ఒప్పుకునే విషయమే. నాకు తెలిసి కథలన్నీ అందరూ ఒకేలా రాయరు. ఎవరి కథలు వాళ్లు కూడా ఒకేలా రాయలేదు. అన్ని సినిమాలు ఒకేలా ఉండవు అంటారే... అలా అన్ని కథలూ ఒకేలా బాధపెట్టవు కూడా. ఒక్కో కథ ఒక్కో రకంగా ఒక్కో కొత్త పద్ధతిలో బాధపెడుతుంది. మనం ఎంచుకునే వస్తువును బట్టి కూడా బాధ స్థాయి ఉంటుంది. 'నేను అన్ని కథలూ ఒకేలా రాసేస్తాను' అని ఎవరైనా అంటే నాకెందుకో నమ్మబుద్ధి కాదు.***

నేను నా కథానుభవనాన్ని మీతో పంచుకునే ముందు ఓ రెండు మాటలు చెబుతాను. చాలా మంది కొత్తగా కథలు రాసేవాళ్లను బెదిరించి పడేస్తున్నారు. 'కథ' అంటే అది, కథ అంటే ఇది, ఇదే కథ, అది మాత్రమే కథ, కథంటే ఏమనుకున్నావ్? ... ఇలా వాయించి పడేస్తున్నారు. కానీ భయపడనక్కర్లేదు. ఏది కథో స్వయంగా దిగితే కానీ తెలీలేదు నాకైతే మాత్రం. బయటుండి బావిలోతు గురించి ఎంత మాట్లాడుకుంటే ఏం లాభం... లోపలికి దిగి ఈత కొట్టగానికి ప్రయత్నిస్తేనే ఉపయోగం. నేనలా ఈత కొత్తడానికి ప్రయత్నించే కథలు రాశాను.

ఎలా కథ చేయాలో తెలిస్తే చాలు... దేన్నయినా కథ చేయొచ్చు. అది అందరూ ఒప్పుకునే విషయమే. నాకు తెలిసి కథలన్నీ అందరూ ఒకేలా రాయరు. ఎవరి కథలు వాళ్లు కూడా ఒకేలా రాయలేదు. అన్ని సినిమాలు ఒకేలా ఉండవు అంటారే... అలా అన్ని కథలూ ఒకేలా బాధపెట్టవు కూడా. ఒక్కో కథ ఒక్కో రకంగా ఒక్కో కొత్త పద్ధతిలో బాధపెడుతుంది. మనం ఎంచుకునే వస్తువును బట్టి కూడా బాధ స్థాయి ఉంటుంది. 'నేను అన్ని కథలూ ఒకేలా రాసేస్తాను' అని ఎవరైనా అంటే నాకెందుకో నమ్మబుద్ధి కాదు.

తొలినాళ్లలో వీలైనంతవరకు ఎవరైనా తమ సొంత జీవితాన్నే కథలుగా రాయడానికి ప్రయత్నిస్తే బావుంటుందనేది నా అభిప్రాయం. వివిధ వృత్తుల్లో ఉన్నవాళ్ళు, వివిధ వర్గాల్లో ఉన్న వాళ్లు, వివిధ జీవితాలను గడుపుతున్నవాళ్లు వాళ్ల వాళ్ల సొంత అనుభవాలను కథలుగా రాసుకుంటూ పోతే అన్ని రకాల జీవితం ఒక చోట చేరి కథ సాహిత్యం పరిపుష్టిగా తయారవుతుందనేది నా ప్రగాఢనమ్మకం. ఆ నమ్మకాన్ని కలిగించినవాళ్ళు చాలామందే ఉన్నారు. వాళ్ళ పేర్లన్నీ నేను ఇక్కడ చెప్పలేను కానీ..... వీలైనంతవరకు నేను కూడా నా సొంత జీవితాన్నే కథలుగా రాయడానికి ప్రయత్నించాను.

అలా అని ఇతరుల జీవితాన్ని కథలుగా రాయకూడదని రూలేం లేదు. ఇతరుల జీవితం గురించి, మనకేమాత్రం ఏవిధంగానూ పరిచయం లేని జీవితం గురించి కూడా కథలు రాయొచ్చు. కాకపోతే వాటికి తీసుకోవాల్సిన జాగ్రత్తలు వేరేగా ఉంటాయి. నేను ముందే చెప్పాను కదా... ఒక్కో కథ ఒక్కో రకంగా బాధపెడుతుంది అని. మన సొంత జీవితాన్ని అంటే మనకు బాగా తెలిసిన జీవితాన్ని తీసుకుని రాస్తే మనకు కొంత బాధ తగ్గుతుంది. ఇతరుల జీవితాన్ని కథగా తీసుకుంటే ముందు దాని గురించి తెలుసుకోవాలి.... ఆ తెలుసుకున్న దానికి తగిన వాతావరణం కల్పించి రాయాలి. అలా రాస్తున్నప్పుడు ఎలాంటి టెక్నికల్ మిస్టేక్స్ లేకుండా కూడా చూసుకోవాలి. ఇక్కడ టెక్నికల్ మిస్టేక్ అనేది చాలా ఇంపార్టెంట్.



**పెద్దలకు భయపడో, సమాజానికో, లేక పరువుకు భయపడో ఏదో ఒక కారణంతో చాలామంది ఇష్టం లేకపోయినా కూడా ఆయా ఆచారాల్ని, పద్ధతుల్ని పాటిస్తూ ఉంటారు. మనమేమో అవేవీ పట్టించుకోకుండా బయట్నుంచి చూసి గుడ్డిగా 'వాళ్లకు చాదస్తం' అనేస్తాం. కానీ వాళ్లక్కాదు చాదస్తం. మనకు చాదస్తం. అందర్నీ ఒకే చూపుతో చూస్తామే అందుకు మనకు చాదస్తం.ఆ చాదస్తపు చూపుతో చూడటం వల్ల చాలా విలువైన విషయాలను మనం కథలుగా రాసే అవకాశం కోల్పోతామనేది నా బలమైన అభిప్రాయం.**

టెక్నికల్ మిస్టేక్ అంటే విపులంగా వివరించే ప్రయత్నం ఏమీ చేయను కానీ... ఒక చిన్న ఉదాహరణ మాత్రం చెబుతాను. మనకు సాఫ్ట్‌వేర్ లైఫ్ గురించి తెలియదను కుందాం. అయినా ఆ జీవితం గురించి రాస్తున్నాం. అలా రాస్తున్నపుడు 'కొందరు సాఫ్ట్‌వేర్ కుర్రాళ్లంతా కలసి జీపులో బయల్దేరారు' అని రాశామనుకోండి. అసలు ఇప్పుడు జీపులే లేవు. ఉన్నా వాటిని సాఫ్ట్‌వేర్ కుర్రాళ్లు అస్సలు ఉపయోగించరు. అప్పుడది నా భాషలో టెక్నికల్ మిస్టేక్ అయిపోతుంది. ప్రధాన కథ దెబ్బతినదు. కానీ ఈ టెక్నికల్ మిస్టేక్స్ కథని చులకన చేసేస్తాయి.

ఈ తప్పుని నేనొకసారి 'కోయేటు లెక్క' అనే కథలో చేశాను. కొయేటు నుంచి డబ్బులొస్తే.... పోస్ట్‌మెన్ డైరెక్టుగా ఇంటికి తీసుకొచ్చి ఇవ్వడు. కేవలం ఇంటిమేషన్ మాత్రమే ఇస్తాడు. ఆ ఇంటిమేషన్ తీసుకుని తర్వాత మనం పోస్టాఫీస్ కెళ్ళి డబ్బుతెచ్చుకోవాలి. ఆ విషయం తెలియక పోస్ట్ మ్యాన్ డైరెక్టుగా ఇంటికొచ్చి డబ్బులిచ్చినట్టుగా రాశాను. అందుకే ఇతరుల కథలు రాస్తున్నప్పుడు ఇలాంటి మిస్టేక్స్ నుంచి జాగ్రత్తగా ఉండాలి.

ఇక నేను చెప్పదల్చుకున్న నా కథ 'పర్దా'.. ఈ మధ్యే వచ్చిన నా కథల పుస్తకం 'జుమ్మా'లో మొదటి కథ ఇది.

ఇప్పుడు జెనరేషన్ మారిపోయింది. చాలామందికి పద్ధతులు, పాటింపులు, సంప్రదాయాలు అంటే గిట్టడం లేదు. అలా అని వాటిని పూర్తిగా నెగ్లెట్ చేయలేదు. ఎందుకంటే ఏదో తెలీని ఒక అనివార్యత వాళ్లపై పనిచేస్తూ ఉంటుంది. పెద్దలకు భయపడో, సమాజానికో, లేక పరువుకు భయపడో ఏదో ఒక కారణంతో చాలామంది ఇష్టం లేకపోయినా కూడా ఆయా ఆచారాల్ని, పద్ధతుల్ని పాటిస్తూ ఉంటారు. మనమేమో అవేవీ పట్టించుకోకుండా బయట్నుంచి చూసి గుడ్డిగా 'వాళ్లకు చాదస్తం' అనేస్తాం. కానీ వాళ్లక్కాదు చాదస్తం. మనకు చాదస్తం. అందర్నీ ఒకే చూపుతో చూస్తామే అందుకు మనకు చాదస్తం.ఆ చాదస్తపు చూపుతో చూడటం వల్ల చాలా విలువైన విషయాలను మనం కథలుగా రాసే అవకాశం కోల్పోతామనేది నా బలమైన అభిప్రాయం. అందుకే రచయితకి సరైన దృష్టి అవసరం అంటారు విమర్శకులు.

ఒక ముస్లిం సామాజిక వర్గానికి చెందిన వ్యక్తిగా బుర్ఖాకు వ్యతిరేకంగా ఎవరు మాట్లాడినా నాకు వెంటనే మా నాన్న

గుర్తుకొచ్చేస్తాడు. కాటికి కాలుచాపిన మా ముసలి జేజి - దుప్పటి కప్పుకోనందుకు ఆయన పడే వేదన నాకు గుర్తుకొస్తుంది. వయసులో ఉన్నవాళ్లను బుర్ఖా కప్పుకోమంటారు. సరే .... ముసలిదైన మా జేజి పట్ల కూడా నాన్నకెందుకింత పట్టింపు. ఇందులో ఏదో అనివార్యత ఉంది. ఒకవేళ నిజంగానే మా నాన్న చాదస్తుడే అయితే ఆ చాదస్తం మిగతా చోట్ల కూడా ఉండాలి కదా. ఆయనేమో వారానికి ఒకసారి కానీ నమాజుకెళ్లడు. ఇస్లాంలోని పద్ధతులేం పెద్దగా పాటించడు. ఇంట్లో ఆడవాళ్ల విషయానికొస్తే మాత్రం 'నేను అసలు సిసలు ముసల్మాన్' అంటాడు. మరి ఆడవాళ్ల విషయంలో ఏమైనా దురభిప్రాయం ఉందా...? అంటే అది కూడా లేదు. మరి ఏంటా అనివార్యత... బాగా ఆలోచిస్తే పేదరికం యొక్క సైడ్ ఎఫెక్టే మా నాన్న సైకాలజీ అని అర్థమైంది. మరి ఆ అర్థమైన విషయాన్ని అదే స్థాయిలో పాఠకులకు అర్థమయ్యేలా కథగా చెప్పి మెప్పించాలి.



*సొంత జీవితంలోని కథలు రాస్తున్నప్పుడు కూడా కొన్ని జాగ్రత్తలు తీసుకోవాల్సి ఉంటుంది. లేకుంటే గొడవలైపోతాయి. 'పర్దా' కథలో జేజి పాత్ర హీరో అయితే అమ్మ పాత్ర విలన్. తెలుసు కదా అత్తా కోడళ్ల గొడవలు ఎలా ఉంటాయో. "నా గురించి చెడ్డగా రాస్తావా..' అని మా అమ్మ ఇప్పటికీ నా మీద కోపానికి వస్తుంది. 'ఇంకోసారి ఇలాంటి కథలు రాసినావంటే చూడు... గొంతు మీద కాలు వేసి కసకసా కలిపి చంపేస్తా...' అని బెదిరిస్తుంది.*

కథకు కావాల్సిన వస్తువు అయితే దొరికింది కానీ దానికి కథారూపాన్ని ఇవ్వాలి. రూపం ఇవ్వాలంటే కథను ఎక్కడ మొదలుపెట్టాలి.... ఎక్కడ మొదలుపెట్టి ఎలా తిప్పి ఎక్కడ ముగించాలి - అనేది సమస్య. ఆలోచిస్తున్నంతసేపు "సూపర్ రా భాయ్.. ఇలా రాస్తే కేక" అనిపిస్తుంది. కానీ సగం రాశాక రకరకాల డౌట్లు. అసలు నేను చెప్పాలనుకున్నది సరిగా ఫోకస్ అవుతుందా- లేదా? అనేది గిల్టీ. రాయడం..., సగం దూరం వెళ్లాక బాగాలేదనిపించి ఆపేయటం. చెబితే ఎక్కువ అనుకుంటారు కానీ అలా మూడు నాలుగేళ్లు గడచిపోయింది. ఇక ఈ కథ నేను రాయలేను అనుకుని వదిలేసి మరో రెండు కథలు కూడా రాశాను.

ఆ తర్వాత రాయడానికి ఏమీ లేక మధ్యలో ఆపేసిన ఈ కథ దగ్గరికొచ్చాను మళ్లీ. అసంపూర్ణంగా ఉన్న కథనే మళ్లీ మళ్లీ చదువుకున్నాను. నచ్చడం లేదు. నచ్చకపోవడం కాదు కానీ ఇందులో ఏదో లోపం ఉందనిపిస్తోంది. చెప్పాల్సిన విషయం సరిగ్గా ఫోకస్ అవడం లేదనేది ప్రధానంగా ఉన్న వెలితి. జేజి జీవితం దగ్గర్నుంచి కాకుండా ఇంకెక్కడి నుంచో కథను మొదలుపెట్టి రాయాలి. అలా రాసి చివర్లో జేజి విషయాన్ని హైలెట్ చేసి ముగించాలి. అలా చేయాలంటే ఇంకేదో అంశం కథకు జోడించాలి. ఏమి జోడించాలి.

ఈ కోణంలో ఆలోచించినపుడు నాన్న ఇంకా ఎక్కడక్కడ పట్టింపులకు పోతున్నాడో అర్థమైంది. వెంటనే అక్క గుర్తుకొచ్చింది. యస్... కథ ఇక్కడ్నుంచి మొదలుపెట్టాలి. అక్క దగ్గర్నుంచి కథను మొదలుపెట్టి, మెల్లగా జేజిని పరిచయం చేసి, ఆమె జీవితాన్ని అక్క జీవితంలో ఆన్వయించి రాసి చివర్లో దుప్పటి అంశంతో కథను ముగించాలి. సూపర్.. ఎంత ఆనందమేసిందో... ఆ ఆలోచన రాగానే.. ఒక పెద్ద రిలీఫ్ కూర్చున్నాను. ఒక ఫ్రైడే రోజు ఉదయం నుంచి సాయంత్రం దాకా కూర్చోని రాశాను. రాసిన తర్వాత అనుమానాలు.

"మధ్యతరగతికి చెందిన ఒక ముస్లిం వ్యక్తి తన కూతురికి పెళ్లి ఎక్కడ అవదో నన్న భయంతో - ఎప్పుడూ అలవాటు లేని ముసలితల్లిని దుప్పటి కప్పుకోమని దండించడం, ఆమె

దుప్పటిని ధిక్కరించి.. మళ్లీ ఎక్కడ్నుంచి వచ్చిందో అక్కడికే వెళ్లిపోవడం... " కథలో ప్రధానాంశం. ఈ విషయం ఎంత ఆమోదయోగ్యంగా రాసినప్పటికీ తోటి ముస్లిం సమాజం ఒప్పుకుంటుందా.. .అన్నది భయం. ముస్లిం కథలు రాస్తున్న వాళ్లను ఈ సమస్య వెంటాడుతూ ఉంటుంది. ఇరువర్గాల పాఠకులని కన్విన్స్ చేసే విధంగా కథను ప్రజెంట్ చేయాల్సి ఉంటుంది. అనవసర వివాదాలకు తావివ్వడం రచయిత ఉద్దేశ్యం కాదుకదా. అందుకే ఇది కొంచెం కత్తిమీద సామే. చివరికి ఏదైతే అదైందని ధైర్యం చేసి ఆదివారం ఆంధ్రజ్యోతికి కథను పంపాను, అచ్చయ్యింది.

కథకు ముందు అనుభవం ఇలా ఉంటే – కథ తర్వాత అనుభవం గురించి కూడా రెండు ముక్కలు చెప్పాలి.

సొంత జీవితంలోని కథలు రాస్తున్నప్పుడు కూడా కొన్ని జాగ్రత్తలు తీసుకోవాల్సి ఉంటుంది. లేకుంటే గొడవలైపోతాయి. 'పర్దా' కథలో జేజి పాత్ర హీరో అయితే అమ్మ పాత్ర విలన్. తెలుసు కదా అత్తా కోడళ్ల గొడవలు ఎలా ఉంటాయో. "నా గురించి చెడ్డగా రాస్తావా..' అని మా అమ్మ ఇప్పటికీ నా మీద కోపానికి వస్తుంది. 'ఇంకోసారి ఇలాంటి కథలు రాసినావంటే చూడు... గొంతు మీద కాలు వేసి కసకసా నలిపి చంపేస్తా...' అని బెదిరిస్తుంది. ఇంకాస్త ముందుకెళ్లి పోలీస్ కేసు పెట్టినా పెట్టొచ్చు. అందుకే సొంత జీవితాల్లోని కథలు మరీ పర్సనల్‌గా రాస్తున్నప్పుడు ఇలాంటి పర్యవసానాలను కూడా దృష్టిలో పెట్టుకుని రాయడం మంచిది.

నాకు ఈ అనుభవాలను 'కథాకార్యశాల'లో పంచుకునేందుకు అవకాశమిచ్చిన 'సాహితీ స్రవంతి' కి మనస్ఫూర్తిగా ధన్యవాదాలు చెప్పుకుంటూ విరమిస్తున్నాను.






కథాశిల్పం అంటే ఏమిటి? కథకి ఒక పాయింట్ వుండడం. కథ సూటిగా వుండడం. సంక్షిప్తంగా వుండడం. సన్నివేశ చిత్రణ, పాత్రల చిత్రణ, వర్ణనలు – అన్నీ ఒక్క లక్ష్యంవేపే సాగడం. కథకి పొదుపరితనం చాలా ముఖ్యం. కథ చెప్పే తీరులో ప్రతి వాక్యానికీ, ప్రతి మాటకీ తూకం వుండాలి. యీ విషయంలో యేమాత్రం అలసత్వం వున్నా కథ సాగిలపరుచుకుని పడుకుంటుంది. అప్పుడు కథకాకుండా పోతుంది. కథ రసపుష్టంగా వుండాలంటే రచయిత అతి వ్యాప్తి చాపల్యానికి లొంగకూడదు.

**– సొదుం జయరాం**



సాహిత్యంలో మౌలిక సమస్య వస్తు–శిల్పాల కున్న సంబంధం. ప్రాచీన యుగాలనుంచీ ఆ యుగాల పరిధిలో అనేకమంది ఈ విషయాన్ని గూర్చి అభిప్రాయాలను ప్రకటించారు. అన్నింటిలాగానే ఈ విషయంలోనూ వర్గ స్వభావమే పునాదిగా వుంది. ప్రపంచంలో ప్రతిదానికి ఏదో ఒక రూపం వుంది. పదార్థాల్లో సారాంశం వస్తువే అయినా అది రూపంతోనే అస్తిత్వంలో వుంటుంది. రూపాన్ని ఆశ్రయించుకునే వస్తువు వ్యక్తం అవుతుంది. సమాజ జీవితంలో వచ్చే ప్రతి చిన్న మార్పు వస్తువులో మార్పును తెస్తుంది. కాని రూపంలో కొన్ని అతి ముఖ్యమైన చారిత్రక సందర్భాల్లోనే మార్పు కనిపిస్తుంది. జీవితానుభవంలో కొత్తశక్తులు కొత్త రూపాలను అభివృద్ధి చేస్తాయి. సాధారణంగా అభివృద్ధి క్రమంలో వస్తువే రూపాన్ని నిర్ణయిస్తుంది. రూపం వస్తువును నిబద్ధించే సందర్భాలు కూడా వుంటాయి.

**–త్రిపురనేని మధుసూదనరావు**



★ స్వీయ కథా విశ్లేషణ

# జి. ఉమామహేశ్వర్



## వాటర్



***ఒక కథ తను బయట పడాలనుకున్నప్పుడు దానికి తగిన పరిస్థితులను తానే కల్పించుకుంటుందనేది ఒక వాదన, కొందరి నమ్మకం. అప్పటికే కొన్ని ఖరీదైన హోటళ్ళలో తాగే నీటి గురించి రెండు ఆప్షన్స్ ఉండేవి. 'ఆర్డీనరీ, మినరల్' అలాగే రైల్వే స్టేషన్‌లో కూడా కొళాయి నీళ్ళు, బాటిల్ నీళ్ళ ఆప్షన్స్ ఉండేవి ఉన్నాయి. ఇప్పుడున్న రెండు ఆప్షన్స్ కొద్దిరోజుల్లో మాయమవుతాయనిపించేది. 'రెండో ఆప్షన్ తీసేస్తే' 'అందరికీ నీరు కొనడమే గత్యంతరం' అనే పరిస్థితి కల్పిస్తే? - ఆ ఆలోచనే కథను నడిపింది.***

పీపులార్‌లైక్ వాటర్ యు.నో.. యు షుడ్ బి ఏబుల్ టు మ్యానేజ్ దెమ్. ఎలాగైతే నీటిని పాత్రలో పోసి పాత్ర ఆకారమూ, గ్లాసులో పోస్తే గ్లాస్ ఆకారమూ వస్తాయో ప్రజలూ అంతే ! ఎలా అవసరమైతే అలా మల్లించగలగాలి. పదిహేనేళ్ళక్రితం ఈ మాటలు ఒక మ్యానేజ్‌మెంట్ సెమినార్‌లో విన్నప్పుడు నాకు ఆశ్చర్యమేసింది. ఏమిటి ప్రజలంటే అంతేనా? అంత చులకనా? అని నాలో నేనే మధనపడ్డాను.

సరిగ్గా అప్పుడే 1999 లో ఒరిస్సాలో వరదలొచ్చినప్పుడు వరద బీభత్సాన్ని, విలయతాండవాన్ని చిత్రిస్తూ, వరద తెచ్చిన నష్టాల్ని వర్ణిస్తూ వచ్చిన ఓ కవిత చదివాను "వర్షం ఎప్పుడూ హర్షమే కానక్కరలేదుకదా!" అన్న వాక్యంతో ఆ కవిత ముగుస్తుంది. ఎందుకో ఈ మాటలు మ్యానేజ్‌మెంట్ సెషనలో చెప్పిన మాటలకు అవతలికోణాన్ని పరిచయం చేసినట్టు తోచింది. అదే వాటర్. పాత్రలో పోస్తే, పాత్ర ఆకారాన్ని, గ్లాస్‌లో పోస్తే గ్లాస్ ఆకారాన్ని సంతరించుకుని, ఒదిగిపోయిన వాటరే. అప్పుడప్పుడు మనిషిని భయవిహ్వాలుణ్ణి చేస్తుంది. కళ్లెర్ర చేసి కట్టడి చేస్తుంది.

అంతే! కథకు పాయింట్ దొరికింది. అయితే ఈ పాయింట్‌ని చెప్పడం ఎలాగ ? ఏదో ఒక సందర్భం సృష్టించి ఒక మేనేజర్ మాట్లాడినట్టు, అందులోని కథకుడి లాంటి పాత్ర ఆలోచనలతో నేననుకున్న భావాల్ని చెప్పించవచ్చు. కానీ అది అభిప్రాయాల్ని పంచుకోవడమే గాని, కథలా వుంటుందనిపించలేదు.

**మరికొన్ని రోజులు గడిచాయి**

ఒక కథ తను బయట పడాలనుకున్నప్పుడు దానికి తగిన పరిస్థితులను తానే కల్పించుకుంటుందనేది ఒక వాదన, కొందరి నమ్మకం. అప్పటికే కొన్ని ఖరీదైన హోటళ్ళలో తాగే నీటి గురించి రెండు ఆప్షన్స్ ఉండేవి. 'ఆర్డీనరీ, మినరల్' అలాగే రైల్వే స్టేషన్‌లో కూడా కొళాయి నీళ్ళు, బాటిల్ నీళ్ళ ఆప్షన్స్ ఉండేవి ఉన్నాయి. ఇప్పుడున్న రెండు ఆప్షన్స్

కొద్దిరోజుల్లో మాయమవుతాయనిపించేది. 'రెండో ఆప్షన్ తీసేస్తే' 'అందరికీ నీరు కొనడమే గత్యంతరం' అనే పరిస్థితి కల్పిస్తే? – ఆ ఆలోచనే కథను నడిపింది.

'నీళ్ళ ఫ్యాక్టరీలో రక్తం చిందింది. నీళ్లు ప్రభుత్వానివి రక్తం ప్రజలలో ఒక కార్మికుడిది'

అంతే! కథ మొదలైంది. వెంటనే ఒక ప్రశ్న. కథాకాలం 1999 అప్పటికి మరి నీళ్ళ ఫ్యాక్టరీలు లాంటి మాటలు అందులో శిక్షలు తిరుగుబాట్లు లాంటివి వాస్తవాలు కావు కాబట్టి ఈ కథ భవిష్యత్తులో జరగాలి. నీళ్ళ ఫ్యాక్టరీలో నీళ్ళ దొంగతనం జరిగితే, ఆ దొంగ ఒకానొక పరిస్థితిలో చనిపోతే, మిగిలిన ప్రజల క్రోధ ప్రవాహంలో హంతకులు కొట్టుకుపోవాలి.

మరి నీళ్ళు దొంగతనం చేయాల్సిన పరిస్థితి ఎందు కొస్తుంది? ఎలా వస్తుంది? అంటే నీళ్ళు ఒక వ్యాపార వనరుగా మారి, ఆ వనరుల మీద కొందరు మాత్రమే గుత్తాధిపత్యం కలిగినప్పుడే వస్తుంది. ఆ వాతావరణం సృష్టించడమే కథ మొదటిభాగం. అయితే ఆ వాతావరణం సృష్టించే క్రమం చాలా లాజికల్‌గా ఉండాలి. చెప్పే విషయం తర్కానికి నిలబడాలి. పాఠకులను నమ్మించ గలగాలి. ఈ కథలో నేను ఎదుర్కొన్న సవాల్ అదే!

పంతొమ్మిది వందల తొంభై దశాబ్ది చివరలో చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా ఉన్న రోజుల్లో ఆయన వైఖరి చాలా భిన్నంగా వుండేది. ఆయనకున్న వాటి మీద మోజును ఆధారం చేసుకుని చాలామంది వ్యక్తిగతంగానూ, సంస్థాపరంగానూ, లాభపడ్డారు. అప్పట్లో అమ్మకానికి ఆంధ్రప్రదేశ్ అన్న ఎన్. వేణుగోపాల్ పుస్తకం ఆంధ్రప్రదేశ్‌లో వస్తున్న ముందంజల






గురించీ, తీసుకుంటున్న రిస్కుల గురించి సమగ్రమైన అవగాహన కల్పించింది. అప్పట్లో మెకెన్సీ PVC లాంటి సంస్థలు కేవలం సర్వే రిపోర్ట్సు, రోడ్ మ్యాపులు, చూపించి కొన్ని కోట్లు కన్సల్టెన్సీ పేరుతో వసూలు చేశారు. అప్పటికీ రాష్ట్రంలో నీటి సంఘాల ఎన్నికలు KPMG అంటూ జిల్లా స్థాయిలో వాటి నిర్వహణ విభాగాలు నెలకొల్పాలని ప్రభుత్వం ఆలోచిస్తోంది. నీటి వినియోగం మీద చూపిస్తున్న శ్రద్ధ, విపరీతమైన ఆసక్తి పరిశీలకుడిగా నాకు చాలా అనుమానాలు రేకెత్తించింది. ప్రభుత్వపు అతి, మితిమీరిన నలహా సంఘాల విజృంభణ, విధివిధానాల నిర్ణయాలలో విదేశీ నిపుణుల జోక్యం చాలా చిరాకు కలిగించాయి. ఆ సంస్థల ధనవ్యామోహం అవతలి వ్యక్తి బలహీనతని క్యాష్ చేసుకునే తీరు అత్యాశ, అలాగే బ్యూరోక్రసీలో వుండే అతి వినయం, అసందర్భ విధేయత చాలా ఎబ్బెట్టుగా, ఒక క్యారికేచర్‌లాగా తోచేవి. ఈ పరిశీలనలన్నీ ఈ కథా సందర్భానికి అన్వయించు కుంటూ కథని నడపడానికి తోడ్పడ్డాయి. వీలయి నంత వ్యంగ్యం, కొంచెం వెటకారం తోడయి కథ మరీ సీరియస్ కాకుండా చూశాయి.

ఈ కథకు ఎంచు కున్న శైలి కూడా కొంత వ్యాస ధోరణి కలిగి ఉంటుంది. కథ మధ్యలో కొన్ని రిపోర్ట్‌లు, ప్రణాళిక అంశాలు ఇవన్నీ కొంత వివరంగా చెప్పాల్సి వచ్చినప్పుడు వ్యాసధోరణి బయటపడుతుంది. ఈ విషయంలో తర్జనభర్జన పడుతున్నప్పుడు 'చినువ అచిబే' అనువాద నవల ఒకటి చదివాను. అందులో అతను కథ చెప్పిన తీరు, కథాంశాన్ని బట్టి అతను చేసిన రాజకీయ పరిశీలనలు, విశ్లేషణలు నవలలో

విస్తారంగా చర్చించబడతాయి. ఆ నవల నాకు శైలిపట్ల నమ్మకాన్ని కలిగించింది.

కర్నూల్‌లో మా మిత్రబృందం 'కథాసమయం'లో ఈ కథ చదివినప్పుడు కూడా ఎవరూ ఈ విషయాలు తమకు బోర్ కొట్టాయనిగానీ, కథకు అనవసరమయిన విషయాలని భావించకపోవడం వల్ల ఇదే ఉంచేశాను. బహుశా వాళ్ళ అభిప్రాయం వేరేగా ఉంటే, ఇంకో ఫార్మ్ కోసం ప్రయత్నించి ఉండేవాడినేమో.!

ఈ కథలో ఏ పాత్రకూ పేరు పెట్టలేదు. ఎందుకంటే కార్పొరేట్లలో ఎవరికీ పేర్లతో అవసరముండదు. ఏ అవసరానికైనా వాళ్ళకున్న ఎంప్లాయీ ID ఉంటే చాలు. అందుకే అలాంటి పూర్తి అమానవీయ వాతావరణానికి ప్రతీకగా నెంబర్ తోనే పాత్రను సృష్టించడం జరిగింది. అలాగే, కథలోని అంశమైన తిరుగుబాటు గురించి రాయాలనుకున్నప్పుడు, కార్పొరేట్‌లో యూనియన్లుండవు కాబట్టి, అక్కడున్న యాంత్రిక జీవితాలకలవాటు పడ్డ ప్రజలలో స్పందన కోసమని ఒక భీభత్సమైన హృదయవిదారకమైన దృశ్యాన్ని సృష్టించాల్సి వచ్చింది. తత్కారణంగా ఉన్నట్టుండి జనాల్లో ఏర్పడిన తిరుగుబాటుకే వాడి గాఢత ఎక్కువై, దాని ప్రభావం ఎక్కువ మంది మీద ఉంటుందని నమ్మటం వల్ల కథలో 'ఎక్కడా నాయకత్వాలు గానీ, ఉత్తేజపూరిత ఉపన్యాసాలు గానీ లేవు' అని రాయడం జరిగింది.

రాజకీయులు, విద్యావంతులు, అధికారులు సాధారణ జనం పట్ల చాలా తేలిక భావం కలిగి ఉంటారు. వాళ్ళకు సహజంగా కలిగే భావన – ఈ అలగా జనాన్ని నయానో, భయాన్నో, సామ, దాన, భేదా, దండోపాయాలతో నియంత్రించవచ్చని .అది చెల్లదని చెప్పడమే, వాళ్ళ సహనాన్ని పరీక్షిస్తే కట్టలు తెంచుకునే ఆగ్రహం తుఫాన్ లాంటిదేనని చెప్పడమే కథ ముఖ్యోద్దేశం.

**చివరిగా శీర్షిక గురించి...**

నీటి ప్రైవేటీకరణ గురించీ, నీళ్ళ లాంటి ప్రజల గురించి రాసిన తరువాత నీటి గురించిన శీర్షిక పెడదామనుకున్నాను. తెలుగు కథా సాహిత్యంలో ఆ రోజుల్లో 'నీళ్ళు' పదంతో సీమ నీటికరువు మీద చాలా కథల శీర్షికలొచ్చాయి. వాటికి భిన్నమైన కథావస్తువు కావడం వల్ల, పీపులార్ లైక్ వాటర్ అన్న మాట ఆంగ్లంలో ఉంటేనే దానిలోని ధ్వని బాగా అర్థమౌతుందని ఆలోచించి ఆంగ్లభాష అని తెలిసీ "వాటర్" అని పెట్టడం జరిగింది.



**కథాసూత్రాలు**

పుష్కలమైన అనంతమైన సంఘటనలతో నిండివున్న ఎంతో గాంభీర్యమూ, వైవిధ్యమూ గల నేటి జీవితాన్ని వీక్షించక ప్రపంచ ప్రసిద్ధికెక్కిన ప్రాచీన కాల్పనిక కథల నుంచి రచయితలు యితివృత్తాలను ఎందుకు స్వీకరిస్తారో అర్థంకాక నాకు ఆశ్చర్యం వేసింది.

– గురజాడ

మార్క్సిజం ప్రకారం చరిత్రంతా వర్గపోరాటాల చరిత్ర. సాహిత్యం ఆ పోరాటాలకు కళారూపం. అందువల్ల మార్క్సిస్ట్ విమర్శ సాహిత్యంలో ప్రతిబింబించేది. ఏ వర్గజీవితమో మొదట నిర్ణయిస్తుంది. ఆ వర్గజీవిత చిత్రణకు తగిన శిల్పాన్ని ఎలా వాడుకున్నదో నిర్ధారిస్తుంది. మార్క్సిజానికి జీవితంగాని, మనిషిగాని అమూర్తాలు కావు. ఏకఖండాలు కావు. వైరుధ్యాల సమూహాలు, సమాజం విరుద్ధ శక్తుల నిలయం. మనిషి వర్గ పీడితుడు. అందుకే మార్క్సిస్ట్ విమర్శ ఏ రచనను తీసుకున్నా మొదట అందులో చిత్రింపబడిన జీవితం ఏ వర్గానిది అన్న దానిని గురించి పరిశీలిస్తుంది. దీనిని పాక్షికదృష్టి అని మార్క్సిస్ట్ వ్యతిరేకులు అంటున్నారు. ఇది అశాస్త్రీయమైన ఆరోపణ. మార్క్సిస్ట్ విమర్శ సాహిత్యంలోని పాత్రలకు నిర్దిష్ట సాంఘిక ఆర్థిక శక్తులకు ప్రతినిధులుగా ప్రతీకలుగా పరిశీలిస్తుంది.

– రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి

★ స్వీయ కథా విశ్లేషణ

# శిరంశెట్టి కాంతారావు



## అడవి లోపల





> రాళ్ళమేకల గురించిన ఏచిన్న సమాచారమైనా ఏ ఒక్కరి దగ్గరి నుండైనా దొరక్కపోతుందా అన్న ఆశతో నా దృష్టిలో ఆ విషయం తెలియడానికి అవకాశముందనుకున్న వాళ్ళనల్లా అడుగుతూ పోయాను.

కొత్తగా కథలు వ్రాయాలనుకునే వారికి ప్రధానంగా కావాల్సింది సమాజం పట్ల అవగాహన, ప్రాణులపట్ల ప్రేమ, స్పందించే గుణం, గుండెల్లో ఆర్తి, ఎందుకంటే కథకు మూలవస్తువు సమాజం నుండి మాత్రమే లభిస్తుంది కాబట్టి మన చుట్టూ వుండే సమాజంలో మనుషులతోపాటు అనేక జీవులూ నివసిస్తుంటాయి. అలా నివసించే క్రమంలో బలవంతుడు బలహీనుణ్ణి లొంగదీసుకోవడానికి అనేకవిధాలుగా ప్రయత్నాలు చేస్తుంటాడు. ఆ బలవంతుడు ఆగడాలను అడ్డుకోవడానికి బలహీనులు సమిష్టిగా సాగించే అనేక ప్రయత్నాలు కథలకు మూలవస్తువులు అవుతాయి. అలాంటి కథావస్తువులే జన బాహుళ్యాన్ని ప్రభావితం చేస్తాయి.

ఇంకొకరకంగా చెప్పాలంటే వ్యథవున్న చోట కథ పుడుతుంది. అలాంటి వ్యథను పట్టుకోవడంలోనే కథకుడి ప్రతిభ బైటపడుతుంది. పదిమందికి అతణ్ణి పట్టిస్తుంది. స్థూలంగా చెప్పాలంటే కథానేపథ్యాన్ని ఒడిసిపట్టుకోవడంలోనే కథా రచయిత యొక్క సామర్థ్యం బయటపడుతుంది.

ఇప్పటివరకు నేను వ్రాసిన కథల్లో 'అడవిలోపల' అనే కథా నేపథ్యాన్ని కొత్తగా కథలు వ్రాయాలనుకునేవారికి వర్ధమాన రచయితలకూ ఉపయుక్తంగా వుంటుందనే ఉద్దేశ్యంతో ఇక్కడ ప్రస్తావిస్తున్నాను.

2010లో ఒకరోజు ఈనాడు దినపత్రిక ఖమ్మంజిల్లా ఎడిషన్‌లో ఇల్లందు డివిజన్ నుండి ఒక చిన్న బాక్స్ ఐటమ్ వార్తాకథనంగా ప్రచురింపబడింది. అదేమిటంటే 'ఇల్లందు అడవుల్లోని రాళ్ళమేకల దొడ్డికి 'నరబలి' ఇవ్వడం జరిగింది అనేవార్త. ఆ వార్తను చదివిన నేను ఈ రోజుల్లో కూడా ఇంకా నరబలులు ఉన్నాయా!? అన్న విభ్రమానికి లోనయ్యాను. ఒక చింతనకు గురయ్యా. అసలు రాళ్ళమేకలు అంటే ఏమిటి? రాళ్ళమీద చెక్కిన మేకల బొమ్మలా? రాళ్ళల్లో పెరిగే గడ్డితిని తిని రాళ్ళల్లోనే పెరిగే మేకలా? లేదా కంచిమేకల మాదిరిగా పెరిగే మరో రకం మేకలా? ఈ ఆలోచనలతో సరిగా నిద్రపోని రాత్రులు కూడా వున్నాయి. ఇక అప్పటినుండి కనిపించిన వారినల్లా రాళ్ళమేకలను గురించి అడగడం మొదలుపెట్టాను. కానీ, ఏఒక్కరుకూడా సంతృప్తికరమైన సమాధానం ఇవ్వలేకపోయారు. దాంతో ఏంచేయాలన్న సందిగ్ధంలో

పడిపోయిన నేను ఆఖరికి ఏ ఇల్లందు ప్రాంతంనుండైతే ఆ వార్త వచ్చిందో అక్కడికే వెళ్ళి ఆ వార్తను సేకరించి పంపిన ఆ ప్రాంత విలేఖరిని కలిసి వాటిని గురించి తెలుసుకోవాలనే నిర్ణయానికొచ్చాను. దాంతో ఆ మరునాడు ఉదయమే బయలుదేరి ఇల్లందు చేరుకున్నాను. ఇల్లందులో నా సాహితీ మిత్రుడైన కటుకోర్ఝ్వల రమేష్ గారి ఇంటికి వెళ్ళాను. ఉభయకుశలోపరి అయిన తరువాత ఆ ఊరు నేనెందుకొచ్చానో మిత్రునికి వివరించాను. విషయమంతా సావధానంగా విన్న తను నన్ను ఆ రాళ్ళమేకల వార్తను సేకరించిన విలేఖరి దగ్గరికి తీసుకువెళ్ళాడు. ఆ విలేఖరి వ్యక్తిగత పరిచయాలు అయిన తరువాత ఆ రాళ్ళమేకలను గురించిన వివరాలు అందజేసినట్టయితే వాటి నేపథ్యంతో నేనో కథవ్రాస్తానని తెలియజేశాను.



ఆ విలేఖరి మిత్రుడు నా మాటను నమ్మలేదు సరికదా! నిజంగా ఒక కథ వ్రాయడం కోసం ఎవరైనా ఇంత రిస్క్ తీసుకుంటారా!? అంటూ కొంచెం వ్యంగ్యంగా మాట్లాడాడు. ఐనా నేను నిరుత్సాహపడకుండా విషయం మళ్ళీ వివరించాను. దాంతో కొంత పునరాలోచనలోపడిన ఆ విలేఖరి మిత్రుడు ఆ రాళ్ళమేకల దొడ్ల దగ్గరికి బయటి వ్యక్తులు వెళ్ళడమనేది చాలా రిస్క్‌తో కూడుకున్న విషయం. ఆ ఏరియా అంతా ఏరియా వాళ్ళకు తెలియకుండా, వాళ్ళకు విషయం ఏమిటో చెప్పకుండా అక్కడికి వెళ్ళడం అంటే కొరివితో తల గోక్కోవడమే అవుతుంది. ఆ రాళ్ళమేకల వార్తలు సేకరించడానికి మేమే నానా తిప్పలు పడ్డాము. ఆ దొడ్ల దగ్గర పనిచేసే వ్యక్తులను ఏదో విధంగా వెతికి పట్టుకొని వాళ్ళకు అన్నో ఇన్నో డబ్బులిచ్చి మా దగ్గరున్న కెమేరాలను కూడా వాళ్ళకేఇచ్చి వాళ్ళద్వారా ఫోటోలు తీయించి తెప్పించుకున్నాము. కాబట్టి ఇప్పటికిప్పుడు మీరక్కడికి వెళ్ళడమంటే సాధ్యమయ్యేపనేకాదు. మీరొక పదిరోజులాగిరండి ఈలోపు అక్కడుండే లోకల్ లీడర్లతో మాట్లాడి చెబుతాను అంటూ అంటీముట్టకుండా సమాధానమిచ్చాడు. దాంతో ఏంచేయాలో పాలుపోక వెనుదిరిగి వచ్చాము.

ఇంకొక ప్రయత్నం చేద్దామండీ! అన్న నా మిత్రుడు రమేష్ తనకు తెలిసిన ఓ యాదవుల కుటుంబందగ్గరికి నన్ను తీసుకుని వెళ్ళాడు. తనను చూడడంతోనే ఎంతో స్నేహశీలంగా ఆదరించి కూర్చోబెట్టి చాలాసేపు మంచీ చెడూ మాట్లాడిన ఆ కుటుంబవాళ్ళకు ఆఖరికి నన్ను పరిచయం చేసి రాళ్ళమేకల వివరాలు కాస్త చెబుతారా అంటూ అడిగాడు. అంతే! అప్పటిదాకా మాపట్ల వున్న వాళ్ళదృక్పథమే ఒక్కసారిగా మారిపోయింది. వేం అర్జంట్‌గా సంతకుపోవాలిగాని లేండి అంటూ లేచి మాముఖాన్నే తలుపులు వేశారు. దాంతో పూర్తిగా నిరుత్సాహపడిన నా మిత్రుడు రమేష్ ఇక లాభంలేదండి! ఇదంతా మన వల్ల అయ్యే పనికాదుగాని మాఇంట్లో శుబ్బరంగా భోంచేసి పాల్వంచ బస్సెక్కండి! అంటూ ఏకవాక్య తీర్మానం చేసేశాడు. అప్పటికి నేనింకా చేసేదేంలేక నా మిత్రుని కోరికను సున్నితంగా తిరస్కరించి అటునుండి అటే తను చెప్పినట్టు పాల్వంచకు బస్సెక్కాను.

*అడగ్గా అడగ్గా చివరికి నేను ఆ రాళ్ళమేకల కోసం ఏ ఊరికైతే వెళ్ళాలనుకుంటున్నానో ఆ ఊరివాడైన ఓ గిరిజన మిత్రుడు నాకు తటస్థపడడం జరిగింది. ఆ గిరిజన మిత్రునికి గత రెండు నెలలుగా రాళ్ళమేకల సమాచారంకోసం నేను పడుతున్న శ్రమనంతా వివరించి తన సహాయాన్ని అర్థించాను. సహజంగానే స్నేహపాత్రుడైన ఆ గిరిజనమిత్రుడు దాందేముంది రేపే పోదాంపదండీ! అన్నాడు*

చూస్తుండగానే మరో వారం పదిరోజులు గడిచిపోయాయి. కానీ ఆ రాళ్ళమేకలను గురించి తెలుసుకోవాలన్న నా ఆరాటం అంతకంతకూ అధికమవ్వ సాగింది తప్ప విషయాన్ని అంతటితో వదిలేయాలనిపించలేదు. రాళ్ళమేకల గురించిన ఏచిన్న సమాచారమైనా ఏ ఒక్కరి దగ్గరి నుండైనా దొరక్కపోతుందా అన్న ఆశతో నా దృష్టిలో ఆ విషయం తెలియడానికి అవకాశముందనుకున్న వాళ్ళనల్లా అడుగుతూ

పోయాను. వేయగా వేయగా ఓ రాయి తగిలినట్టు అడగ్గా అడగ్గా చివరికి నేను ఆ రాళ్ళమేకల కోసం ఏ ఊరికైతే వెళ్ళాలనుకుంటున్నానో ఆ ఊరివాడైన ఓ గిరిజన మిత్రుడు నాకు తటస్థపడడం జరిగింది. ఆ గిరిజన మిత్రునికి గత రెండు నెలలుగా రాళ్ళమేకల సమాచారంకోసం నేను పడుతున్న శ్రమనంతా వివరించి తన సహాయాన్ని అర్థించాను. సహజంగానే స్నేహపాత్రుడైన ఆ గిరిజనమిత్రుడు దాందేముంది రేపే పోదాంపదండీ! అన్నాడు



నా శ్రమ ఫలించిందన్న సంతోషంతో నేనా రాత్రి సరిగా నిద్రకూడా పోలేదు. అన్నట్టుగానే ఆ గిరిజన మిత్రుడు మరునాడు ఉదయమే మా ఇంటికి వచ్చాడు. తన బైక్ మీదనే నన్ను ఎక్కించుకుని ఇల్లందు అడవుల్లోవున్న తన ఊరికి తీసుకుపోయాడు. నా జీవితంలో మొదటి సారి గిరిజనుల అసలు సిసలు ఆతిధ్యం ఎలా వుంటుందో చవిచూశాను. భోజనం చేసిన తరువాత ఇద్దరం కాలినడకన బయలుదేరి అడవిలోపల నాలుగు కిలోమీటర్ల దూరంలో ఉన్న రాళ్ళమేకల దొడ్లను చేరుకున్నాము.

మమ్ములను చూడగానే వాళ్ళంతా వచ్చి చుట్టుముట్టారు. వాళ్ళమనసుల్లోవుండే భావమేమిటో ఎరిగివున్న నా గిరిజన మిత్రుడు వాళ్ళ వంక చూస్తూ ఇతను నాతోపాటే పని చేస్తాడు. ఈ దొడ్లు చూస్తానంటే నేనే తీసుకొచ్చానంటూ నా గురించి వాళ్ళకు క్లుప్తంగా వివరించాడు.

అంత దట్టమైన అడవిలో ఆ రాళ్ళమేకల దొడ్లున్న ప్రాంతంలో మాత్రం కొంత మేర చెట్టూ చేమాలేని బయలు ప్రదేశం వుంది. ఆ బయలు ప్రదేశంలో మన పట్టణాల్లో కోళ్ళఫారాల కోసం వేసేటంత విశాలమైన నాలుగు పెద్దపెద్ద పూరిపాక లున్నాయి. ఆ పాకల దగ్గర ఒకరిద్దరు మనుషులు ఏవో పనులు చూసుకుంటున్నారు.

మమ్ములను చూడగానే వాళ్ళంతా వచ్చి చుట్టుముట్టారు. వాళ్ళమనసుల్లోవుండే భావమేమిటో ఎరిగివున్న నా గిరిజన మిత్రుడు వాళ్ళ వంక చూస్తూ ఇతను నాతోపాటే పని చేస్తాడు. ఈ దొడ్లు చూస్తానంటే నేనే తీసుకొచ్చానంటూ నా గురించి వాళ్ళకు క్లుప్తంగా వివరించాడు.

రాళ్ళమేకల గురించి చాలా రోజులుగా సాగుతున్న నా అన్వేషణకు వాళ్ళద్వారా సమగ్రమైన సమాచారం లభించింది.

## 2

ఇల్లందు అడవుల్లోని కొంతమంది వ్యక్తులు వేసవికాలం రాగానే ఎక్కడెక్కడో తిరిగి ఎండుతుమ్మకాయను లారీలకొద్దీ కొనుక్కొచ్చి నిలవచేస్తారు.

అలాగే సంక్రాంతికి ముందు రోజుల్లో మళ్ళీ ఊళ్ళ వెంటతిరిగి అప్పుడే ఈనిన వాటి దగ్గరనుండి మొదలుపెట్టి నెలరోజుల వయసున్న చిన్న చిన్న మేకపిల్లలను కొనుక్కొచ్చి అడవిలో వున్న ఆ పూరిపాకల్లోకి చేర్చుతారు. ఒక్కోదొడ్డిలో సుమారుగా రెండువందల నుండి రెండువందల యాభై మేకపిల్లలను ఉంచుతారు. ఆ విధంగా దొడ్లల్లోకి తోలిన ఆ మేకపిల్లలకు వేసవిలో కొనివుంచిన ఎండుతుమ్మ కాయలతో పాటు ఆ అడవిలో విస్తారంగా దొరికే కోడిశే. పంచోది వుపె ఈ మూడురకాల ఆకులను మాత్రమే వాటికి ఆహారంగా మేపుతుంటారు. మేకలనేవి సహజంగా అడవిలో తిరుగుతూ దొరికిన ప్రతి ఆకునూ తినిపెరుగుతుంటాయి. కానీ ఈ మేకపిల్లలకు మాత్రం కేవలం పైన పేర్కొన్న ఆ మూడు రకాల ఆకులను మాత్రమే తినిపిస్తుంటారు. సాధారణంగా పశువులు, మేకలు దొరికిన ఆహారాన్ని దొరికినట్టు గబగబా తింటూ తిరుగుతుంటాయి. ఆ తరువాత స్థిమితంగా పడుకున్నప్పుడు అంతకుముందు నమిలిమింగిన ఆహారాన్ని మళ్ళీ నెమరుకుతెచ్చుకొని మెత్తగా నమిలిమింగుతుంటాయి. అదేవిధంగా ఈ దొడ్లల్లో తోలిన మేకపిల్లలు కూడా ఎండుతుమ్మకాయలను పైన పేర్కొన్న మూడురకాల ఆకులను దొరికినప్పుడు గబగబా తిని మళ్ళీ

నెమరు వేసేటప్పుడు తుమ్మగింజలను బైటికి వెళ్ళగొస్తుంటయి. ఆ విధంగా వెళ్ళగొసే సందర్భంలో వాటి ప్రమేయం లేకుండానే అప్పుడోగింజ ఇప్పుడో గింజా గొంతులోకి జారి వాటి కడుపులోకి వెళ్ళిపోవడం జరుగుతుంది.

ఆ విధంగా లోపలికి వెళ్ళిన ఆ తుమ్మగింజలు వాటి జీర్ణాశయం లోపలవుండే ఓ ప్రత్యేకమైన అరలో నిలిచిపోతాయి. ఆ విధంగా నిలిచిపోయినా తుమ్మగింజలు కాస్తా వాటికి మేపే ఆ కొడిశ, పంచోది, వుపె ఆకు పసరుల కారణంగా ఒక విధమైన రసాయనిక చర్యకులోనవుతూ వాటిమీద ఒకవిధమైన గట్టిపొర ఏర్పడి క్రమంగా రంగురాళ్ళుగా మారిపోతాయి. ఆ రాళ్ళకు ఏర్పడే రంగులు వాటికి మేపే ఆకుల్లో ఒకరకం ఆకు ఎక్కువగా తినిపించిన మేకపిల్ల కడుపులో ఒక రకం రంగురాళ్ళు అధికంగా తయారవుతాయి. ఆ రాళ్ళు చూడడానికి చిన్న పిల్లలు తినే చాక్‌లెట్స్ మాదిరిగా వుంటాయి.



> ఆ కథను చదివిన పెద్దవారు కొందరు ఈ రకమైన కథావస్తువుతో ప్రపంచ కథాసాహిత్యంలోనే ఇంతవరకు ఎవ్వరూ వ్రాయని కథను నువ్వు వ్రాశావు అంటూ వెన్నుతట్టి ప్రోత్సహించారు. ఆ విధంగా ఒక జిల్లా ఎడిషన్లో వచ్చిన ఒక నరబలి అనే ఒక చిన్న బాక్స్ ఐటమ్ అంతవరకు ప్రపంచ కథాసాహిత్యంలోనే ఎవ్వరూ వ్రాయని కథావస్తువుగా తెలియడంతోనూ అలా తెలియజేసిన పెద్దవారికీ ఈ సందర్భంగా మరోమారు ధన్యవాదములు తెలియజేసు కుంటున్నాను.

మేకలు చిన్నపిల్లలుగా వున్నప్పుడు సంక్రాంతికి దొడ్లలోకితోలితే అవి నెమ్మదిగా పెరిగి దసరానాటికి పెద్దవవుతాయి. వాటితోపాటే వాటి కడుపుల్లో రంగురాళ్ళూ పెరుగుతుంటాయి. ఆ మేకలు పెంచేవాళ్ళు మధ్యమధ్య వాటి డొక్కల్లో చేతితో గట్టిగా తట్టి చూస్తుంటారు. అలా తట్టినప్పుడు ఒక విధమైన చప్పుడు వినిపిస్తుంది. ఆ చప్పుడును బట్టి మేకల కడుపుల్లో రాళ్ళు తయారయ్యింది లేనిది వాళ్ళకు తెలిసిపోతుంది. ఏది ఏమైనా దసరానాటికి ఆ మేకలను కోతకిచ్చి వాటికడుపుల్లో వుండే రంగురాళ్ళను తీసుకుంటారు. అలా చెయ్యకపోతే మేకల కడుపుల్లో తయారైనా ఆ రాళ్ళు కాస్తా పదినెలలు దాటితే వాటి పెంటికలతోపాటు పడిపోతాయి. అందుకే వాటిని దసరా పండుగనాటికల్లా ఇల్లందు దాని చుట్టుపక్కల మార్కెట్లకి తోలేస్తుంటారు. ఎంత పెద్దమేకనైనా బరువుతో సంబంధం లేకుండా ఐదువందలకే ఇచ్చేస్తుంటారు. అందువల్ల దసరాముందు రాళ్ళమేకలు మార్కెట్ కి వచ్చాయంటే చాలు కటికదుకాణంవాళ్ళకు చెప్పలేనంత ఆనందం. ఒక దుకాణం వాళ్ళకు ఎన్నిమేకలు ఇస్తే తిరిగి ఆ దుకాణం వాళ్ళు అన్ని ఐదువందలతో పాటు ఆ మేకల కడుపుల్లోనుండి తీసిన రాళ్ళతిత్తులను దొడ్లయజమానులకు తిరిగి ఒప్పచెబుతుంటారు. అది వాళ్ళ మధ్య వుండే వ్యాపారపరమైన ఒడంబడిక.

ఆ విధంగా పోగుచేసిన రాళ్ళను బొంబొయి నుండి వచ్చిన సేట్లు తులం ఒక్కంటికి ఐదువేల నుండి ఎనిమిది వేల వరకు రేటుపెట్టి కొనుక్కుపోతారు. అసలు ఆ ముంబై సేట్లే ఇల్లందు అడవుల్లో రాళ్ళమేకలు పెంచడానికి పెట్టుబళ్ళు పెడుతుంటారని అంటుంటారు. మరి ఇంత పకడ్బందీగా ఇన్ని ప్రత్యేకతలతో సంపాదించే ఆ రంగురాళ్ళను ఏం చేస్తారూ? దేనికి ఉపయోగిస్తారని అక్కడి వాళ్ళను విచారిస్తే వాటిని వైద్యానికి ఉపయోగిస్తారని చెబుతారు. మరి ఏ విధమైన వైద్యంలో ఏవిధమైన జబ్బులకు వాడుతారు? అంటే మాత్రం అవన్నీ మాకు తెలియదంటూ సమాధానం చెబుతారు.

ఆ విధంగా నా గిరిజన మిత్రుని సహాయంతో రాళ్ళమేకలకు సంబంధించిన పూర్తిసమాచారాన్ని సంపాదించుకుని అతనికి ధన్యవాదాలు తెలియజేసుకుని ఇల్లు చేరాను. ఈ మొత్తం సమాచారం సేకరించడానికి నాకు మూడు మాసాలు పడితే దొరికిన ఆ సమాచారంతో కథను ఎలా ప్రారంభించాలి? అనేదానికి మరో మూడు మాసాలు

పట్టింది. ఆఖరికి ఒక మెడికో పాత్రను సృష్టించుకుని, ఆ మెడికో తాతగారు అతను పుట్టకముందు ఇల్లందు అడవుల్లో ఫారెస్ట్ అధికారిగా పనిచేసినట్టు ఆ అధికారి ఆనాడే రాళ్ళమేకలకు సంబంధించిన విశేషాలను ఉత్తరాలద్వారా తన భార్యకు తెలియజేసినట్టు ఆ పాత ఉత్తరాలు ఒక సందర్భంలో మెడికో మనమడు కంటపడినట్టు ఆ మెడికో తన తాతగారు వ్రాసిన ఆ రాళ్ళమేకల ఉదంతాన్ని తెలుసుకోవాలని ఇల్లందు అడవులకు బయలుదేరడంతో కథనుమొదలుపెట్టి అతను రాళ్ళమేకల ఉదంతాన్ని తెలుసుకోవడంతో ముగించాను. కథ ప్రారంభం కోసం మూడుమాసాలు తండ్లాడిన నేను ప్రారంభం దొరకగానే మూడురోజుల్లో కథను ముగించాను.

ఆ కథను పంపించిన వెంటనే చినుకు మాసపత్రికవారు ప్రచురించారు. ఆ కథను చదివిన పెద్దవారు కొందరు ఈ రకమైన కథావస్తువుతో ప్రపంచ కథాసాహిత్యంలోనే ఇంతవరకు ఎవ్వరూ వ్రాయని కథను నువ్వు వ్రాశావు అంటూ వెన్నుతట్టి ప్రోత్సహించారు. ఆ విధంగా ఒక జిల్లా ఎడిషన్లో వచ్చిన ఒక నరబలి అనే ఒక చిన్న బాక్స్ ఐటమ్ అంతవరకు ప్రపంచ కథాసాహిత్యంలోనే ఎవ్వరూ వ్రాయని కథావస్తువుగా తెలియడంతోనూ అలా తెలియజేసిన పెద్దవారికీ ఈ సందర్భంగా మరోమారు ధన్యవాదములు తెలియజేసు కుంటున్నాను. ఈ కథకు కీ.శే.ఆర్.ఎస్. కృష్ణమూర్తి మెమోరియల్ కథలపోటీలో ప్రథమ బహుమతి కూడా లభించింది.

ఒక కథ వ్రాయడం వెనుక ఇంత కథ నడిచింది. కొత్తగా కథలు వ్రాయాలనుకునేవారికి, ఇప్పటికే కొత్తగా వ్రాస్తున్న వారికీ ఈ సందర్భంగా నేను చేసే అభ్యర్థన ఒక్కటే. ప్రారంభం లో నేను పేర్కొన్న కథకుడి లక్షణాలకు అదనంగా ప్రతి కథకుడికీ పాము చెవులు, కుక్క ముక్కు, డేగ చూపులూ కావాల్సివుంటుంది. అప్పుడే ఓ కథకుడు సాధారణ వ్యక్తులకన్నా విభిన్నంగా తన చుట్టూ వుండే సమాజాన్ని పరిశీలించడం జరుగుతుంది. విభిన్నమైన కథా వస్తువులను సేకరించడానికి సాధ్యమవుతుంది. ఆ రకంగా కథకులు కథలపట్ల ఇష్టాన్ని పెంచుకుని, అందుకుతగ్గ కష్టాన్ని చేస్తూ కథా కథనాలమీద పట్టుసాధిస్తూ కథలు వ్రాసినట్టయితే వారు తప్పకుండా భవిష్యత్‌లో నిస్సంశయంగా మంచి కథకులుగా గుర్తింపు పొందుతారు.






'కథకి గొప్పతనం పట్టాలంటే కథ చిత్రించే జీవితం భూమి నుంచి పైకి లేవాలి'.

– చలం

కథను ఏ రూపంలో రాసినా కథ ద్వారా పాఠకులకు ఒక సంస్కారాన్నీ ఒక కొత్త దృష్టినీ కల్గించడం ముఖ్యం'

– గోపీచంద్

కథలో కావ్యంలో చెప్పిన సత్యం ఒక ప్రత్యేక యుగానికి సంబంధించినదే అయినా, అది అనంత యుగాల్ని స్పృశిస్తూ ఉంటుంది. ఇలా అఖండ కాలాన్ని స్పృశించగలిగినప్పుడే ఆ రచన సార్థకమవుతుంది. ఒక మధుర భావనగానీ, ఒక భయంకర సంవేదనగానీ వ్యక్తి మనస్సులో పుట్టి, వెంటనే నశించిపోతే అది కథావస్తువు కానేరదు.

– సొదుం జయరాం

ఏకాంశ వ్యగ్రమై స్వయం సమగ్రమైన కథాత్మక వచన ప్రక్రియ కథానిక

– పోరంకి దక్షిణామూర్తి

చదవండి **అస్మిత ప్రచురణలు** చదివించండి
















1. మహిళావరణం - ఓల్గా, వసంత కన్నబిరాన్, కల్పన కన్నబిరాన్
2. ఈ కాలమ్ - ఓల్గా, వసంత కన్నబిరాన్
3. సంకలిత (సాహిత్య వ్యాసాలు) - ఓల్గా
4. సహిత (సాహిత్య వ్యాసాలు) - ఓల్గా
5. కఠోర షడ్జమాలు - వసంత కన్నబిరాన్
6. విముక్త (కథలు) - ఓల్గా
7. స్వేచ్ఛ (నవల) - ఓల్గా
8. పలికించకు మౌన మృదంగాలను - ఓల్గా
9. సహజ (నవల) - ఓల్గా
10. ఓల్గా తరంగాలు - అబ్బూరి ఛాయాదేవి, మృణాలిని
11. గురజాడ అడుగుజాడ (సాహిత్య వ్యాసాలు) - ఓల్గా

ప్రతుల కొరకు

**అస్మిత రిసోర్స్ సెంటర్ ఫర్ విమెన్, టీచర్స్ కాలనీ, ఈస్ట్ మారేడ్‌పల్లి**

**సికింద్రాబాద్ - 500 026, ఫోన్: 040- 27733229**

## కె. ఆనందాచారి

# కథా కార్యశాల ప్రయోజనకరం



సమాజంలో, జీవితాల్లో వున్నదే మేము చెబుతున్నామని అందరూ చెబుతారు. కానీ ఎందుకోసం ఒక విషయాన్ని చెబుతున్నామో, స్పష్టపరచదలచామో ముందుగా నిర్ణయించుకోవాలి. ఇక్కడే రచయిత సామాజిక బాధ్యత సమస్య ఎదురౌతుంది. ఏ విలువల కోసం, ఎలాంటి సమాజం కోసం రచయిత ఆలోచిస్తున్నాడో తేటతెల్లమవుతుంది.

హైదరాబాద్‌లో జరిగిన కథా కార్యశాల లక్షిత ప్రయోజనం కంటే ఒకింత ఎక్కువ ఫలితాన్నే ఇచ్చింది. చాలాకాలం తర్వాత కథలపైన ఇంత విస్తృతంగా రెండు వందలమంది కథనోత్సాహులతో ఒక రోజంతా చర్చోపచర్చలు జరగటం గొప్ప అనుభూతిని, ప్రేరణను కలిగించింది. ప్రసిద్ధులైన కథా రచయితలే కాక ఇపుడిప్పుడే కథలు రాస్తున్నవారు, రాయాలన్న ఉత్సాహాన్ని కలిగి వున్నవాళ్ళూ చాలా శ్రద్ధగా పాల్గొన్నారు. కొత్తగా రాస్తున్నవాళ్ళు ఎంత ఉత్సాహాన్ని పొందారో చేయి తిరిగిన రచయితలూ నూతనోత్సాహాన్ని నింపుకున్నారు. అంతమంది పాల్గొనటమే కాదు రచనపట్ల సీరియస్‌నెస్ కూడా వారిలో వుండటం కార్యశాల సాధించిన విజయం.

కథా పరిణామం, కథా నిర్మాణం, వస్తు శిల్పాల ప్రాధాన్యాలు సామాజిక మార్పుల అవగాహన రాజకియ ఆర్థికాంశాల పరిశీలన మొదలైన విషయాలపై ప్రసంగాలు, వివరణలు కొత్తవారికి ఎంతో ఉపయోగపడే ప్రాథమిక విజ్ఞానాన్ని అందించాయి. అంతేకాదు ఆరుగురు ప్రముఖ కథారచయితలు వారి సొంత కథల నేపథ్యాన్ని, కథలను విశ్లేషణాత్మకంగా వివరించిన తీరు అందరినీ ఆకట్టుకుంది. కథా రచయితలకు వుండాల్సిన దృష్టికోణాన్ని విడమర్చింది. వస్తువునూ, శిల్పాన్ని ఎలా సమకూర్చుకున్నది, సంభాషణ, భాష, యాస గురించిన కృషి ఎలా చేసింది మొదలైన ఎన్నో విషయాలు తమ స్వీయకథా విశ్లేషణలో రచయితలు ఆసక్తిగా వివరించారు. ఇది పాల్గొన్నవారికి మంచి స్ఫూర్తిని అందించాయి.

కుప్పిలి పద్మ, బారహమతుల్లా, వేంపల్లి షరీఫ్, యాళ్ళ అచ్యుత రామయ్య, శిరంశెట్టి కాంతారావు, ఉమామహేశ్వర్‌రావు ఈ ఆరుగురు విశ్లేషించిన కథల ఇతివృత్తాలు వారు స్వయంగా చూసిన జీవితాలకు, సామాజిక సంబంధాలకు సంబంధించినవే కావటం గమనించదగిన అంశం. చూడగలిగితే, చూసే దృష్టిని అలవరచుకుంటే సమాజం, జీవితం, మనకెన్నో కథావస్తువుల్ని అందిస్తుందనీ, జీవిత పరిశీలన, సాధనలోంచి శిల్పమూ అలవడుతుందనీ వారి విశ్లేషణలో అర్థమయింది.

అయితే కథ ఎలా రాయాలి, వస్తువేమిటి, శిల్పమేమిటి అని తెలుసుకోవటం ద్వారానే కథలు రాయలేమనేది అందరికీ

తెలిసిన విషయం. కానీ ఒక పని కానీ నిర్మాణం కానీ చేసేటపుడు ఎలా చేయాలో ప్రాథమికాంశాలు తెలుసుకోవడం అవసరమే. నీళ్ళలోకి దిగకుండా ఈత ఎలా నేర్చుకోలేమో, కథ రాయటం ద్వారానే ఎలా రాయాలో, ఎలా రాయరాదో కూడా తెలుసుకోగలుగుతాము. అయితే ఏదీ ఊరకనే రాదు అనే సూత్రం కథలు రాయడానికీ వర్తిస్తుంది. సాధన కావాలి, స్పందన ఉండాలి. నేర్పు, కూర్పుతోపాటు తాను రాస్తున్న విషయాల పట్ల నిజాయితీ వుండాలి. సమాజంతో, సమూహాలతో మనుషులతో సంబంధాలు కలిగుండాలి. కథలు రాయడానికి కనీసావసరాలివి.



ఇకపోతే కథలు రాయాలనుకునే వాళ్ళు మనకు ముందు వచ్చిన గొప్ప కథలను చదవాలి. ఇప్పటికే వచ్చిన కథలు తప్పకుండా చదవాలి. చదివిన కథల ప్రభావం మనమీద ఉన్నప్పటికీ ఏమీ చదవకుండా కొత్తగా రాయలేము. మన కథల్లో, సినిమాల్లో ఉన్న ప్రేమలు, ద్వేషాలు, భయానకాలు, భీభత్సం, దయ, కారుణ్యం, బాధ, దుఃఖం, ట్విస్టులు, హాస్యము, ఆనందము, సౌందర్యము మొదలైనవన్నీ మన నిజ జీవితంలో, సమాజంలో ఎక్కువగానే వున్నాయి. దుర్మార్గము, దుష్టత్వమూ వుంది. చూడగలగాలి. ఇక్కడే ఇంకో విషయం చెప్పుకోవాలి. సమాజంలో, జీవితాల్లో వున్నదే మేము చెబుతున్నామని అందరూ చెబుతారు. కానీ ఎందుకోసం ఒక విషయాన్ని చెబుతున్నామో, స్పష్టపరచదలచామో ముందుగా నిర్ణయించుకోవాలి. ఇక్కడే రచయిత సామాజిక బాధ్యత సమస్య ఎదురౌతుంది. ఏ విలువల కోసం, ఎలాంటి సమాజం కోసం రచయిత ఆలోచిస్తున్నాడో తేటతెల్లమవుతుంది. అన్నీ సమాజంలోనే ఉంటాయి. మనమనుకునే మంచీ చెడు, మానవీయత, అమానవీయత. ఏ విలువకు పాఠకుడి స్మృతిలోకి తేవాలనుకుంటున్నాము అనేది కథ యొక్క సారాంశంగా వుండాలి. విస్మరించాల్సిన, వొదిలివేయాల్సిన విలువలేమిటో తెలుసుకోవటం అవసరం.

**కథ అంటేనే కల్పనతో కూడుకొని వుంటుంది. కానీ ప్రాపంచిక వాస్తవిక పరిధిని దాటి పోకూడదు. ఇందులో ఎన్ని టెక్నిక్స్ అయినా ప్రయోగించవచ్చు. చెప్పే విషయాన్ని నూతనంగా వైవిధ్యంగా గుండెకు హత్తుకునే విధంగా చెప్పగలగాలి. కథలోని పాత్రలతో, సంఘటనలతో పాఠకుడు తనను పోల్చుకోవటం, ఐడెంటిఫై కావటంలోనే కథ విజయవంతం అవుతుంది.**

అందుకనే రచయిత సమాజాన్ని లోతుగా పరిశీలించాలి. సమాజం, జీవితం పైకి కనపడుతున్న దానికి అంతర్గత అంశాలకున్న సంబంధాన్ని అర్థం చేసుకోగలగాలి. పూలదండలో దారం దాగివున్నట్లుగా జీవితపు బాహ్య ప్రవర్తనలో, సంఘటనల్లో అంతర్గత అంశాలు దాగి వుంటాయి. వీటిని అర్థం చేసుకోవటంలోనే రచయిత సామర్థ్యం దాగివుంటుంది. జీవితాన్ని సమాజాన్ని డ్రైవ్ చేస్తున్న అంశాలు ఏమిటన్నది తెలుసుకోగలిగితే కథలో చెప్పాలనుకున్న విషయాన్ని స్పష్టంగా చెప్పగలగుతాము.

ఇక కథ చెప్పే పద్ధతి, నైపుణ్యం కృషి ద్వారా సాధించాలి. కల్పనలైనా, ఊహలైనా కథగా అల్లామనుకుంటే సరిపోదు. జీవిత వాస్తవికతకు దగ్గరగా వుంటేనే పాఠకుడు స్వీకరించగలుగుతాడు. ఫిక్షన్, జానపద కథల్లోని సాహసాలు ఎన్ని ఉన్నప్పటికీ కథా భూమిక సామాజికమయి వుంటే పాఠకుడు అనుభూతి చెందుతాడు. కథ అంటేనే కల్పనతో కూడుకొని వుంటుంది. కానీ ప్రాపంచిక వాస్తవిక పరిధిని దాటి పోకూడదు. ఇందులో ఎన్ని టెక్నిక్స్ అయినా ప్రయోగించవచ్చు. చెప్పే విషయాన్ని నూతనంగా వైవిధ్యంగా గుండెకు హత్తుకునే విధంగా చెప్పగలగాలి. కథలోని పాత్రలతో, సంఘటనలతో పాఠకుడు తనను పోల్చుకోవటం, ఐడెంటిఫై కావటంలోనే కథ విజయవంతం అవుతుంది.

నిత్యనూతనమైన, నవనవోన్మేషమైన జీవితపు వివిధ పార్శ్వాలను పరిశీలిస్తూ, అవగాహన చేసుకుంటూ, సామాజిక అస్పష్టతలను స్పష్టపరిచే దృషికోణాన్ని పొందగలిగితే మంచి కథకులుగా ఎదుగుతారు. అలాంటి ఉత్సాహవంతులైన రచయితలకు అప్పుడప్పుడూ ఇలాంటి కథా కార్యశాలలు, ప్రసిద్ధ రచయితల అనుభవాలు ఎంతో ప్రయోజనాన్ని చేకూర్చుతాయి. అందులో విజయాన్ని సాధించింది హైదరాబాద్ కథా కార్యశాల.



# 3



- 1900-1947 మధ్య తెలుగు సాహిత్యం సింహావలోకనం

  \- కె.కె. రంగనాథాచార్యులు

- అర్థశతాబ్దపు తెలుగు కథ ఒక అంచనా - డా॥ కాత్యాయనీ విద్మహే

- తెలుగు కథా సాహిత్యంలో

  హిందూ-ముస్లిం సమైక్యతా ధోరణులు - కె.పి. అశోక్‌కుమార్

## 1900-1947 మధ్య తెలుగు సాహిత్యం

# సింహావలోకనం

కె.కె. రంగనాథాచార్యులు

తెలుగు సాహిత్య వికాసం
(1900 - 1947 సంవత్సరాల మధ్య)

[అక్టోబరు 1978 నుండి సెప్టెంబరు 1979 వరకు జరిగిన "సారస్వత వేదిక" ఉపన్యాసాల సంకలనం.]

సంపాదకుడు:
డా॥ కె. కె. రంగనాథాచార్యులు



ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500 001.

> ఒక్కొక్క జాతి జీవితంలో పురోగమనానికి కారణమైన వివిధ ఉద్యమాలన్నీ పరస్పరం పెనవేసుకొని వస్తుంటాయి. కందుకూరి సంఘ సంస్కరణోద్యమం, గిడుగు వ్యావహారిక భాషోద్యమం, కందుకూరి - గురజాడల సాహిత్యోద్యమాలు, కొమర్రాజు చరిత్ర పరిశోధన, విజ్ఞాన శాస్త్ర ప్రచార, గ్రంథాలయోద్యమాలు - వీటితో పాటు భారతదేశం స్వాతంత్ర్యం కోసం సాగుతున్న జాతీయోద్యమం ఈ శతాబ్ది పూర్వార్థాన్ని తెలుగుదేశ చరిత్రలోనే మహోన్నత యుగంగా నిలబెట్టాయి.

ఆధునిక సాహిత్యానికి ఉషఃకిరణాలు పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధంలోనే ప్రసరించినా అది సమగ్రతను, పరిపూర్ణతను సంతరించుకొన్నది ఇరవయ్యవ శతాబ్ది పూర్వార్ధంలోనే. తెలుగు జాతి పునరుజ్జీవనానికి కారణమైన మహానుభావులు చాలామంది జన్మించింది కూడా పందోమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలోనే అయినా వారి ఉద్యమాలు పరాకాష్ఠను పొందిందికూడా ఇరవయ్యో శతాబ్ది పూర్వార్ధంలోనే. ఒక్కొక్క జాతి జీవితంలో పురోగమనానికి కారణమైన వివిధ ఉద్యమాలన్నీ పరస్పరం పెనవేసుకొని వస్తుంటాయి. కందుకూరి సంఘ సంస్కరణోద్యమం, గిడుగు వ్యావహారిక భాషోద్యమం, కందుకూరి - గురజాడల సాహిత్యోద్యమాలు, కొమర్రాజు చరిత్ర పరిశోధన, విజ్ఞాన శాస్త్ర ప్రచార, గ్రంథాలయోద్యమాలు - వీటితో పాటు భారతదేశం స్వాతంత్ర్యం కోసం సాగుతున్న జాతీయోద్యమం ఈ శతాబ్ది పూర్వార్థాన్ని తెలుగుదేశ చరిత్రలోనే మహోన్నత యుగంగా నిలబెట్టాయి. అందుకే ఈ ఉద్యమాలు భూమికగా ఉన్నతశిఖరాలందుకున్న ఈ కాలపు సాహిత్య వికాసాన్ని అధ్యయనం చేయటం తెలుగు సాహిత్య చరిత్ర అధ్యయనంలో ప్రాముఖ్యాన్ని వహిస్తుంది.

ఇరవయ్యో శతాబ్ది పూర్వ భాగంలోని తెలుగు సాహిత్య వికాసాన్ని గురించి చెప్పుకొనే ముందు ఆధునిక సాహిత్యానికి మూలస్తంభాలైన కందుకూరి గురజాడలను గురించి ప్రత్యేకంగా పేర్కొనవలసి ఉంటుంది. కందుకూరి వీరేశలింగం పేరు తెలుగుజాతి చరిత్రలో ముఖ్యంగా సంఘ సంస్కరణోద్యమంతోనే ముడిపడి ఉన్నా ప్రాచీన సాహిత్య క్షీణ యుగపు చీకట్లను చీలుస్తూ ఆధునిక సాహిత్యం వెలుగులను ప్రసరింపజేసిన వాడుగా తెలుగు సాహిత్య చరిత్రలో ఆయనకు ప్రత్యేక స్థానం ఉన్నది. తెలుగు సాహిత్యానికి కందుకూరి ఆధునికతను సంతరింపజేసిన నూతనాంశాలు నాలుగు. 1 సామాజిక ప్రయోజనానికి, ముఖ్యంగా సంఘసంస్కరణకు

సాహిత్యాన్ని సాధనంగా చేయటం. 2. అలంకారాలతో దీర్ఘ సమాసాలతో నిండిన కవిత్వాన్ని, గర్భబంధ, చిత్ర కవిత్వాలను నిరసించి ఆధునికతకు ప్రధాన లక్షణమైన సరళమైన కవిత్వం అవసరాన్ని సూచించడం. సరస్వతీ నారద సంవాదం ఈ అశయాన్నే చాటి చెప్తుంది. 3. ప్రబంధ యుగంలో ప్రారంభమై దక్షిణాంధ్రవాఙ్మయ యుగం చివర పరాకాష్ఠ పొందిన అంగాంగి వర్ణనలతో కూడి భౌతిక శృంగారం నిండిన రచనలను నిరసించటం, అందుకే ముద్దు పళని 'రాధికా సాంత్వనా'న్ని నిషేధింపజేశాడు. తారాశశాంకవిజయాన్ని తగలబెట్టమన్నాడు. కామోన్మత్తుల్ని చేస్తుందని 'వసుచరిత్ర'లాంటి ప్రబంధాల్ని చదువకపోతే బాగుంటుందన్నాడు. 4. అంతవరకు ఒక పద్యప్రక్రియ మాత్రమే తెలుగు సాహిత్యంలో ప్రధానంగా ఉండగా అనేక వచన ప్రక్రియల్ని ప్రవేశపెట్టి ప్రచారం తీసుకొని రావటం, తెలుగులో మొదటి నవలను రాయటమే కాకుండా, పోటీలద్వారా నవలా రచనలను ప్రోత్సహించాడు కందుకూరి. వివిధ శాస్త్ర విషయాలకు, సాహిత్య విమర్శలకు, మూఢ నమ్మకాలను ఖండించటానికి సంబంధించిన అనేక వ్యాసాలను రాయటం ద్వారా ఆ ప్రక్రియకు ప్రచారం కలిగించాడు; నాటికలని చెప్పదగ్గ ప్రహసనాలను మొదటిసారిగా రాశాడు; శాస్త్ర గ్రంథాలను అనువాదం చేశాడు; రచించాడు. సంప్రదాయ పద్ధతిలో కాక కొత్త పద్ధతిలో తెలుగుకి వ్యాకరణం రాశాడు; తెలుగువాచకాలు తయారు చేశాడు; 'వివేకవర్ధని' లాంటి పత్రికల ద్వారా తెలుగులో జర్నలిజానికి మార్గం వేశాడు; మొదటి నాటక కర్త కాకపోయినా అనేక సంస్కృత నాటకాలను, ఆంగ్ల నాటకాలను అనువాదం చేశాడు; స్వతంత్రంగా నాటకాలు రాశాడు; తరువాత తెలుగు సాహిత్య చరిత్ర గ్రంథాలకు ఆధార గ్రంథం అనదగ్గ 'తెలుగు కవుల చరిత్ర'ను సమగ్రమైన విధానంలో రాసి తెలుగు సాహిత్య పరిశోధనా పద్ధతులకు మార్గం వేశాడు. పై అంశాలు కందుకూరి ఆధునిక తెలుగజాతి చరిత్రకే కాకుండా, ఆధునిక తెలుగు సాహిత్యానికి కూడా 'యుగకర్త'ను చేశాయి.



**కందుకూరి సంఘ సంస్కరణోద్యం, గిడుగు వ్యావహారిక భాషోద్యమం రెండూ గురజాడలో సమన్వయం పొంది తెలుగు సాహిత్య నవయుగ వైతాళికుణ్ణి చేశాయి. ఆయన సాహిత్యానికి వస్తువు సమకాలీన సమాజం; పద్య ప్రయోజనం సంఘ సంస్కరణం; అంతిమ ప్రయోజనం విశ్వమాన సౌభ్రాతృత్వం; ఆలోచనా విధానం శాస్త్రీయం; దృష్టి ప్రజాదృష్టి;**

కేవలం సాహిత్యాన్ని మాత్రమే తీసుకొన్నప్పుడు వస్తువులో, రూపంలో, భాషలో, సంవిధానంలో – సాహిత్యానికి సంబంధించిన అన్ని అంశాలలో నవ్యతకు ఆద్యుడైనవాడు గురజాడ అప్పారావు. గురజాడ కేవలం కవి రచయిత మాత్రమే కాదు. మేధావి. భవిష్యత్సమాజాన్ని దర్శించగల ద్రష్ట; మానవతావాది. కందుకూరి సంఘ సంస్కరణోద్యం, గిడుగు వ్యావహారిక భాషోద్యమం రెండూ గురజాడలో సమన్వయం పొంది తెలుగు సాహిత్య నవయుగ వైతాళికుణ్ణి చేశాయి. ఆయన సాహిత్యానికి వస్తువు సమకాలీన సమాజం; పద్య ప్రయోజనం సంఘ సంస్కరణం; అంతిమ ప్రయోజనం విశ్వమాన సౌభ్రాతృత్వం; ఆలోచనా విధానం శాస్త్రీయం; దృష్టి ప్రజాదృష్టి; భాష అంత వరకు తెలుగు కావ్యాలలో కనిపించే సంస్కృత జటిలమైన శైలికి భిన్నమైన సరళమైన వ్యావహారిక భాష; కవితారూపం అంతవరకు పండితులకు మాత్రమే పరిమితమైన వృత్తాలు, గణబద్ధ ఛందస్సు కాక సామాన్యులు పాడుకోవటానికి అనుకూల మైన మాత్రా ఛ్ఛందస్సు, గేయ ఫణితి – ఇవి గురజాడ ఆధునిక కవి వాల్మీకి కావటానికి కారణాలు. తెలుగులో తొలి ఆధునిక నాటకం 'కన్యాశుల్కాన్ని', తొలి కథానికను రాసింది గురజాడే. ఆధునిక యుగ ప్రధాన లక్షణమయిన ఖండకావ్య రచనకు కూడా గురజాడనే మొదటి వాడుగా పేర్కొనాలి. అయితే గురజాడ మరణించిన తరువాత ఇరవై అయిదు సంవత్సరాలకుగాని ఆయనకు గుర్తింపు, ప్రచారం రాలేదు. దీనికి మొదటి కారణం భావ కవిత్వం,

ధోరణి నవ్యమైనదైనా భాష, ఛందస్సు మొదలైనవన్నీ ప్రాచీన పద్ధతికి సంబంధించినవే భావకవిత్వంలో, ఆ కారణం వల్ల పండితులు, సాంప్రదాయకులు నవ్య కవిత్వం పేరిట భావకవిత్వాన్నే ఆదరించారుగాని అన్నింటా నవ్యతగల గురజాడను తట్టుకోలేకపోయారు. భావకవిత్వంతోపాటు దేశభక్తి పేరిటా, ఆంధ్రాభిమానం పేరిటా వచ్చిన గత పునరుద్ధరణ వాద కవిత్వం రెండవకారణం. వేదకాలం నాటి భారతీయ సంస్కృతిని, శాతవాహనుల నాటి ఆంధ్ర వైభవాన్ని వర్ణించే కవిత్వానికి ప్రచారం ఇచ్చిన సాంప్రదాయకులు 'దేశమంటే మట్టికాదోయ్' 'మంచి గతమును కొంచెమేనోయ్' అనే గురజాడ భావాలను జీర్ణించుకోలేకపోయారు. మూడవదీ, అన్నిటికంటే ముఖ్యమైనదీ అయిన కారణం గురజాడ తాను నివసించిన కాలం కంటే నూరేళ్లు ముందుండటం (చూ. ఇదే గ్రంథంలో బూదరాజు రాధాకృష్ణ పే. 185). 'కొయ్య బొమ్మలు మెచ్చు కనులకు, కోమలులు సౌరెక్కునా' అని ఆధునిక కవితను గురించి గురజాడ వెలువరించిన అభిప్రాయాలు, 'మగడు వేల్పన పాతమాటది, ప్రాణ మిత్రుడ నీకు...' అని భార్యభర్తల సంబంధాన్ని నిర్వచించిన విధానం 'మలిన దేహుల మాలలనుచును, మలిన చిత్తుల కధికకులముల, నెల వొసంగిన వర్ణ ధర్మమధర్మ ధర్మంబే' అని వర్ణాధార్మాన్ని అధర్మ ధర్మంగా భావించటం, 'మంచి చెడ్డలు మనుజులందున, యెంచి చూడగ రెండు కులములు, మంచియన్నది మాలయైతే, మాలనేఅగుదున్' అని కులభేధాలను కాదనటంతోపాటు సమాజంలో అట్టడుగున ఉన్న మాలలను గురించి ఆలోచించటం, 'మతములన్నియు మాసిపోవును, జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును' అని మతాలనే తోసి రాజనటం, 'యెల్ల లోకము వొక్కయిల్లై' అని విశ్వమానవ సౌభ్రాతృత్వాన్ని ప్రకటించటం సమకాలీన కవులకే కాదు నేటి కవులలో చాలామందికి కూడా ఆలోచనా స్థాయికి అందని విషయాలు. ఊహలోకి రాని అంశాలు. తెలుగు దేశంలోనే కాదు మొత్తం భారతదేశంలోనే సాహిత్యరంగంలో తాను చేస్తున్న కృషికి సమతుల్యమైన కృషి కనిపించదని గురజాడే స్వయంగా చెప్పుకున్నాడు. అభ్యుదయ సాహిత్యోద్యమం పుంజుకున్న తరువాతనే గురజాడ ప్రగతిశీల చారిత్రక పాత్రను గుర్తించటం జరిగింది.



**తెలుగు దేశంలోనే కాదు మొత్తం భారతదేశంలోనే సాహిత్యరంగంలో తాను చేస్తున్న కృషికి సమతుల్యమైన కృషి కనిపించదని గురజాడే స్వయంగా చెప్పుకున్నాడు. అభ్యుదయ సాహిత్యోద్యమం పుంజుకున్న తరువాతనే గురజాడ ప్రగతిశీల చారిత్రక పాత్రను గుర్తించటం జరిగింది.**

1900-1947 మధ్య తెలుగు కవిత్వం ప్రధానంగా రెండు పాయలుగా కనిపిస్తుంది. ఒకటి సంప్రదాయ కవిత, రెండవది ఉద్యమశీలమైన నవ్య కవిత లేక ఆధునిక కవిత. ఖండ కావ్యాలు కొన్ని ప్రాచీన ఛందస్సులో ఉన్నా కవిత్వం కథనుంచి వేరు కావటం అనే నవ్య కవితా లక్షణానికి సంబంధించినవి కాబట్టి ముఖ్యంగా సుదీర్ఘకావ్యాలను మాత్రమే సంప్రదాయ కావ్యాలుగా స్వీకరించవలసి ఉంటుంది. వీటిని ముఖ్యంగా నాలుగు భాగాలుగా విభజించవచ్చు. 1. ప్రాచీన పురణేతిహాసాలు వస్తువులుగా రచించినవి. వావికొలను సుబ్బారావు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి మొదలైన వాళ్లు ఈ కోవలోకి వస్తారు. విశ్వనాథ 'రామాయణ కల్పవృక్షము'లో కొన్ని కాండలు స్వాతంత్ర్యానికి పూర్వమే వచ్చాయి. 2. జాతీయోద్యమ కాలంలో అంతకు ముందు కావ్య వస్తువులు కాని వీరుల కథలను వస్తువులుగా, తీసుకొన్న గ్రంథాలు, గడియారం వేంకటశేషశాస్త్రిగారి 'శివభారతము' దర్భాక రాజశేఖర శతావధాని 'రాణా ప్రతాపసింహ చరిత్ర' ఈ పద్ధతికి సంబంధించినవి. తుమ్మల సీతారామమూర్తిచౌదరి గారి 'మహాత్మకథ' జాతీయ నాయకుణ్ణి వస్తువుగా తీసుకొన్న కావ్యాలలో ప్రధానమైంది. 3. పురాణ కథలకు కొత్త వాఖ్యానాలు చేసి, భావపరివర్తన కోసం సమన్వయం చేసినా రాసిన కావ్యాలు. త్రిపురనేని రామస్వామి చౌదరిగారి 'సూత

పురాణము’ లాంటివి 4. ఆశు కవితలు –అవరోధనాలు. నిజానికి ఇవి సుదీర్ఘ కావ్యాల కోవలోకి రాకపోయినా రూపం, వస్తువు, ధ్యేయం మొదలైన వాటిని బట్టి ఇవి సంప్రదాయ పరిధిలోకే వస్తాయి. ఈ శతాబ్ది పూర్వర్థంలో ప్రక్రియగా అశుకవిత – అవరోధాలు ఎక్కువ ప్రచారంలోకి వచ్చినా సాహిత్య స్థాయిని దృష్టిలో పెట్టుకొన్నప్పుడు అది ఉత్తమ కవిత్వం కావటానికి అవకాశాలు తక్కువ. రాజ్యాలు, రాజులు పోయి భూస్వామ్య వ్యవస్థ వేళ్లుపెకిలించుకొని పోతున్న తరుణంలో భూస్వామ్య సమాజ స్వభావాన్ని వదులుకోలేని సంప్రదాయకవులకు ఆలంబనగా నిలిచింది ఆశుకవిత – అవధానాలు. ఈ ప్రక్రియ ఈ కాలంలో ఎక్కువ వ్యాప్తి చెందడానికి కూడా అ అవసరమే పనిచేసింది. ఈ ప్రక్రియగా గుర్తింపు తెచ్చిన ప్రతిభావంతులు తిరుపతి వేంకట కవులు. అయితే ప్రాచీన కవితకు భరత వాక్యం, ఆధునిక కవితకు నాందీ వాక్యం. పలికిన వారుగా వారిని పేర్కొనటం ఆధునిక సాహిత్య పరిణామంలో వారికి అవనరాన్ని మించిన పీట వేయటమే ఔతుంది. ‘కాలము బట్టి దేశమును గాంచి ప్రభుత్వమునెంచి, దేశభాష మారుతుంది, వంటి కొన్ని వారి అభిప్రాయ ప్రకటనలను వదిలేస్తే ఛందస్సులో, భావంలో, అభిప్రాయంలో, వస్తువులో తిరుపతి వేంకటకవులు వెళ్లటం అనే అంశాన్ని వీరు కాలానుగుణంగా సాధించారు. సంప్రదాయ పద్ధతిలోని ఖండ కావ్య కర్తలలో రాళ్లపల్లి, పుట్టపర్తి మొదలైన వాళ్లను చెప్పుకోవాలి. ప్రాచీన పద్ధతిలోనే అయినా సామాజిక స్పృహతో వస్తు నవ్యత చూపిన ప్రతిభావంతులైన కవులలో జాషువాను ముఖ్యంగా పేర్కొనాలి.



**సంప్రదాయ పద్ధతిలోని ఖండ కావ్య కర్తలలో రాళ్లపల్లి, పుట్టపర్తి మొదలైన వాళ్లను చెప్పుకోవాలి. ప్రాచీన పద్ధతిలోనే అయినా సామాజిక స్పృహతో వస్తు నవ్యత చూపిన ప్రతిభావంతులైన కవులలో జాషువాను ముఖ్యంగా పేర్కొనాలి.**

1900–1947 మధ్య తెలుగు సాహిత్యానికి ప్రత్యేకతను, ఆధునికతను సంతరింపజేసిన ఉద్యమశీలాలైన నవ్య కవితా ధోరణులు భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం, భావ కవిత్వానికి సమాంతరంగా వచ్చిన దేశ భక్తి కవిత్వం. తెలుగులో ఉద్యమాల ప్రత్యక్ష ప్రభావం కవితారంగం మీద పడినట్లుగా ఇతర ప్రక్రియలమీద పడినట్టు కనిపించదు. ప్రబంధయుగం, దక్షిణాంధ్ర వాఙ్మయ యుగాలనాటి భౌతికశృంగారం స్థానంలో మానసికమైన ప్రేమను, అమలిన శృంగారాన్ని నిలబెట్టిన భావకవిత్వం కందుకూరి ఉద్యమాలలో ఒకటైన పచ్చిశృంగారాన్ని వ్యతిరేకించటానికి లక్ష్యంగా నిలిచింది. పద్దెనిమిదవ శతాబ్దం ఉత్తరార్థం, పందొమ్మిదవ శతాబ్దం పూర్వార్థం మధ్యకాలంలో యూరప్‌లో, ముఖ్యంగా జర్మనీ, ఇంగ్లాండ్, ఫ్రాన్సు దేశాలలో వచ్చిన “రొమాంటిక్(( కవితా ఉద్యమానికి సుమారు వంద సంవత్సరాల తరువాత తెలుగులో వచ్చిన ప్రతిధ్వనే భావకవిత్వం (చూ. ముకురాల రామారెడ్డి పే. 97-46)

పారిశ్రామికవిప్లవం, తదితర కారణాలవల్ల పాత సంస్కృతి, విలువలు, కుటుంబ సంబంధాలు శిథిలమౌతున్న దశలో స్వేచ్ఛ పేరుతో, స్వాతంత్ర్యం పేరతో వైయుక్తిక మానసిక ప్రపంచాన్ని సృష్టించుకొని వ్యక్తి ప్రాధాన్యాన్ని నిలబెట్టే ప్రయత్నంలో ‘రొమాంటిక్” కవిత యూరప్‌లో బయలుదేరింది. నిజానికి భావకవిత్వానికి ప్రేరకశక్తులు, అలాంటి కవిత్వం రావటానికి గల పరిస్థితులు ఈ దేశంలో ఆనాడు లేవు. ఆంగ్లవిద్యావ్యాప్తి కారణంగా, ఆంగ్ల సాహిత్య పఠన ఫలితంగా, అనుకరణగా, అనుసరణగా మాత్రమే భావకవిత్వం తెలుగుదేశంలో వచ్చింది. భావకవులు వర్ణించిన ప్రణయం, విరహవేదన వారి జీవితానుభవం నుంచి వచ్చినవి కావు. అయితే ఆ మార్గంలోని కవులు కొందరు ప్రతిభావంతులు కావటం వల్ల , కవితాశిల్పంవల్ల భావకవిత్వం కొంతకాలమైనా తెలుగుదేశంలో నిలదొక్కుకోగలిగింది. శైలిలో, అభివ్యక్తిలో, పదప్రయోగంలో కనిపించిన నవీనగుణాలు ప్రబంధ క్షీణయుగం రచనలతో విసుగెత్తిన పాఠక లోకానికి కొత్త వెలుగు నివ్వటం కూడా భావకవిత్వం కొంత ప్రచారం

పొందగలగటానికి మరో కారణం. దేవులపల్లి కృష్ణశాస్త్రి, రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణారావు, తల్లావఝుల శివశంకరశాస్త్రి, మల్లవరపు విశ్వేశ్వరరావు, విశ్వనాథ సత్యనారాయణ భావకవులలో ఎన్నదగ్గవారు.

1910-1935 మధ్య భావకవిత్వంతోపాటు దేశభక్తి పేరిట ప్రాచీనత పైన అభిమానాన్ని, పునరుద్ధరణ కాంక్షనీ అభివ్యక్తీకరించే కవిత్వం కూడా వచ్చింది. భావకవులలో చాలామంది ఇలాంటి కవిత్వం కూడా రాశారు. జాతీయోద్యమానికి దోహదంగా దేశభక్తి ప్రేరేపక గీతాలు, పద్యాలు రాసిన వాళ్లలో వేదుల సత్యనారాయణశాస్త్రి, గరిమెళ్ళ సత్యనారాయణ మొదలయిన వాళ్లున్నారు. నిజానికి ఇలాంటి కవిత్వానికి నాందిగా చిలకమర్తి వారి పద్యం "భరతఖండంబు చక్కని పాడియావు" 1906లో వచ్చింది. ఈ కాలంలోనే వచ్చిన పామర పాత్రలతో, పామరభాషలో రచించిన నండూరి వెంకట సుబ్బారావు రచించిన "ఎంకిపాటలు" "బసవరాజు అప్పారావు గీతాలు" ప్రత్యేకంగా చెప్పుకోదగ్గవి.



పారిశ్రామికవిప్లవం, తదితర కారణాలవల్ల పాత సంస్కృతి, విలువలు, కుటుంబ సంబంధాలు శిథిలమౌతున్న దశలో స్వేచ్ఛపేరుతో, స్వాతంత్ర్యం పేరతో వైయుక్తిక మానసిక ప్రపంచాన్ని సృష్టించుకొని వ్యక్తి ప్రాధాన్యాన్ని నిలబెట్టే ప్రయత్నంలో 'రొమాంటిక్' కవిత యూరప్‌లో బయలుదేరింది.

"కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ, ప్రపంచ బాధ అంతా శ్రీశ్రీ బాధ" అన్న చలంమాట ఆ ఇద్దరూ వరుసగా ప్రాతినిధ్యం వహిస్తున్న భావ కవిత్వానికి, అభ్యుదయకవిత్వానికి సరిగ్గా ఇముడుతుంది. కవి తాను కల్పించుకొన్న బాధలను పాఠకుడికి వినిపించుకొనే రోజులు పొయ్యాయి. భావకవితాయుగంనాటి పడికట్టు పదాలతో పాఠకులు విసుగెత్తిపోయిన దశలో శ్రీశ్రీ, శిష్ట్లా, పఠాభి, శ్రీరంగం నారాయణబాబు భావకవిత్వం పైన తిరుగుబాటు చేశారు. వీరిలో చివరి ముగ్గురూ వ్యక్తులుగా మాత్రమే భావకవిత్వంపైన తిరుగుబాటు చేయగా,, శ్రీశ్రీ అభ్యుదయ కవిత్వోద్యమానికి ప్రారంభ కుడయ్యాడు. శిష్ట్లా, నారాయణబాబులలో ప్రజాజీవితానికి, పీడితులకు, హీనులకు సంబంధించిన వస్తువులు లేకపోలేదు. (చూ. కడియాల గోపాలరావు, పే. 53-56)

అభ్యుదయ కవిత్వానికి యుగకర్త శ్రీశ్రీయే. ఈ శతాబ్ది పూర్వార్థంలో అంతర్జాతీయ, జాతీయరంగాలలో ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగాలలో వేగంగా అనేకమైన మార్పులు వచ్చాయి. అంతర్జాతీయంగా వచ్చిన మార్పుల ఫలితం ప్రతిదేశంపైనా పడటం సహజం. ఆర్థిక, సామాజిక సమస్యలు ప్రపంచ మానవులందరికీ సంబంధించినవి. అందుకే అభ్యుదయ కవిత్వానికి ప్రేరకశక్తులు అంతర్జాతీయ మైనవే కాదు, జాతీయమైనవి కూడా. అందువల్లే యూరప్‌లో వచ్చిన "రొమాంటిక్" ఉద్యమానికి, తెలుగుదేశంలో వచ్చిన భావకవిత్వోద్యమానికి ఉన్నంత ఎడం పాశ్చాత్యదేశాలలో వచ్చిన "ప్రోగ్రెసివ్" పోయిట్రీ ఉద్యమానికి, అభ్యుదయ కవిత్వోద్యమానికి లేదు. అభ్యుదయ కవిత్వానికి మార్క్సిస్టు సిద్ధాంతాలు ఆత్మ, సమసమాజ నిర్మాణం ధ్యేయం.

1917 లో వచ్చిన రష్యావిప్లవ ప్రభావం ప్రపంచం అంతటా పడింది. 1992లో "న్యూ సిగ్నేచర్స్" పేరుతో లండన్ నుంచి ప్రోగ్రెసివ్ రచయితల కవితా సంకలనం వచ్చింది. 1935లో అఖిల భారత స్థాయిలో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడగా తెలుగుదేశంలో 1943లో మొదటి అభ్యుదయ రచయితల మహాసభలు జరిగాయి. శ్రీశ్రీ "మహా ప్రస్థానం" కవితలు 1933-41 మధ్య వచ్చాయి. అభ్యుదయ కవితా రచన 1933లోనే మొదలైనా ముఖ్యమయిన అభ్యుదయ కవితా సంకలనాలన్నీ 1947 తరువాతనే వచ్చాయి.

సామాజిక దృక్పథం, మానవసమస్యలు భూమిక కావటం కారణంగా అభ్యుదయ కవిత్వమే ఈనాటికీ ఏదో ఒక రూపంలో కొనసాగుతున్నది. అభ్యుదయ కవిత్వంతో పాటు వచ్చిన అధివాస్తవిక కవిత్వంలాంటివి తెలుగుదేశంలో వేళ్లూనుకోలేదు.

పాశ్చాత్యదేశాలలోని మేధావులలో నిరాశా, నిస్పృహలు, అరాచక ధోరణుల ఫలితంగా వచ్చిన ఈ కవిత్వానికి ఈ దేశంలో సామాజిక ప్రేరణ లేదు.

ఆంగ్లసాహిత్య సంపర్కం వల్ల తెలుగులో చేరి పాఠకులలో ఎక్కువగా ప్రచారం పొందిన వచనప్రక్రియలు నవల, కథానిక, నాటికీ నేటికీ తెలుగునవలా వాఙ్మయంలో మొదటిస్థానం ఇవ్వదగ్గ నవల ఉన్నవ లక్ష్మినారాయణపంతులు గారి "మాలపల్లి" ఈ యుగం మధ్యకాలంలో వచ్చింది. సమకాలీన జీవితాన్ని, వివిధ సామాజిక సమస్యలనూ అద్దంపట్టేదే నవల అయితే 'మాలపల్లి' దీనికి సరియైన లక్ష్యం అవుతుంది. జాతీయోద్యమం, రష్యన్‌విప్లవం, గ్రామీణవాతారణం, మాలవాడలు, ఆర్థిక పోరాటాలు, కార్మిక సంఘాలు - తెలుగుదేశం సమకాలీన చరిత్రను చక్కని వాడుకభాషలో చిత్రించిన నవల మాలపల్లి. అభ్యుదయ కవిత్వంలో కనిపించే అనేక అభ్యుదయభావాలు అంతకుముందే ఈ నవలలో కనిపిస్తాయి. నవలలోని తీవ్రభావజాలం కారణంగా ఆనాటి ప్రభుత్వం దాన్ని చాలాసార్లు నిషేధించిందంటే దాని ప్రాధాన్యం బోధపడుతుంది. ఈ నవలకు భిన్నంగా భూస్వామ్యవ్యవస్థలోనే అభ్యుదయాన్ని దర్శించిన నవల విశ్వనాథ సత్యనారాయణ నవల "వేయిపడగలు" ఈ యుగంలోనే వచ్చింది. స్త్రీ స్వేచ్ఛ. స్వేచ్ఛాప్రణయం వస్తువులుగా చలం నవలలు ఈ కాలంలోనే వచ్చాయి. చిలకమర్తి లక్ష్మీనరసింహం, అడవి బాపిరాజు మొదలయిన వాళ్ళు తమ ఉత్తమమైన నవలల్ని, ఈ కాలంలోనే వెలవరించారు. 1947 తరువాత ఎక్కువ ప్రచారం పొందిన మనోవిశ్లేషణాత్మక నవలలు గోపిచంద్ "అసమర్థుని జీవయాత్ర" బుచ్చిబాబు "చివరకు మిగిలేది" కొడవటిగంటి కుటుంబరావు రచనలు ఈ యుగం చివర వచ్చాయి. గురజాడతో ప్రారంభమై తెలుగు కథానిక ఆధునిక తెలుగుసాహిత్యంలో ఉత్తమస్థాయిని పొందిన ప్రక్రియలలో ఒకటి. నవలా రచయితలందరూ సుమారుగా కథానికలను కూడా రచించారీ యుగంలో.



> **గురజాడతో ప్రారంభమై తెలుగు కథానిక ఆధునిక తెలుగుసాహిత్యంలో ఉత్తమస్థాయిని పొందిన ప్రక్రియలలో ఒకటి. నవలా రచయితలందరూ సుమారుగా కథానికలను కూడా రచించారీ యుగంలో.**

కట్టమంచి రామలింగారెడ్డిగారితో ప్రారంభమైన ఆధునిక విమర్శనాధోరణులు ఈ యుగంలో అనేక రకాలుగా విస్తరించాయి. ఈ కాలంలోనే వచ్చిన చర్చలూ, వాదోపవాదాలు, ఉద్యమాలు ఆధునిక తెలుగుసాహిత్య వికాసానికి ఎంతగానో దోహదం చేశాయి. ఈ కాలంలో సాహిత్యవికాసానికి పత్రికలు ఎంతగానో దోహదం చేశాయి.

రచనాభాషావిషయంగా చూచినప్పుడు ఈ యుగానికి ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. సాహిత్యానికి ఆధునికతను సంతరింపజేసే గుణాలలో సమకాలీన వ్యావహారిక భాషలో రచనలు చేయటం ఒకటి. ప్రాచీన సాహిత్యంలో సృజనాత్మక సాహిత్యం అంతా సుమారుగా పద్యరూపంలోనే ఉండేది. అందుకే నన్నయ భారతభాషే కావ్యభాషగా ప్రాచీన సాహిత్యం చివరి దశవరకు కొనసాగింది. శాసనాల్లో సాధారణ వచనం. రాయవాచకంలాంటి చరిత్రగ్రంథాలు, లక్షణ గ్రంథాల్లోని వివరణలు మాత్రం సమకాలీన వ్యావహారికభాషలోనే ఉండేవి. సృజనాత్మక సాహిత్యంలో వచన ప్రక్రియలకు ప్రాధాన్యం ఏర్పడ్డ ఆధునిక యుగంలో భాషను ఎన్నుకోవటం విషయంలో అనేక వాదోపవాదాలు ఏర్పడ్డాయి. గిడుగువారి వ్యావహారిక భాషోద్యమం అన్ని రకాల రచనలూ సమకాలీన వ్యావహారిక భాషలో అంటే నన్నయ భారతభాషవంటి భాషనే వాడాలని సాంప్రదాయకులు వాదించారు. సంఘ సంస్కరణోద్యమ నాయకుడయిన కందుకూరి మొదట గ్రాంథికంలోను, తరువాత సరళగ్రాంథికంలోను రచనలు చేశాడు. జీవితం చివరికాలంలో గిడుగువారి వాదాన్ని అంగీకరించాడు కందుకూరి. అయితే ఆయన తన ప్రహసనాలలో, సాంఘికనాటకాలలో వ్యావహారిక భాషను ఉపయోగించాడు.

జాతిలో వైజ్ఞానికదృష్టిని, హేతువాదాన్ని ప్రచారం చేసిన కొమర్రాజు లక్ష్మణరావు పంతులువంటి వారు కూడా వ్యావహారిక భాషవాదాన్ని వ్యతిరేకించి గ్రాంథికాన్ని సమర్థించారు. విశ్వనాథ సత్యనారాయణగారు మొదట కొన్ని రచనలు వ్యావహారికభాషలో చేసినా చివరిదశలో గ్రాంథికంలోకి మారారు. అయితే గ్రాంథికం గాని, సరళగ్రాంథికం గాని వ్యాసాలకు మాత్రమే పరిమితమైపోయింది. సృజనాత్మకరచయితలు స్వేచ్ఛగా తమ మార్గాన్ని ఎన్నుకొన్నారు. ఉన్నత వాడుకభాషలో రాయాలని ఉద్యమించి రాసిన నవల "మాలపల్లి". అంతకు ముందు గురజాడ "కన్యాశుల్కం" ఇతరకథలూ వ్యావహారిక భాషలో వచ్చాయి. తమ ప్రాంతపు నుడికారంతో చక్కని తెలుగులో కథానికలు రాశారు.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, చలం, గోపిచంద్, కొడవటిగంటి వాడుకభాషలోనే తమదంటూ ప్రత్యేకమైన శైలిని నిర్మించుకున్నారు. ఆంగ్ల రచనల శైలీప్రభావం బుచ్చిబాబు వంటివారిమీద కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. అయితే కవిత్వంలో మాత్రం గురజాడ శైలీసారళ్యాన్ని తరువాతి భావకవులు అనుసరించలేదు. అటు గురజాడ కవితలలోను, ఇటు అభ్యుదయ కవుల కవితలలోను గ్రాంథిక, వ్యావహారిక భాషారూపాలు కలగాపులగమై కనిపిస్తాయి. జాతీయోద్యమ గీతాలు కొన్ని దీనికి అపవాదంగా నిలుస్తాయి. పామర మాండలికంలో రచనలు చేసే ప్రయత్నం నండూరి వంటివారిలో కనిపిస్తుంది. పూర్తిగా మాండలికాలలో వచనరచన చేయటం 1947 తరువాతే ఎక్కువగా జరిగింది.

తెలుగు సాహిత్య ప్రక్రియలతోపాటు 1900 -1947 మధ్య తెలుగుదేశంలో ముఖ్యంగా హైదరాబాదులో ఉర్దు సాహిత్యం తీరుతెన్నుల గురించి చివరివ్యాసంలో పరిశీలించటం జరిగింది. (చూ.రాజబహదూర్‌గౌడ్, పే. 212-219). ఈ కాలంలో ఉరుదూ, తెలుగు సాహిత్యాలు పరస్పరం ప్రభావితాలయ్యాయేమో ఉభయ సాహిత్య నిష్ణాతులు పరిశీలించవలసి ఉంది.



## కథాసూత్రాలు

రచయిత శిల్పి అయితే వస్తువు బండరాయి. లోకంలో బండరాళ్ళకి ఎలా కొరత లేదో వస్తువుకి కూడా కొరత లేదు. మనిషి జీవితంనిండా అవే. మనిషిజీవితమే ఒక చైను. సంఘటనల చైను. ఒకదాన్నొకటి కలుపుకుంటూ అలా అలా బతుకంతా పొడుగ్గా కుప్పతిప్పలుగా ఎన్నెన్నో. అయితే ప్రతిరాయీ శిల్పానికి పనికిరాదు. అలాగే ప్రతి సంఘటనా కూడా. కొండా, కోనా తిరిగి ఉలిపెట్టి తట్టిచూసి పరీక్ష చేసి తగినరాయిని శిల్పి ఏరుకున్నట్లే రచయిత కూడా అనువైన వస్తువును ఎన్నుకోవాలి. పైకి డంబంగా వున్నా లోపల ఏమీలేని గుల్లయితే శ్రమే తప్ప ఫలితం సున్న. ఒకవేళ రచయిత కష్టపడి కథను తయారుచేసినా ఏ విమర్శకుడో కాస్త గట్టిగా ఓ రాయి విసిరేసరికి పుటుక్కున పగిలిపోతుంది.

-శీలా వీర్రాజు

సామాజిక వాస్తవికత, జీవిత వాస్తవికత కథానికకు ప్రాణవాయువులు.

- పెద్దిభొట్ల సుబ్బరామయ్య

కథ రాయాలనే ఆర్తికి ఎలా రాయాలి ఎందుకోసం రాయాలి అనే ఆలోచనా వుంటే, ఆసక్తి కలిగించే మంచి కథ రాయడం సాధ్యమవుతుంది.

- కేతు విశ్వనాథరెడ్డి

# అర్ధశతాబ్దపు తెలుగు కథ ఒక అంచనా

## డా॥ కాత్యాయనీ విద్మహే




> అర్థశతాబ్ది కాలమంటే వ్యక్తి జీవితంలోనే కాదు ఒక జాతి జీవన గమనంలో కూడ అనేక పరిణామాలకు లోనవుతూ పరిణితిని సాధించడానికి సరిపడే ప్రామాణిక కాలమే. అనేకమంది వ్యక్తుల అనుభవాల నుండి, సృజన కౌశలం నుండి అభివృద్ధి చెందే కథ వంటి సాహిత్య ప్రక్రియల అభివృద్ధి గమనాన్ని అంచనావేయడానికి కూడా అది ఒక చెప్పుకోనదగిన కాల ప్రమాణమే.

దాదాపు వంద సంవత్సరాల చరిత్ర కలిగిన ఆధునిక తెలుగు కథ ఆంధ్రప్రదేశ్ ఒక రాష్ట్రంగా ఏర్పడిన ఈ అర్ధశతాబ్దికాలంలో ఏయే మార్గాలలో నడిచి ఎంతగా అభివృద్ధి చెందిందో అంచనా వేసుకొంటున్న సందర్భం ఇది. అర్థశతాబ్ది కాలమంటే వ్యక్తి జీవితంలోనే కాదు ఒక జాతి జీవన గమనంలో కూడ అనేక పరిణామాలకు లోనవుతూ పరిణితిని సాధించడానికి సరిపడే ప్రామాణిక కాలమే. అనేకమంది వ్యక్తుల అనుభవాల నుండి, సృజన కౌశలం నుండి అభివృద్ధి చెందే కథ వంటి సాహిత్య ప్రక్రియల అభివృద్ధి గమనాన్ని అంచనావేయడానికి కూడా అది ఒక చెప్పుకోనదగిన కాల ప్రమాణమే. ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ్ ఒక రాష్ట్రంగా ఏర్పడిన ఈ అర్దశతాబ్ది కాలాన్ని ప్రమాణంగా తీసుకొంటున్నామంటే, ఆ నిర్దిష్ట కాలపు సామాజికార్థిక, రాజకీయ పరిణామాలు కథాభివృద్ధి క్రమాన్ని, గమనాన్ని ఏ మేరకు, ఏ విధంగా ప్రభావితం చేస్తూవచ్చాయనేది ముఖ్యంగా గమనించాల్సిన అంశం అవుతుంది. గత అర్ధశతాబ్దపు సామాజిక రాజకీయార్థిక సాంస్కృతిక పరిణామాలను ఈ క్రిందివిధంగా గుర్తించవచ్చును.

**ఒకటి :**

1956లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడటానికి తెలుగు భాషా భాషీయులందరినీ కూడగట్టటంలో భాగంగా అటు రాయలసీమ, ఇటు తెలంగాణ ప్రజల అసంతృప్తులకు, ఆకాంక్షలకు ఒక పరిష్కారం జరిగిన శ్రీబాగ్ ఒడంబడిక, పెద్దమనుషుల ఒప్పందం ఈ యాభైఏళ్ళ ఆంధ్రదేశ చరిత్ర గమనాన్ని ప్రభావితం చేస్తూనే వచ్చాయి. అస్తిత్వ స్పృహతో ఆత్మగౌరవ చైతన్యంతో అభివృద్ధిలో తమదైన వాటాకొరకు తపనతో ఆనాటి నుండి ఈనాటివరకు అటు రాయలసీమ నుండి ఇటు తెలంగాణ నుండి కథలు కొల్లలుగా వస్తున్నాయి. ఆ నిర్దిష్ట రాజకీయార్థిక నేపథ్యం నుండి దృక్పథం నుండి ఈ కథలను అధ్యయనం చేయవలసి వున్నది.

**రెండు:**

సంఘ సంస్కరోణోద్యమం వలన చర్చలోకి వచ్చిన స్త్రీవిద్య, పునర్వివాహం, యుక్తవయసులో వివాహం వరకట్న నిషేధం, విడాకులు, ఉద్యోగ అవకాశాలు, ఆరోగ్య ఆస్తిహక్కులు మొదలైన స్త్రీల సమస్యలకు పరిష్కారంగా స్వాతంత్ర్యానంతరం రాజ్యాంగపరమైన హామీలు లభించాయి. చట్టాలు చేయబడినాయి. పంచవర్ష ప్రణాళికలలో స్త్రీ సంక్షేమాన్ని ఉద్దేశించి చేపట్టవలసిన కార్యక్రమాలకు – ముఖ్యంగా స్త్రీల విద్యకు ఆరోగ్యానికి సంబంధించిన వాటికి ప్రాధాన్యత లభించింది. ఆంధ్రప్రదేశ్ ఒక రాష్ట్రంగా ఏర్పడటం తోటే రాజ్యాంగం ఆదేశించిన, కేంద్ర ప్రభుత్వం నిర్దేశించిన మార్గంలో

స్త్రీల సంక్షేమం కొరకు పనిచేయవలసి వచ్చింది. ఆ మేరకు ఆంధ్రప్రదేశ్ స్త్రీల జీవిత చైతన్యాలలో గొప్ప కదలిక ప్రారంభమైంది. ఈ కదలికలను, ప్రకంపనాలను 1960 నాటికే తెలుగ కథ అద్భుతంగా ప్రతిఫలించింది. స్త్రీలు విద్యావంతులవుతూ తమ జీవితాశలను, ఆకాంక్షలను తాముగా వ్యక్తీకరించగలిగిన స్థాయికి చేరుకొంటున్న క్రమంలో 60 ల తరువాత కథారచయిత్రుల సంఖ్య పెరగటం ఒక అభివృద్ధి అయితే స్త్రీల జీవితంలోని అదృశ్య, అసంతృప్త చీకటికోణాలను ఆవిష్కరించగల స్థాయికితెలుగు కథ చేరుకొనటం ఒక విశేషం. 1975 తరువాత స్త్రీవాద దృక్పథం స్త్రీల కథలకు ఒక రాజకీయ పదునును సమకూర్చింది. పురుషుల కథలకు సంయమనాన్ని, సహనాన్ని, సహానుభూతిని కొత్తగుణాలుగా చేర్చింది. స్త్రీల సమస్యలపైన వచ్చిన కథలను, స్త్రీలు వ్రాసిన కథలను ఈ నేపథ్యం నుండి అధ్యయనం చేయవలసి ఉన్నది. ఆంధ్రప్రదేశ్‌లో లింగ వివక్ష స్వరూప స్వభావాలను, ప్రభావాలను, పరిణామాలను తెలుసుకొనడానికి ఈ కథలు ఉపయోగపడతాయి.



**మూడు :**

సంఘ సంస్కరణోద్యమ కాలంలోనే చర్చలోకి వచ్చిన మరొక ముఖ్యాంశం - దళిత సమస్య హరిజనోద్యమంగా, అస్పృశ్యతా వ్యతిరేక ఉద్యమంగా జాతీయోద్యమంలో కూడా ఇది ప్రధాన భాగమైంది. స్వాతంత్ర్యానంతర రాజ్యాంగపర హక్కులు, హామీల తరువాత కూడా అదొక అపరిష్కృత సమస్యగానే వుండి అనేక సంఘర్షణలకు సంవేదనలకు కారణం అవుతూనే వున్నది. సున్నితమూ, అంతరంగవేదనా కారణమూ, సామాజికంగా దుర్భరమూ అయిన ఈ అంశం తెలుగు కథకు ప్రారంభం నుండి వస్తువు అవుతూనే వుంది. 1985 తరువాత దళిత ఉద్యమ చైతన్యం నుండి కథలు వస్తున్నాయి. యాభై ఏళ్ళ తెలుగు కథను ఈ దృక్పథంతో అధ్యయనం చేయటం అవసరం. వెనుకబడిన కులాల అస్థిత్వ చైతన్యం కూడా దళిత ఉద్యమానికి తోడైనాక తెలుగు కథ వస్తు పరిధి మరింత విస్తరించదన్న విషయం ఈ సందర్భంగా గుర్తించాలి.

**నాలుగు :**

జాతీయోద్యమ కాలంలో తలెత్తిన మరొక సమస్య హిందూ ముస్లిం వైరుధ్యాలు. కాంగ్రెస్ పార్టీతో భేదిస్తూ ముస్లిం లీగే ఏర్పడటం, స్వాతంత్ర్యం పాకిస్తాను నుండి విడదీయబడిన భారతదేశానికి రావటం, దేశవిభజన తరువాత కూడా ఈనాటికి ఆ వైరుధ్యాలు అప్పుడప్పుడూ సెలవేసి మత వైషమ్యాలుగా, సంఘర్షణలుగా రూపాంతరం చెందటం గమనించదగినవి. ఈ నేపథ్యంలో రూపొందింది మైనారిటీవాదం. ఈ మత రాజకీయ నేపథ్యం నుండి ఈ యాభైఏళ్ళుగా తెలుగు కథ హిందూ ముస్లిం ఐక్యతను, సంఘర్షణను ఏ విధంగా ప్రతిఫలించిందో ప్రత్యేకంగా పరిశీలించటం అవసరం.

**ఐదు :**

సంస్కరణోద్యమ కాలంలో వర్ణ లింగ వ్యత్యాసాలను గురించిన అవగాహన అభివృద్ధి చెందినట్లుగానే స్వాతంత్ర్యోద్యమ కాలంలో వర్గ వ్యత్యాసాలను గురించిన అవగాహన దేశీయ అంతర్జాతీయ పరిస్థితుల నుండి అభివృద్ధి చెందింది. 1935లో కమ్యూనిస్టు పార్టీ ఏర్పడటంతో అది ఒక స్పష్టమైన నిర్దుష్టమైన రూపాన్ని తీసుకొన్నది. ఈ అవగాహనతో సాహిత్య సాంస్కృతిక రంగాలను పదునెక్కించటానికి అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి వంటి సంస్థలు 40వ దశకంలో ఆవిర్భవించాయి. 1947 నాటితెలంగాణ సాయుధ రైతాంగ పోరాట ఫలితంగా పీడిత జనజీవిత చిత్రణ, పీడితవర్గ చైతన్య చిత్రణ తెలుగు కథా సాహిత్యంలో విశేషభాగాన్ని ఆక్రమించాయి. తెలంగాణ పోరాటానికి కొనసాగింపుగా 1956 తరువాత ఊపందుకొన్న శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటం -నక్సల్‌బరీ ఉద్యమ ప్రభావంతో 1970లలో తీసుకొన్న మలుపులు, 1978 నాటికి ఉత్తర తెలంగాణా వ్యావసాయిక విప్లవంగా అది విస్తరించిన తీరు, ఈ ఉద్యమాల వలన ఆయా ప్రాంతాలలో చర్చకు వచ్చిన జనజీవిత సమస్యలు, ఉద్యమాలలో

**సాహిత్య సాంస్కృతిక రంగాలను పదునెక్కించటానికి అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్యమండలి వంటి సంస్థలు 40వ దశకంలో ఆవిర్భవించాయి. 1947 నాటితెలంగాణ సాయుధ రైతాంగ పోరాట ఫలితంగా పీడిత జనజీవిత చిత్రణ, పీడితవర్గ చైతన్య చిత్రణ తెలుగు కథా సాహిత్యంలో విశేషభాగాన్ని ఆక్రమించాయి.**

వాళ్ళ భాగస్వామ్య స్వరూప స్వభావాలు, తత్ఫలితంగా వాళ్ళ జీవితాలలో వచ్చిన పరిణామాలు, ప్రభావాలు అన్నీ తెలుగు కథ వస్తు పరిధిని విస్తృతీకరించాయి. ఈ రాజకీయార్థిక నేపథ్యంలో పీడిత తాడిత కర్షక కార్మికుల, కూలీల, పేద సాదల జీవిత చిత్రణగా వచ్చిన కథా సాహిత్యాన్ని అధ్యయనం చేయవలసి ఉంటుంది.

**ఆరు :**

భారతదేశంలో ప్రజల జీవన విధానం ప్రధానంగా వ్యవసాయ రంగంపై ఆధారపడి వుంది. భూమి ముఖ్యమైన ఆదాయవనరు కనుక భూమి మీద పనిచేసే రైతు దోపిడీకి గురవటం వలన వ్యవసాయోత్పత్తి క్రియ అనాసక్తంగా మారి దిగుబడి తగ్గటానికి దారితీస్తుంది. కనుక వ్యవసాయిక సంబంధాలను సంస్కరించటం ప్రభుత్వాలకు అవసరమైంది. వ్యవసాయోత్పత్తిలో పెరుగుదల కొరకని 1960లలో హరిత విప్లవాన్ని ఆహ్వానించటం ఆ క్రమంలోనే జరిగింది. వ్యవసాయోత్పత్తిలో పెరుగుదల వ్యవసాయ రంగంలో పనిచేస్తున్న జనమందలి జీవన ప్రమాణాలను పెంచుతుందని భావించటం జరిగింది కానీ వాస్తవానికి అది రైతుకు భూమికి మధ్య వున్న సహజ సంబంధాల మధ్య దానిని విధ్వంసం చేసే మార్కెట్ మహాభూతాన్ని విచిత్ర పరిణామాలను ప్రతిఫలించే కథలు అనేకం వచ్చాయి. హరిత విప్లవం సృష్టించిన ప్రకంపనలకు అతలాకుతలం అవుతున్న రైతు జీవితాన్ని 1990లలో ప్రవేశపెట్టబడిన నూతన ఆర్థిక పరిణామాలు మరింత కల్లోలానికి గురిచేశాయి. హరిత విప్లవం నుండి ప్రపంచీకరణ వరకు వచ్చిన రాజకీయార్థిక విధానాలు ఆంధ్రదేశ వ్యవసాయ రంగంపై ప్రసరించిన ప్రభావాలను, తత్ఫలితంగా రైతు జీవితంలో, కుటుంబ సంబంధాలలో వచ్చిన పరిణామాలను చిత్రిస్తూ వచ్చిన విస్తృత కథాసాహిత్యాన్ని ప్రధానంగా అధ్యయనం చేయాలి. వ్యవసాయరంగ అభివృద్ధిని, రైతు సంక్షేమాన్ని ఆశించి ప్రభుత్వం రూపొందించిన విధానాలు, పథకాలు వాస్తవంగా అమలవుతున్న తీరుపై విమర్శగా వచ్చిన కథలు కూడా ఇందులో భాగంగా అధ్యయనం చేయాలి.



**హరిత విప్లవం నుండి ప్రపంచీకరణ వరకు వచ్చిన రాజకీయార్థిక విధానాలు ఆంధ్రదేశ వ్యవసాయ రంగంపై ప్రసరించిన ప్రభావాలను, తత్ఫలితంగా రైతు జీవితంలో, కుటుంబ సంబంధాలలో వచ్చిన పరిణామాలను చిత్రిస్తూ వచ్చిన విస్తృత కథాసాహిత్యాన్ని ప్రధానంగా అధ్యయనం చేయాలి.**

**ఏడు :**

ప్రపంచీకరణ క్రమంలో దేశాలన్నీ కుగ్రామాలుగా కుదించబడుతూ దాని ప్రత్యక్ష పరోక్ష ప్రభావాలకు గురి అవుతున్నాయి. దేశీయ ఉత్పత్తులకు కాలం చెల్లిపోతూ బహుళ జాతి ఉత్పత్తులు జీవితమంతా పరుచుకొంటూ, వినియోగదారీ సంస్కృతి పెరిగిపోతూ డబ్బే సర్వస్వమవుతూ మానవ జీవితాన్ని, విలువలను, సంబంధాలను లోపలి నుండి, బయటి నుండి ప్రభావితం చేస్తూ వస్తున్న ప్రపంచీకరణ ఈనాడు స్పృశించని మానవ జీవన పార్శ్వమంటూ లేదు. 1990ల తరువాత తెలుగు కథను విశేషంగా ప్రభావితం చేసిన అంశం ఇది. కనుక ఈ అర్ధశతాబ్ది తెలుగు కథను విశ్లేషించటంలో విస్మరించరాని కోణం ఇది.

ఇటువంటి ప్రధాన సామాజిక భావనలు, రాజకీయార్థిక పరిణామాలు మాత్రమే కాక ఈ అన్నింటి సంబంధంలో రూపొందుతూ మారుతూ వుండే మానవ చిత్తవృత్తులు, విలువలు, వ్యక్తిత్వాలు వుంటాయి. ప్రేమకొరకైన తపనలు, స్వార్థానికి సంబంధించిన చింతనలు అన్నీ వాటిలో భాగమే. వాటికి సంబంధించిన ఆదర్శాలకు వాస్తవాలకు మధ్య సంఘర్షణ కూడా వుంటుంది. వ్యక్తివాద భూమికలో పుట్టి పెరిగిన ఆధునిక కథ వ్యక్తి మనస్తత్వంలోని బహుముఖాంశాలను వస్తువుగా చేసుకొని విస్తరించిన విషయం తప్పనిసరిగా గమనంలోకి తీసుకోవాలి.

వైవిధ్యభరితమైన మానవజీవితాన్ని, నిత్యం, నిరంతరం ఆసక్తికరంగా సాగే మానవ జీవనయానాన్ని, మానవజీవితాన్ని, జీవన గమనాన్ని నిర్దేశించి నియంత్రించే సామాజికార్థిక రాజకీయ పరిణామాలను చిత్రిస్తూ ఈ అర్థ శతాబ్దకాలంలో వచ్చిన కథలు వేల సంఖ్యలో వుంటాయి. ఆ కథలు వ్రాసిన వాళ్లు వందల సంఖ్యలో వుంటారు. ఈ వ్యాస పరిమితిలో అన్ని కథలను, అందరు కథకులను ప్రస్తావించటం సాధ్యంకాదు.

అందువలన అర్థశతాబ్దికాలపు కథాగమనాన్ని అందులోని ధోరణులను, పోకడలను సూచించడం మాత్రమే ఈ వ్యాసానికి నిర్దేశించుకొన్న పరిధి.

## 2

1956 నుండి 2006 వరకు ఈ అర్ధ శతాబ్ది కాలంమీద పరుచుకొని వచ్చిన కథలలో ఈ కాలపు సామాజిక రాజకీయార్థిక సాంస్కృతిక పరిణామాలు, మానవ ప్రవృత్తులు, మనోవైఖరులు ఎలా చిత్రితమైనాయో పరిశీలించటానికి ప్రతి పది సంవత్సరాల కాలాన్ని ఒక యూనిట్‌గా స్వీకరించటం ప్రయోజనకరంగా వుంటుంది. 1956-1965 మొదటి దశకం చలం, కొడవటిగంటి కుటుంబరావు, పాలగుమ్మి పద్మరాజు, బుచ్చిబాబు, గోపీచంద్ మొదలైన వాళ్ళు అంతకుముందు నుండే మంచి కథలు వ్రాస్తూ ఈ దశాబ్దిలో కూడా కథారచన కొనసాగించారు. రాచకొండ విశ్వనాథశాస్త్రి, కాళీపట్నం రామారావు, మధురాంతకం రాజారాం, బలివాడ కాంతారవు, ఆర్.యస్. సుదర్శనం, పురాణం సుబ్రహ్మణ్య శర్మ, త్రిపుర, కె.సభా, శ్రీదేవి, అబ్బూరి ఛాయాదేవి, కళ్యాణ సుందరీ జగన్నాథ్, ఆర్. వసుంధారాదేవి, మాలతీ చందూర్, అరవింద, అచ్యుతవల్లి, మొదలైన వాళ్ళు కథారచయితలుగా తమ సత్తాను నిరూపించుకొంటూ తలెత్తి నిలబడిన కాలం ఈ దశాబ్ది.



ప్రతి వ్యక్తీ ప్రపంచంలోని తక్కిన వ్యక్తులందరికీ తాను బాధ్యుడునన్న స్పృహతో అలవరచుకొనవలసిన మానవీయ విలువలు ఆవిష్కరణగా "ఇక్కడ దీపం ఆరిపోతే లోకం అంతా చీకటి' అనే కథ వ్రాశాడు. మానవుల మధ్య పరస్పర ద్వేషాలు, అసహనాలు, స్పర్థలు, ఈర్ష్యలు ఎందుకు వుంటాయి అన్నది బుచ్చిబాబును వేధించిన సమస్య.

బుచ్చిబాబు వ్రాసిన అరకులోయలో కూలిన శిఖరం, ఆరుగురు కథకులు ఒక నాయిక, బీ, ఇక్కడ దీపం ఆరితే లోకమంతా చీకటే, అంటూ వుండే బద్ధమిత్రులు, పొగలేని నిప్పు, కొత్తొంతెన - పాతనీరు మొదలైన అనేక కథలు ఈ దశాబ్దిలో వచ్చినవే. బుచ్చిబాబువి ప్రధానంగా మనస్సులోతులను, మానవ ప్రవృత్తులలోని వైచిత్రిని చిత్రించిన కథలు. సమాజంలో చదువులోనూ, హోదాలోనూ ఉన్నత స్థాయిని అందుకొన్న వాళ్ళు తోటి మనుషుల పట్ల ఎంత క్రిందికి దిగజారి ప్రవర్తిస్తారో చెప్పిన కథ అరకులోయలో కూలిన శిఖరం. మనిషి ఎంతటి సమర్థుడైనా సమాజానికి పనికివచ్చేపని చేసేవాడయినా స్త్రీలౌల్యం కారణంగా తిరస్కృతుడయ్యే నీతి విధానం పట్ల నిరసనతో వ్రాసిన కథ కొత్తొంతెన పాతనీరు ఈ రెండు కథలలోనూ కథా పురుషులు ఇంజినీర్లే ఫ్రాయిడ్ సార్త్రే, రస్సెల్ మొదలైన వాళ్ళు జీవితానుభవాలను నిగ్గుతేల్చి రూపొందించిన మానసిక తాత్త్వికసూత్రాలకు ప్రయోగాత్మకంగా వ్యాఖ్యానించటంగా బుచ్చిబాబు కథలు వ్రాశాడు. ప్రతి వ్యక్తీ ప్రపంచంలోని తక్కిన వ్యక్తులందరికీ తాను బాధ్యుడునన్న స్పృహతో అలవరచుకొనవలసిన మానవీయ విలువలు ఆవిష్కరణగా "ఇక్కడ దీపం ఆరిపోతే లోకం అంతా చీకటి' అనే కథ వ్రాశాడు. మానవుల మధ్య పరస్పర ద్వేషాలు, అసహనాలు, స్పర్థలు, ఈర్ష్యలు ఎందుకు వుంటాయి అన్నది బుచ్చిబాబును వేధించిన సమస్య. అతని సాహిత్యానికి కీలకాంశం అదే అంటూవుంటే బద్ధమిత్రులు కథ అందుకు మంచి నిదర్శనం. స్వార్థపూరిత గమ్యాలు విద్వేషపూరితమైన చర్యలకు కారణం అవుతున్నవని ఆ స్వార్థపూరిత గమ్యాలను సాంఘిక గమ్యాలుగా పరివర్తన జీవన సూత్రాన్ని ఈ కథ ద్వారా వ్యక్తీకరించాడు. ఈ సూత్రాన్ని తాను గ్రహించి జీవన సూత్రాన్ని ఈ కథ ద్వారా వ్యక్తీకరించాడు. ఈ సూత్రాన్ని జీవితానికి అన్వయించుకొన్నప్పుడు శత్రుత్వాలు సమసిపోయి మిత్రత్వమే వికసించి విరాజిల్లుతుందని బుచ్చిబాబు భావన.

కొడవటిగంటి కుటుంబరావు 'రసికుడు' వంటి కథలు ఈ దశాబ్దంలో వెలువడ్డాయి. వేశ్యలను తాము ఉద్ధరిస్తున్నామనుకొనే వాళ్ల నైతిక పతనాన్ని, దిగజారుడు విలువలను వేశ్యముఖంగానే వేలెత్తి చూపించిన కథ ఇది. పరాయి స్త్రీలు అందునా వేశ్యలు తమ సౌందర్యాన్ని, సంగీత జ్ఞానాన్ని బ్రతుకు తెరువు మార్గం చేసుకొనటం అభ్యంతరకరం కాదు కానీ ఆ వేశ్యయందే తనకు పుట్టిన పిల్లమాత్రం గౌరవంగా బ్రతకాలనుకొనటంలోని పితృస్వామిక ద్వంద్వ విలవల స్వభావాన్ని బయటపెట్టింది ఈ కథ.

ఈ కాలంలోనే కాళీపట్నం రామారావు తీర్పు, ఇల్లు వంటి

కథలు వ్రాసి కథకుడుగా నిలదొక్కుకొన్నాడు. రెండింటిలోనూ తల్లిదండ్రులకూ పిల్లలకు మధ్య సంబంధాలు కీలకపాత్ర వహించాయి. వస్తువులను ఉత్పత్తి చేసినవాళ్ళకు ఆ వస్తువులలో తమకు ఇష్టమైన దానిని పొందే హక్కు వున్నదన్న అంశాన్ని కుటుంబ సంబంధాలలో భాగంగా సూచించిన కథ తీర్పు. పిల్లలను తమ భవిష్యత్తుకు పెట్టుబడిగా భావించే సంస్కృతి తల్లిదండ్రులకు పిల్లలకు మధ్య సంబంధాన్ని ఎంత హింసాపూరితంగా చేస్తుందో చూపిస్తూ ఆ విధ్వంస సంబంధాల నుండి విముక్తికై తండ్రులను హెచ్చరించిన కథ ఇల్లు.



ఈ దశాబ్దిలో కథలు వ్రాసిన వారిలో మా గోఖలే ఒకడు. ముత్తాయి కూతురు, సేవా పరాయణుడు ఆయన వ్రాసిన కథలు మొదటి కథ దళిత జీవిత దైన్యాన్ని చిత్రిస్తే రెండవ కథ మధ్యతరగతి అవకాశవాద ఆత్మవంచనా పూరిత స్వార్థ ప్రవృత్తిని బానిసబుద్ధిని చిత్రించింది. మాదిగ ముత్తాయికి ఊరందరి పనులు చేసిపెట్టటమే కానీ తన కొరకు, తన భార్యాబిడ్డల కొరకు ఏమీ చేసుకొనేందుకు తీరుబాటే వుండదు. తన బ్రతుకుకు తాను పరాయీకరింపబడిన వాడతను. అతను ఎవరికి ఎంత చాకిరీ చేసినా అంతా ప్రతిఫలం లేనిసేవే. చివరికి తన కూతురికి వైద్యం చేయించుకోవాలంటే భార్య మెడలో పుస్తెలమ్ముకొనటం తప్ప మరొక మార్గంలేదు. సేవా పరాయణుడు కథలో గుర్నాధం యజమానుల పక్షం చేరి తన ఉద్యోగివర్గానికి వ్యతిరేకంగా పనిచేయటంలో పబ్బం గడుపుకొనే అల్పజీవిగా కనబడతాడు. తానే వర్గం వాడో మరిచి తన శ్రమ విలువను విస్మరించి యజమాని దయమీదనే తాను బ్రతుకుతున్నానన్న భ్రమలో నిండా మునిగినవాడు సేవకుడుగా అథమస్థాయి జీవితం గడపవలసినదే కానీ శ్రామికుడుగా స్వతంత్ర ఉద్యోగిగా ఆత్మగౌరవంతో జీవించలేడని ఈ కథ సూచిస్తుంది.

**సారానిషేధ చట్టం అమలులో వున్న ఈ దశాబ్దిలోనే రావిశాస్త్రి ఆ చట్టం మాటున సారావ్యాపారం ఎంత సజావుగా సాగిపోతున్నదో పోలీసు న్యాయవ్యవస్థలు అందులో ఎలాంటి పాత్ర వహిస్తున్నాయో ఈ క్రమంలో అందులో భాగమై అవస్థలు పడే అధోజగత్తు మనుషుల మనో ప్రవృత్తులు, సమస్యలు ఎలా వుంటాయో చూపిస్తూ సారా కథలు వ్రాశాడు.**

ఈ కాలంలోనే రాచకొండ విశ్వనాథశాస్త్రి బేఖాతర్ కథలు, సారో కథలు వ్రాసే దశ నుండి బయటపడుతూ జీవితంలో దుఃఖానికి, సమాజంలో సమస్యలకు ఆర్థిక రాజకీయ కారణాలున్నాయన్న గుర్తింపుతో కథకుడుగా విశ్వరూప ప్రదర్శనకు సిద్ధమైనవాడు. ప్రకృతి వనరులు వ్యక్తి సొంత ఆస్తిగా స్థిరపడిన క్రమం మానవ సంబంధాలను ఎంత విధ్వంసానికి గురిచేసిందో "మామిడిచెట్టు" వంటి కథలలో చూపాడు రావిశాస్త్రి. స్త్రీ పురుష సంబంధాలలో విలువల రాహిత్యం పురుషుడి వైపు నుండి పెరుగుతున్న వైనాన్ని విలువలను నిలబెట్టుకొనాలన్న ఔన్నత్యం స్త్రీలలో నిలబడి వుండటాన్ని 'విలువలు' వంటి కథలలో చిత్రించాడు. సారానిషేధ చట్టం అమలులో వున్న ఈ దశాబ్దిలోనే రావిశాస్త్రి ఆ చట్టం మాటున సారావ్యాపారం ఎంత సజావుగా సాగిపోతున్నదో పోలీసు న్యాయవ్యవస్థలు అందులో ఎలాంటి పాత్ర వహిస్తున్నాయో ఈ క్రమంలో అందులో భాగమై అవస్థలు పడే అధోజగత్తు మనుషుల మనో ప్రవృత్తులు, సమస్యలు ఎలా వుంటాయో చూపిస్తూ సారా కథలు వ్రాశాడు. ఈ దశాబ్దిలో మార్క్సిస్టుగా ఆయన సాధించిన పరిణితికి నిలువుటద్దం మిగులు విలువ సిద్ధాంతాన్ని సులభసూత్రంగా బోధించే కథా వస్తువుతో వ్రాసిన బల్లచెక్క (1964) కథ.

ఈ దశాబ్దిలో తెలంగాణ నుండి కథనమంతా మాండలికంలోనే నడిపిన మారాజు వంటి కథలు వచ్చాయి. గూడూరి సీతారామ్ ఈ కథను వ్రాశాడు.

కరీంనగర్ జిల్లా నుండి బొంబాయికి వలసలు ప్రారంభమవుతున్న ఈ దశకంలో ఒక గ్రామీణ యువకుడు బొంబాయికి పోయి పడిన అవస్థలు బ్రతికి బయటపడిన విధం ఈ కథలో చిత్రితమైనాయి. బొంబాయిలో అతను తన డబ్బంతా కోల్పోయాడు కానీ ప్రాణాలతో తిరిగి వచ్చాడు కనుక 'మారాజు' అయ్యాడు.

ఈ దశకంలో స్త్రీలు వ్రాసిన కథలో చెప్పుకోదగినవి అరవింద వ్రాసిన అల్లుడి మంచితనం, కల్యాళ సుందరీ జగన్నాథ్ వ్రాసిన అలరాసపుట్టిళ్ళు, ఆలోచనలు. అభిప్రాయాలు, విలువలు, వ్యక్తిత్వం కలిగిన స్త్రీ భార్యగా భర్త అధికార నియంత్రణల క్రింత

నిస్సారంగా జీవితాన్ని గడపలేక పుట్టింటికి వచ్చి చదువు పూర్తిచేసి ఉద్యోగం చేస్తూ తన కాళ్ళ మీద తాను నిలబడటాన్ని చిత్రించిన కథ అల్లుడి మంచితనం. భార్య ఆత్మగౌరవ చైతన్యం తత్కాలంలో భర్తల అహంకారానికి దెబ్బగా అనిపించినా అంతిమంగా అది వాళ్ళల్లో మంచి లక్షణాలను పెంచటానికి కారణం అవుతుందని సూచిస్తుందీ కథ. లోకానికి కనిపించే అల్లుని మంచితనం రూపొంది ప్రకాశమానం కావటం వెనక అవసరమైన సమయంలో ఆత్మవంచనకు, రాజీకి, లొంగుబాటుకు పాల్పడకుండా నోరువిప్పి మాట్లాడగలిగిన అమ్మాయి చైతన్యం వుందని అల్లుడి మంచితనం (1959) కథ స్పష్టం చేస్తుంది.



'అలరాస పుట్టిళ్ళు (1962) కథ పరువు ప్రతిష్టలకు, పంతాలకు నెలవైన కుటుంబాలు, మగవాళ్ళు దురహంకారం ఆడవాళ్ళ మనసులను అర్థం చేసుకోకుండా బలవంతపు పెళ్ళిళ్ళకు, కాపురాలకు తరుముతుంటే స్త్రీల జీవితాలే కాదూ మొత్తం కుటుంబాలే విధ్వంసం అవుతాయన్న విషయాన్ని స్పష్టీకరించింది.

**'అలరాస పుట్టిళ్ళు (1962) కథ పరువు ప్రతిష్టలకు, పంతాలకు నెలవైన కుటుంబాలు, మగవాళ్ళు దురహంకారం ఆడవాళ్ళ మనసులను అర్థం చేసుకోకుండా బలవంతపు పెళ్ళిళ్ళకు, కాపురాలకు తరుముతుంటే స్త్రీల జీవితాలే కాదూ మొత్తం కుటుంబాలే విధ్వంసం అవుతాయన్న విషయాన్ని స్పష్టీకరించింది.**

ఈ దశకంలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి పురాణం సూర్యప్రకాశరావు, వీరమల్లు రామకృష్ణ మొదలైన రచయితలు స్త్రీలు వ్యక్తిత్వ చైతన్యంతో స్వయంసిద్ధులుగా ఎదగటాన్ని దర్శిస్తూ మంచికథలు వ్రాశారు. వీరమల్లు రామకృష్ణ వ్రాసిన బ్రతికి చెడిన జీవి (సెప్టెంబర్ 1957 భారతి) కథలో తండ్రి కూతురికి పెట్టుపోతలు జరపాలనుకొంటాడే కానీ తన పేదరికాన్ని గురించి తెలియనీయకూడదనేకొనే సంప్రదాయానికి చెందినవాడు. తనకు తానుగా పుట్టింటికి వచ్చే స్వతంత్ర వ్యక్తిత్వం సంతరించుకొన్న ఆధునిక యువతి కూతురు. తల్లిదండ్రుల పేదరికపు సమస్యకు అతిసున్నితంగా పరిష్కారాన్ని చూపింది. తనతోపాటు తమ్ముణ్ణి తీసుకొని వెళ్ళి చదివిస్తానని కోరి ఆ నెపంతో తాను తల్లిదండ్రుల బాధ్యత తీసుకొనటానికి సిద్ధపడటం హృద్యంగా ఈ కథలో చిత్రితమైంది. 1957 సెప్టెంబర్ భారతిలోనే ప్రచురించబడిన నిద్రాళువు కథలో పురాణం సూర్య ప్రకాశరావు భర్తల ప్రవర్తనను ప్రవృత్తులను కనీస మాత్రంగానైనా ప్రశ్నించకుండా, విమర్శించకుండా వాళ్ళను నెత్తిమీద దేవుళ్ళుగా కొలిచే స్త్రీల మూఢత్వాన్ని విమర్శకు పెట్టటమే కాక తమ అభిరుచులను అసక్తులను నెరవేర్చుకొనటానికి, తమకాళ్ళమీద తాము నిలబడటానికి ప్రయత్నించే స్త్రీలను ఆదర్శ నమూనాగా చూపించాడు కూడా.

నవంబరు 1959 భారతిలో ప్రచురించబడిన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి కథ ఘటన ఏకంగా వరకట్న సమస్యను ఎదుర్కొనడానికి చట్టపరంగా నిషేధించబడిన వరకట్న సంప్రదాయంగా సమాజంలో సజావుగా కొనసాగుతున్న తీరును ప్రతిఘటించటానికి స్త్రీలు దళాలుగా ఏర్పడి పనిచేయటాన్ని చిత్రించింది. కట్నం ఇచ్చి మొగుణ్ణి కొనుక్కొనటం ఇష్టంలేని సుభద్ర అటువంటి స్త్రీలకు మద్దతుగా నిలబడిన స్త్రీల సంఘదళపతి జానకి ఈ కథలో కనిపించే పాత్రలు.

ఆర్.యస్. సుదర్శనం తానేమిటో తెలుసుకొనే నిరంతర చింతనలో వ్యక్తి పొందే అనుభవాలను, తీసుకొనే నిర్ణయాలను వస్తువుగా చేసి ఆత్మజ్ఞానం (జనవరి 1959) అమృతుడు (నవంబరు 1959) వంటి కథలు వ్రాసింది ఈ దశకంలోనే. ఈ దశాబ్దిలో విరివిగా కథలు వ్రాసిన మరొక రచయిత మధురాంతకం రాజారాం. మానవ మనస్తత్వంలోని మంచి చెడులను అవి నైజ గుణాలుగా చూపించే కథలు ఆర్. సూర్యనారాయణ వ్రాశాడు. ఆర్. చిదంబరం కూడా ఈ దశకంలో కనబడే మరొక కథా రచయిత. అన్నదమ్ముల ఆస్తి సంబంధాలు సంఘర్షణలు వాటిమధ్య నలిగిపోయే తల్లి స్థితి వస్తువుగా చేసి జి.వి. కృష్ణారావు 'ఉదబిందువులు' అనే మంచి కథ వ్రాశాడు. అన్నదమ్ముల ఆస్తి తగాదాలకు ఇంటి కోడళ్ళే కారణం అనుకొనే సంప్రదాయ భావనకు విరుద్ధంగా ఆస్తి అన్నదమ్ములకు సంబంధించినది కనుక సంఘర్షణ, స్వార్థం కూడా వాళ్ళకు సంబంధించినవేనని ఈ క్రమంలో వైరుధ్యం తోడికోడళ్ళకు సంబంధించినది కాదని




# మరుగుదొడ్డి నిర్మించుకోండి
# మహిళల ఆత్మగౌరవాన్ని కాపాడండి



భారత ప్రభుత్వము సంపూర్ణ పారిశుద్ధ్య ఉద్యమము (టిఎస్‌సి) పథకమును నిర్మల్ భారత్ అభియాన్‌గా మార్పు చేయడం జరిగింది. ఈ నిర్మల్ భారత్ అభియాన్ క్రింద రంగారెడ్డి జిల్లా నీరు మరియు పారిశుద్ధ్య శాఖలో ఇంతవరకు చేపట్టిన, చేపట్టబోయే పనులు భవిష్యత్తులో అనగా 2012-13లో చేపట్టబోయే అభివృద్ధి కార్యక్రమాలు......

- గత ఆర్థిక సంవత్సరములలో రంగారెడ్డి జిల్లా నీరు మరియు పారిశుద్ధ్య శాఖ (40) నిర్మల్ గ్రామ పురస్కారాలు సాధించబడినాయి.
- భారత ప్రభుత్వము ఆర్థిక సంవత్సరము 2012 నుండి అనగా తేది 27-8-2012 నుండి వ్యక్తిగత మరుగుదొడ్డి అంచనా విలువను రూ.3,500/- నుండి రూ.10,000/- వరకు పెంచటం జరిగినది... పెంచబడిన అంచనా విలువ ఈ క్రింది విధంగా....

| | | |
|---|---|---|
| | రూ.4,600.00 | (నిర్మల్ భారత్ అభియాన్ నుండి) |
| | రూ.4,500.00 | (మహాత్మాగాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి పథకం నుండి) |
| | రూ.900.00 | లబ్ధిదారుని వాటా. |
| మొత్తం | **రూ.10,000.00** | |

- ఆర్థిక సంవత్సరం 2012-13కు గాను జిల్లాలో మొత్తం (165) గ్రామ పంచాయతీలను నిర్మల్ గ్రామ పురస్కార్ అవార్డుకు ప్రతిపాదించడం కొరకు ప్రణాళికలు రూపొందించడం జరిగినది. ఈ ఎంపిక చేయబడిన గ్రామాల వివరాలను క్షుణ్ణంగా పరిశీలించి, వ్యక్తిగత మరుగుదొడ్ల ఆవశ్యకత వివరాలను సేకరించుటకు సంబంధిత జిల్లా, గ్రామ స్థాయి అధికారులకు ఆదేశాలు / ప్రతిపాదనలు ఇవ్వటం జరిగినది.
- ప్రతిపాదనలు చేయబడిన (165) నిర్మల్ గ్రామ పంచాయతీలలో గ్రామసభలు మహిళాసంఘాలు, సంబంధిత అధికారులను, అనధికారులును (వి.డబ్ల్యు.ఎస్.సి) కమిటీలను చైతన్యపరచి సంపూర్ణ పారిశుద్ధ్య ఉద్యమంలో పాలుపంచుకొని తమ గ్రామాలను సంపూర్ణ పారిశుద్ధ్య గ్రామాలుగా తీర్చిదిద్దేందుకు చర్యలు తీసుకునేలా... ప్రణాళికను రూపొందించడం జరిగినది.
- గ్రామాలలో సమాచార, విద్య ప్రసార మాధ్యమాలు (ఐ.ఇ.సి) ద్వారా ప్రజలను చైతన్యవంతులను చేయటం తద్వారా, వ్యక్తిగత మరుగుదొడ్ల ఆవశ్యకత, నిర్మల్ గ్రామ పురస్కార ఆవశ్యకత గురించి గ్రామాలలో ప్రతి ఇంటికి, పాఠశాలలకు, అంగన్‌వాడలకు మరియు ఇతర ఆవాస ప్రాంతాలకు మరుగుదొడ్ల సౌకర్యాలు కల్పించడం మరియు వాటి ఆవశ్యకతను చేరవేయుటకు ప్రణాళికలు రూపొందించటం జరిగినది.

## నిర్మల్ భారత్ అభియాన్ (ఎన్.బి.ఎ) ముఖ్య ఉద్దేశములు :



**బి. జగదీశ్వర్ రెడ్డి**
మెంబర్ సెక్రటరీ
జిల్లా నీరు మరియు పారిశుద్ధ్య కమిటీ

- గ్రామీణ ప్రాంతాలలో సంపూర్ణ పారిశుద్ధ్యం సాధించడం
- వ్యక్తిగత పరిశుభ్రత, ఆరోగ్య పరిశుభ్రతపై అవగాహన కల్పించి వారిలో చైతన్యం పెంపొందించి పారిశుద్ధ్య సౌకర్యాల కొరకు డిమాండ్‌ను పెంచడం
- పాఠశాలలు, అంగన్‌వాడీలలో పారిశుద్ధ్యం సౌకర్యాలు కల్పించి, పిల్లలలో ఆరోగ్యం, విద్యపట్ల అవగాహన కల్పించడం....
- బహిరంగ మలవిసర్జనను రూపుమాపడం దీనిపై ప్రజలను చైతన్య వంతులను చేయడం...
- గ్రామాలలో చెత్త (Solid & Liquide Waste)ను ఒక నిర్దేశిత పద్ధతి ప్రకారం పారవేయుటకు... అందుకుగాను ప్రభుత్వం తరపున కావలసిన సహాయం అందించడం.
- గ్రామాలలో ఉన్న ఆవాసాల నుండి వచ్చే చెత్తను తీసే పరికరాలు / వస్తువులను ప్రభుత్వ (జిల్లా నీరు మరియు పారిశుద్ధ్య కమిటీ) ద్వారా అందించటం మొదలైనవి.



**శ్రీ.బి. శ్రీధర్**
జిల్లా కలెక్టర్ అండ్ చైర్మన్
జిల్లా నీరు మరియు పారిశుద్ధ్య కమిటీ

ఈ పథకాన్ని సద్వినియోగం చేసుకుందాం... మరుగుదొడ్లు నిర్మించుకుందాం

### గ్రామీణ నీటి సరఫరా మరియు పారిశుద్ధ్య శాఖ : రంగారెడ్డి జిల్లా

## నిర్మల్ భారత్ అభియాన్ (ఎన్.బి.ఎ)







# సాగు సమస్యలను అధిగమిద్దాం! అధిక దిగుబడులు సాధిద్దాం!!



ఆరుగాలం శ్రమిస్తూ అందరికీ అన్నం పెట్టే రైతన్నలు, తక్కువ ఖర్చుతో అధిక దిగుబడులు సాధించేందుకు, వ్యవసాయ శాఖ చేపట్టే వివిధ పథకాలతో పాటు భూసార పరిరక్షణ పథకం కూడా ప్రాధాన్యత సంతరించుకుంది. భూసారాన్ని పరిరక్షించి రాబోయే తరాలకు ఆరోగ్యవంతమైన భూమిని అందించడమే గాక, నాణ్యమైన అధిక దిగుబడులను కూడా సాధించే దిశగా వ్యవసాయ శాఖ దృష్టి సారించింది.

శ్రీ నల్లారి కిరణ్‌కుమార్‌రెడ్డి
ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్



శ్రీ కన్నా లక్ష్మీనారాయణ
వ్యవసాయ & వ్యవసాయ సాంకేతిక మిషన్
శాఖా మాత్యులు, ఆంధ్రప్రదేశ్

# భూ చేతన

## ఆంధ్రప్రదేశ్‌లో వర్షాధారిత పంటల ఉత్పాదకత పెంపొందించే మిషన్ ప్రాజెక్ట్

- 2011-12 నుండి ఇక్రిశాట్ నిర్వహించే 'భూ చేతనను' ఎక్కువ విస్తీర్ణంలో నిర్వహించుటకు ఈ ప్రాజెక్ట్‌ను వ్యవసాయ శాఖ 2013-14 నుండి చేపడుతుంది.
- ఈ ప్రాజెక్ట్ 2013-14 సంవత్సరంలో 14 జిల్లాలను (కడప, కర్నూలు, నల్గొండ, మెదక్, రంగారెడ్డి, ప్రకాశం, ఆదిలాబాద్, మహబూబ్‌నగర్, కరీంనగర్, అనంతపూర్, ఖమ్మం, వరంగల్, గుంటూరు మరియు పశ్చిమ గోదావరి) ఎంపిక చేయడం జరిగింది.
- ఈ జిల్లాలలో ఎంపిక చేసిన ప్రతీ మండలంలో 2-3 గ్రామాలను గుర్తించి, 350 హెక్టార్ల విస్తీర్ణంలో 2-3 ప్రధాన పంటలలో ప్రదర్శనలు నిర్వహించుట.
- ప్రతీ 350 హెక్టార్ల విస్తీర్ణంలో 10 మట్టి నమూనాలు సేకరించి స్థూల మరియు సూక్ష్మ పోషకాలను విశ్లేషించడం.
- ఈ భూసార పరీక్ష ఆధారంగా ఎరువుల సిఫారసులను అనుసరించి రైతులకు 50% సబ్సిడీపై సూక్ష్మ పోషకాలను (జింక్, జిప్సం మరియు బోరాన్) అందజేయడం.
- వ్యవసాయ శాఖలోని వివిధ పథకాలను సమన్వయ పరచుకొని వ్యవసాయ సాంకేతిక పరిజ్ఞానాన్ని విస్తరించడం ద్వారా సాగు సమస్యలను అధిగమించడం.
- సేంద్రియ వ్యవసాయం - ఎంపిక చేసిన ప్రతి మండలంలో 5 వర్మిబెడ్స్ & 1 వర్మి యూనిట్‌లను ఏర్పాటు చేయడం.
- గ్రామ విత్తన పథకం - ఎంపిక చేసిన మండలంలో ఒక గ్రామవిత్తన పథకం అమలు చేయడం.
- పొలంబడి - ఎంపిక చేసిన మండలంలో ఒక పొలంబడి నిర్వహించడం.
- విత్తన పంపిణీ - గడ్డి ఉత్పత్తిని ప్రోత్సహించుటకు 4 హెక్టార్ల విస్తీర్ణానికి గడ్డిజాతి విత్తనాలు పంపిణీ చేయడం.
- నీటి గుంత - ఎంపిక చేసిన మండలంలో ఒక నీటి గుంతను ఏర్పాటు చేయడం.
- ప్రతిపాదిత ప్రాంతాలలో 50 హెక్టార్లలో డ్రమ్ సీడర్ ద్వారా వరి విత్తనాన్ని వేయుటకు 75% సబ్సిడీపై రైతులకు డ్రమ్ సీడర్ అందజేయుట.

## వ్యవసాయశాఖ - ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

స్పష్టం చేయగలగటం వలన అత్తాకోడళ్ళు, తోడికోడళ్ళు ఎప్పుడూ సహృదయతతో స్నేహంతో సానుభూతితో ఆ వైరుధ్యాలు తమకు సంబంధించినవి కావన్న విజ్ఞతను ప్రదర్శించిన తీరును చిత్రించినందువలన ఇది మంచి కథ కాగలిగింది.

1960 దశకపు ప్రారంభంలో పాము కథతో (1963) ప్రారంభించి త్రిపుర మానవ మనస్తత్వంలోని ద్వంద్వ ప్రవృత్తులను, ఆత్మవంచనా లక్షణాన్ని పరవంచనా ప్రవృత్తిని, ముఖంలేని తనాన్ని, ఏరోజుకారోజు కొత్తముఖాన్ని తగిలించుకొని బ్రతికేందుకు సిద్ధమయ్యే శైథిల్యాన్ని కథా వస్తువుగా చేసుకొన్నాడు. ప్రయాణికులు మొదలైన కథలు వ్రాశాడు. దేవరకొండ బాలగంగాధర్ తిలక్ వ్రాసిన ఊరిచివరి ఇల్లు తీవ్రవాద నాయకుడు వంటి కథలు ఈ దశకంలోనే వచ్చాయి. పాలగుమ్మి పద్మరాజు, ముళ్ళపూడి వెంకట రమణ, పెద్దిభొట్ల సుబ్బ రామయ్య, స్మైల్ మొదలైనవారు ఈ దశకపు కథకులు. పెద్దిభొట్ల సుబ్బరామయ్య మధ్యతరగతి జనజీవితాన్ని, స్వాతంత్ర్యానంతర దేశీయ స్థితిగతులను లంచగొండితనం, నిరుద్యోగం మొదలైన సమస్యలను గుమాస్తా జీవితాలను దళిత బ్రాహ్మల జీవితాన్ని చిత్రిస్తూ కథలు వ్రాయగా స్మైల్ రావిశాస్త్రివలె అధోజగత్తులోని మానవజీవన సంఘర్షణలను వస్తువుగా చేసి 'ఖాళీ సీసాలు' వంటి కథలు వ్రాశాడు. తరువాతి శతాబ్దాలలోనూ వీరి కథారచన విస్తృతంగా సాగింది. ఉత్తరాంధ్ర నుండి భూషణం వంటి కథా రచయితలు ఈ కాలంలోనే రూపొందారు. రాయలసీమ నుండి పులికంటి కృష్ణారెడ్డి కథారచన ప్రారంభించాడు.



**దేవరకొండ బాలగంగాధర్ తిలక్ వ్రాసిన ఊరిచివరి ఇల్లు తీవ్రవాద నాయకుడు వంటి కథలు ఈ దశకంలోనే వచ్చాయి. పాలగుమ్మి పద్మరాజు, ముళ్ళపూడి వెంకటరమణ, పెద్దిభొట్ల సుబ్బరామయ్య, స్మైల్ మొదలైనవారు ఈ దశకపు కథకులు.**

### 3

1966-1975 దశకంలో కుటుంబరావు కథారచన కొనసాగింది. ఆడదానికి స్వేచ్ఛలేకుండా చేసిన వివాహ వ్యవస్థ మీద విమర్శను పెట్టి ఆత్మాభిమానం గల ఆడవాళ్ళు ఆత్మాభిమానంతో స్వేచ్ఛగా సహజంగా ప్రవర్తించగల ఆడవాళ్ళను సహజీవన భాగస్వాములుగా కోరుకొనే సంస్కారాన్ని అభివృద్ధి చేసుకొన్న మగవాళ్లు కలిసి ఏర్పరచుకోగల నూతన స్నేహ సంబంధాలను గురించి చర్చను ప్రారంభిస్తూ వ్రాసిన కథ సైరంధ్రి. (7-11-1969, ఆంధ్రజ్యోతి) స్వాతంత్ర్యానంతరం అభివృద్ధి చెందిన నూతన ధనికవర్గపు మనుషుల తత్త్వాన్ని విమర్శకు పెడుతూ కొ.కు వ్రాసిన ట్యూటర్ కథ ఈ శతాబ్ది కథలలో చెప్పుకోదగింది. ఈ కథలో వాణి నూతన ధనిక వర్గానికి ప్రతినిధి వాళ్ల జీవితానికి కథకుడితోపాటు ఈ కథలో వాణికి హిందీ ట్యూషన్ చెప్పే శేఖర్ కూడా ఒక వ్యాఖ్యాతే. నూతన ధనిక వర్గపు మనుషుల సంబంధాలు వ్యాపార సంబంధాలుగా వున్నాయనే వాస్తవాన్ని 'వాణి జౌళిపరిశ్రమను పెళ్ళాడబోతున్నది' అన్న ఒక్క వాక్యంలో శక్తివంతంగా సూచించాడు కొ.కు. దేనినైనాడబ్బుతోనే కొలిచే ఆ వర్గం వారికి దిగువ వర్గాలవారి ఆర్థికావసరాలు, ఆకాంక్షలు అల్పమైనవిగా కనిపించటంలోని వైరుధ్యాన్ని వ్యక్తీకరించటమే కాక ఆ మనస్తత్వం కారణంగానే వాళ్ళొక పీడక వర్గంగా పేదవర్గాలను శత్రువర్గంగా భావించి అణచివేసి ఎదిగే అమానవీయ స్థితికి చేరుతున్న వైనాన్ని కూడా ఈ కథ చూపించగలిగింది.

1966 యజ్ఞం కథ ప్రచురించి కాళీపట్నం రామారావు ఒక విస్ఫోటనాన్ని సృష్టించాడు. రైతు కుటుంబపు అప్పల్రాముడు అవసరాల కొరకు వూరు షావుకారు గోపన్న దగ్గర చేసిన అప్పుబాకీ రెండువేల అయిదువందలు తీర్చటానికి ఇయ్యబడిన మూడేళ్ళ గడువు ముగిసి మూడ్నెల్లయినా అదింకా తీర్చలేని పరిస్థితిలో వూరిమండపంలో పెద్దమనుషులు పంచాయతీ నిర్వహించిన సంఘటనే ఈ కథలో కీలక ఘట్టం. అప్పల్రాముడు గోపన్న దగ్గర చేసిన అప్పు అప్పేనా, దానిని ఈనాడు ఎలాగైనా తీర్చెయ్యమనటం న్యాయమేనా అన్న మౌలికమైన ప్రశ్న అప్పల్రాముడు వేశాడు. ఆ ప్రశ్న మీద కథా నిర్మాణం జరిగింది. అరెకరాల రైతు - దినుసు మార్పులలో ద్వంద్వ ప్రమాణాలు,

వేరుశనగ వంటి వ్యాపార పంటల ప్రవేశం, రైతుకు తెలియని రైతు చేతుల్లోలేని మార్కెట్ ధరలలో ఒడిదుడుకులు కారణంగా ఆరుగాలం ఇంటిల్లిపాది రెక్కలు ముక్కలు చేసుకొన్నా అప్పులపాలవుతూ క్రమంగా ఉన్నకాస్త వెండి బంగారాలను కోల్పోయి రెండెకరాల సన్నకారు రైతు కూలిగా దిగజారిపోయిన పరిస్థితి గ్రామీణ అభివృద్ధి నీడలో సమాజం అంచులకు నెట్టివేయబడిన విషాద స్థితి ఈ కథలో అప్పుల్రాముడి ముఖంగా వ్యక్తీకరించబడింది. అప్పుబాకీ చెల్లుబాటుకు ఆ ఉన్న కాస్త భూమి అమ్ముకొనలేక ఆ రైతు కుటుంబం చేసిన ఆఖరి పెనుగులాట ఈ కథలో చిత్రించబడింది. అభివృద్ధి ఒక యజ్ఞమే కానీ దానికి బలి పశువులయ్యేది బడుగు జీవులేనని యజ్ఞఫలాలననుభవించి అధికార స్థానాన్ని అలంకరించి సర్వ ప్రయోజనాలు ఈడేర్చుకొనే వర్గం బలపడుతున్నదని స్వాతంత్ర్యానంతర పరిణామాలను పదిహేను సంవత్సరాల కాలంమీద పరిశీలించి నిగ్గుతేల్చి చెప్పాడు కారా ఈ కథలో.



మహదాశీర్వచనం, వీరుడు - మహావీరుడు, హింస, ఆర్తి, చావు వంటి గొప్ప కథలన్నీ కాళీపట్నం రామారావు ఈ దశకంలోనే వ్రాశాడు. ఇటు జీవితంపై కుటుంబం, కులం, ఆర్థిక స్థితిగతులు, చేస్తున్న పెత్తనం వల్ల స్త్రీలు పడుతున్న హింసను, అటు సమాజ జీవితంలోని వర్గ వైరుధ్యాలు మొత్తం మానవ సంబంధాలలోనే ఒక అమానుష వాతావరణాన్ని సృష్టించటం వలన స్త్రీ పురుషులిద్దరూ లోపల నుండి బయటనుండి ఎదుర్కొంటున్నా కనిపించని హింసను ఈ కథలలో కారా సమర్థవంతంగా చిత్రించాడు. పీడిత జనపక్షపాతం కారా కథల లక్షణం. ఆ పీడితులు ఎదుర్కొంటున్న పీడన ఏ స్థాయిదైనా - ఆ మేరకు కారా పీడిత జన పక్షపాత దృక్కోణం నుండే ఈ కథలు వ్రాశాడు. నక్సల్‌బరీ ఘటనకు ముందు వెనుకలుగా వచ్చిన ఈ కథలు రాజకీయార్థిక కోణం నుండి తెలుగు ప్రాంతాల మానవజీవన తాత్త్వికతను ఆవిష్కరించాయి.

**పీడిత జనపక్షపాతం కారా కథల లక్షణం. ఆ పీడితులు ఎదుర్కొంటున్న పీడన ఏ స్థాయిదైనా - ఆ మేరకు కారా పీడిత జన పక్షపాత దృక్కోణం నుండే ఈ కథలు వ్రాశాడు. నక్సల్‌బరీ ఘటనకు ముందు వెనుకలుగా వచ్చిన ఈ కథలు రాజకీయార్థిక కోణం నుండి తెలుగు ప్రాంతాల మానవజీవన తాత్త్వికతను ఆవిష్కరించాయి.**

ఈ దశకంలోను రావిశాస్త్రి రచన ముమ్మరంగా జరిగింది. 1960 తరువాత విస్తరిస్తున్న స్వేచ్ఛా విఫణి విధానం, అది సృష్టిస్తున్న నూతన ధనికవర్గం ద్వారా దేశంలోని దిగుమతి అవుతున్న సామ్రాజ్యవాద సంస్కృతి, దాని నీడలో వికృతంగా పెరుగుతున్న నేర వ్యవస్థ ఇవన్నీ రావిశాస్త్రి కథలలో మానవ జీవిత గమనాన్ని, సంబంధాలను నిర్దేశించటం, నియంత్రించటం కనిపిస్తుంది. పేదసాదలు, మధ్యతరగతి గుమాస్తాలు స్త్రీలు, పురుషులు, యువకులు, వృద్ధులు ఎవరిలోనైనా జీవితోత్సాహాన్ని నిలబెట్టి వ్యతిరేక పరిస్థితులలో యుద్ధానికి సంసిద్ధం చేయటం ఈ శతాబ్ది రావిశాస్త్రి కథా స్వభావం. 1969 నాటికి నక్సల్‌బరి వెలుగులో శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటం ఊపందుకొన్న దశలో 1970లో విప్లవ రచయితల సంఘం ఏర్పడిన నేపథ్యంలో రావిశాస్త్రి ఆ తరువాత వర్గ స్వభావాలను గురించి, వర్గహీనంను గురించిన అవగాహనకు ఆటంకంగా వున్న పూర్వ విశ్వాసాల గురించి, హెచ్చరికగా వుండే కథలు - కొంగల దేవుడు. ఈ ప్రేమ లోకంలో వంటివి వ్రాశాడు.

కాళీపట్నం రామారావు, రావిశాస్త్రి తనకు స్ఫూర్తికాగా ఉత్తరాంధ్ర నుండి భూషణం కథారచయితగా రాటుతేలింది ఈ దశకంలోనే. 1970 నాటికి విస్తరించిన శ్రీకాకుళ గిరిజన రైతాంగ ఉద్యమం అతనికి ప్రధాన కథావస్తువైంది. గిరిజన రైతాంగ పోరాటాలకు కారణమైన సాంఘిక రాజకీయార్థిక పరిస్థితులను, దోపిడి వ్యవస్థలను గిరిజనుల జీవితంలో వస్తున్న పరిణామాలను, ఆయన కథలుగా మలిచాడు. స్వాతంత్ర్యానంతరం ప్రభుత్వ విధానాలు, సంక్షేమ పథకాలు, పాలకవర్గాల ప్రయోజనాలకు ఉపయోగపడినట్లుగా సమాజం చివరి అంచులకు నెట్టివేయబడిన గిరిజనులకు ఉపయోగపడలేదన్న వాస్తవాన్ని భూషణం కథలు బయటపెట్టాయి. మైదానప్రాంతాలు, వ్యాపార వర్గాల, భూస్వాముల పాలకుల నిత్యపీడనకు గురవుతున్న గిరిజనుల 'ధైన్యాన్ని' వాళ్ళలో ప్రతిఘటనా చైతన్యాన్ని ప్రోదిచేసిన

విప్లవోద్యమాన్ని పరస్పర సంబంధంలో అడివంటుకొంది. పులుసు, కొత్తగాలి మొదలైన కథలలో భూషణం చూపించాడు. 1950లలోనే కథా రచన ప్రారంభించి 1965 నాటికి మంచిపల్లకి కథతో తనదైన స్థానాన్ని ఏర్పరచుకొన్న మరొక ఉత్తరాంధ్ర రచయిత శ్రీపతి తొలి కథలలోనే ఆస్తి సంబంధాలపైన, అధికార సంబంధాలపైన విమర్శను సంధించిన శ్రీపతి సహజంగానే నక్సల్ బరి విప్లవోద్యమ ప్రభావంలోకి రాగలిగాడు. 1968 నుండి తెల్లారింది. పెద్దల న్యాయం, గొర్రెలకాపరి, జనం వంటి కథలను వ్రాయగలిగాడు.

రావిశాస్త్రి ప్రభావంతో ఉత్తరాంధ్ర నేపథ్యంలో ఈ దశకంలో కథలు వ్రాసిన ఎన్నెస్ ప్రకాశరావు. మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి బడిపంతుళ్ళ ఒంటరిస్త్రీల బ్రతుకు బరువు మోతలోని వ్యధను, వేదనను చిత్రిస్తూ రగులుకొనే రాక్షసి బొగ్గు, పగ అనే కథలు వ్రాశాడు. పీడితులు ఒక్కసారిగా తిరిగబడితే అంతవరకు అధికార దర్పాలతో హద్దూ పద్దూ లేకుండా అమానవీయంగా ప్రవర్తించిన వాళ్లు ఎంతగా భయపడిపోతారో, వాళ్ళ పేపర్ టైగర్ స్వభావం ఎలా బయటపడుతుందో నిరూపిస్తూ పేపర్ టైగర్ కథ వ్రాశాడు. ఎన్నెన్. వంతొమ్మిది వందల నలభయ్యవ దశకంలో విస్తృతంగానూ యాభయ్యవ దశకంలో ప్రారంభంలో కొద్దిగానూ కథలు వ్రాసిన చాగంటి సోమయాజులు దాదాపు ఒక పదిపదిహేను సంవత్సరాల విరామం తరువాత 1968లో 'బండపాటు' కథతో మళ్ళీ కథా రచన కొనసాగించాడు. అట్టడుగు వర్గాలలో చేసే కూలి పనులతో దినం వెళ్ళటం కష్టమైన బ్రతుకులలో చావుకూడా ఒక సంపాదనా మార్గం కావటం – ఒక చావువల్ల వచ్చే ఆర్థిక ప్రయోజనాలను దక్కించుకొనటానికి భార్య. తల్లి, దళారి తేడా లేకుండా ప్రయత్నించటం ఎంత విషాదమో అంత వాస్తవం కూడానని చాసో ఈ కథలో నిరూపించాడు. మున్సిపాలిటీ పాలనా విధానాలు, అతి సామాన్య జనానికి అర్థంకాని లాలూచీలు కౌన్సిలర్ల స్వార్థ రాజకీయాలు, దళారీతనం పేదవాడి పొట్టమీద కొడుతున్న వైఖరిని 'జంక్షనులో బడ్డీ' (1969 డిసెంబరు) కథలో చిత్రించి చాసో ఉన్నచోటునుండి మార్చబడుతున్న ఉనికి వలన బడుగువర్గాలు, చౌరస్తాల నుండి సందుల్లోకి, పేవ్‌మెంట్ల మీద నుండి నగరపు చివరి అంచులకు నెట్టివేయబడుతూ అదృశ్యమయ్యే క్రమం ప్రారంభం కావటాన్ని సూచించాడు.



**అట్టడుగు వర్గాలలో చేసే కూలి పనులతో దినం వెళ్ళటం కష్టమైన బ్రతుకులలో చావుకూడా ఒక సంపాదనా మార్గం కావటం – ఒక చావువల్ల వచ్చే ఆర్థిక ప్రయోజనాలను దక్కించుకొనటానికి భార్య. తల్లి, దళారి తేడా లేకుండా ప్రయత్నించటం ఎంత విషాదమో అంత వాస్తవం కూడానని చాసో ఈ కథలో నిరూపించాడు.**

ఈ దశకంలో పులికంటి కృష్ణారెడ్డి మరపురాని మా ఊరు (1,మార్చి 1974) వంటి మంచి కథలు వ్రాశాడు. బాల్యానుభవాల జ్ఞాపకాలతో ప్రారంభమై స్వాతంత్ర్యానంతర గ్రామీణ జీవిత విధ్వంస చిత్రాన్ని సూచిస్తూ వ్రాసిన కథ ఇది. పంచవర్ష ప్రణాళికలు, గ్రామాభ్యుదయం గురించిన పథకాలు అమలవుతున్న కాలంలోనే ఈ విధ్వంసం ఎందుకు జరుగుతున్నదన్న మౌలికమైన ప్రశ్నను లేవనెత్తింది ఈ కథ.

ఈ దశకంలో 'ఊరబావి' కథ వ్రాసి (1968) కొలకలూరి ఇనాక్ తెలుగు కథకు దళిత దృక్పథాన్నిచ్చాడు. పెద్ద కులాలవాళ్ళు ఎవరయినా తోడిపోస్తేగాని ఊరబావి నీళ్ళు తెచ్చుకొనటానికి వీలులేని మాదిగల పరిస్థితి ఆ సందర్భంగా వాళ్ళు ఎదుర్కొనవలసి వచ్చే అవమానాలు తిరస్కారాలు సహిస్తూ బ్రతికిన కాలానికి కాలం చెల్లిందని ఈ కథ సూచిస్తుంది. ఆత్మగౌరవ చైతన్యం పొటమరిస్తూ వున్న మాదిగలు సరికొత్త పోరాట రూపాలు, వ్యూహాలు రూపొందించుకొంటూ నిశ్శబ్ద విప్లవానికి సన్నద్ధమవుతున్న దృశ్యాన్ని ఈ కథ అద్భుతంగా చిత్రించింది. చిదంబరం భార్యపాత్ర ఎప్పటికీ గుర్తుండిపోతుంది.

ఈ కాలంలో ఆర్. వసుంధరాదేవి విస్తృతంగా కథలు వ్రాసింది. మచ్చలు, న్యాయం మనుష్యులూ –బొద్దింకలు (1967), బ్రతుకు తెరువు (1971) మొదలైన అనేక కథలు వచ్చాయి. మచ్చలు, మనుష్యులూ – బొద్దింకలూ రెండు కథలు భర్తతో పిల్లలతో జీవించే ఒక గృహిణి అంతరంగ అసంతృప్తులను, భయాలను, అసహనాలను, అసహ్యాలను, ఆవేదనలను ప్రదర్శించాయి.

ఫస్ట్‌కేస్ (1967), డబ్బు (1968) కథలు వ్రాసిన 'బీనాదేవి' ఈ రెండు కథలలోనూ, వైద్యవృత్తిలో వున్న వారి డబ్బుయావ మానవత్వానికి వాళ్ళనెంత పరాయికరిస్తున్నదో స్వప్రయోజనాల వలయంలో ఎలా పరిభ్రమించేలా చేస్తున్నదో చిత్రించటం జరిగింది. ఫస్ట్‌కేస్ కథలో ఆనందరావు ఇంకా మానవత్వాన్ని పూర్తిగా వదులకోని మనిషి. అందుకనే తోటమాలికూతురి జబ్బుకు వైద్యం చేయటానికి వెళ్ళగలిగాడు. అలాంటి పేదలకు సేవ చేయటానికి మురికిపేటలో ప్రాక్టీసు పెట్టాలని ఒక క్షణం అనుకొన్నాడు కానీ అమెరికాకు పై చదువులకు వెళ్ళి తిరిగి వచ్చి మందులు కంపెనీ పెట్టాలన్న తండ్రి ఆశయం మేరకు అమెరికా వెళ్ళటంతో మానవీయతకు పూర్తిగా పరాయివాడయ్యాడు. డబ్బుకథలో ఆ పరాయి ముఖమే కనబడుతుంది. ఆ పరాయి ముఖం వల్లనే డబ్బును తప్ప ఆపదను చూడలేని స్థితికి అతను దిగజారాడు. దాని పరిణామమే తన కొడుకు ప్రాణాలు కాపాడే అవకాశాన్ని తాను పోగొట్టుకొన్న జీవిత విషాదాన్ని ఎదుర్కొనటం.



ఈ దశకంలో 'ఊరబావి' కథ వ్రాసి (1968) కొలకలూరి ఇనాక్ తెలుగు కథకు దళిత దృక్పథాన్నిచ్చాడు. పెద్ద కులాలవాళ్ళు ఎవరయినా తోడిపోస్తేగాని ఊరబావి నీళ్ళు తెచ్చుకొనటానికి వీలులేని మాదిగల పరిస్థితి ఆ సందర్భంగా వాళ్ళు ఎదుర్కొనవలసి వచ్చే అవమానాలు తిరస్కారాలు సహిస్తూ బ్రతికిన కాలానికి కాలం చెల్లిందని ఈ కథ సూచిస్తుంది.

1956-65 దశకంలో అస్తిత్వ స్పృహతో నన్ను అర్థం చేసుకోరా అని భర్తను ప్రాధేయపడే స్త్రీని తన కథలలో సృష్టించిన రంగనాయకమ్మ పెళ్ళి దగ్గర నుండి తన జీవితంలోని ప్రతి అంశాన్ని తానే నిర్ణయించుకోగల చైతన్య స్థాయిని పొందుతున్న కొత్త స్త్రీని చూపిస్తూ విజయ కథను 1966-76 దశకంలో వ్రాసింది. ఈ దశకంలో వచ్చిన 'పెళ్ళానికి ప్రేమలేఖ' కథ ఉత్తరాల రూపంలో నిర్మించబడి భర్తకు ఒక పనిమనిషిగా, ఇంటి కొక కేర్‌టేకర్‌గా మిగిలిపోవటానికి ఇష్టపడని నూతన స్త్రీ ప్రవృత్తిని ఆవిష్కరించింది. ఇప్పుడు స్త్రీ డిమాండే తనను ఒక మానవ వ్యక్తిగా జీవన సహచరిగా గుర్తించమని ఆ ఆకాంక్ష నెరవేరని నాడు కాపురాన్ని వదులుకొనటానికైనా తాను సిద్ధమేనన్న హెచ్చరికను ఈ కథలో విమల చేసింది. ప్రేమ ప్రేమను ప్రేమిస్తుంది కథ కూడా కుటుంబంలో భార్యభర్తల మధ్య వుండవలసిన సమస్థాయి సంబంధాల గురించిన చర్చను ముందుకు తెచ్చింది. 1974లో అరవింద వ్రాసిన ఓ కప్పు కాఫీ కథ అటు ఇంటి పని ఇటు ఉద్యోగపు పని ఒత్తిడిలో నలిగే ఆధునిక స్త్రీ ఇంటిపనిలో భర్త సహకారాన్ని ఆకాంక్షించటాన్ని చూపింది. రాబోయే స్త్రీవాద కథకు వేగుచుక్కగా ఇది కనిపిస్తుంది.

కులమతాలకు అతీతంగా ఇంట్లో ఒక అనాథ పిల్లవాడిని తన కొడుకుగా పెంచే సంస్కారాన్ని ప్రదర్శిస్తూ, తన సంకల్పానికి, తన ఆశయానికి, జీవిత విధానానికి అవరోధంగా వున్న వ్యక్తులతో, సామాజిక శక్తులతో నవ్వుతూనే నిరంతర యుద్ధం కొనసాగించి తను మరణించే నాటికి తను కన్నపిల్లలకు ఆ పెంచిన కొడుకుకు మధ్య ఒక సహజవున్నత సంస్కార సంబంధ పరిమళాన్ని ఇల్లంతా నింపిపోయిన తల్లి కథ ఒక కూతురి కోణం నుండి కథనం చేయబడుతూ వచ్చిన కథ ఊహల్లో స్వరం. ఈ కథతో ఈ దశాబ్దిలో జలంధర కథా రంగప్రవేశం చేసింది.

ఆడవాళ్ళ జీవితంలోని ఒంటరితనాన్ని వస్తువుగా చేసి శివరాజు సుబ్బలక్ష్మి ఈ దశాబ్దంలో అనేక కథలు వ్రాసింది. తమను మనుషులుగా గుర్తించి ఆపేక్షగా చూచుకొనటమే తెలియని భర్తల పట్ల సొంత సుఖాలే కానీ ఆడవాళ్ళ కష్టసుఖాలు, ఇంటి విషయాలు పట్టించుకోని భర్తల పట్ల స్త్రీల అసంతృప్తి లోతులను, ఆ క్రమంలో కొత్త స్నేహసంబంధాలకు, లైంగిక సంబంధాలకు ఆశపడటాన్ని, ఆ ఆశ లోకనీతికి విరుద్ధం కనుక మనసు మూలలకు నెట్టివేసి ఏమీ ఎరుగనట్లు బతుకుసాగించే ఆడవాళ్ళ బ్రతుకు తీరును ప్రయాణం తిరుగుతోంది (1972) మనసుని ముసిరిన మబ్బులు (1973) వంటి కథలలో సుబ్బలక్ష్మి చిత్రించింది. స్త్రీల కోణం నుండి స్త్రీల అంతరంగాలను తెరిచి చూపించిన కథలామెవి.

ఈ దశకంలోనే అబ్బూరి ఛాయాదేవి ఉపగ్రహం (1969) శ్రీమతి ఉద్యోగిని (1975) వంటి కథలు వ్రాసి కుటుంబంలో భార్యభర్తల సంబంధాలు - స్త్రీల అసంతృప్తికి కారణమవుతున్న వైఖరిని బయటపెట్టింది. స్త్రీ స్వతంత్ర్య వ్యక్తి కాదు. భర్త

అనుగ్రహం కోసం నిరంతరం అతని చుట్టూ తిరిగే ఉపగ్రహం. అలా తిరగటంలో ఆమె పొందేది ఏదీ లేకపోవటం ఒక జీవిత విషాదం. స్త్రీ భార్యగా, ఉద్యోగిగా రెండు బాధ్యతలను నిర్వహించాల్సి వచ్చినప్పుడు భార్య బాధ్యత ఎంత ప్రధానమైనదీ ముఖ్యమైనదీ అవుతుందో ఆక్రమంలో భర్తమనసును నొప్పించకుండా కత్తిమీద సాములాంటి కాపురాలను ఎలా చేయవలసివస్తుందో హాస్యపూరితంగా చెప్పిన కథ శ్రీమతి-ఉద్యోగిని. ఛాయాదేవి వ్రాసిన మూడునాళ్ళ ముచ్చట (1973) కథ కూడా ఈ సందర్భంగా ప్రస్తావించదగింది. స్త్రీల నెలసరి బహిష్టు సమస్యను దానిచుట్టూ వున్న ఆచారవ్యవహారాలను, విమర్శకు పెడుతూ వ్రాసిన ఈ కథ మరొక ఆరవై ఏళ్ళకు వికసించనున్న స్త్రీవాద సాహిత్య వస్తు విలక్షణతను సంకేతిస్తున్నది.



నవీన్, రామాచంద్రమౌళి ఈ దశకంలో కథలు వ్రాసిన వాళ్ళలో వున్నారు.

**ఛాయాదేవి వ్రాసిన మూడునాళ్ళ ముచ్చట (1973) కథ కూడా ఈ సందర్భంగా ప్రస్తావించదగింది. స్త్రీల నెలసరి బహిష్టు సమస్యను దానిచుట్టూ వున్న ఆచారవ్యవహారాలను, విమర్శకు పెడుతూ వ్రాసిన ఈ కథ మరొక ఆరవై ఏళ్ళకు వికసించనున్న స్త్రీవాద సాహిత్య వస్తు విలక్షణతను సంకేతిస్తున్నది.**

తెలంగాణా నుండి వట్టికోట ఆళ్వారు స్వామి, జి.సురమౌళి, గూడూరి సీతారాం, కాళోజి మొదలైన వాళ్ళ వారసత్వాన్ని ముందుకు తీసుకొని పోతూ తెలుగు కథ ఇటు ప్రాంతీయ చైతన్యాన్ని, అటు వర్గచైతన్యాన్ని సమకూర్చుకొంటూ అభివృద్ధి చెందటం ఈ దశాబ్దిలో కనిపిస్తుంది. కరీంనగర్ రచయితల కథల సంకలనంగా 1973లో వచ్చిన 'బదలా' ఒక చారిత్రక ఘటనే అని చెప్పాలి. 1970లో విరసం ఏర్పడిన తరువాత విప్లవ నిబద్ధతతో సాహిత్య రచన జరగాలన్న పిలుపుకు కథారంగంలో వచ్చిన తొలి ప్రతిస్పందన ఈ కథా సంకలనం అంతుకు ముందు నుండే కథలు వ్రాస్తూ వున్న తాడిగిరి పోతరాజు వ్రాసిన 'బ్లాక్ అండ్ వైట్' కథ ఉత్తరాంధ్ర నుండి ఉత్తర తెలంగాణకు విస్తరిస్తున్న విప్లవోద్యమ నేపథ్యంలో పోలీసు డిపార్ట్‌మెంట్ వారి జులుంను వస్తువుగా చేసుకొన్నది. తమ ప్రయోజనాలకు అనుగుణంగా పనిచేయక ధిక్కరించిన ఎవరినైనా అణచివేయటానికి 'నక్సలైటు' అని పేరు పెట్టటానికి సిద్ధపడే పోలీసు సంస్కృతి ఎలా రూపొందుతున్నదో సూచించింది. వినోద్ వ్రాసిన 'పునాది' కథ ఒక గ్రామంలో దొర పెత్తనాన్ని ఎదిరించటంగా కొనసాగింది. ప్రజలపై అమలు చేసే అణచివేతే పెత్తందారీ వర్గాల వినాశనానికి పునాది అని హెచ్చరించిన కథ ఇది. పీడిత వర్గంలో వర్గశత్రువును గుర్తించే చైతన్యం అనుభవం నుండి అభివృద్ధి చెందటం తిరుపతి వ్రాసిన 'పిడికిళ్ళు బిగుసుకున్న రాత్రి' కథలో విషయం, భూస్వాముల స్వార్థానికి, భూదాహానికి బలి అవుతున్న బడుగు జీవులు తాము శ్రమచేసిన భూములకే తాము పరాయీకరించబడుతున్న రైతులు ఊళ్ళో న్యాయం దొరకని వ్యతిరేక పరిస్థితులలో విప్లవోద్యమ బాట పడుతున్న దృశ్యాన్ని ఆవిష్కరించింది యం.వి. తిరుపతయ్య వ్రాసిన 'న్యాయం' కథ. యం. శరత్‌కుమార్ వ్రాసిన రేపటి ఉదయం కథ భూస్వాముల కుటుంబానికి పొలాలలోనో, ఇంట్లోనో నిరంతరం చాకిరి చేసే రాజయ్య కుటుంబ సభ్యులందరూ శ్రమదోపిడికే కాక యజమాని కుటుంబ సభ్యుల పీడనకు కూడాగురి అవుతూ వున్న స్థితిలో ఈ బ్రతుకులు ఈ విధంగా ఇంకా ఎన్నాళ్ళన్న ప్రశ్న పీడితులలో తలెత్తుతున్న సందర్భాన్ని చూపింది. 'పోచమ్మ' ఈ సంకలనంలో ఆఖరి కథ. ఉమ్మెంతల వెంకటరెడ్డి దీనిని వ్రాశాడు. ఈ కథలన్నీ పీడిత ప్రజల సమస్యల చుట్టూ నిర్మించబడ్డాయి. కరీంనగర్ జిల్లా వాతావరణ నేపథ్యంలో ఆ జిల్లా మాండలిక భాషలో రచించబడిన ఈ కథలు తరువాత దశకంలో రానున్న విప్లవ కథకు వైతాళిక గీతాలైనాయి. విప్లవోద్యమ నేపథ్యం నుండి ఈ దశకంలో వచ్చిన హోరు, జనం కథా సంపుటాలు (న్యూవేవ్ రచయితలు) కూడా చెప్పుకోదగినవి.

## 4

1976-85 దశకం ప్రధానంగా విప్లవ కథా దశకం అని చెప్పవచ్చు. 1978 నాటికి నిర్దిష్టమైన రూపాన్ని వ్యూహాన్ని తీసుకొన్న కరీంనగర్ ఆదిలాబాద్ రైతాంగ పోరాటగమనాన్ని గిరిజన ఉద్యమచైతన్యాన్ని నమోదు చేసిన, ప్రతిఫలించిన కథలు

అనేకం ఈ కాలంలో వచ్చాయి. భూస్వాముల దోపిడి దౌర్జన్యానికి గురవుతున్న తెలంగాణ గ్రామీణ జనజీవిత సమస్యలు, విప్లవ పార్టీల నేతృత్వంలో సంఘాలుగా సమీకృతలయ్యేందుకు చూపిస్తున్న చొరవ, సంఘబలంతో పెరిగిన పోరాట చైతన్యం ధిక్కారాన్ని జీవలక్షణంగా చేసికొని సాధించిన విజయాలు, ఓటమికి అవమానపడి శాంతి భద్రతల రక్షణకు భూస్వాములు పోలీసు బలగాలను ఊళ్ళలోకి దింపితే తత్ఫలితంగా ప్రజలు ఎదుర్కొన్న కొత్త సమస్యలు, సాయుధపోరాట మార్గాన్ని అంతిమ సాధనంగా ఎంచుకొన్న తెగింపు – ఇవన్నీ ఈ కాలపు కథా వస్తువులు. తెలంగాణలో విశాల ప్రాంతంలో విస్తరించిన సింగరేణి బొగ్గుగనులు వుండటం వలన విప్లవోద్యమ నిర్మాణం గ్రామాలలోనే కాక గనులకు కూడా విస్తరించింది. అందువలన గని కార్మిక పని జీవిత సమస్యలు, వేతన సమస్యలు, గృహ జీవిత సమస్యలు అన్నీ అపూర్వంగా కథా వస్తువులైనాయి. 1979లో గిరిజన రైతు కూలీ సంఘాల స్థాపన ఉధృతమవుతూ సాయుధ విప్లవ నిర్మాణం బలపడుతూ దండకారణ్యంలోకి విస్తరించిన క్రమంలో గోండు గిరిజన జీవితాలను కూడా అది అనన్యంగా ప్రభావితం చేసింది. 1981 ఏప్రిల్ ఇంద్రవెల్లిలో గిరిజనులు తమ సమస్యల మీద మాట్లాడుకోవటానికి సభ పెట్టుకొని తరలిరావటం, ప్రభుత్వం ఆ సభ జరగకుండా అడ్డుపడటం, ఆ క్రమంలో కొందరు గిరిజనులు మరణించటం, గాయపడటం, ఎందరో జైలుపాలు కావటం అందరి దృష్టిని గిరిజన జీవిత సమస్యల వైపు మళ్లించింది. తత్ఫలితంగా గిరిజన జీవిత సమస్య విస్తృతంగా ఈ కాలపు విప్లవ కథా వస్తువైంది.

'సంఘం' అనే కథ వ్రాసి ఈ దశకపు విప్లవ కథకు (1978 మార్చి) ఒరవడి పెట్టాడు అల్లం రాజయ్య. అల్లం రాజయ్యతోపాటు వుప్పల నరసింహం, బి.యస్.రాములు, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, పి. చంద్, కార్మిక, కిరణ్, సాహు, కాలువమల్లయ్య మొదలైన వారెందరో ఈ కాలంలో కర్షక కార్మిక గిరిజన జీవితాలలోని పరిణామాలను, చైతన్యాన్ని ప్రతిఫలించే కథలు వ్రాశారు. సున్నితమైన మానవ హృదయ స్పందనలను చిత్రించటంలో ఈ రచయితలు ప్రతిభ కనబరిచారు. అల్లం రాజయ్య వ్రాసిన మార్పు ఇందుకు మంచి ఉదాహరణ. విప్లవోద్యమ చైతన్యాన్ని ముందుగా పొందినవాళ్ళు తమ కుటుంబంలో బంధుమిత్రులలో దానికి అనుగుణమైన చైతన్యాన్ని ప్రోది చేయటానికి ఎంత ప్రేమతో, ఎంత బాధ్యతతో, ఎంత ఓర్పుతో ప్రయత్నించాలో ఈ కథ చూపింది. మామాకోడళ్ళ సంబంధాలు కేవలం బంధుత్వ సంబంధాలుగానే కాక ఒక ఉన్నతాశయంతో ముడిపడి వున్న బంధంగా, ఆ ఆశయానికి కట్టుబడి ఆచరణ మార్గంలో వున్న వ్యక్తి జీవితంతో ముడిపడివున్న జీవన సంబంధంగా వున్నప్పుడు ఎంత మానవీయంగా ఆర్ద్రంగా వుంటుందో కూడా ఈ కథ చెప్తుంది. మొత్తం మీద వీళ్ళందరూ భూస్వామ్యపు ఉక్కుపిడికిట్లో గిలగిల తన్నుకునే నిరుపేదలనే కథావ్యక్తులుగా స్వీకరించినా ఆ వ్యక్తులు వివిధ కులాలకు, వృత్తులకు చెందిన వాళ్లయినప్పుడు ఆయా పరిధులు, పరిమితుల మేరకు వాళ్ళ విప్లవ చైతన్యం ఏ విధంగా వుంటుందో చూపించగలిగారు. వుప్పల నరసింహం వ్రాసిన 'తిరగబడ్డ భూమి' కథలో గ్రామ సుంకరి ముత్యాలు జీవనానుభవం చిత్రించబడిన తీరు ఉదాహరించదగినది. బొగ్గు బావి పనిలో నిరంతరం ఒళ్లు హూనం చేసుకొని అనంత సంపదను భూమి పొరల నుండి పైకి తీస్తున్న కార్మికులు ఉండటానికి సరియైన వసతి, నీటి వసతి లేక పొయ్యి మీదికి, పొయ్యి కిందికీ లేక పడే యాతనలను, ఆ యాతనలనుండి బయట పడటానికి చేస్తున్న పెనుగులాటలను, ప్రతిఘటనలను తుమ్మేటి రఘోత్తమరెడ్డి చక్కని కథలుగా మలిచాడు. ఆ వరుసలో నీళ్ళ తగువు మంచికథ, కార్మికునిపై జరిగే దోపిడీ, కార్మికుల జీవనావసరాలు తీర్చటం పట్ల యాజమాన్యపు నిర్లక్ష్యవైఖరి కార్మికుల ఇండ్లలో స్త్రీల జీవితాన్ని ఎంత దుర్భరం చేస్తుందో స్త్రీలు పోరాటమార్గంలోకి



**సున్నితమైన మానవ హృదయ స్పందనలను చిత్రించటంలో ఈ రచయితలు ప్రతిభ కనబరిచారు. అల్లం రాజయ్య వ్రాసిన మార్పు ఇందుకు మంచి ఉదాహరణ. విప్లవోద్యమ చైతన్యాన్ని ముందుగా పొందినవాళ్ళు తమ కుటుంబంలో బంధుమిత్రులలో దానికి అనుగుణమైన చైతన్యాన్ని ప్రోది చేయటానికి ఎంత ప్రేమతో, ఎంత బాధ్యతతో, ఎంత ఓర్పుతో ప్రయత్నించాలో ఈ కథ చూపింది.**

రావలసిన అనివార్యతను ఎలా కల్పిస్తుందో 'నీళ్ళ తగువు' కథ స్పష్టం చేసింది. గిరిజనుల జీవితాలు అవసరాలకు ఆపదలకు మైదాన ప్రాంత షావుకార్లకు తాకట్టు పెట్టబడుతున్న తీరును పి. చంద్ వ్రాసిన 'అనామతుఖాతా' వంటి కథలు విమర్శకు పెట్టాయి. ప్రభుత్వ ప్లాంటేషన్ విధానాలు గిరిజనులను తమకు సహజ వారసత్వం సంపద అయిన అటవీ భూముల నుండి బేదాఖలు చేస్తుంటే దానిని ప్రతిఘటించ పూనుకొన్న గిరిజనుల చైతన్యాన్ని, బొంగు కొట్టుకొని పోవటానికి అడవులలోకి వచ్చే కాంట్రాక్టర్ల దోపిడీ విధానానికి వ్యతిరేకంగా తిరగబడుతున్న గిరిజనుల తెగింపును చిత్రిస్తూ సాహు వ్రాసిన రక్తపింజెర వంటి కథలు ఈ దశకంలో వచ్చాయి. బి.యస్. రాములు వ్రాసిన అడవిలో వెన్నెల కథ (1984 అక్టోబరు, అరుణతార) గోండ్లు గిరిజన జీవితాన్ని, జీవన విధానాన్ని సమగ్రంగా చిత్రించింది. గిరిజనుల ప్రేమలు, పెళ్ళిళ్లు, రివాజులు ఉత్సవాలు, ఆహార విహారాలు, అనారోగ్యాలు, రిజర్వు ఫారెస్టు అధికారుల ఆగడాలు, మేకలను మేపుకొన్నందుకు, గుడిసెకు అవసరమైన కట్టె కొట్టుకొన్నందుకు చివరకు వ్యవసాయం చేసినందుకు – ఆ అడవి, ఆ భూములు ప్రభుత్వ రక్షిత సంపదలో భాగం అన్న నెపంతో నిరంతరం కట్టవలసి వస్తున్న దండుగలు, పేపరు మిల్లులకు సరఫరా చేసే బొంగు కొరకు ప్లాంటేషన్లు వేసే ప్రభుత్వ విధానాల వల్ల సాగుభూములను కోల్పోవటాలు, పంటకోత సమయంలో ప్లాంటేషన్లలో కంకబొంగు కొట్టటానికి నిర్బంధంగా పోవలసి రావటం, అందుకు లభించే కూలీలో ప్రకటిత, అప్రకటిత కోతలతో శ్రమదోపిడికి గురికావటం, అసవరాల కొరకు, షావుకార్ల దగ్గర చేసిన అప్పుల క్రింద, వాళ్ళ దగ్గర కొన్న వినియోగ వస్తువుల కింద చేతికొచ్చిన పంటను జమకట్టవలసి రావటం – ఇవన్నీ గిరిజనుల జీవితాన్ని ఎంత దుఃఖభాజనం చేస్తున్నాయో అనివార్యంగా వారిని పోరాటాల వైపు ఎలా నెడుతున్నాయో అడవిలో వెన్నెల కథలో చిత్రించాడు బి.యస్.రాములు. ఈ దశకంలో వర్గ సమాజ సంస్కృతిని స్వభావాన్ని భిన్న కోణాల నుండి ప్రదర్శిస్తూ రాయలసీమ నుండి కేతు విశ్వనాథరెడ్డి కథలు వచ్చాయి. కులం, మతం జీవితాన్ని నియంత్రించే సాంస్కృతిక శక్తులుగా పైకి కనబడుతున్నప్పటికీ నిజానికి జీవన విలువల నిర్ణాయక శక్తి 'డబ్బు' మాత్రమేనని కేతు విశ్వనాథరెడ్డి మార్పు, సానుభూతి మొదలైన కథలలో సూచించాడు. ఆర్థిక ప్రయోజనాల కొరకు కులాన్ని నెపంగావాడుకొనే హీన విలువల సంస్కృతిని పద్ధతి (1977) కథలో, కులాన్ని కార్మిక ఉద్యమాలను నీరుకార్చడానికి సాధనంగా చేసి స్వప్రయోజనాలను ఈడేర్చుకొనే నీచ విలువల దిగజారుడుతనాన్ని శృతి (1984) కథలో గమనించవచ్చు. పోలీసు అధికార ఉద్యోగరంగాలు మనుషులను అమానవీకరిస్తున్న వైఖరిని అనధికారం (1978). పారువేట (1978) కథలలో నిరసించాడు. శ్రామికులకు కడుపునిండా తిండి, సంపదలో న్యాయమైన ఒక వాటా ఇయ్యలేని వర్గసమాజంలో అన్నదానపు తంతు అమానవీయ విలువ అని నిర్ద్వంద్వంగా నిరూపించిన అన్నదాతలు (1983) కథలు విశ్వనాధ రెడ్డి కథలలో తప్పనిసరిగా పేర్కొనదగినవి.



**ఈ దశకంలో వర్గ సమాజ సంస్కృతిని స్వభావాన్ని భిన్న కోణాల నుండి ప్రదర్శిస్తూ రాయలసీమ నుండి కేతు విశ్వనాథరెడ్డి కథలు వచ్చాయి. కులం, మతం జీవితాన్ని నియంత్రించే సాంస్కృతిక శక్తులుగా పైకి కనబడుతున్నప్పటికీ నిజానికి జీవన విలువల నిర్ణాయక శక్తి 'డబ్బు' మాత్రమేనని కేతు విశ్వనాథరెడ్డి మార్పు, సానుభూతి మొదలైన కథలలో సూచించాడు.**

ఈ దశకంలోనే పి.సత్యవతి కథారచయితగా నిలదొక్కుకొని, 'మాఘసూర్యకాంతి' కథ ద్వారా తన జీవితదృక్పథాన్ని – స్త్రీల జీవిత అనుభవ కోణం నుండి స్త్రీల పక్షాన నిలబడి ఆలోచించగల దృక్పథాన్ని వ్యక్తీకరించుకొన్నది. ఉనికిని కోల్పోతున్నామని బాధపడుతూ, ఉనికిని నిలబెట్టుకొనాలని ప్రయత్నిస్తూ ఆ క్రమంలో స్త్రీలు పడే జీవన సంఘర్షణను, ప్రదర్శించే ఆత్మగౌరవ చైతన్యాన్ని, ఆత్మ విశ్వాసాన్ని ప్రధానంగా చిత్రిస్తూ సత్యవతి ఈ దశకంలో సరళరేఖ, డాటర్స్ ఆఫ్ ఇండియా దామిట్ వంటి కథలు వ్రాసింది. యశోదా రెడ్డి, సుజాతారెడ్డి తెలంగాణ జనజీవన సంస్కృతిని ప్రతిఫలించే కథలు వ్రాశారు. ఆత్మాభిమానంతో ప్రవర్తించటం, తనను తాను ప్రేమించుకొనటం, తనను తాను గౌరవించుకొనటం ఉత్తమ జీవిత విలువగా ప్రతిపాదిస్తూ అది

అందరి జీవితాలను వెలిగింపచేయగల శక్తి అని నిరూపిస్తూ జలంధర ఈ దశకంలో సాలభంజిక, తులసి మొక్క వంటి కథలు వ్రాసింది.

మధురాంతకం రాజారాం, బలివాడ కాంతారావు, సింగమనేని నారాయణ, అల్లం శేషగిరిరావు మొదలైన వాళ్ళు, ఈ దశకపు కథా రచయితలు. వాసిరెడ్డి సీతాదేవి, డి. కామేశ్వరి మొదలైన వాళ్ళెందరో ఈ దశకంలో కథలు వ్రాశారు.

**5**

1986-95 దశకంలో అల్లం రాజయ్య, తుమ్మేటి రఘోత్తమరెడ్డి మొదలైన వారి విప్లవ కథా సాహిత్య సృజన కొనసాగింది. విప్లవోద్యమ కథలో ఈ దశాబ్దిలో ఒక గుణాత్మక పరిణామం వచ్చింది. 1978 నుండి 1985 వరకు విప్లవోద్యమ కథ ప్రధానంగా విప్లవోద్యమ చరిత్ర గమనంతో, ఘటనలతో ముడిపడి అభివృద్ధి చెందింది. విప్లవోద్యమ చరిత్ర క్రమాన్ని డాక్యుమెంట్ చేసిన కథలవి. విప్లవోద్యమం ఊళ్ళల్లో, మానవ సంబంధాలలో, చిత్తవృత్తులలో తెచ్చిన పరిణామాలను ప్రదర్శించటం ఈ దశకపు కథాలక్షణం. అల్లంరాజయ్య వ్రాసిన మనిషి లోపలి విధ్వంసం (1989) భూముల్లో పనులు చేస్తూ, షావుకార్ల దగ్గర అప్పులు చేస్తూ, బ్యాంకుల నుండి అప్పులు తీసుకొంటూ ప్రకృతి సహకరించక, పంటలు అందక, అప్పులు తీర్చలేక బకాయిల కింద భూములను కోల్పోతూ ఆ క్రమంలో తనను తానే కోల్పోయే రైతు కుటుంబాన్ని సాది సవరించలేక భూమికే కాక తనవాళ్ళకు కూడా పరాయివాడై పడే, ఒంటరి వేదనలను, ఎదుర్కొనే జీవిత పరిణామాలను ఈ కథ చిత్రించింది. రైతు కూలీగా మారే క్రమంలో చచ్చిన వాడితో సమానమవుతున్నాడు. ఏ చావూ తననింక కదల్చలేని జడత్వ స్థితికి చేరుకొంటున్నాడు. తన ప్రమేయం లేని ఈ పరిణామాలకు తాను బాధ్యుడుగా చేయబడి కన్న కొడుకు దిక్కులేని చావును, భార్య ద్వేషాన్ని ఎదుర్కొనవలసి వచ్చిన రైతు జీవిత విషాదాన్ని మనిషలోపలి విధ్వంసం కథ వ్యక్తీకరించింది. అల్లంరాజయ్య వ్రాసిన అతడు కథ కూడా ఈ సందర్భంలో తప్పక ప్రస్తావించవలసినది. సింగరేణి బొగ్గు గనులలో కార్మికోద్యమాన్ని నిర్మించటంలో భాగంగా తన స్నేహ సంబంధాలతో, సంభాషణలతో, ఉనికితో అతనెంతమంది ఆలోచనా ప్రపంచాన్ని కుదుపుకు లోనుచేశాడో, ఎంతమంది జీవితాలను ప్రభావితం చేశాడో తానొక్కడే ఎవరికి ఏమేమి అయి తోచాడో, కనిపించాడో అతని మరణ సందర్భంలో మనుషుల జ్ఞాపకాల నుండి వేదనల నుండి విశిష్టంగా వ్యక్తీకరించిన కథ ఇది.



**విప్లవోద్యమ కథలో ఈ దశాబ్దిలో ఒక గుణాత్మక పరిణామం వచ్చింది. 1978 నుండి 1985 వరకు విప్లవోద్యమ కథ ప్రధానంగా విప్లవోద్యమ చరిత్ర గమనంతో, ఘటనలతో ముడిపడి అభివృద్ధి చెందింది. విప్లవోద్యమ చరిత్ర క్రమాన్ని డాక్యుమెంట్ చేసిన కథలవి. విప్లవోద్యమం ఊళ్ళల్లో, మానవ సంబంధాలలో, చిత్తవృత్తులలో తెచ్చిన పరిణామాలను ప్రదర్శించటం ఈ దశకపు కథాలక్షణం.**

విప్లవోద్యమ అవసరాల కొద్దీ కుటుంబాల నుండి వేరయి పనిచేస్తున్న వాళ్ళ జాడ ప్రజాసమూహాలలో, హృదయాలలో ఎంత గాఢంగా కనబడుతుందో, ఎందుకూ పనికిరానివాడని లోకం తిరస్కరించిన వ్యక్తికి విప్లవోద్యమం ఎంత విలువను కల్పిస్తుందో ఈ మొత్తం సందర్భం తనగురించి మాత్రమే ఆలోచించుకొనే స్వార్థపూరిత మానవ మనస్తత్వంలో సైతం కదలికలను ఎలా సృష్టిస్తుందో జాడ కథలో రఘోత్తమరెడ్డి చూపించాడు.

కైతికాల పోశెట్టి 'స్వగతాలు'గా సింగరేణి బొగ్గుబావులలోని శ్రామిక జన వ్యతిరేక రాజకీయాలను కడిగి పోసే కథలు 'బండకింద బతుకులు' అన్న పేరుతో ఈ దశకంలోనే వచ్చాయి. హరిత విప్లవ ఫలితంగా వ్యవసాయం గిట్టుబాటు కాక భూములు కోల్పోయి బ్రతుకు తెరువుకై బొగ్గు బావులకు వచ్చిపడ్డ ఉత్తర తెలంగాణ రైతాంగానికి ప్రతినిధి ఈ పోశెట్టి పాత్ర అభివృద్ధి నమూనా అడుగున పడి నలిగినవాడు. అందువల్లనే జీవితపు లోతులు తెలిసి వ్యాఖ్యానించగలిగాడు. పూర్తి తెలంగాణా మాండలికంలో ఒక ప్రయోగంగా వచ్చిన రాజకీయ కథలివి.

ఈ దశకంలో విప్లవోద్యమ రాజకీయ సంస్కృతీ నేపథ్యం నుండి జీవితాన్ని వ్యాఖ్యానించగల తాత్త్విక గాఢతతో యువరచయితలు అనేకమంది రంగంలోకి వచ్చారు. భూపాల్ వ్రాసిన అంబల్లబండ కథ, భూస్వామ్య అధికారాన్ని ధిక్కరించే

గొల్లకుల జన సంఘటిత శక్తిని చిత్రించింది. భూసంబంధాలనే కాక 90వ దశకంలో వచ్చిపడిన నూతన ఆర్థిక విధానాల ఫలితంగా విస్తరిస్తున్న ప్రైవేటీకరణ పదఘట్టనల కింద నలుగుతున్న మానవ జీవన సంబంధాలను సంవేదనలను వీళ్ళు కథావస్తువులుగా చేసుకోగలిగారు. అంతకుముందు దశకంలో వ్యావసాయిక విప్లవోద్యమాలను, వాటి ప్రభావాలకు లోనవుతున్న, ఉత్తరాంధ్ర గ్రామీణ జనజీవితాన్ని చూస్తూ, 'పోడు' కథలు, 'పోరు' కథలు వ్రాసిన ఎ.అప్పల్నాయుడు ఈ దశకంలో వస్తువినిమయ సంస్కృతిని విస్తరింపచేసే పెద్ద షాపింగ్‌మాల్స్ నిర్మాణం జరుగుతూ చిన్న వ్యాపారులను ఉపాంతీకరించే ప్రక్రియ ప్రారంభం కావటం గమనించాడు. అలా చిన్న బడ్డీకొట్టు వ్యాపారులను సమాజం చివరి అంచులకు నెట్టివేసే కుట్ర మున్సిపల్ అధికార రాజకీయాలో భాగంగా ఎలా జరుగుతున్నదో 'భద్రయ్య' కథలో చూపించాడు.



ఈ వ్యాపార సంస్కృతిలో వ్యవసాయం గిట్టుబాటు కాక రైతు జీవితం ఒక వైపు నానాటికీ దిగనాసిల్లుతుంటే ఉద్యోగ వర్గాలకు భూమి ఒక జీవనాధారంగా కాక ఆస్తిగా కనబడే స్థితి ఘనీభవిస్తున్నప్పుడు భూమితో ప్రత్యక్ష సంబంధంలేని యజమానికి, భూమిమీద వ్యవసాయం చేసేవాళ్ళకు మధ్య తలెత్తే ఒకానొక వైరుధ్యం ఈదశకపు కథల్లో, భిన్న కోణాల నుండి ప్రదర్శితమైంది. పాపినేని శివశంకర్ వ్రాసిన 'మట్టి గుండె' ఇందుకు ప్రతినిధి కథ అనవచ్చు.

ఈ దశకంలో కథలు వ్రాయటం ప్రారంభించిన వారు స్వామి, చక్రవేణు, బమ్మిడి జగదీశ్వరరావు, కాట్రగడ్డ దయానంద్, ఆర్.యం. ఉమామహేశ్వరరావు, డా॥ వి చంద్రశేఖరరావు, కొండేపూడి నిర్మల, ఒమ్మి రమేశ్‌బాబు, సి.సుజాత, డా॥ టి. సంపత్ కుమార్, గొరుసు జగదీశ్వరరెడ్డి దగ్గమాటి పద్మాకర్, కుప్పిలి పద్మ, ముళ్ళపూడి సుబ్బారావు, దాదాహయత్, ఓల్గా, కె.వరలక్ష్మి, వి. ప్రతిమ, నల్లూరి రుక్మిణి, సువర్ణముఖి మొదలైనవాళ్ళు.

**భూసంబంధాలనే కాక 90వ దశకంలో వచ్చిపడిన నూతన ఆర్థిక విధానాల ఫలితంగా విస్తరిస్తున్న ప్రైవేటీకరణ పదఘట్టనల కింద నలుగుతున్న మానవ జీవన సంబంధాలను సంవేదనలను వీళ్ళు కథావస్తువులుగా చేసుకోగలిగారు.**

కరువు, పేదరికం మనుషులనెంత దౌర్భాగ్య స్థితికి నెడుతుందో మనుషులలో ఒకరిపట్ల ఒకరికి వుండవలసిన ప్రేమాభిమానాలను ఎలా హరించివేస్తుందో,రక్త సంబంధీకులు, ఒక తల్లి పేగు తెంచుకొని పుట్టినవాళ్లు కూడా ఒకరినొకరు విశ్వసించుకొనలేని పరిస్థితులెలా దాపురిస్తాయో చిత్రించిన కథలు ఈ దశకంలో స్వామి వ్రాసిన సావుకూడు, చక్రవేణు వ్రాసిన కసాయి కరువు, కువైట్ సావిత్రమ్మ మొదలైనవి. చచ్చిన మొగుడి గురించి కాక, మొగుడి చావు దినం నాడు వండిన మాంసంకూర ఒకముక్కయినా తన విస్తట్లోకి రాలేదే అని తలచుకొని ఏడ్చిన తల్లి చావు కూటికై పడిన ఆశ 'సావు' కూడు' కథ ముగిసేసరికి అత్యంత కఠినంగా ఆవిష్కృతమవుతుంది. డబ్బు అన్ని తప్పులను మాఫీచేసి వ్యక్తికి గౌరవాన్ని తెచ్చిపెట్టే విలువగా వుండటం కువైట్ సావిత్రమ్మ కథలో కనబడుతుంది.

ఉన్నత విద్యలవల్ల, ఉద్యోగాలవల్ల, అధికారాలవల్ల తానెంతో ఎదిగిపోయానని భావించి పూరి జగన్నాథ స్వామి దేవాలయంలో పండాగా తండ్రి జీవితాన్ని, అందులోని ప్రలోభాలను, భక్తులనుండి డబ్బు దండుకునే పద్ధతులను ఏవగించుకొన్న కొడుకు ఆ తండ్రి చావు బతుకుల్లో వుంటే చూడటానికి వెళ్ళేందుకే బోలెడు కష్టపడడం, తండ్రితో కూర్చుని ఆదరంగా మాట్లాడలేకపోవటం, తన ఇంట్లో తానుండి అక్కతో కలిసి తినలేకపోవటం - ఇవన్నీ ఆ తండ్రి కంటే ఇతను ఎందులో గొప్ప అన్న ప్రశ్నను పాఠకులకు కలిగించే కథ చక్రతీర్ధ - బలివాడ కాంతారావు వ్రాసినది ఈ దశకపు రచన. పాఠకులకు కలిగే ఆ ప్రశ్నే తండ్రికి తన కన్న కొడుకు ఎందులోనూ గొప్పకాదని నమ్మకమైన సమాధానం అయింది. అందుకే తన మరణానంతర కార్యక్రమాల బాధ్యత కొడుక్కి వదిలెయ్యలేకపోయాడు. ఆ రకంగా డబ్బు మాయలో మనుషులు హీనులకంటే హీనులుగా దిగజారటాన్ని, మనిషిని సానుభూతితో అర్థం చేసుకొనలేక పోవటాన్ని 'చక్రతీర్థ' కథ చూపించింది.

ఈ దశకంలో స్త్రీల చేతిలో కథ ఒక స్పష్టమైన రాజకీయ సాధనంగా పదునుదేరింది. సమాజంలోని స్త్రీ పురుష వివక్షా సంస్కృతి వెనక వున్న రాజకీయార్థిక ఉద్దేశాలను, వ్యూహాలను పసిగట్టే ఎండగట్టే లక్ష్యంతో స్త్రీ అస్తిత్వ చైతన్యాలకు ప్రాతినిధ్యం వహిస్తూ స్త్రీవాద కథ బలపడింది. ఓల్గా వ్రాసిన 'రాజకీయ కథలు' స్త్రీల శరీరాల చుట్టూ, స్త్రీలకు తోటి స్త్రీలతో, సమాజంతో ఇంట్లో తమ పురుషులతో వుండే సంబంధాల చుట్టూ పితృస్వామిక సమాజం అల్లిన 'మాయ జలతారు పరదాలను తొలగించి అసలు వాస్తవానికి కళ్లు తెరిపిస్తాయి. 'స్త్రీలు పుట్టరు, తయారు చేయబడతారు' అన్న సైమన్ డి బావురె మాటల సారాంశం, ఏ సామాజిక నియంత్రణను ఉద్దేశించిందో ఆ సామాజిక నియంత్రణా స్వభావాన్ని మన అవగాహనకు తీసుకొనివచ్చే ప్రయోజనాపేక్షలో ఓల్గా వ్రాసిన కథలు రాజకీయ కథలు, స్త్రీలను అధీనులుగా అణచి వుంచటానికి శరీరాన్ని, శారీరక కదలికలను నియంత్రించటం తద్వారా మననుని ఆలోచనలను అణచి వ్యక్తిత్వమనేది లేకుండా చేయటం, మనసుని, ఆలోచనలను నియంత్రించి వ్యక్తిత్వం వికసించకుండా నిరోధించటం ద్వారా శరీరాన్ని కుంచింపచేయటం వరస్పర సంబంధంలో చాపకింద నీరులాగా తెలియకుండానే జరిగిపోతుంటుందని గ్రహించిన ఓల్గా ఈ అణచివేత రాజకీయాల గుట్టు మట్లు విప్పి చెప్పేందుకు వ్రాసిన కథలివి.



**ఓల్గా వ్రాసిన 'రాజకీయ కథలు' స్త్రీల శరీరాల చుట్టూ, స్త్రీలకు తోటి స్త్రీలతో, సమాజంతో ఇంట్లో తమ పురుషులతో వుండే సంబంధాల చుట్టూ పితృస్వామిక సమాజం అల్లిన 'మాయ జలతారు పరదాలను తొలగించి అసలు వాస్తవానికి కళ్లు తెరిపిస్తాయి.**

జుట్టు, కళ్ళు, ముక్కు, నోరు మొదలైనవన్నీ ఒక శరీర సంబంధమైన అంగాలు ఆ శరీరం స్త్రీదయితే అవి ప్రత్యేకంగా ఆ స్త్రీకి సంబంధించినవి. వీటికి అదనంగా స్త్రీకి మాత్రమే ప్రత్యేకమైనది, పునరుత్పత్తికి స్థానమైనది గర్భసంచి ఒకటి వున్నది. అయితే ఇవన్నీ స్త్రీ ఇచ్ఛతోటి, అవసరంతోటి, ఆకాంక్షల తోటి సంబంధం లేకుండా పురుష ప్రయోజనాలకు, పితృస్వామిక సంస్కృతికి అనుకూలంగా నిర్వచించబడటం, వ్యాఖ్యానించ బడటం స్త్రీ స్వతంత్ర వ్యక్తిత్వాన్ని కొద్దికొద్దిగా హరిస్తూ మొత్తంగా స్త్రీని లొంగదీస్తుంది. ఈ క్రమంలో స్త్రీలు పడే హింస, వేదన సీతజడ, కళ్ళు, ముక్కుపుడక, నోర్ముయ్, ఒక రాజకీయ కథ మొదలైన వాటిలో చిత్రించబడింది. ఈ కథలు వ్రాయటం ద్వారా ఓల్గా పురుషాధిపత్య సంస్కృతిపై యుద్ధ ప్రకటన చేసినట్లయింది. అనాకార సంబంధాలుగా మారిన దాంపత్య సంబంధాలపై తిరుగుబాటుగా వివాహంతో నిమిత్తం లేని స్త్రీపురుష సంబంధాలను ప్రత్యామ్నాయంగా చూపిస్తూ ఓల్గా ప్రయోగం కథ వ్రాసింది ఈ కాలంలోనే.

1989 అక్టోబరు నుండి 1995 ఏప్రిల్ వరకు అయిదున్నర సంవత్సరాల కాలంమీద పి. సత్యవతి స్త్రీల జీవితాల గురించి; స్త్రీల అనుభవాల గురించి స్త్రీల కోణం నుండి వ్రాసిన కథలు 'ఇల్లలకగానే....' అన్న సంకలనంగా వచ్చాయి. స్త్రీవాద కథకు పరిపుష్టిని సమకూర్చిన కథలివి. ప్రతి పురుషుడి విజయం వెనక ఒక స్త్రీ వుంటుంది అని మెచ్చుకోలుగా మాట్లాడే మాట వెనక ఒక స్త్రీ తనను తాను కోల్పోవటం వుంటుందని స్పష్టం చేసింది. భర్తల నీడలో, భర్తల కొరకు సేవలు చేస్తూ భర్తల మేధోచైతన్యాల పరిధుల మేరకు తమను తాము కుదించుకొని బ్రతుకుతూ, తమకంటూ ప్రత్యేకమైన ఉనికి లేకుండా యాంత్రికంగా బ్రతికే ఇల్లాళ్ళను తయారుచేస్తున్న కుటుంబం యొక్క అసలు స్వభావాన్ని బయటపెట్టిన కథలు సత్యవతి కథలు. భార్య గృహిణి, మాతృమూర్తి మొదలైన అధికారం లేని పదవులకే మురిసి, ఆ పదవీ బాధ్యతల నిర్వహణలో తన వ్యక్తిత్వాన్ని, ఉనికిని కోల్పోయిన స్త్రీ తనను తాను వెతుక్కోవటం, తనను తాను తెలుసుకొనటం స్త్రీవాద కథకు అసలు లక్షణం. ఇల్లలకగానే కథ ఆ రకంగా ఇంటి పనిలో తనను తాను కోల్పోయిన స్త్రీ తనెవరో తెలుసుకోనాలన్న ఆత్మజ్ఞానం పొంది ఆరాటపడటం వస్తువుగా సత్యవతి వ్రాసిన ఇల్లలకగానే కథ ఆరకంగా మంచి స్త్రీవాద కథ అయింది.

మసిగుడ్డ, వి.డి.ఆర్.యల్., మంచుదీపం మొదలైన కథల ద్వారా కుప్పిలి పద్మ ఉష్ట్రపక్షి, ఎద్దుపుండు మొదలైన కథల ద్వారా కొండేపూడి నిర్మల, పంజరం మొదలైన కథల ద్వారా

సి.సుజాత, వర్కింగ్ వైఫ్ కథ ద్వారా కె. రామలక్ష్మి, మాకు కొంచెం నమ్మకం ఇవ్వండి, ఇల్లాలి సుఖం వంటి కథల ద్వారా వి. ప్రతిమ ఈ దశాబ్దంలో స్త్రీ వాద కథను బలోపేతం చేశారు. కె. వరలక్ష్మి మతమేదైనా స్త్రీలందరూ ఒక్కవిధంగానే సమస్యలను ఎదుర్కొంటున్నారని, స్త్రీల మధ్య ఐక్యతే దానికి పరిష్కారమని స్వస్తి వంటి కథలలో చెప్పింది.

1970ల నుండి కథలు వ్రాస్తున్న కవనశర్మ విడాకులు, అమె ఇల్లు కథలు వ్రాసి ఈ దశాబ్దంలో స్త్రీవాద కథాభివృద్ధికి తనవంతు దోహదం చేశాడు. సమస్థాయి సంబంధాలు లేని తన ఎదుగుదలకు అవకాశమియ్యని దాంపత్య సంబంధాల నుంచి వైదొలగటానికి సిద్ధపడుతున్న ఆధునిక యువతీ చైతన్యాన్ని విడాకులు కథ ప్రదర్శించింది. పితృస్వామిక సామాజిక న్యాయం స్త్రీకి అటు పుట్టింటిపై గానీ, ఇటు అత్తింటిపైగాని హక్కులు లేకుండా చేస్తున్నప్పుడు తనకంటే ఒక ఉనికి, వనతి లేకపోవటం పట్ల వేదన పడి, అవమానపడి ఒక ఇల్లును తన కొరకు తానుగా ఏర్పాటు చేసుకొనటానికి తహతలాడి నిశ్శబ్దంగా దానిని అమలుపరిచిన ఒక నడివయసు స్త్రీ సృష్టించిన సంచలనం ఆమె ఇల్లు కథలో చూస్తాం. కేతు విశ్వనాథరెడ్డి వ్రాసిన రెక్కలు, సతి, వాడ్రేవు చినవీరభద్రుడు వ్రాసిన సుజాత, అల్లం రాజయ్య వ్రాసిన కమల, నీలి మొదలైన కథలు స్త్రీవాద ఉద్యమ ప్రభావం నుండి వచ్చినవే.



**1970ల నుండి కథలు వ్రాస్తున్న కవనశర్మ విడాకులు, అమె ఇల్లు కథలు వ్రాసి ఈ దశాబ్దంలో స్త్రీవాద కథాభివృద్ధికి తనవంతు దోహదం చేశాడు. సమస్థాయి సంబంధాలు లేని తన ఎదుగుదలకు అవకాశమియ్యని దాంపత్య సంబంధాల నుంచి వైదొలగటానికి సిద్ధపడుతున్న ఆధునిక యువతీ చైతన్యాన్ని విడాకులు కథ ప్రదర్శించింది.**

**6**

1996 నుండి 2006 వరకు గల ఈ పదకొండు సంవత్సరాల వర్తమానం అనేక సామాజిక సంక్షోభాలకు సంఘర్షణలకు లోనైన కాలం. ప్రపంచీకరణ క్రమం వేగవంతం కావటం ఒకవైపు, తెలంగాణా ప్రాంతీయ అస్తిత్వ చైతన్యం పదునెక్కటం ఒకవైపు, దళిత ఉద్యమం కొత్త వైరుధ్యాలతో కొత్తమలుపులు తీసుకొనటం ఒకవైపు, స్త్రీలలో సాధికార చైతన్యాన్ని అభివృద్ధి పరిచిన అంతర్జాతీయ నేపథ్యంలో స్థానిక ప్రభుత్వపాలనలో స్త్రీలకు భాగస్వామ్యం కల్పించటం ద్వారా సాధికారత సాధించటానికి రూపొందిన దేశీయ విధానాలు ఒకవైపు మానవ ప్రవృత్తులను, సంబంధాలను విశేషంగా ప్రభావితం చేసిన కాలం ఇది. ఈ కాల లక్షణం తెలుగు కథకు విలక్షణమైన వస్తు వైవిధ్యాన్ని సమకూర్చింది.

ప్రపంచీకరణ ప్రభావాలను భిన్న జీవనరంగాలకు, భిన్న జీవిత పార్శ్వాలకు అన్వయించి వ్రాసిన కథలు అనేకం వచ్చాయి. ఈ దశకంలో, కార్పొరేట్ సంస్కృతి వ్యవసాయరంగానికి విస్తరించటం వలన గ్రామీణ జన జీవితం సంక్షోభానికి లోనుకావటాన్ని చిత్రించిన కథలు తిరుగుడు గుమ్మి, నరాలు తెగుతున్న నేల (1997) కోస్తా ఆంధ్ర ప్రాంతం నుండి ఉత్తరాంధ్రకు వలసవెళ్ళిన కమ్మదొరలు అక్కడ భూములను కొని పెద్ద ఎత్తున పెట్టుబడులు పెట్టి పళ్ళతోటలు సాగు చేయటం మొదలు పెట్టేసరికి స్థానిక రైతులు తమ భూములకు, నేలకు నివాసానికి పరాయివాళ్ళుగా బ్రతకవలసిన దౌర్భాగ్యస్థితి ఎలా దాపురిస్తున్నదో చెప్పిన కథలివి. ప్రపంచీకరణను 'తెల్లదయ్యం'గా పేర్కొంటూ అది రైతు జీవితంలో తెస్తున్న సంక్షోభాన్ని గురించి హెచ్చరిస్తూ స్వామి వ్రాసిన కథ తెల్లదయ్యం. అప్పల్నాయుడు వ్రాసిన క్షతగ్రాతగానం ఉత్తరాంధ్రలో వ్యవసాయరంగం వ్యాపార రంగంగా మారటం వలన దెబ్బతిన్న మానవజీవితాలను చూపించింది. డా॥ వి. చంద్రశేఖర్ వ్రాసిన ఆవు, పులి, మరికొన్ని కథలు (2002), నీటి పిట్టల కథలు (2003) రెండూ కూడా ప్రపంచీకరణలోని హింసను, బీభత్సాన్ని దాన్ని పైకి తెలియనీయకుండా చేసే రాజకీయార్థిక కుట్రను సమర్థవంతంగా వ్యక్తీకరించాయి.

ప్రపంచీకరణ ప్రయోజనాలకు, వ్యాపారరంగ అవసరాలకు అనుగుణంగా రోడ్లు వెడల్పు చేయటం ఒక పెద్ద కార్యక్రమంగా ముందుగా వచ్చింది ఈ కాలంలో, అది ఎంతోమంది చిన్నకారు, సన్నకారు వ్యాపారులను, రోడ్డుపక్క బేరగాళ్ళను ముంచింది. ఈ పరిణామాలు వస్తువుగా ఖాదర్‌లేదు (2001), న్యూ ఆనంద్‌హోటల్ ఫాస్ట్ ఫుడ్ సెంటర్ (2003) మొదలైన కథలు వచ్చాయి. రోడ్డుపక్క సైకిలు షాపు టీ అంగడి కలిపి నడుపుకొంటూ ముప్పయ్యేళ్ళు బ్రతికిన ఖాదర్ రోడ్డు వెడల్పు కార్యక్రమం వలన

అవతలికి గెంటివేయబడ్డాడు. రోడ్డు మార్జిన్‌లో బ్రతుకులు వెళ్ళదీసుకొనే మార్జినోళ్ళంతా తమ మార్జిన్ తమకు ఇయ్యాలని ఎంత వేడుకొన్నా లాభం లేకపోయింది. ఆ కాస్త బ్రతుకుతెరువు జాగా పోతే ఎక్కడికి పోవడమన్న ఆవేదనలో సంఘర్షణలో ఖాదర్ ఊరి వదిలి పోవటం ఖాదర్ లేడు కథలో విషయం. ఖాదర్ లాగే రోడ్డుమీద కాలెండర్లు అమ్ముకొనేవాళ్ళు, మిషను కుట్టేవాళ్లు అనేకమంది నిర్వాసితులై నిస్సహాయంగా నిలబడ్డ దృశ్యం ఇందులో కనబడుతుంది. మహమ్మద్ ఖదీర్‌బాబు ఈ కథ వ్రాశాడు. ఈ సమస్యను ఇంకొక కోణం నుండి చూపింది సుజాతరెడ్డి వ్రాసిన న్యూ ఆనంద్ హోటల్ ఫాస్ట్‌ఫుడ్ సెంటర్, బ్రతుకుతెరువుకు పట్నం వచ్చి చిన్నహోటల్ తెరిచి లాలయ్య జీవితం ప్రారంభిస్తే అతని కొడుకు ఎక్కివచ్చి దానిని కాస్త పెంచి పెద్దచేసి న్యూ ఆనంద్ హోటలుగా మార్చాడు. రోడ్డు వెడల్పు సందర్భంగా తమ జాగా పోతుందని తండ్రి బాధపడుతుంటే దానిని తన ప్రయోజనాల కనుగుణంగా మలుచుకొన్నాడు కొడుకు. రోడ్డు వెడల్పువల్ల పెరిగే రద్దీని, హోటలుకు రాబోయే గిరాకినీ వూహించి పోటీలో నిలబడేందుకు బాంకులోను తెచ్చి ఆ స్థానంలో రెండంతస్తుల మేడ లేపి పై భాగాన్ని అద్దెకిచ్చి కింది భాగంలో ఆధునిక పరికరాలతో హోటలును విస్తరించి ఫాస్ట్‌ఫుడ్ సెంటరును అదనంగా చేర్చాడు. మనుషులతో పని ఎక్కువ లేని విధంగా మిషన్లను దిగుమతి చేసుకొన్న కొడుకు వైఖరి లాభాపేక్ష హోటల్‌ను ఆశ్రయించుకొని బ్రతికే ఎంతోమంది పనివాళ్ళకు బ్రతుకుతెరువు లేకుండా చేసిందన్న వేదనను దుఃఖాన్ని మిగిల్చాయి ఆ తండ్రికి.



సరళీకృత ఆర్థిక విధానాల వలన ప్రయివేటు రంగం విస్తరిస్తూ పబ్లిక్ రంగ ప్రాధాన్యత తగ్గిపోతున్న నేపథ్యంలో పబ్లిక్ రంగ పరిశ్రమలను నష్టాల బాటలోకి నెట్టి సిక్ ఇండస్ట్రీస్‌గా ప్రకటించి నామమాత్రపు ధరలకు ప్రైవేటు రంగ సంస్థలకు అప్పగించే ఒక కుట్ర దేశంలో నడుస్తున్న సందర్భం నుండి సురేష్ టైటానిక్ అనే కథ, గొరుసు జగదీశ్వర్‌రెడ్డి 'బతుకు గోస' అనే కథ వ్రాశారు. నష్టాల ఊబిలో లేవటానికి వీల్లేకుండా కూలిపోయిన కర్మాగారాలతో పనిక్రమంలో ముడిపడ్డ మనుషుల సంబంధాలు, ఏర్పడ్డ మమకారాలు వాళ్ళనెంత వేదనకు గురిచేస్తాయో రెండు కథలూ చూపించాయి.

**సరళీకృత ఆర్థిక విధానాల వలన ప్రయివేటు రంగం విస్తరిస్తూ పబ్లిక్ రంగ ప్రాధాన్యత తగ్గిపోతున్న నేపథ్యంలో పబ్లిక్ రంగ పరిశ్రమలను నష్టాల బాటలోకి నెట్టి సిక్ ఇండస్ట్రీస్‌గా ప్రకటించి నామమాత్రపు ధరలకు ప్రైవేటు రంగ సంస్థలకు అప్పగించే ఒక కుట్ర దేశంలో నడుస్తున్న సందర్భం నుండి సురేష్ టైటానిక్ అనే కథ, గొరుసు జగదీశ్వర్‌రెడ్డి 'బతుకు గోస' అనే కథ వ్రాశారు.**

బహుళ జాతి కంపెనీల పటాటోపం ముందు దేశీయ పరిశ్రమలు ఉనికిని కోల్పోతున్న వైనాన్ని వ్యంగ్య చమత్కారంతో చిత్రించిన 'కప్పదాలు' కథ ఈ సందర్భంలో పేర్కొనదగినది.

ప్రపంచీకరణ ప్రకంపనలు స్త్రీల జీవితంలో కలిగిస్తున్న సంక్షోభాన్ని ప్రతిఫలించటం ద్వారా స్త్రీవాద కథ ఈ దశకంలో మరింత శక్తిమంతంగా ఎదిగింది. కుప్పిలి పద్మ వ్రాసిన కుబుసం, సాలభంజిక కథలు, సుజాతరెడ్డి వ్రాసిన నిశ్శబ్దం, నిశ్శబ్దం, పి. సత్యవతి వ్రాసిన 'మంత్రనగరి' వంటి కథలు ఇందుకు ఉదాహరణగా చెప్పుకొనవచ్చు. కార్పొరేట్ సంస్కృతి కనిపించని పామై ఇంట్లో తిరుగుతూ మానవ సంబంధాలలో విషం చిమ్మటాన్ని కుబుసం కథ చిత్రించింది. ఎక్కువ జీతాలు, సౌఖ్యాలు ఇచ్చే ఉద్యోగావకాశాలను కల్పించగలిగిన బహుళజాతి సంస్థలు ఒక పురుషుడు సమర్థవంతంగా పనిచేయటానికి అతను భార్యా పిల్లలతో వుండాలని షరతు పెడితే చేస్తున్న ఉద్యోగం వదులుకొని తన వెంటరావటం ఆమెకు ఇష్టమవుతుందో లేదోకూడా అడగకుండా ఆమె పక్షాన తానే భర్త నిర్ణయం తీసుకొనటంలోని ఐరనీని ప్రశ్నించిందీ కథ. పితృస్వామిక భర్త అధికారానికి కార్పొరేట్ సంస్కృతి కూడా తోడయితే స్త్రీల మీద ఎంత వత్తిడి పడుతుందో, చూపించటమే కాదు స్త్రీ కాస్త జాగరూకతతో లేకపోతే తనను తాను కోల్పోయే ప్రమాదం కూడా వుందని హెచ్చరిస్తుందీ కథ. స్త్రీలు తరతరాలుగా పోరాడి సాధించుకొన్న స్వతంత్ర వ్యక్తిత్వం, ఆత్మగౌరవ చైతన్యం అన్నీ బహుళ జాతి సంస్థలు ఎరగా చూపే ప్రలోభాల ముందు – అభావం అయ్యే అవకాశాలు ఎంతగా వున్నాయో మంత్రనగరి కథ చూపింది. విదేశీయులతో వ్యాపార లావాదేవీల నిర్వహణలో స్త్రీ శరీర సౌందర్యాల వినిమయం కూడా ఒకరకమైన ఉద్యోగంగా స్థిరపడుతున్న క్రమంలో స్త్రీ శారీరక

అనారోగ్యానికి, మానసిక హింసకు సంఘర్షణకు, అభద్రతకు లోనయ్యే పరిస్థితులలో చిక్కుకుపోవటాన్ని సాలభంజిక కథ చిత్రించింది. కార్పొరేట్ సంస్కృతిలో పైకి ఎదుగుతూ పోవటం, డబ్బు సంపాదించటమే పరమలక్ష్యం అయినప్పుడు మనిషికి పై చూపే కానీ పక్క చూపు లేకపోవటం, అవసరాల స్నేహాలు, విందు వినోదాలే కానీ అసలు స్నేహంతో పనిలేకుండా పోవటం జరుగుతుందని ఆ పరిస్థితులలో భార్యగా స్త్రీ మాటామంచీ లేని నిశ్శబ్దంలో ఒంటరి వేదనను అనుభవిస్తూ మిగిలిపోవలసి వస్తుందని స్త్రీ అనుభవ కోణం నుండి కథ వ్రాసింది సుజాతరెడ్డి.



ప్రపంచీకరణ సందర్భంలో వచ్చిన మరొక పరిణామం విదేశీ కంపెనీలలో ఉన్నతోద్యోగాలకై అమెరికాకు ఎక్కువైన మేధోవలస. దీని కారణంగా మానవ సంబంధాలు డబ్బు సంబంధాలుగా, అవసరాల సంబంధంగా మారిపోతున్న స్థితిని అది కలిగిస్తున్న భౌతిక మానసిక ఒత్తిడిని వస్తువుగా చేసి నల్లూరి రుక్మిణి దూరపు కొండలు, పోగులు తెగిన అల్లిక, మిడిసిపాటు మొదలైన కథలు వ్రాసింది. ఆరి సీతారామయ్య వ్రాసిన 'అపచారం' కథ కూడా ఈ కోవలోనిదే.

విప్లవోద్యమం ఈ దశకంలో అణిచివేతలు, చర్య లొంగుబాట్ల పర్వాలతో నడిచింది. ఏవో కారణాలవల్ల విప్లవోద్యమం నుండి బయటకు వచ్చిన వాళ్లు ఎదుర్కొనే కొత్త సమస్యలను, సంఘర్షణలకు నిర్మల వ్రాసిన ప్రవాహం, మిట్కో వ్రాసిన మెట్లమీద । మొదలైన కథలు ప్రాతినిధ్యం వహించాయి. భర్త విప్లవోద్యమం నుండి వెళ్ళిపోతుంటే భార్యగా అతనిని అనుసరించటం కాక విప్లవ నిబద్ధతను వ్యక్తిగా వ్యక్తిత్వంతో ప్రకటించిన శోభ ప్రవాహంలోను, తాను విప్లవోద్యమం నుండి బయటకు వచ్చి ప్రశాంత జీవితం గడపాలని ఊరికి వచ్చేసరికి ఊరంతా విప్లవాభిముఖ చైతన్య దీప్తితో నిండిపోవటం, దాని కాంతులు తన ఇంట్లోనూ ప్రతిఫలించటం – చూచి తనపాత్ర ఆ సందర్భంలో ఏమిటో అర్థం కాక తనలో తాను సంఘర్షణ పడ్డ రవీంద్ర మెట్ల మీద కథలోనూ కనబడతారు. తాను పైకి అధిరోహించాలా కిందికి దిగిరావాలా అన్నది మెట్లమీద నిల్చున్న అతను ఎదుర్కొన్న సదసత్సంశయం.

ఈ దశకంలో అభివృద్ధి చెందిన ప్రాంతీయ అస్తిత్వ చైతన్యంతో తెలంగాణా నుండి అనేక మంది కథకులు కొత్త ఉత్తేజంతో ముందుకు వచ్చారు. పెద్దింటి అశోక్ కుమార్, బెజ్జారపు వినోద్ కుమార్, బెజ్జారపు రవీందర్, వసంతరావ్ దేశ్‌పాండే, కాసుల ప్రతాపరెడ్డి, కె.వి. నరేందర్ మొదలైన వారెందరో తెలంగాణా జన జీవన సంస్కృతిని, రాజకీయార్థిక పరిణామాలను, జీవిత సంఘర్షణలను, బ్రతుకు వెతలను వస్తువుగా చేసి కథలు వ్రాశారు. తెలంగాణ ప్రాంతీయ దృష్టిని, స్త్రీ అస్తిత్వం చైతన్యాన్ని కలగలుపుకొన్న జీవిత దృక్పథంతో గీతాంజలి, జాజులగౌరి, వ్రాసిన కథలు బచ్చేదానీ, మన్నుబువ్వ అన్న పేర్లతో సంకలనంగా వచ్చాయి. కథాప్రాంతాలను ఎన్నుకొనటం, భాషను ఉపయోగించుకొనటం మొదలైన అన్ని విషయాల్లోనూ ప్రాంతీయ ముద్ర వీళ్ళందరి కథలలో కనబడుతుంది. యాంత్రీకరణ వలన తెలంగాణ వ్యవసాయ జీవనంలో వచ్చిన మార్పులను సంప్రదాయంగా వస్తున్న పనులను కోల్పోతూ మార్పుతున్న పరిస్థితులకు అనుగుణంగా తమ జీవన శైలిని రూపొందించుకొని కొత్తపనులకు తమను తాము సిద్ధం చేసుకొంటున్న తెలంగాణ శ్రామిక జనం పెద్దింటి అశోక్ కుమార్ కథలలో (తెగారం, వలస పక్షి మొ॥) కనిపిస్తాయి. ప్రపంచీకరణ పరిణామాల మధ్య కీలుబొమ్మల వుతున్న జనం ఘోష కూడా పెద్దింటి అశోక్‌కుమార్ తన కథలలో వినిపింపచేయగలిగాడు. ఎప్పటి నుండో కథలువ్రాస్తున్న బోయ జంగయ్య, జాతశ్రీ వంటి సీనియర్ రచయితలు ఈ దశకంలో కూడా కథలు వ్రాశారు. తెలంగాణ కథల నుండి కొన్నింటిని ఎంపికచేసి ఏడాదికి ఒక సంకలనం అచ్చువేసే సంకల్పం చేసిన కర్ర ఎల్లారెడ్డి చొరవ వలన ఇప్పటికి మూడు సంకలనాలు వచ్చాయి.

**ప్రపంచీకరణ పరిణామాల మధ్య కీలుబొమ్మలవుతున్న జనం ఘోష కూడా పెద్దింటి అశోక్‌కుమార్ తన కథలలో వినిపింపచేయగలిగాడు. ఎప్పటి నుండో కథలువ్రాస్తున్న బోయ జంగయ్య, జాతశ్రీ వంటి సీనియర్ రచయితలు ఈ దశకంలో కూడా కథలు వ్రాశారు.**

దళిత ఉద్యమంలో వచ్చిన మాల మాదిగ వైరుధ్యాలు దళిత జీవితాన్ని మరింత సూక్ష్మంగా పరిశీలించటానికి, విశ్లేషించటానికి

కారణమయ్యాయి. ఆత్మగౌరవ చైతన్యంతో ప్రతివారూ తమ జీవన సంస్కృతిని వ్యాఖ్యానించటానికి పూనుకొనటం వలన తెలుగు కథా సాహిత్యానికి మేలు జరిగింది. ఇనాక్ వంటి సీనియర్ రచయితలతో పాటు నాగప్పగారి సుందర్రాజు, డా॥ వి.చంద్రశేఖర రావు మొదలైన వాళ్ళు కథలు వ్రాశారు. మాదిగ మానవ జీవన సంస్కృతి వ్యక్తీకరించే మేమిట్లుండం, ఎదురుచూపులు కథా సంకలనాలు వచ్చాయి. ప్రత్యేకించి ఈ దశకంలో ఎండ్లూరి సుధాకర్ 'మల్లెమొగ్గల గొడుగు' అనే మాదిగ కతల సంకలనం నిబిడ భావోద్వేగసౌందర్యంతో వచ్చింది. డా॥ వి. చంద్రశేఖరరావు కథలు దళిత ఉద్యమంలోని భిన్న కోణాలను స్పృశించాయి. దళిత ఉద్యమాలను స్వీయ రాజకీయార్థిక ప్రయోజనాల కొరకు బలిపెట్టేందుకైనా దిగజారిన నాయకులు వైఖరులు యువత నిజమైన ఆవేశాన్ని, ఆదర్శాన్ని తమకొరకే వాడుకొనే తీరును మోహనా కథలోనూ, దళిత విద్యావంతులు పైకి ఎదిగేకొలదీ తన చరిత్ర మూలాలను మరచి తనవారి నిజమైన ఆరాట పోరాటాల వర్తమాన చరిత్రను విస్మరించి స్వార్థ పూరితులుగా మారిపోవటాన్ని 'చరిత్ర' కథలోనూ, దళితులు అందులోనూ స్త్రీలు హక్కుగా అమలు చేసుకొనీయని సామాజిక దురహంకారాన్ని, దురన్యాయాన్ని బఫెల్లోస్ క్లబ్ కథలోనూ ఆయన చూపించారు.



**ఈ యాభై ఏళ్ళలోను తెలుగు కథ కులమత ప్రాంత లింగ వర్గచైతన్య స్పృహతో తమలోకి తాము చూసుకుంటూ తమచుట్టూ వున్న సమాజాన్ని చూస్తూ మార్చుకొనటానికి ప్రయత్నిస్తూ ప్రపంచీకరణ ప్రభావాలతో సహా అన్ని ప్రతికూల పరిస్థితులతోను తలపడి అంతిమ విజయం కొరకు చేసే నిరంతర అంతర బహిఃపోరాటాలలో నిమగ్నమైన మానవుల జీవన హేలను ప్రతిఫలించింది.**

ఈ దశకంలో స్కైబాబ, ఖలందర్, యాకూబ్, అన్వర్, రహమతుల్లా మొదలైన వాళ్ళతో పాటు సుజాత రెడ్డి కూడా ముస్లిం జనజీవితాలను చిత్రించే కథలు వ్రాశారు. గోద్రా ఘటన తరువాత గుజరాత్‌లో ముస్లిముల మీద జరిగిన దాడుల నేపథ్యంలో నెత్తురోడుతున్న నేల, బిచ్‌డీ చమన్, విషప్రయోగం, బోర్డర్, కిరాయి మకాన్ మొదలైన కథలు వచ్చాయి. మైనారిటీలుగా ముస్లిములకు వున్న అభద్రతా భావాన్ని, ఏ ప్రాంతానికి చెందని పరాయీకరణ దుఃఖాన్ని వ్యక్తీకరించాయి.

ఈ దశకంలో 2001ని మహిళా సాధికారతా సంవత్సరంగా ప్రకటించటం జరిగింది. స్థానిక ప్రభుత్వ పాలన 33 శాతం స్త్రీలభాగస్వామ్యానికి రాజ్యాంగ సవరణ ఎప్పుడో జరిగింది. స్త్రీలు సర్పంచులు స్థాయి నుండి అధికార పీఠాలను అధివసించే అవకాశం వచ్చిన వర్తమాన సందర్భం నుండి స్త్రీలు పొందవలసినదేమిటి? పొందింది ఏమిటి అన్న విచికిత్సతతో వచ్చిన కథలు ఈ దశాబ్ది, స్త్రీవాద కథకు ఒక అదనపు విలువను ఇచ్చాయి. నల్లూరి రుక్మిణి, వి. ప్రతిమ, కొండవీటి సత్యవతి ఈ నేపథ్యం నుండి మంచి కథలు వ్రాశారు. పురుషులది అయిన ప్రధాన రాజకీయ స్రవంతిలోకి స్త్రీలు అడుగుపెట్టి చొరవగా పనిచేస్తున్నప్పుడు వాళ్ళను ఎదగనీయకుండా చేసే నియంత్రణలు రకరకాల రూపంలో ఎలా వస్తుంటాయో రుక్మిణి కథలు చెప్తాయి. మహిళా రిజర్వేషన్ కారణంగా భార్యను ఎన్నికల బరిలో నిలిపి వ్యవహారమంతా నడిపే భర్త అధికార అహంకార ఛత్రం నుండి తనను తాను తప్పించుకొనటానికి ఒక స్త్రీ పడిన వేదన ప్రతిమ వ్రాసిన గంగజాతర కథలోను తాను భర్తనీడగా నిర్ణయాలను అమలు చేసే కీలుబొమ్మలాగా కాక స్వతంత్రంగా ప్రవర్తించాలని సంకల్పం చేసిన ఆధునిక స్త్రీ చైతన్య స్వభావం కె. సత్యవతి వ్రాసిన ముందడుగు కథలోనూ ఒక ఆశావహమైన భవిష్యత్తుకు హామీని ఇస్తుంది.

మొత్తానికి ఈ యాభై ఏళ్ళలోను తెలుగు కథ కులమత ప్రాంత లింగ వర్గచైతన్య స్పృహతో తమలోకి తాము చూసుకుంటూ తమచుట్టూ వున్న సమాజాన్ని చూస్తూ మార్చుకొనటానికి ప్రయత్నిస్తూ ప్రపంచీకరణ ప్రభావాలతో సహా అన్ని ప్రతికూల పరిస్థితులతోను తలపడి అంతిమ విజయం కొరకు చేసే నిరంతర అంతర బహిఃపోరాటాలలో నిమగ్నమైన మానవుల జీవన హేలను ప్రతిఫలించింది.



కథ
ప్రత్యేకసంచిక

# తెలుగు కథా సాహిత్యంలో హిందూ - ముస్లిం సమైక్యతా ధోరణులు

## కె.పి. అశోక్‌కుమార్




> మతతత్త్వ పార్టీల ప్రచారాన్ని ఖండిస్తూ లౌకిక, ప్రజాస్వామ్య భావనలు పెంపొందించాల్సిన బాధ్యతను మేధావులు, రచయితలు, కళాకారులు గుర్తించాల్సిన అవసరముంది. దేశ విభజన సందర్భంగా జరిగిన రక్తపాతాన్ని నిరసిస్తూ సాదత్ హసన్ మంటో ఉర్దూలో అనేక సంఘటనలను చిన్న కథలుగా మలచి మనముందుకు తెచ్చారు. ఈ విషయమై ఉత్తరాది రచయితలతో పోలిస్తే దక్షిణాన వచ్చిన స్పందన తక్కువేనని చెప్పాలి.

పరస్పర విరుద్ధ భావనలు - ఆచార సంప్రదాయాలు కలిగిన మతాల మధ్య సంఘర్షణ మామూలే. సంఘర్షణ భిన్న మతాల మధ్యే కాకుండా, ఒకే మతంలోని వేరు వేరు శాఖల మధ్య కూడా ఏర్పడటానికి అవకాశముంది. హిందూమతంలో శైవవైష్ణవాలకు, శైవులకు-బౌద్ధులకు మధ్య జరిగిన ఘర్షణలు చరిత్రలో ఎన్నో కనిపిస్తాయి. ముస్లిములలో ప్రధానంగా షియా, సున్నీల ఘర్షణే ఎక్కువగా చోటు చేసుకున్నా బహాయి, అహ్మదీయ, కాదీయాని మొదలైన ఇతర తెగలవారిని కూడా నిర్దాక్షిణ్యంగా అణచివేయడానికే ప్రయత్నిస్తారు. మతం ఒక్కటైనంత మాత్రాన అంతా కలిసి వుంటారన్నది కూడా నిజం కాదు. వారు ప్రాంతీయంగా, రాజ్యాల వారిగా వివాదాలతో యుద్ధాలు చేసుకొనే పరిస్థితి నెలకొనివుంది. క్రూసేడ్ల పేరు మీదుగా జరిగిన ముస్లిం-క్రైస్తవ మతాల మధ్య పోరాటాలు జగత్ప్రసిద్ధాలు. కేథలిక్కులు, ప్రొటెస్టంట్‌లు తదితర శాఖల మధ్య వైరుధ్యాలతో క్రైస్తవం కూడా ఏమీ తక్కువ తినలేదు. ఇతర మతాలతో పోటీ - ఘర్షణ లేనప్పుడు ఒకే మతంలోని ఇతర శాఖల మధ్య ఆధిపత్య పోరాటాలు జరుగుతాయి. ఒకవేళ ఇతర మతస్థులు గణనీయంగా ఉన్నప్పుడు మతపరంగా అన్ని శాఖలు ఒక్కటైపోతాయి.

మతం, రాజ్యం - రెండూ పరస్పరాశ్రయాలు. ప్రజలను అణచివేయడానికి, తమ అధికారాన్ని ఎదురు లేకుండా కొనసాగించుకోవడానికి ఇవి రెండూ ఏకమవుతాయి. గతంలో కొన్ని మతాలు నేరుగా రాజ్యాన్ని శాసించగలిగాయి. మనదేశంలో మాత్రం మతం - అర్షధర్మం పేరిట ఇటు ప్రజలను, అటు రాజ్యాన్ని నియంత్రించగలిగింది. రాజాశ్రయం కోసం విభిన్న శాఖల మధ్య జరిగిన పోరాటాల చరిత్ర మనకు ఉన్నది. రాజ్యం అండతోనే మత ప్రచారం నిర్విఘ్నంగా కొనసాగింది.

నూతన ప్రజాస్వామిక భావనలో లౌకికతత్వం ప్రధాన అంశం. ప్రపంచంలో ప్రజాస్వామ్య దేశాలుగా ప్రస్తుతించుకునే అమెరికా, ఇంగ్లాండులో క్రైస్తవ మతం అధికారమతంగా చలామణి అవుతున్నది. అయినా ఇతర మతాలతో సహజీవనం

సాగించే మత సామరస్యం అక్కడ నెలకొనివుంది. అక్కడి ప్రజాస్వామ్యాన్ని మనవాళ్ళు అరువు తెచ్చుకున్నా అక్కడి లౌకికతత్వాన్ని మాత్రం అలవర్చుకోలేకపోయారు. దీనికి వేరే కారణాలున్నాయి. మొదటి నుండి భారతదేశంపై జరిగిన తురుష్కుల దండయాత్రలు, దాని తాలూకు హింసాకాండ ఇక్కడి ప్రజలలో చెరపలేని ముద్రవేయడం వలన అప్పటి చరిత్ర జ్ఞాపకాలను తలచుకొని ఇప్పటికీ ఉద్రేకంతో ఊగిపోయే ఒక అవాంఛనీయ పరిస్థితి ఏర్పడివుంది. ఆ అభద్రతా భావనల వల్ల వచ్చిన ఆధిపత్య ధోరణుల వల్లనే స్వాతంత్రపోరాట ఉద్యమంలో వివాదాలు ఏర్పడటం - అది చివరకు దేశ విభజనకు దారితీయడం జరిగింది. స్వాతంత్ర్య సమరకాలంలో ప్రజల భావోద్వేగాలను రెచ్చగొట్టి ఉద్యమింపజేయడానికి ఏ మతాన్ని ఆయుధంగా చేసుకొన్నారో ఆయా మతాలను ఆధారం చేసుకొని తమ ఆధిపత్యాన్ని, తమ అధికారాన్ని నిలుపుకోవడం కోసం మన నాయకులు దేశ విభజనకు పూనుకున్నారు. దేశ విభజన జరిగిన సందర్భంలో కొనసాగిన హింసాకాండ - నరమేధం ఇరుమతాల మధ్య అగాధాలను సృష్టించగలిగింది. మత సామరస్యాన్ని పెంచాల్సిన నాయకులే మత విద్వేషాన్ని రెచ్చగొడుతున్నారు. ప్రజలను ఓటు బ్యాంకులుగానే తప్ప మనుషులుగా చూడలేని స్వార్థంతో మతాన్ని ఆలంబన చేసుకొని మతతత్త్వ పార్టీలు ముందుకొచ్చాయి. అవిద్య, అజ్ఞానం కొనసాగినంత కాలం ఈ మతతత్త్వ పార్టీల మనుగడ వుంటుంది. మతతత్త్వ పార్టీల ప్రచారాన్ని ఖండిస్తూ లౌకిక, ప్రజాస్వామ్య భావనలు పెంపొందించాల్సిన బాధ్యతను మేధావులు, రచయితలు, కళాకారులు గుర్తించాల్సిన అవసరముంది. దేశ విభజన సందర్భంగా జరిగిన రక్తపాతాన్ని నిరసిస్తూ సాదత్ హసన్ మంటో ఉర్దూలో అనేక సంఘటనలను చిన్న కథలుగా మలచి మనముందుకు తెచ్చారు. ఈ విషయమై ఉత్తరాది రచయితలతో పోలిస్తే దక్షిణాన వచ్చిన స్పందన తక్కువేనని చెప్పాలి.



తెలుగులో నెల్లూరు కేశవస్వామిగారు హిందూ, ముస్లిం ఐక్యత-సంస్కృతులపై రాసిన కథలను "చార్మినార్" పేరుతో సంకలనంగా వెలువరించారు. ఈ సంకలనాన్ని పాకిస్తాన్‌కు వెళ్ళిపోయిన తన చిన్ననాటి మిత్రుడు అజరుద్దీన్ అహ్మద్‌కు అంకితమివ్వడం విశేషం.

ఒకప్పుడు హిందూ, ముస్లింలు సఖ్యతగా ఉండేవారని ఇంగ్లీషువాడి విభజించి పాలించు సిద్ధాంతంతో శత్రువులుగా మారారని, చివరకు తెల్లవాడి మోసాన్ని కనుక్కొని వాడిని తరిమేసి ఇరువురు ఒక్కటైనారని తెలిపే కథ ''గోడ మీది మూడోవాడు'' గోపిచంద్ రాసిన ఈ కథ స్వాతంత్ర్య పోరాట చరిత్రను అన్యాపదేశంగా తెలియజేస్తుంది.

**పాకిస్తాన్ వైపు నుండి వచ్చే హిందువులు, హిందూస్తాన్ వైపు నుండి తరిమివేయబడిన ముస్లింలు దారుణ పాశవిక హింసకు గురై కొనప్రాణాలతో ప్రతీకారవాంఛతో రగిలిపోతూ ఒకరికొకరు ఎదురైన సన్నివేశం ఎలా వుంటుందో తెలుసుకోవాలంటే చలం రాసిన "హిందూ -ముసల్మాన్" కథ చదవాల్సిందే.**

అఖండ భారతదేశానికి స్వాతంత్ర్యం రావడంతో ప్రజలలో ఆనందోత్సాహాలు వెల్లివిరిశాయి. కాని పాకిస్తాన్‌లోని లక్షాది హిందువులకు, సిక్కులకు - ఇండియాలోని లక్షలాది ముస్లిములకు అది ప్రాణాంతకమైంది. కనివిని ఎరుగని విధంగా బెంగాల్ నుండి పంజాబ్ వరకు మానవ మారణహోమం జరిగింది. తూర్పు బెంగాల్లోని వేలాది హిందువులు ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకొని కాందిశీకులుగా పశ్చిమ బెంగాల్లోకి ప్రవేశిస్తే, పశ్చిమ బెంగాల్లోని ముస్లిములు వేలాదిగా తరలి తూర్పు బెంగాల్‌కు వెళ్ళిపోయారు. మానవ మారణకాండ ఎక్కువగా పంజాబ్‌లో జరిగింది. సరిహద్దుకు తూర్పున వున్న ముస్లిములు, పడమర వున్న సిక్కులు, హిందువులు మారణహోమంలో సమిధలయ్యారు. పాకిస్తాన్ వైపు నుండి వచ్చే హిందువులు, హిందూస్తాన్ వైపు నుండి తరిమివేయబడిన

ముస్లింలు దారుణ పాశవిక హింసకు గురై కొనప్రాణాలతో ప్రతీకారవాంఛతో రగిలిపోతూ ఒకరికొకరు ఎదురైన సన్నివేశం ఎలా వుంటుందో తెలుసుకోవాలంటే చలం రాసిన "హిందూ -ముసల్మాన్" కథ చదవాల్సిందే. హింసించబడి, గాయాలతో నిండి పాకిస్తాన్ వైపు వెళుతున్న ముస్లిములలో కూడా తినడానికి గోధుమలు లేనికాలంలో ఆ ముసల్మాన్ రాజ్యంలో తమకు ఆదరణ లభిస్తుందా? అనే సందేహం వచ్చినా ప్రాణాలు దక్కించుకోవడానికి తమ ప్రమాణం కొనసాగిస్తారు. దాంతో తమ కెదురైన హిందువుల గుంపును చూసి దాడి చేసినా వాళ్ళు తమలాంటి నిస్సహాయులు అని గుర్తించి శాంతిస్తారు. మతకల్లోలాల సందర్భాల్లో గాంధీ నిర్వహించిన పాత్ర పట్ల రచయితకున్న ఆరాధానాభావాన్ని ఈ కథలో చూడవచ్చు. అయితే గాంధీ లౌకికవాది కాదని ఈ రోజు కొత్త నిర్ధారణలు చేయడం కంటే, హిందూ - ముస్లింల మధ్య మత సామరస్యానికి గాంధీ చేసిన కృషి అప్పటికి - ఇప్పటికీ ఆదర్శప్రాయంవేనని మరువరాదు. ముఖ్యంగా గాంధీ 1947 జనవరి నుండి కేవలం మతకలహాల నివారణ కొరకే తన యావచ్ఛక్తిని వినియోగించాడు. మతకలహాలను ఆపగలిగితే దేశ విభజనను అరికట్టవచ్చునని విశ్వసించారు. ఆయన నమ్మిన అహింస, హృదయ పరివర్తన సిద్ధాంతాలను ప్రత్యక్షంగా అమలు జరిపి చూపించేందుకు ముందు కలకతా వెళ్ళాడు. అక్కడి నుండి నౌఖాలి, బీహార్, ఢిల్లీలో పాదయాత్ర సాగించాడు. ఆయన ఎక్కడకు వెళితే అక్కడ మత కలహాలు ఆగిపోయాయి. మహోన్నత మానవత్వం ముందు మతోద్రేకం తలవంచిందని రచయిత చలం ఆనాడే గుర్తించారు.

దేశ విభజన కాలంలో చితాగ్ని గుండంగా మారిన సరిహద్దులలో కొనసాగిన హింసాకాండకు గురైన ఒక సామాన్యుడు "ఈ రాక్షసత్వం మనుషులది కాదు. మతానిది" అని ఆగ్రహిస్తూ దానికి బదులుగా " ఈ రాక్షసత్వం మతానిదే కాదు రాజకీయానిది. అఖండ భారతాన్ని విభజించి అటు ముస్లింలీగ్, ఇటు కాంగ్రెస్‌లు తమ పాలన కోసం అధికారం కోసం ఎగతోసి రేపిన మతజ్వాలదే. ఆ మంటలని వాటి వెనుక వున్న రాజకీయాల్ని రచయిత క్రాంతికిరణ్ తన కథ 'చితాగ్ని గుండం'లో తెలియచేశారు. స్వాతంత్ర్య పోరాటంలో తన ప్రాముఖ్యతను, ఆధిక్యతను నిరూపించుకోవడానికి మహ్మదాలీ జిన్నా ముస్లిముల ప్రతినిధిగా ముస్లిం ప్రత్యేకదేశం కోసం పిలుపునిస్తారు. నిజానికి వాస్తవికుడు, ఆధునికతావాది అయిన జిన్నాకు ముస్లిం కార్డును ఉపయోగించుకోవడం ఇష్టం లేకపోయినా తన రాజకీయ మనుగడకు దాన్నే ఆలంబనగా చేసుకోవాల్సి వస్తుంది. వెనక్కి తగ్గలేని పరిస్థితిలో ప్రత్యేక దేశం కోసం పట్టుబట్టాల్సి వస్తుంది. చివరకు దేశం చీలిపోతుంది. పాకిస్తాన్ ప్రత్యేక దేశంగా అవతరిస్తుంది. విభజన సందర్భంగా జరిగిన మత కల్లోలాలలో లక్షలాది మంది ప్రాణాలు కోల్పోతారు. దానికి కారణమైన నాయకులు మాత్రం తమ అధికార ఛత్రం క్రింద హాయిగా వుంటారు. ముస్లిం జీవన విధానానికి, ముస్లిం జీవన తత్త్వానికి దూరంగా వుండే జిన్నా ముస్లిం కార్డులు ఉపయోగించడం అనూహ్య పరిణామమే కావచ్చు. కాని రాజకీయాలలో ఏదీ ఆశ్చర్యం కాదు. ఈ విషయాన్ని జిన్నా గుర్తించినట్లుగా బాలగంగాధర్‌తిలక్ తన కథ "అద్దంలో జిన్నా"లో చిత్రీకరించారు. "తన వెనకాల మహమ్మదీయులందరూ వస్తారు. ఎందుకు వస్తారో వారికి తెలియదు. తెలుసుకుంటే ఎవరూ ఏ విషయం ఏమీ చెయ్యరు. అజ్ఞానం క్రియకీ, కర్మకి కారణం, ఆ అజ్ఞానాన్ని తాను భద్రంగా కాపాడుతాడు. ఆ అజ్ఞానాన్ని తాను భ్రమలతో, ఆశలతో పోషిస్తాడు... తన మనస్సు తన భావాన్ని నిజానికి నమ్మలేదు. తనలో వుండే



పాకిస్తాన్ కాశ్మీర్‌ను కబళించడానికి చేసిన ఫలితమే ఇండో -పాక్ యుద్ధంగా పరిణమించింది. కాశ్మీర్‌పై చేసిన దండయాత్ర భారత సార్వభౌమాధికారానికే ప్రమాదంగా భావించి దేశమంతా ఒక్క తాటిపై నిలిచింది. ఆనాటి దేశభక్తిపూరిత వాతావరణంలో వెలువడిన కథే నిఖిలేశ్వర్ గారి "మనిషి -మట్టి".

ఒక అధికార వాంఛ ఆ భావాన్ని తయారుచేసి ఇతరుల్ని నమ్మమంది. తాను నమ్మినట్లుగా నమ్మించింది. తాను నమ్మినట్లుగా ఉండిపోవడం వలన ఒక్కొక్కసారి తనూ నమ్మేశాడు. అలా నమ్మకపోతే పదికోట్ల మంది మహమ్మదీయులు తన వెనకాల రారు. ఇది జిన్నా అంతరంగమే కాదు. ఈ రోజు బతకనేర్చిన ప్రతి రాజకీయవాది ఆంతర్యం, కూడా ఇదే. అధికారం కోసం, ఆధిపత్యం కోసం మతాన్ని ఒక పనిముట్టులాగ వాడుకున్నంతసేపు పరిస్థితి ఇలాగే వుంటుంది.

దేశ విభజన గాయాలు మానకముందే కాశ్మీరు సమస్య ఇరుదేశాల మధ్య అగ్గిని రాజేసింది. ప్రజలతో నిమిత్తం లేకుండా ప్రభుత్వాల మనుగడను శాసించే విధంగా కాశ్మీర్ సమస్య తయారయింది. కాశ్మీర్‌ను సాధించడం కోసం పాకిస్తాన్ యుద్ధాలకి కూడా సిద్ధపడింది. ఇండో-చైనా యుద్ధంలో భారత పరాజయాన్ని బలహీనతగా ఎంచిన పాకిస్తాన్ కాశ్మీర్‌ను కబళించడానికి చేసిన ఫలితమే ఇండో -పాక్ యుద్ధంగా పరిణమించింది. కాశ్మీర్‌పై చేసిన దండయాత్ర భారత సార్వభౌమాధికారానికే ప్రమాదంగా భావించి దేశమంతా ఒక్క తాటిపై నిలిచింది. ఆనాటి దేశభక్తిపూరిత వాతావరణంలో వెలువడిన కథే నిఖిలేశ్వర్ గారి "మనిషి -మట్టి". ఇందులో భారత్ - పాక్ యుద్ధ సమయంలో భారత సైన్యాలు పాక్ సైన్యాలను తరిమికొడుతూ పాకిస్తాన్‌లోకి ప్రవేశిస్తాయి. పారిపోకుండా మసీదులో ఉండిపోయిన ముసలివాళ్ళను కాపాడినందుకు - పాక్ సైనికుని దొంగచాటు కాల్పుల నుండి హిందూ సైనికులను కాపాడి ఆత్మత్యాగం చేసిన ఖైరున్నీసా కథే "మనిషి-మట్టి" దేశాల మధ్య పోరాటం తప్ప హిందూ - ముస్లింల పోరాటం కాదనీ, యుద్ధరంగంలో మానవత్వాన్ని మరచి పోకూడదనే సందేశాన్ని ఇచ్చే ఈ కథ కొంత ఆదర్శవాదంతో కూడుకొని సినిమాటిక్‌గా రూపొందింది. ఇండో - పాక్ పోరాటాన్ని కాశ్మీర్‌పై ప్రభుత్వ అభిప్రాయాలను రచయిత ఆనాడు సమర్థించడం వింతగా అనిపించినా అప్పటి పరిస్థితుల దృష్ట్యా చూస్తే అది సబబుగానే కనిపిస్తుంది బలప్రయోగంతో కాశ్మీర్‌ను స్వాధీనం చేసుకోలేమని గుర్తించిన పాకిస్తాన్ మాయోపాయంతో కాశ్మీర్‌లో అంతర్గత కల్లోలం సృష్టించడానికి పూనుకున్నది. దాని ఫలితమే కాశ్మీర్‌లో టెర్రరిజం. ఒకవైపు పాకిస్తాన్ మిలిటెంట్లు, ఇంకోవైపు భారతీయ భద్రతా దళాల దాడులతో ప్రజలు కాశ్మీర్‌లో నరకయాతనపడుతున్నారు. రెండు దేశాల నాయకులు తమ అస్తిత్వాన్ని నిలుపుకోవాలంటే కాశ్మీర్ రావణకాష్టంలా రగిలిపోవాల్సిందే. కాశ్మీరు స్వయం నిర్ణయాధికారాన్ని తోసివేసి తమలో కలుపుకోవాలన్న రెండు దేశాల రాజకీయాల వల్ల భద్రతా దళాలు, మిలిటెంట్ల మధ్య ఆర్థికవ్యవస్థ నాశనమై కాశ్మీరీలు నలిగిపోతున్నారు. మరుగున పడిపోతున్న అసంతృప్తిని పునరుజ్జీవింపచేసి పండిట్స్‌ను, ముస్లిములను వేరుచేసి వివక్ష పాటిస్తున్నది ప్రభుత్వమే. ఎన్నికలను ప్రతిసారి రిగ్గింగుల వేడుకగా మార్చింది పాలకులే. కాశ్మీరీల అభిప్రాయాలను కాలరాచి ఆర్డినెన్సులు, చట్టాలు శాసనాలతో కాలయాపన చేస్తూ వివిధ మిలిటెంట్ గ్రూపుల పుట్టుకకు కారణమైంది ఢిల్లీ పెద్దలే. కాశ్మీర్‌కు సంబంధించిన నిజాలను మభ్యపెట్టి దేశభక్తి పేరుతో కాశ్మీరు పతనాన్ని బలప్రయోగంతో అణచివేతకు మానసికంగా మనల్ని సిద్ధం చేస్తున్న ప్రభుత్వాలు, పాకిస్తాన్ వ్యతిరేకతను ముస్లిం వ్యతిరేకంగా మార్చటంలో విజయం సాధించాయి. నిర్బంధ దమనకాండ, అణిచివేతతో కాశ్మీరు జీవితాలు ఎంత దయనీయంగా తయారయ్యాయో తెలిపిన కథ డా॥ శాంతికుమార్ గారి "ఖబరస్తాన్"



> మత ఘర్షణల నేపథ్యంలో ముస్లిముల పక్షాన చేరిన హిందువు - హిందువుల పక్షాన చేరిన మహమ్మదీయుడు సంఘ బహిష్కృతులుగా మారే పరిస్థితిని ఎదుర్కోక తప్పదని సెట్టి ఈశ్వరరావు "హిందూ-ముస్లిం" కథలో నిరూపిస్తాడు.

ఇరుమతాల మధ్య ఘర్షణలకు దారితీసే సున్నిత అంశాలను రెచ్చగొట్టి మతకల్లోలాన్ని రేపడానికి కొన్ని స్వార్థపర శక్తులు అవకాశం కోసం ఎదురు చూస్తుంటాయి.

కొన్ని సందర్భాలలో వ్యక్తిగత విద్వేషాలతో మొదలైన పోట్లాటలు మతకలహాలకు దారితీసిన సందర్భాలున్నాయి. ఈ విషయాన్ని సున్నితంగా హెచ్చరించే కథ "అల్లా హో అక్బర్". ఇందులో పౌరోహిత్యం నెరపే సంప్రదాయ బ్రాహ్మణుడు నారాయణకు, అతని పొరుగింటి రహీమ్‌కు ఎప్పుడూ పడదు. మతపరంగా ఇద్దరు ఛాందసులే. పట్టలేని కోపంతో నారాయణ రహీం కొడుకు అక్బర్‌ను గాయపరచగా, ప్రతీకారంతో రహీమ్ నారాయణ కొడుకు రామును కిడ్నాప్ చేసి తీసుకుపోతూ మసీదు ప్రార్థన పిలుపుతో మేల్కొని తన పాపపు చింతకు సిగ్గుపడుతూ రామును ఇంటికి చేరుస్తాడు. క్షణికమైన ఉద్రేకాలతో మానవత్వాన్ని కోల్పోకూడదనే ప్రబోధం అంతర్లీనంగా ఆ కథలో కనిపిస్తుంది. అతినాటకీయత చోటు చేసుకున్న ఈ కథ గీతాంజలి రాసిన మొదటి కథ. మత ఘర్షణల నేపథ్యంలో ముస్లిముల పక్షాన చేరిన హిందువు – హిందువుల పక్షాన చేరిన మహమ్మదీయుడు సంఘ బహిష్కృతులుగా మారే పరిస్థితిని ఎదుర్కోక తప్పదని సెట్టి ఈశ్వరరావు "హిందూ–ముస్లిం" కథలో నిరూపిస్తాడు. తిండిలేక చస్తుంటే పట్టించుకోని మతం నాలుగు డబ్బులు ఏర్పడితే మతాన్ని, కర్తవ్యాన్ని ఎరుకపరుస్తుంది. చౌకగా శ్రమశక్తిని కొల్లగొట్టడానికి, కార్మికులను సంఘటితం కాకుండా చూడటానికి పెట్టుబడిదారులకు మతం ఒక ఆయుధంగా పనికివస్తుంది. వ్యాపారంలో పోటీ లేకుండా చూసుకోడానికి కూడా మత ఘర్షణలు తోడ్పడతాయి. దేశంలో జరిగే ఏ మతకల్లోలానైనా ఇలాంటి ఆర్థిక సామాజిక పరిస్థితులతో విశ్లేషించుకుంటే, ఆ కల్లోలాలకు బాధ్యులెవరో మనం గుర్తించవచ్చు. ఈ ఇతివృత్తంతో ప్రస్తుత పరిస్థితుల కనుగుణంగా ఎన్ని కథలు వచ్చినా, ఆ మధ్య ముదిగంటి సుజాతారెడ్డి గారు రాసిన కథ ఎన్నదగినది. మతతత్త్వ పార్టీల కుళ్లు రాజకీయాల వల్ల మతకల్లోలాలు చెలరేగి ఐక్యత భంగం కాకూడదని వాంఛించే కథ దార్ల రామచంద్రగారి 'అస్సోయి ధూల" కింది తరగతికి చెందిన ముస్లిం కుటుంబాలలో ముఖ్యంగా దూదేకులు, మొట్లువేసే పనివారలకు చౌకగా లభించే ప్రత్యామ్నాయ వస్తువుల తాకిడికి వాళ్ళ కులవృత్తులకు పనిలేకుండా పోతున్నది. పొట్టకూటికోసం పట్నం తరలివచ్చిన ఇలాంటి చిల్లరవ్యాపారులు మతకల్లోలాలకు సమిధలుగా మారే ప్రమాదమే ఎక్కువ. అలాగని ఊళ్ళలో పనులు లేక అలమటించిపోవాలా? లేక పట్నం వచ్చి మతకల్లోలాలకు బలిపశువుగా మారాలా? అని ఈ కథ మనల్ని ఆలోచించ మంటుంది.



పొట్టకూటికోసం పట్నం తరలివచ్చిన ఇలాంటి చిల్లరవ్యాపారులు మతకల్లోలాలకు సమిధలుగా మారే ప్రమాదమే ఎక్కువ. అలాగని ఊళ్ళలో పనులు లేక అలమటించిపోవాలా? లేక పట్నం వచ్చి మతకల్లోలాలకు బలిపశువుగా మారాలా? అని ఈ కథ మనల్ని ఆలోచించ మంటుంది.

పై కథలన్నింటికంటే భిన్నంగా మతకల్లోలాల గురించి తెలియజేసిన కథ దాదా హయత్ "మసీదు పావురం" ఘర్షణలకు పాల్పడినవారు ఎవరో, హింసాకాండకు గురైనవారి మతమేదో ఈ కథలో రచయిత చెప్పకపోవడం గమనించదగ్గ విషయం. తాను ఏ మతస్థులవైపు నుండి చెప్పకపోవడమే కాకుండా జరిగిన సంఘటనల పరంగా కూడా ఆయా మతస్థుల ప్రస్తావన తీసుకురాదు. అది ఎవరైనా కావడానికి అవకాశముంది. కాని వారి హింసాకాండకు గురయ్యేది ఏ పాపం ఎరుగని అమాయకులే. రెక్కాడితేగాని డొక్కాడని బీదాబిక్కి మాత్రమే వాళ్ళకు టార్గెట్ అవుతున్నాయి. ప్రాణం నిలపుకోవడానికి ఉపకరించని మతం ప్రాణాలు తీయడానికి ముందుంటుంది. ప్రతీకాత్మకంగా కొనసాగిన ఈ కథ శిల్పపరంగా కూడా విలక్షణమైనదే. ఒక ఆడపావురాన్ని ఆధారంగా చేసుకొని నడిపిన ఈ కథలో పావురాన్ని ఒక ముస్లిం మహిళలకు ప్రతీకగా గుర్తించవచ్చును. విశ్వమానవ విలువలను ప్రబోధించే ఈ కథ ఆంగ్లంలోను, ఇతర భాషల్లోకి కూడా అనువదించాల్సిన అవసరముంది.

తెలంగాణాలో నైజాం పాలనలో రజాకార్ల ఆగడాలు, హిందువులపై చేసిన దురాగతాలను వివరించే కథలు, చరిత్రలో మనకు కనిపిస్తున్నాయి. కాని అప్పట్లో

ముస్లిములంతా నిజాం విధేయులనీ, రజాకార్ల మద్దతుదారులనే ఒక అపోహ బలంగా నాటుకుని వుంది. అయితే అప్పట్లో కూడా రజాకార్ల దురాగతానికి చాలా మందిలో వ్యతిరేకించే ముస్లిములు ఉన్నారనీ, కొన్ని గ్రామాల్లో హిందూ - ముస్లిములు ఎలా ఐక్యతగా వున్నారో వివరించే కథ మహ్మద్ నిసార్ గారి "వతన్". గతావశేషమే అయినప్పటికీ హిందూ - ముస్లిం సఖ్యత అనే ఆదర్శవాదానికి సమూనాగా ఈ కథను వేడుకగా చేసుకొనే అలవాట్లను ఈ కథ చక్కగా చిత్రీకరించింది. ఉర్దూ, తెలుగు సమ్మిళితమైన తెలంగాణ నుడికారంతో ఈ కథను ఒక సజీవ చిత్రంలా మనవాళ్ల ముందుంచడంలో మహమ్మద్ నిస్సార్ చేసిన కృషి ప్రశంసనీయం.

దేశ విభజన ఇండో పాక్ యుద్ధం, కాశ్మీర్ సమస్యలను హిందూ - ముస్లిం సమస్యలుగా చిత్రీకరించి హిందూయిజమే భారతీయతగా చలామణి కావడంతో ఈ దేశంలోని మైనారిటీలు ముఖ్యంగా ముస్లిములు అభద్రతా భావానికి, అవమానాలకు గురవుతున్నారు. వాళ్ళు పుట్టుకకు వాళ్ల ఉనికికి సంబంధించిన విషయాలతో వాళ్లను దోషులుగా నిలబెట్టె పరిస్థితిని ఖండించాలి. ఈ దేశంలో పుట్టిన ప్రతివాడూ భారతీయుడు. అందరికీ సమానావకాశాలు, జీవించే హక్కు వున్నాయి. ఎవరికి వారు దుష్ట రాజకీయాలకు దూరంగా స్వీయ చైతన్యాన్ని పెంపొందించుకోవాలి. మన సామాజిక వ్యవస్థలో సహజీవనం అనివార్యం కాబట్టి హిందూ-ముస్లిం సఖ్యత తప్పనిసరిగా కొనసాగుతుంది. ఈ దిశగా హిందూ - ముస్లిం సఖ్యతలకు అవరోధంగా నిలచిన సమస్యల చిత్రీకరణలో, ఆ సమస్యల పట్ల సరియైన అవగాహన కలిగించడంలో స్వల్పమే అయినా తెలుగు కథకుల కృషి ప్రశంసించదగ్గ రీతిలో వుంది. అయినా మత ఫాసిజాన్ని వ్యతిరేకిస్తూ ప్రజాస్వామ్య లౌకిక భావనలను పెంపొందించే దిశగా మరింత ఎక్కువగా రచనలు రావాల్సిన అవసరాన్ని ఈ వ్యాసం గుర్తుకు తెస్తుంది.






**క**థారచన వేరు, కథా నిర్మాణం వేరు. ఛందస్సులో పదాలను యాంత్రికంగా ఇరికించడం పద్యరచన అయినట్లే, ఏదో ఒక వస్తువు తీసుకొని వ్యక్తిత్వ వికాసంలేని పాత్రలు, రుచిలేని సంభాషణలు జోడించి కథ రాయడం కథారచన. కథానిర్మాణం కథారచనకు మించిన రచయిత ప్రతిభకు ఫలితం, సూత్రబద్ధమైన కథారచన కథానిర్మాణమౌతుంది. కథా నిర్మాణం యాంత్రికంగా కాకతాళీయంగా సిద్ధించదు. రచయిత ప్రయత్నం చేసి సాధించాలి. కథలోని భిన్న సంఘటనలను నిర్దిష్టమైన విధానంలో అనుసంధించి కథా వస్తువును పాఠకుడికి చేరవేయగల సామర్థ్యమే కథా నిర్మాణం. కథల్లో ఉండే పాత్రలు, సంభాషణలు, నేపథ్యం, కంఠస్వరం వంటివన్నీ ఈ నిర్మాణంలో కలిసిపోతాయి. కథానిర్మాణం ఎంతసూత్రబద్ధంగా ఉంటే, వస్తువు పాఠకులకు అంత చేరువౌతుంది. కథారచనా ప్రయోజనం సిద్ధిస్తుంది.

- రాచపాళెం చంద్రశేఖర రెడ్డి

**క**థానిక- వివరణ: ఆంగ్లంలోని షార్ట్‌స్టోరీ సమానార్థంగా మనం 'కథానిక' అనే పదాన్ని వ్యవహరిస్తున్నాం. షార్ట్ అనే పదాన్ని మనవాళ్లు 'చిన్న' అని అనువదించి షార్ట్ స్టోరీ ని 'చిన్నకథ' అనే పేరుతో ప్రారంభంలో పిలిచేవారు. అయితే ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు 1936లో 'ప్రతిభ' అనే పత్రికలో వ్యాసం రాస్తూ షార్ట్ స్టోరీ అనే దాన్ని 'చిన్నకథ' అని అనకుండా సంస్కృతంలో వున్న 'కథానిక' అనే పదాన్ని ఉపయోగించడం అన్ని విధాలా మంచిదని సూచించారు. అప్పటి నుండి షార్ట్‌స్టోరీ ని 'కథానిక' అని పిలవడం పరిపాటి అయింది.

- ప్రొ.వి. సిమ్మన్న

# 4






# గురజాడ కథలు

## ప్రొఫెసర్ అత్తలూరి నరసింహారావు

వృద్ధ వివాహ సమస్య ఆధారంగా రాసిన కథ మెటిల్డా. ముసలి భర్తకి, అందమైన, యవ్వనంలో వున్న మెటిల్డా - భార్య. శిధిలమవుతున్న వృద్ధ వివాహ వ్యవస్థ ఈ కథలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఒక అసమ వివాహంలో, భర్త పాత్ర ఎన్ని వికృత ధోరణులు పోతుందో ఈ కథలో తెలుస్తుంది. ఈ కథలో భార్యని మనిషిగా కాకుండా, ఒక వస్తువుగా పరిగణించిన భర్త కనిపిస్తాడు.

ప్రాచీన కాలంలో కవిత్వం, కథ, నవల, నాటకం ఈ ప్రక్రియలన్నీ ఒకే రూపంలో సాంప్రదాయిక పద్య కావ్యాల్లో కనిపిస్తాయి. ఆధునిక కాలంలో ఈ ప్రక్రియలన్నీ విడిపోయి దేనికదే స్వతంత్ర ప్రక్రియగా ఆవిర్భవించాయి. అలాగే ప్రాచీన కాలంలోని పాతకావ్య వస్తువులు ఆధునిక కాలం ఆవిర్భావంతోనే మారిపోయి, వివిధ ప్రక్రియల్లో కొత్త వస్తువులు ప్రత్యక్షమయ్యాయి. కాలం, సమాజం మారాయనటానికి, సాహిత్యంలో ఇవి కొండగుర్తులు. ఆధునిక సమాజం ఏర్పడటానికి కందుకూరి రచనలు దోహదం చేస్తే, ఆధునిక సాహిత్యం రూపుదిద్దుకోవటానికి గురజాడ రచనలు దోహదం చేశాయి. ఒక్క నవల తప్పించి మిగతా మూడు ప్రక్రియల్లోనూ మొదటి రచనలు చేసి, వాటికి ఓ స్వరూపాన్ని, స్వభావాన్ని సంతరించిన వారు గురజాడ.

గురజాడ కథలు మొత్తం 5. ఇందులో పెద్దవి చిన్నవి వున్నాయి. 'పెద్ద మసీదు' కథయితే అసంపూర్ణం. మరొక కథ 'సంస్కర్త హృదయం' ఇంగ్లీషులో గురజాడ రాస్తే అవసరాల సూర్యారావు తెలుగు అనువాదం చేశారు.

'మీ పేరేమిటి' కథ 1910లో అచ్చయింది. ఇది మత మౌఢ్యాన్ని వ్యతిరేకించిన కథ. హిందూ మతంలోని శైవ, వైష్ణవ వర్గాల మధ్య వున్న పోటాపోటీ అజ్ఞానం. అహంకారం ఈ కథలో చిత్రించారు. ఈనాటి రాజకీయ విభేదాల స్థానాన్ని ఆనాడు మత విభేదాలు భర్తీ చేశాయనిపిస్తుంది. ఆనాటి మతం స్థానంలో ఈనాడు రాజకీయం చోటు చేసుకుందనటానికి గుర్తు ఈ కథ. దీనిలో శైవ, వైష్ణవ ఆధిపత్య పోరు, వారి డాంబిక ప్రవర్తన, పిరికితనం, దొంగ భక్తి పాత్రలుగా కనిపిస్తాయి. చివరికి చిత్తశుద్ధి, నిజాయితి విజయం సాధిస్తాయి. ఇలా ఆనాటి మూఢ విశ్వాసాల్ని... మతంలోని డొల్లతనాన్ని గురజాడ వెల్లడించారు.

వృద్ధ వివాహ సమస్య ఆధారంగా రాసిన కథ మెటిల్డా. ముసలి భర్తకి, అందమైన, యవ్వనంలో వున్న మెటిల్డా - భార్య. శిధిలమవుతున్న వృద్ధ వివాహ వ్యవస్థ ఈ కథలో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఒక అసమ వివాహంలో, భర్త పాత్ర ఎన్ని వికృత ధోరణులు పోతుందో ఈ కథలో

తెలుస్తుంది. ఈ కథలో భార్యని మనిషిగా కాకుండా, ఒక వస్తువుగా పరిగణించిన భర్త కనిపిస్తాడు. ముసలి పులి నోట్లో చిక్కుకున్న నిస్సహాయత, దైన్యస్థితి భార్య రూపంలో కనిపిస్తాయి. ఈమె ఆనాటి సమాజంలోని స్త్రీల మూగ రోదనకు ప్రతినిధి. వృద్ధవివాహం కారణంగా, ప్రాణం వున్న బొమ్మలా తయారు చేయబడింది. ప్రాణం వున్నా పలుకే లేని ప్రాణి అయింది. వివాహ వ్యవస్థ స్త్రీని బానిసగా తీర్చిదిద్దింది అనటానికి మెటిల్డా పాత్రే ఉదాహరణ. స్త్రీకి శరీరమే కాని మనసు వుందని గ్రహించని పురుష సమాజం మెటిల్డాను తయారుచేసింది. స్త్రీకి కనీసావసరాలు తీరిస్తే చాలనుకునే పురుష సమాజ అసహజ భావాల పంజరంలో చిక్కిన చిలక మెటిల్డా.

'దిద్దుబాటు' కథ కూడా 1910లో అచ్చ[illegible] మరోపేరు 'కమలిని' ఆనాటి సామాజిక సమస్యను తీసుకుని రాసిన కథ. విద్యావంతుల్లోనూ, పై కులాల వారిలోనూ, వేశ్యల పట్ల వ్యామోహం ఉండటాన్ని సామాజిక గౌరవంగా భావిస్తున్న కాలం నాటి కథ. ఇలాంటి వ్యామోహంలో పడి భార్యని నిరాదరించిన భర్తని, తన తప్పు తెలుసుకునేలా చేసిన కమలిని పాత్ర ఇందులో ప్రముఖమైంది. ఇది స్త్రీ చైతన్య ఆరంభంలో వచ్చింది. ఒక అంతర్నాటకం ద్వారా కమలిని, తన భర్త ప్రవర్తనని మార్చగలిగింది. భర్తలో పశ్చాత్తాపం కలిగేలా, పరివర్తన కలిగేలా చేసి కమలిని విజయం సాధిస్తుంది. స్త్రీ విద్యావంతురాలైతేనే తన సమస్యల్ని పరిష్కరించుకోగలదని చెప్పిన బలమైన కథ.

ఇక 'పెద్ద మసీదు' కథ అసంపూర్తిగా కనిపించినా సంపూర్ణ కథగానే పాఠకుడికి సంతృప్తినిస్తుంది. ఇది మత సంబంధమైన కథ. 'మీ పేరేమిటి' కథలో ఒకే మతంలోని శైవ వైష్ణవ ముతాల ఆధిపత్య పోరు, దాని వల్ల జరిగిన పరిణామాలు చిత్రించారు. ఈ కథలో శిష్యుడైన పుల్లంబొట్టుకి వున్న వాస్తవిక జ్ఞానం, ఇంగిత జ్ఞానం; శాస్త్రాలు చదివిన గురవైన నారాయణ భట్టుకి వుండదు. దేవుడికి వున్నదనుకుంటున్న మహిమ మనిషి కల్పనే అని గురజాడ పరోక్షంగా చెబుతారు.

> **తెలుగు సాహిత్యంలో ప్రజాస్వామిక భావాలను, విమర్శనాత్మకంగా వాస్తవికతను ప్రవేశపెట్టిన గురజాడ రచయితగా ఈనాటికీ ఆధునికుడే. వేద విజ్ఞానం, పుస్తక విజ్ఞానం కన్నా అనుభవ జ్ఞానం విలువైందనీ, ఏ మతమైనా ఆధునిక కాలానికి పనికి రాదనీ, స్త్రీ విద్యావంతురాలైతే సమస్యల్ని పరిష్కరించు కోగలదనీ చెప్పిన గురజాడ ఈనాటికీ ఆదర్శణీయుడే.**

ఆఖరి కథ 'సంస్కర్త హృదయం' వేశ్యా వృత్తి, దాని సంస్కరణకి సంబంధించింది. ఇంగ్లీషు విద్యా విధానంలో విద్యావంతులైన కొందరు, నైతిక వాదులుగా మారి సాగించిన ఉద్యమం వేశ్యా సంస్కరణ. ఈ కథలో వేశ్యా వృత్తిలో వున్న సరళని సంస్కరించబోయి తానే పతనం అంచుల్లోకి వెళ్ళిన ప్రొఫెసర్ రంగనాథయ్యరు హృదయాన్ని చిత్రించారు. ఈయన పుస్తక [illegible] సరళ అనుభవ జ్ఞానానికి ప్రతినిధి. ఇంగిత జ్ఞానంలో కూడా సరళ స్థాయిని చే రం కో లే ని వా డం రంగనాథయ్యర్. వీరిద్దరి మధ్య జరిగిన సంభాషణలు ఇందుకు సాక్ష్యం. పడుపు వృత్తి సమస్య, నైతిక విలువల దృష్ట్యా పరిశీలిస్తే, పరిష్కారం కాదని తేల్చి చెప్పిన కథ. ఆ సమస్య మూలాలు సమాజంలోనే అల్లుకుని వున్నాయని గ్రహించేట్టు చేసిన కథ.

ఇలా ఈ మొత్తం 5 కథల్లో పతనమవుతున్న మత వ్యవస్థ, సాంఘిక వ్యవస్థ కనిపిస్తాయి. ఇక రచనాపరంగా చూస్తే 'దిద్దుబాటు' కథలో కమలినిది పరోక్ష పాత్రచిత్రీకరణ. కథ నాటకీయ శైలితో నడుస్తుంది. 'దిద్దుబాటు' మెటిల్డా కథలు స్త్రీ ప్రధానమైనవి. 'సంస్కర్త హృదయం' కథలో కథా కథన, వర్ణనాత్మక, నాటకీయ శైలులు ప్రధానంగా వున్నాయి. ఈ కథల్లో పాత్రోచిత సంభాషణ, సజీవ పాత్ర చిత్రణ కనిపిస్తాయి. హాస్య, కరుణ రసాల సమ్మేళనం ఈ కథల్లో ప్రతిఫలిస్తుంది. 'దిద్దుబాటు' కథని 'తలుపు' అని సంభాషణతో

ప్రారంభించటం గురజాడ ఆధునికతల్లోని ప్రత్యేకత. వర్ణనలతో, వాతావరణ చిత్రణలతో ఆరంభమయ్యే రచనలకి భిన్నంగా కథ ని ఆరంభించటం గురజాడ ఆధునికత.

ఇంకా, ఆధునికత విషయానికి వస్తే; కాలానికి, జ్ఞానానికి సంబంధించిన దృక్పథాన్ని బట్టి ఒకరు ప్రాచీనులా, ఆధునికులా అని చెప్పొచ్చు. తిరోగమనవాదా? పురోగమనవాదా అని కూడా చెప్పొచ్చు. సమాజంలోనూ, రచయితల్లోనూ ఈ రెండు రకాల వాళ్ళూ వున్నారు. గత కాలాన్నే వైభవంగా చిత్రించిన వాళ్ళు వున్నారు. 'మీ పేరేమిటి' కథలో, గతకాలం మనుషుల్ని దృష్టిలో పెట్టుకుని, వెంకయ్య పాత్ర ద్వారా "ఆ పీనుగులు మనలాగే ఏడుస్తూ వుండేవారు. మనకంటే అధ్వాన్నంగా వుండేవారు." అన్న గురజాడ అత్యంత ఆధునికుడు. ఇదే కథలో మరోచోట గురజాడ "ఈ దేశంలో పాండవులు వుండని గుహలూ. సీతమ్మ వారు స్నానమాడని గుంటలూ లేవు." అని సామాజిక విశ్వాసాల్ని అవహేళన చేస్తారు. ఇంకోచోట "అందరు దేవుళ్లు ఒకటే అయితే అందర్నీ కలిపి ఒక్క చోటే వుంచి అందరూ పూజించ రాదా?" అని బ్రహ్మ సమాజ భావాల కన్నా విలువైనవి గురజాడ ప్రతిపాదించారు. జ్ఞానానికి సంబంధించిన ఆధునికత గురజాడ రాసిన 'సంస్కర్త హృదయం' లో స్పష్టంగా కనిపిస్తుంది.

"ప్రత్యక్ష జీవితంలో మనం ఎదుర్కొంటున్న విషయ సమస్యలను పరిష్కరించుకుందుకు ఈ వేద విజ్ఞానం ఒక్క పిసరు అక్కరకు రాదు... పనికి వచ్చే జ్ఞానం ఒకే ఒకటి. యుగయుగాల జీవితానుభవం. ఈ విజ్ఞానమే మన దైనందిన జీవితానికి సహాయకారి." అని ఒక పాత్ర ద్వారా స్పష్టం చేస్తూ ఆధునిక సమాజానికి జ్ఞాన దిక్సూచిని అందించారు.

తెలుగు సాహిత్యంలో ప్రజాస్వామిక భావాలను, విమర్శనాత్మకంగా వాస్తవికతను ప్రవేశపెట్టిన గురజాడ రచయితగా ఈనాటికీ ఆధునికుడే. వేద విజ్ఞానం, పుస్తక విజ్ఞానం కన్నా అనుభవ జ్ఞానం విలువైందనీ, ఏ మతమైనా ఆధునిక కాలానికి పనికి రాదనీ, స్త్రీ విద్యావంతురాలైతే సమస్యల్ని పరిష్కరించుకోగలదనీ చెప్పిన గురజాడ ఈనాటికీ ఆదర్శనీయుః



**కథాసూత్రాలు**

కథా రచయిత తన అనుభవాన్ని పాఠకునికి అనుభూతం చేయటానికి ప్రయత్నిస్తాడు. అది వ్యాసంలో లాగా జీవితానుభవాన్ని సూత్రీకరించే పద్ధతిలో జరగదు. వ్యాసంలో జీవితానుభవాన్ని వ్యక్తం చేసే పద్ధతి-ప్రత్యక్ష పద్ధతి. ఆ పద్ధతి కల్పనా సాహిత్యానికి ఎంతమాత్రమూ పనికిరాదు. అనుభవాన్ని పరోక్షం చేయటానికి ఉపయోగించే అంశాలే కథాంగాలు. పాత్ర కూడా ఒక కథాంగం కాబట్టి దాన్ని చిత్రించటానిక్కూడా కథా రచయిత పరోక్ష పద్ధతినే ఉపయోగిస్తాడు. శిల్ప సామర్థ్యం ఉన్న కథారచయిత తన పాత్ర స్వభావాన్ని గురించి తానుగా చెప్పడు. ఉదాహరణకు తాను సృష్టించిన ఒక పాత్రకు 'నిజాయితీ లేదు' అని రచయిత చెప్పడు. ఆ పాత్ర నిజాయితీ లేకుండా ప్రవర్తించటాన్ని పాఠకునికి చూపుతాడు. పాఠకుడు ఆ పాత్ర స్వభావాన్ని తానుగా అర్థం చేసుకుంటాడు. పాత్ర పోషణకు, కథారచయిత పరోక్ష సూచన మీద ఎంత ఎక్కువగా ఆధారపడితే కథ విలువ అంతగా పెరుగుతుంది.

సమకాలీన జీవితాన్ని వాస్తవికంగా చిత్రించటం వెనక, రెండు ఆశయాలుంటాయి. వాటిలో మొదటిది సమకాలీన జీవితం పట్ల అసంతృప్తి. రెండవది అది ఎక్కువ మందికి ఆమోదయోగ్యంగా మారాలన్న కోరిక. ఇవి రెండూలేని వారే సాధారణంగా వాస్తవిక కథనాన్నీ- తద్వారా వాస్తవిక జీవితాన్నీ - తిరస్కరిస్తూ ఉంటారు.

**- వల్లంపాటి వెంకటసుబ్బయ్య**




# సురవరం కథలు - వస్తు శిల్పాలు

## డా॥ ముదిగంటి సుజాతారెడ్డి

> గోలకొండ పత్రిక మూలంగా సురవరం సామాజిక రాజకీయ చైతన్యాన్ని తేవటమే కాక సాహిత్య ఉద్యమాన్ని కూడా నడిపాడు. పత్రికలో వ్యాసాలు, సాహిత్య విమర్శలు, పుస్తకసమీక్షలు, కథానికలు ప్రచురించి తెలంగాణ ప్రాంతంలో ఆధునిక ప్రక్రియలను ప్రోత్సహించాడు. ముఖ్యంగా వచన రచనకు ఒరవడి పెట్టాడు.

సురవరం ప్రతాపరెడ్డి తెలంగాణ వైతాళికుల్లో అగ్రగణ్యుడు. అతడొక సంస్థగా పనిచేశాడు. నిజాం పాలనలో వెయ్యిమందిలో ఐదుగురు ఆరుగురు అక్షరాస్యులు. వాళ్ళల్లో కూడా ఉద్యోగవకాశాలున్నచోట మొదట ముస్లింలకు ఆ తర్వాత మహారాష్ట్రియన్లకు అటు తర్వాతనే తెలుగువాళ్ళ వంతు వస్తుందని సురవరం గోలకొండ పత్రిక సంపాదకీయ వ్యాసంలో వ్రాసాడు. నిజాం పాలనలోని తెలుగువాళ్ళలో అక్షరాస్యత లోపించటం వల్ల విజ్ఞానం లేదు. సామాజిక చైతన్యం లేదు. అటువంటి తరుణంలో సురవరం ప్రతాపరెడ్డి గోలకొండ పత్రిక పెట్టి నడిపి ప్రజల్లో సామాజిక రాజకీయ చైతన్యం తీసుకువచ్చిన మహనీయుడు. 1926లో గోలకొండ పత్రికను స్థాపించి సురవరం 1947 వరకు నడిపాడు. అతని సంపాదకత్వంలో గోలకొండ పత్రిక తెలంగాణ సామాజిక రాజకీయ ఉద్యమాలకు ప్రతినిధిగా నిలిచింది. ఆయనలో ప్రజాహితకార్యాలు చేయాలనే తపన వుండేది. పత్రిక మూలంగా ప్రజల్లో మేలుకొలుపు తేవచ్చుననే ఉద్దేశంతో కొత్వాల్ వెంకట రామారెడ్డి ప్రోత్సాహం అండదండలతో గోలకొండ పత్రికను ఆరంభించాడు. గోలకొండ పత్రిక మూలంగా సురవరం సామాజిక రాజకీయ చైతన్యాన్ని తేవటమే కాక సాహిత్య ఉద్యమాన్ని కూడా నడిపాడు. పత్రికలో వ్యాసాలు, సాహిత్య విమర్శలు, పుస్తకసమీక్షలు, కథానికలు ప్రచురించి తెలంగాణ ప్రాంతంలో ఆధునిక ప్రక్రియలను ప్రోత్సహించాడు. ముఖ్యంగా వచన రచనకు ఒరవడి పెట్టాడు.

ఆధునిక తెలుగు సాహిత్యంలో కథానిక ప్రక్రియ 19వ శతాబ్దం చివరి దశలో ప్రవేశించి ఆధునిక కవిత్వంతోపాటు ఒక బలమైన ప్రక్రియగా వికసించింది. బ్రిటీషాంధ్ర ప్రాంతంలో ఇంగ్లీషు బెంగాల్ భాషల్లోని కథల చేత ప్రభావితమైన, రచయితలు తెలుగులో కథలను వ్రాశారు. కథలనెట్లా వ్రాయాలి, కథాశిల్పం ఎట్లా వుండాలి? వస్తువు భాషల స్వరూపమేమిటి? అన్న విషయాలను ఆ రచయితలు ఇంగ్లీషు, బెంగాలీ కథల నుంచి తెలుసుకున్నారు, నేర్చుకున్నారు. తెలంగాణ ప్రాంతంలో ఇంగ్లీషు చదువులు లేవు. ఇంగ్లీషు సాహిత్య పరిచయ ప్రభావాలు లేవు. ఇక్కడ ఉర్దుకు ప్రాధాన్యం కాబట్టి ఇక్కడి రచయితలు ఉర్దూలో అప్పుడే వ్రాస్తున్న ప్రేమ్‌చంద్ కథల చేత బాగా ప్రభావితమయ్యారు. మాడపాటి హనుమంతరావు 11 కథలు వ్రాస్తే రెండు కథలు మాత్రమే స్వతంత్రంగా వ్రాసాడు. మిగిలనవిప్రేమ్‌చంద్ ఉర్దూలో వ్రాసిన కథల అనువాదాలు. ఆ తర్వాత కాలంలో కూడా నెల్లూరి కేశవ స్వామి మొదలైన వాళ్ళు ప్రేమ్‌చంద్ కథలను ఉర్దూ నుంచిఅనువాదం చేసి పుస్తకంగా

ప్రచురించారు. ఆ విధంగా ప్రేమ్‌చంద్ కథాశిల్పం కథా వస్తువులు తెలంగాణ కథారచయితలకు ఆదర్శంగా నిలిచాయి.

తెలంగాణా కథా రచయితల కథాశిల్పంగాని వస్తువుగాని బ్రిటీషాంధ్ర కథారచయితల కన్న భిన్నమైనయి. రెండు వందల సంవత్సరాలకు పైగా తెలంగాణ ఇతర తెలుగు ప్రాంతాలతో సంబంధం తెగిపోయి ఒక ద్వీపంగా వుండిపోయింది. ఇక్కడి వాళ్ళు బయట ఏమైతున్నదో తెలుసుకోలేక పోయారు. బయటి ఆంధ్రులు ఇక్కడేమౌతున్నదో గ్రహించలేకపోయారు. తెలుగువాళ్ళు పరస్పరం అపరిచితులయిపోయారు. ఆఖరికి ఆంధ్ర ప్రాంతాల్లో పునరుజ్జీవనం జరుగుతున్న కాలంలో చరిత్ర సాహిత్యాల్లో విస్తృత విషయాలు బయటపడుతున్నప్పుడు పోతన మొల్లలు ఏకశిలానగరానికి చెందిన వాళ్ళని స్పష్టంగా వున్నా ఆ ఏకశిలానగరం తెలంగాణాలోని కాకతీయుల రాజధాని నగరమైన ఓరుగల్లు - వరంగల్‌యేనని అనుసంధానం చేయటం వాళ్ళకు అసాధ్యమై పోయింది. నైజాంలో ఉర్దూ తప్ప తెలుగే లేదు.

తెలుగు కవిత్వమే లేదన్నంత అజ్ఞానం బ్రిటీషాంధ్రులను ఆవరించింది. నిజాం పాలన ఉర్దూప్రాభవం ముస్లింల ఉత్తరభారత సంస్కృతి ప్రభావం తెలంగాణ తెలుగువాళ్ళ భాషా సంస్కృతుల ఉనికిని అస్తిత్వాన్నే దెబ్బతీశాయి. అందుకే ఆధునిక కాలంలో ఒకవైపు భారత దేశమంతటా గాంధీజీ నాయకత్వంలో స్వాతంత్ర్యోద్యమం ఆరంభమైతే తెలంగాణాలో తెలుగుభాషా వ్యాప్తికి అక్షరాస్యత పెంపుదలకు తద్వారా విజ్ఞానం కలగాలనే ఉద్దేశంతో గ్రంథాలయోద్యమం ప్రారంభమైంది. తర్వాత ఆంధ్రజనసంఘం స్థాపన. అది ఆంధ్ర మహాసభగా రూపొంది 1936 నుంచి రాజకీయోద్యమం నడపడం, కాంగ్రెసు పార్టీ స్థాపన కమ్యూనిస్టు ఉద్యమం, ఫ్యూడల్ వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాటం ఆ విధంగా తెలంగాణాలో క్రమక్రమ పరిణామాలు జరిగాయి. తెలంగాణా ఈ చారిత్రక భౌగోళిక సందర్భం నుంచే ఆధునిక సాహిత్యం పుట్టి వికసించింది. ఈ చారిత్రక భౌగోళిక నేపథ్యంలోనే తెలంగాణలో కథ పుట్టి వికాసదశను చేరుకుంది. కవిత్వం పాట ప్రక్రియల తర్వాత రచయితలకు కథ అభిమాన - ఇష్టమైన ప్రక్రియగా రూపొందింది. తెలంగాణ కథ సురవరం ప్రతాపరెడ్డితో వికాస దశను చేరుకుంది. ఆయన కథల్లో వస్తువు భాష శిల్పం స్వతంత్రమైనాయి. వాస్తవికత కలిగినయి. ఆయన 1930 నుంచి కథలు రచించాడు. మొత్తం 25 కథల వరకు వ్రాసాడు. ఇంకా గోలకొండ పత్రికల్లో అతని కథలుండవచ్చును. పరిశోధించ వలసిన అసరముంది. 25 కథల్లో 21 కథలు మాత్రమే ఇప్పుడు ఆంధ్ర సారస్వత పరిషత్తు 1987లో పుస్తకంగా ప్రచురించినయి మాత్రమే లభిస్తున్నాయి. సురవరం చిత్రగుప్త, భావకవి రామూర్తి, యుగపతిసింహ మొదలైన అనేక కలం పేర్లతో రచనలు చేసేవాడు. కాబట్టి వేరువేరు పేర్లతో గోలకొండ, సుజాత మొదలైన పత్రికల్లో సురవరం వ్రాసిన కథలను వెతికి బయటికి తీయవలసి ఉంది. ఇప్పుడు లభించే 25 కథల్లో "వెంకటరెడ్డి దొర" అనేది నాటిక. అది పోగా 24 కథలు ఇప్పుడు మనకు లభిస్తున్నాయి.



**తెలంగాణ కథ సురవరం ప్రతాపరెడ్డితో వికాస దశను చేరుకుంది. ఆయన కథల్లో వస్తువు భాష శిల్పం స్వతంత్రమైనాయి. వాస్తవికత కలిగినయి. ఆయన 1930 నుంచి కథలు రచించాడు. మొత్తం 25 కథల వరకు వ్రాసాడు. ఇంకా గోలకొండ పత్రికల్లో అతని కథలుండవచ్చును. పరిశోధించవలసిన అసరముంది. 25 కథల్లో 21 కథలు మాత్రమే ఇప్పుడు ఆంధ్ర సారస్వత పరిష్యత్తు 1987లో పుస్తకంగా ప్రచురించినయి మాత్రమే లభిస్తున్నాయి.**

సురవరం 24 కథల్లో 11 కథలు మొగలాయి కథల పేరుతో రెండు భాగాలుగా 1940ల్లో అణాగ్రంథమాలవారు మొదట అచ్చువేశారు. గుండవరము హనుమంతరావు, కె.పి. గుప్తా, వెల్దుర్తి మాణిక్యరావులు 1938లో స్థాపించిన అణాగ్రంథమాల తెలంగాణాలో తెలుగుచదివే అలవాటును పెంచటమే కాదు, కథల రచన ప్రచురణలకు ఎంతో దోహదం చేసింది. లోకంలో మౌఖికంగా వ్యాప్తిలో వున్న కథలను తీసుకొని సురవరం ఆధునిక కథన రీతిలో పొదిగి మన ముందుంచాడు.

గోలకొండను ఔరంగజేబు మొగల్ సైన్యం క్రీ.శ 1688లో జయించింది. నలభై సంవత్సరాలు ఆంధ్రదేశంమీద మొగలాయిల పాలన సాగింది. ఆ పాలన తర్వాత హైదరాబాద్ రాజధానిగా ఆంధ్రదేశానికి నిజాం ఉల్‌ముల్క్ ప్రతినిధి నియమింపబడినాడు. అయితే మొగలాయి పాలనాకాలం ఆంధ్రదేశ చరిత్రలో ఒక అరాచకయుగం. ఎవరికి అందినంత వాళ్ళు దోపిడీ చేసుకున్న కాలం.

మొగలాయీ పాలన కాలం నుంచి ప్రజల్లో వ్యాప్తిలో వున్న కథలను తీసుకొని సురవరం "మొగలాయి కథలు" రచించాడు. ఈ కథల్లో వున్న దోపిడీ వ్యవస్థ అప్పుడు కొనసాగింది. ఇప్పటికీ కొనసాగుతున్నది కాబట్టి ఆ కథల్లోని వస్తువు సమకాలిక వ్యవస్థను వ్యాఖ్యానిస్తున్నట్లుగానే అనిపిస్తుంది. ఆ ఇతివృత్తాలు ఇంకా తమ సామాజిక సందర్భాన్ని కోల్పోలేదు. కాబట్టి ఆ కథలు ఇప్పటికీ వాస్తవికతను దర్శింపచేస్తున్నాయి. అధికారుల లంచగొండితనం, అలసత్వం, క్రౌర్యం, దుష్టపరిపాలన, మోసగించే చాతుర్యం, ప్రజలను పీడించటం, గుడ్డి న్యాయం, వీటిన్నిటినీ సురవరం చాలా సహజంగా వర్ణించాడు. ప్రజల నిస్సహాయత, అమాయకత్వాలను కూడా సురవరం యథార్థంగా చిత్రించాడు. మొగలాయీ కథల్లో మొదటి కథ "గ్యారా కద్దూ బారా కొత్వాల్" చాలా చక్కని కథనంతో సాగింది. ఒక పేదరైతు తన చెలకలో తీగకు కాసిన పదకొండు ఆనపకాయలను తీసుకొని పోయి అంగట్లో అమ్ముదామని కూర్చుంటాడు పదిమంది ఆగి బేరం చేస్తుంటారు. కాని ఇంతలో మాలీపటేల్ వచ్చి ఒక ఆనపకాయను పట్టుకపోతాడు. మరో ఆనపకాయను తలారి తన్నుకపోతాడు. అట్లా ఒకరి తర్వాత ఒకరు అధికారులు వచ్చి ఆనపకాయలు పట్టుకుపోతారు. రైతు ఖాళీ కంబలి ముందల కూర్చొని ఏడుస్తుంటాడు. అప్పుడు కరణం వచ్చి నా వంతు కాయ ఏదని కంబలిని మడతపెట్టుకొని తీసుకపోతాడు. దోపిడీకి గురయిన రైతు ఏడ్చి ఊరుకోలేదు. "యథారాజా తథాప్రజా" అన్నట్లుగా రైతు భార్య వంకీ అమ్మి మంచి లాగూ షేర్వానీ కుట్టించుకొని కొంతమంది సేవకులతో ఒక బావి దగ్గరకు చేరి బావికి వచ్చేవాళ్ళ దగ్గర కుండకు పైస చొప్పు వసూలు చేస్తుంటాడు. ఇది నవాబుకు తెలిసి రైతును పిలిపిస్తాడు. రైతు నవాబుకు వంద బంగారు అష్రఫీలు కానుకగా ఇచ్చుకొని తన కథంతా చెప్తాడు. నవాబు నవ్వి రైతును దేవిడీ దగ్గర గంటలు కొట్టే ఉద్యోగమిస్తాడు. అక్కడ బేగంల దగ్గర నుంచి డబ్బు తీసుకొని గంటలు కొడ్తుంటాడు. నవాబుకి ఈ విషయం తెలిసి రైతు చలాకీ తనానికి సంతోషించి, ఓ గ్రామాన్ని ఈనాముగా ఇస్తాడు. అట్లా అమాయకుడైన రైతు అధికారుల దోపిడీకి గురయి దాన్నే పాఠంగా తీసుకొని ఓ గ్రామానికి జాగీర్దారయ్యాడు. "గోమాజీ గణేశ్ బతుకు దెరువు కోసం మొగలాయి ప్రభువు పాలించే రాజ్యానికి పోయి ఉద్యోగం కోసం కనబడిన వాళ్ళనల్లా ఆశ్రయిస్తాడు. కాని లాభం లేకపోయింది. అప్పుడతడు నగరంలోకి ప్రవేశించి ఒక ద్వారం దగ్గర కూర్చొని నగరంలోకి సరుకులను తెచ్చే వాళ్ళ మూటల మీద గోమాజీ గణేశ్ పీతల్ దర్వాజా అనే ముద్రను వేస్తుంటాడు. డబ్బు వసూలు చేస్తూ ధనవంతుడవుతాడు. ఒకసారి గోదా నుంచి తెల్లదొరలు సరుకులు తెస్తూ గోమాజీ ముద్రను వేయించుకోకుండానే నగరంలోకి పోయి సరుకులను వజీర్లకు చూపిస్తారు. "వీటి మీద గోమాజీ ముద్రలేదు దొంగ సరుకుల్లాగా తోస్తున్నాయి" అంటారు. నవాబు ఆ మాటను విని ముద్రవేసే గోమాజీ ఎవరా? – అని పిలిపిస్తాడు. వేయి బంగారు అష్రఫీలను గోమాజీ నవాబుకు కానుకగా సమర్పించుకుంటాడు. నవాబు చల్లబడి గోమాజీ కథంతా వింటాడు. విని నవాబు నవ్వి పూర్వంలాగే సుంకం వసూలు చేయమని ఐదొందల రూపాయల జీతం కట్టడి చేస్తాడు. ఆ విధంగా నగరానికి



**మొగలాయీ పాలన కాలం నుంచి ప్రజల్లో వ్యాప్తిలో వున్న కథలను తీసుకొని సురవరం "మొగలాయి కథలు" రచించాడు. ఈ కథల్లో వున్న దోపిడీ వ్యవస్థ అప్పుడు కొనసాగింది. ఇప్పటికీ కొనసాగుతున్నది కాబట్టి ఆ కథల్లోని వస్తువు సమకాలిక వ్యవస్థను వ్యాఖ్యానిస్తున్నట్లుగానే అనిపిస్తుంది.**

వచ్చే సరకుల మీద సుంకం వసూలు చేయవచ్చునని నవాబు ఆనందించాడు. ఈ విధమైన చమత్కారపూర్ణమైన ఇతివృత్తాలు బేఖూవ్ మదార్‌సాబ్, కిచిడీ జాగీర్దారు, చస్తామంటె పురసత్ లేదు, రుమాలను బర్రె తినిపోయింది. – మొదలైన మొగలాయి కథలుగా రూపొందాయి. పదకొండు మొగలాయి కథల్లో 'రంభ' అనే కథ ఒక వేశ్యవృత్తాంతం, బీజాపూర్‌ను పాలించిన ఆదిల్‌షా అనే ప్రసిద్ధుడైన సుల్తాను ప్రేమించిన స్త్రీ రంభ. ఒకసారి ఆదిల్‌షా యుద్ధానికి పోయి చాలా రోజులకు తిరిగి అంతఃపురం వస్తాడు. అక్కడి ద్వారపాలకులు ఆశ్రితులు రంభ శీలం గురించి సుల్తాన్‌కు లేనిపోని మాటలన్నీ చెప్తారు. ఆ మాటలు విని సుల్తాన్ రంభను అనుమానించి ఆమెను శంకిస్తాడు. క్రూరంగా ప్రవర్తిస్తాడు. నీవు తప్పు చేయకుంటే అల్లా నిన్ను రక్షిస్తాడు. ఈ భవనం కిటికీ నుంచి కిందికి దుముకమంటాడు. రంభ వెంటనే దుముకుతుంది. లాగుపైన కట్టుకున్న ఇరవై మూరల పట్టుచీర గొడుగులాపైకెగిరి ఆమెను సురక్షితంగా కింది దింపుతుంది. కాని రంభ తన నడుములో చెక్కుకున్న చురకత్తి తీసి ఎదలో పొడుచుకొని మరణిస్తుంది. ప్రియుని అనుమానానికి గురయిన షేక్స్పియరు "ఓథెల్లో" కథను తలపిస్తుందీ కథ. సురవరం చాలా సంవేదనాత్మకంగా ఈ కథను రచించాడు.

"సురవరం కథలు" పేరుతో తొమ్మిది కథలున్నాయి. ఇది "సుజాత" పత్రికలో 1940 దశకంలో అచ్చయిన కథలు. వీటిని సేకరించి ఆంధ్ర సారస్వత పరిషత్తువారు మొదటిసారిగా ఒక్కచోట ప్రచురించారు. వీటిల్లో "నిరీక్షణము" కన్యాకుమారి ప్రాంతంలో వ్యాప్తిలో వున్న కథ. శంకరన్ కుమారీల ప్రేమవృత్తాంతం. అనాథ అయిన మేనబావ శంకరన్‌ను కుమారి ప్రేమిస్తుంది. శంకరన్ ఆమెను ప్రేమిస్తాడు. కులాచారం ప్రకారం పెండ్లికి ముందు వరుడు సముద్రం వేటకు పోయి ఏడు చేపలను తేవాలి. అతని కోసం కుమారి రోజు చేపలకూర వండుకొని భోజనంతో వచ్చి సముద్ర తీరంలో ఎదురు చూస్తుంటుంది. అల్లా ఏండ్లు గడిచిపోతాయి. ఆఖరికి కుమారి జబ్బు చేసి మంచం పట్టి మరణిస్తుంది. గ్రామస్థులు కడసారి శంకరన్‌కు వీడ్కోలు ఇచ్చిన చోట ఆమెను సమాధి చేస్తారు. అక్కడ గుడి కడ్తారు. ఆమెనే నేటికి కన్యాకుమారిగా పూజలందుకుంటుంది. స్థానిక చరిత్రకు సంబంధించిన ఇతివృత్తాన్ని తీసుకొని సురవరం ఒక చక్కని కథగా మలిచాడు. సురవరం కథల్లో "నిరీక్షణము" కథ ప్రసిద్ధి చెందింది. "ఈ కథ... ఇరవై కథలలోకి మణిపూస వంటింది". – అని ప్రసిద్ధ కథా రచయిత్రి ఇల్లిందల సరస్వతీదేవి సురవరం కథల సంపుటికి ముందుమాట వ్రాస్తూ అన్నది.

"సురవరం కథలు" తొమ్మిదింటిలో ఐదు స్త్రీల జీవితాలను చిత్రిస్తున్న కథలున్నాయి. సమకాలిక స్త్రీల దౌర్భాగ్యజీవితాలు సురవరంను కదలించి వేసాయి. అవి సంస్కరణలు జరుగుతున్న రోజులు. తెలుగులో తొలితరం కథకులు బ్రిటీషాంధ్రలో గాని తెలంగాణలో గాని సంఘసంస్కరణభావాలను ముఖ్యంగా స్త్రీ జనోద్ధరణ భావాలను చిత్రిస్తూ కథలు వ్రాసారు. తెలుగులో మొదటి కథ అని చెప్పుకునే "దిద్దుబాటు" (1910)లో గురజాడ ఒక స్త్రీ భర్తను వేశ్యాగమనం నుంచి సంస్కరించే ఇతివృత్తం వుంది. దాదాపు ఇటువంటి ఇతివృత్తంతోనే మాడపాటి హనుమంతరావు 'నేనే' అనే కథను 1914లో రచించాడు. అంతకుముందు 1912లో ఆయన అనుమానించే భర్తలను చిత్రిస్తూ "హృదయశల్యము" అనే కథను వ్రాశాడు. గురజాడకు పూర్వమే భండారు అచ్చమాంబ 1898 నుంచి కథలను రాసింది. ఇప్పుడు దొరికే కథల్లో 1902 నాటి "స్త్రీ విద్య, బీదకుటుంబం, లలితాశారదలు" కథల్లో స్త్రీకి విద్య అవసరమని చెప్పింది. స్త్రీలకు వ్యక్తిత్వనిర్మాణం అవసరమని చెప్తూ సంస్కరణ భావాలు గల కథలను వ్రాసింది. గురజాడ

**"సురవరం కథలు" తొమ్మిదింటిలో ఐదు స్త్రీల జీవితాలను చిత్రిస్తున్న కథలున్నాయి. సమకాలిక స్త్రీల దౌర్భాగ్యజీవితాలు సురవరంను కదలించి వేసాయి. అవి సంస్కరణలు జరుగుతున్న రోజులు. తెలుగులో తొలితరం కథకులు బ్రిటీషాంధ్రలో గాని తెలంగాణలో గాని సంఘసంస్కరణభావాలను ముఖ్యంగా స్త్రీ జనోద్ధరణ భావాలను చిత్రిస్తూ కథలు వ్రాసారు.**

ఇంకా ఆ తర్వాత కథకులు శ్రీపాద, మల్లాది వంటి వాళ్ళు కూడా స్త్రీ జన సంస్కరణ భావజాలంతో కథలు వ్రాశారు. వాళ్ళ కథల్లో స్త్రీ విద్య, బాల్య వివాహాలు వద్దని, పునర్వివాహాలు కావాలని చెప్పే భావజాలాన్ని ఎక్కువగా చూస్తాం. కాని సురవరం వ్రాసిన ఐదు కథల్లో బాల్య వివాహాలు వద్దని, పునర్వివాహాలు కావాలన్న భావజాలంతో పాటు స్త్రీలు బాల్య వివాహాలతో వయస్సుమళ్ళిన వాళ్ళతో జరిగిన వివాహాల వల్ల చిన్న వయస్సులో విధవలు కావటం, సంప్రదాయం ధర్మం వాళ్ళను క్రూరంగా చూడటం, కొందరు పురుషులు అటువంటి విధవలను ప్రేమిస్తున్నామని పెండ్లి చేసుకుంటామని నమ్మించి తీసుకుపోయి వేశ్యలుగా మార్చటం వేశ్యాగృహాల్లో అమ్మటం అనే సమస్యలను తీసుకొని ఈ ఐదు కథలు రచించాడు. సంప్రదాయం వాళ్ళకు నియమాలను క్రూరమైన జీవితాన్ని విధించింది. ఇలాంటి స్త్రీల విషయంలో సురవరం చాలా ఉదారంగా ఆలోచిస్తూ కథలను వ్రాసాడు. "హుసేన్ బీ" అనే కథలో కామాక్షి అనే వితంతువును బోధ చేస్తాననే నెపంతో ఒక స్వాములవారు తన వెంటతీసుకుపోయి ఆమెను చెరచటానికి ప్రయత్నిస్తాడు. కామాక్షి స్వాముల వారి మఠం నుంచి పారిపోయి తల్లిదండ్రుల ఇంటికి చేరుకుంటుంది. కాని తల్లిదండ్రులు ఆమెను ఇంట్లోకి రానివ్వరు. అప్పుడామెకు ఒక సాహెబుతో పరిచయమవుతుంది. ఆ సాహెబు వర్తకుడు. ధనవంతుడు. ఆమెను పెండ్లి చేసుకుంటానంటాడు. కామాక్షి ఒప్పుకుంటుంది. నిలువ నీడ లేనిదాన్ని సాహెబు నికా చేసుకుంటాడు. ఆమెకు ఇద్దరు పిల్లలు పుడ్తారు. సుఖంగా కాపురం చేసుకుంటూ వుంటుంది. సురవరం ఈ కథను నాటకీయతతో ఆరంభించాడు. కామాక్షి చిన్ననాటి స్నేహితుడు రాముడు రైల్లో ప్రయాణం చేస్తుంటాడు. ఒక స్త్రీ అతన్ని పేరు పెట్టి పిలుస్తుంది మొదట ఆ ముసల్మాను స్త్రీని రాముడు గుర్తించడు. అప్పుడే ఆ స్త్రీ తన పేరు "హెస్సేన్‌బీ" అని, తను చిన్ననాటి కామాక్షినని పరిచయం చేసుకుంటుంది. అక్కడ సురవరం హుస్సేన్‌బీ మనోహర కంఠాన్ని, బంగారు నగలు ధరించిన ఆమె రూపాన్ని చాలా దీర్ఘంగా సహజంగా వర్ణించాడు. ఆ రాముడు హుస్సేన్‌బీని చిన్ననాటి కామాక్షిగా గుర్తుపడ్తాడు. మధ్వాచార్ల కుటుంబంలో పుట్టిన కామాక్షి మతం మార్చుకొని హుసేన్‌బీ అయి ఆనందంగా కాపురం చేసుకుంటున్నదని తెలుసుకొని "అయ్యో! సంఘదౌర్జన్యం వల్ల హిందూ స్త్రీ లెట్లు చెడిపోతున్నారోకదా! అనిబాధపడ్తాడు. రాముడు హుస్సేన్‌బీ తనను పరిచయం చేసుకున్నప్పుడు – "ఏమిట్రా యీ చిత్రము! బ్రాహ్మణ స్త్రీ తురకది అయింది. మరి యేమిన్నీ చింతలేకుండా యెంత ఆనందంగా వుంది. అప్పుడు ఇంట్లో ఆడువాండ్లు మగవాండ్లు పెట్టే బాధలు పడలేక వాడిపోయిన మొఖముతో యెప్పుడూ శోకిస్తూ వుండేది పాపము!" అని అనుకుంటాడు. సమాజంలో ఇంట్లో స్త్రీలు దుఃఖాల పాలయ్యేవారని సురవరం ఆనాటి స్త్రీ పరిస్థితిని గురించి చెప్పాడు. అటువంటి నిరాశ్రయులైన స్త్రీలు దిక్కుతోచక మతాంతీకరణాన్ని స్వీకరించే వాళ్ళు. ఆ రోజుల్లో జరిగిన ఏదో సంఘటన ఆధారంగానే సురవరం ఈ కథను వ్రాసినట్లుగా కన్పిస్తున్నది. ఎందుకంటే ఇటువంటి ఇతివృత్తంగల స్త్రీ కథనే నందగిరి వెంకట్రావు కూడా వ్రాశాడు. ఈ కథేకాక, మిగిలిన నాలుగు కథల్లోని ఇతివృత్తాలు కల్పితాలుకాక, యథార్థ సంఘటనలను ఆధారంగా చేసుకొని వ్రాసినయే అని చెప్పవచ్చును. పత్రికా సంపాదకుడుగా కూడా అతనికి స్త్రీలపై జరిగే అత్యాచారాలను గురించి వార్తలు తెలిసి వుంటాయి. ఆ వార్తలనే సురవరం కథలుగా మలిచాడు. అందుకే కథలు వాస్తవికగా వున్నాయి.



**బాల్య వివాహాలు వద్దని, పునర్వివాహాలు కావాలన్న భావజాలంతో పాటు స్త్రీలు బాల్య వివాహాలతో వయస్సుమళ్ళిన వాళ్ళతో జరిగిన వివాహాల వల్ల చిన్న వయస్సులో విధవలు కావటం, సంప్రదాయం ధర్మం వాళ్ళను క్రూరంగా చూడటం, కొందరు పురుషులు అటువంటి విధవలను ప్రేమిస్తున్నామని పెండ్లి చేసుకుంటామని నమ్మించి తీసుకుపోయి వేశ్యలుగా మార్చటం వేశ్యాగృహాల్లో అమ్మటం అనే సమస్యలను తీసుకొని ఈ ఐదు కథలు రచించాడు.**

"మెహ్దీ బేగమ్" కథలో మెహ్దీ సంపన్న కుటుంబంలో పుట్టింది. అన్నల సంరక్షణలో పెరిగింది. జబ్బారు అనే యువకుడు వాళ్ళదగ్గర నౌకరి చేస్తుంటాడు. మెహ్దీ అతన్ని

ప్రేమిస్తుంది. జబ్బారు స్వార్థబుద్ధితో ఆమెను ప్రేమిస్తాడు. ఇద్దరు పారిపోతారు. కాని అన్నలు ఆమెను తిరిగి పట్టితెచ్చి ఇంట్లో బంధిస్తారు. మెహ్దీ జబ్బారును మరచిపోలేక ఇంట్లో నుంచి పారిపోయి అతని కోసం వెతుకుతుంది. కాని అతడు ఎక్కడా కన్పించడు. అప్పుడు కొందరు స్త్రీలు ఆమెను వేశ్యాగృహానికి చేరుస్తారు. జబ్బారు కోసం ఎదురుచూస్తు మెహ్దీ నిస్సహాయతతో వేశ్యావృత్తిలోకి దిగుతుంది. ఈ వృత్తాంతాన్ని కూడా సురవరం వెంకట్రామయ్య పాత్రను ప్రవేశపెట్టి నాటకీకరణ చేసాడు. వెంకట్రామయ్య భోగంవాళ్ళ గానాబజానాకు పోయి అక్కడ మెహ్దీని చూసిగుర్తుపట్టాడు. అతడు జబ్బారుకు స్నేహితుడు. నా స్నేహితుడు జబ్బారుకు ప్రియురాలివి కద నీవు ఇట్లా ఎట్లా అయ్యావు అని ఆమె కథను అడుగుతాడు. ఆమె తన కథను వినిపిస్తుంది అప్పుడు వెంకట్రామయ్య జబ్బారు కలకత్తావెళ్ళిపోయాడని చెప్తాడు. దాంతో కథ ముగుస్తుంది. జబ్బారును ప్రేమించిన మెహ్దీ జీవితం ఆ విధంగా విషాదమయమవుతుంది. ఆనాటి హిందూ ముస్లిం సఖ్యతను చాటాడు.



**సమాజంలో ఇంట్లో స్త్రీలు దుఃఖాల పాలయ్యేవారని సురవరం ఆనాటి స్త్రీ పరిస్థితిని గురించి చెప్పాడు. అటువంటి నిరాశ్రయులైన స్త్రీలు దిక్కుతోచక మతాంతీకరణాన్ని స్వీకరించే వాళ్ళు. ఆ రోజుల్లో జరిగిన ఏదో సంఘటన ఆధారంగానే సురవరం ఈ కథను వ్రాసినట్లుగా కన్పిస్తున్నది.**

"ఖిస్మత్" కథలో సురవరం గోహర్‌జాన్ వృత్తాంతాన్ని వ్రాశాడు. లాహోరు నగరంలో గోహరజాన్ చాలా ప్రసిద్ధి చెందిన వేశ్య. ఆ గోహర్‌జాన్ పల్లకీలో పోతుంటే మార్కెట్ దగ్గర ఏడుస్తున్న పిల్లను చూస్తుంది. తన వెంట ఇంటికి తెచ్చి ఇంతియాజన్ అని పేరుపెట్టి ఆటపాటలు ఉర్దూపారశీ కవిత్వపు మెళకువలు నేర్పుతుంది. ఇంతియాజన్ యవ్వనవతి కాంగనే వేశ్యావృత్తిలోకి దింపాలని చూస్తుంది. గోహర్‌జాన్. కాని ఆ పిల్ల ఆ వృత్తికి దిగనంటుంది. పెండ్లిచేసుకుంటా నంటుంది. ఇంతలో ఖాసిం అలీబిన్ అబ్దుల్లా అనే నవయువకుడు గోహర్ దగ్గర సితార్ వ్యాదకుడుగా చేరుతాడు. ఇంతియాజన్ పాటకు అతడు సితార్ వాయించేవాడు. ఇద్దరు ప్రేమించుకుంటారు. వాళ్ళిద్దరు ఎవరికీ చెప్పకుండా బొంబాయి వెళ్ళిపోతారు. ఖాసిం ఏ పని చేయడు. అక్కడ. చివరకు ఇంతియాజన్‌ను ఒక బోగంసాని ఇంటికి చేరుస్తాడు. మొదట ఆమె గానాబజానాతో సరిపెట్టేది. కాని ఎక్కువ డబ్బు సంపాదించమని ఖాసిం ఆమెపై ఒత్తిడిచేసి వేశ్యావృత్తిలోకి లాగుతాడు. మూడేండ్లు అట్లా జరుగుతుంది. ఒకరోజు ఖాసం వున్న సొత్తంతా తీసుకొని పారిపోతాడు. ఇంతియాజన్ తన ఖిస్మత్‌పై భారం వేస్తుంది. ఈ సమాజం స్త్రీని గౌరవంగా బతుకనియ్యదు అని అనుకుంటుంది. కొన్నాళ్ళు వేశ్యావృత్తిలో జీవించితిరిగి లాహోర్ పోతుంది. గోహర్‌జాన్‌ను గురించి జాడ అడిగితే ఆమె చనిపోయిందని తెలుస్తుంది. ఒక బంగ్లాను కిరాయికి తీసుకొని వుంటుంది. ఒకరోజు ఒక ముసలివాడు వచ్చి 20-25 ఏండ్ల కిందట ఒక రెండేండ్ల పిల్లను మార్కెట్ వద్ద విడిచి పెట్టిపోయాడు. ఆ పిల్ల ఎక్కడుంది అని అడుగుతాడు. ఆ పిల్ల తల్లిదండ్రులు ధనవంతులు. వాళ్ళు చనిపోగా ఆ పిల్ల చిన్నమ్మ ఆస్తంతా తను తీసుకొని ఆ పిల్లను మార్కెట్ వద్ద విడిచిపెట్టి వెళ్ళిపోయింది. ఆ చిన్నమ్మ ఇప్పుడు ఆస్తంతా పోయి బిచ్చమెత్తుకుంటుందని చెప్తాడు. ఆ చిన్నమ్మకు, ముసలి వాడికి పొట్టకు లోపం లేకుండా చేస్తుంది ఇంతియాజన్. ఒక అనాథ బాలికను తెచ్చి పెంచుకుంటుంది. తన ఆస్తినంతా అనాథబాలికల సంరక్షణార్థం ఇచ్చి చనిపోతుంది. ఆమె చావుకు ఎందరో దుఃఖిస్తారు. ఆమె గోరి మీద ఇప్పటికీ అనాథలు గులాబీ పూలు పెట్టి కన్నీరు కారుస్తారు - అన్న మాటలతో సురవరం కథ ముగించాడు. ఒక స్త్రీ జీవితం ఎన్ని మలుపులు తిరిగిందో సురవరం చూపాడు. ఇది లాహోర్‌లో నిజంగా జరిగిన వృత్తాంతం మీద ఆధారపడిన కథ!

"అపరాధం" కథ సురవరం బెనారస్‌లో జరిగినట్లుగా వర్ణించాడు. వెంకట్రావు అనే విలాస పురుషుడు, కాశీలోని హిందూ యూనివర్సిటీలో చదవాలని అక్కడికి చేరుకుంటాడు. ఒక పాండా ఇంట్లో వుంటాడు. పక్క ఇంట్లో వున్న స్త్రీ అతన్ని

ఆకర్షిస్తుంది. అలంకరించుకొని ఆమె ఇంటికిపోతాడు. ఆమె పేరు రాంకుమారీ. తన చరిత్రను వినిపిస్తుంది. ఆమె తెలుగు అమ్మాయే. ఆమెది కరీంనగరం జిల్లా. వైదిక నిష్ఠగల కుటుంబంలో పుట్టింది. పెండ్లి జరిగింది. భర్త బాగా ప్రేమగా చూసుకునేవాడు. మామగారు జబ్బు పడితే అతన్ని పట్నం దవాఖానాలో చేరుస్తారు. భర్త అత్త అందరూ దవాఖానాకు వెళ్ళిపోతారు. ఆమె ఒక్కతే వుండటం చూసి ఇంటి యెదుట వుండే ఖాసిం వచ్చి నిన్ను పట్నం దవాఖానాకు తీసుకుపోతానని చెప్పి ఎక్కడికో తీసుకపోయి ఆమెను చెరుస్తాడు. మరిద్దరు దుర్మార్గులు కూడా చేరి ఆమెను చెరుస్తారు. ఆ తర్వాత ఒక దుర్మార్గునికి అమ్మివేస్తారు. ఒక నెల గడిచిన తర్వాత పోలీసులు వచ్చి నిర్బంధంలో వున్న ఆమెను విడిపిస్తారు. అమెను అత్తవారింటికి చేరుస్తారు.



కాని వాళ్ళు ఆమెను కాశీ తీసుకువచ్చి వదిలి వెళ్ళిపోతారు. అక్కడ ఆమె దిక్కులేక వేశ్యావృత్తిలోకి ప్రవేశిస్తుంది. భర్తలు చనిపోయిన తర్వాత దిక్కులేని వాళ్లయి ఎంతో మంది స్త్రీలు వ్యభిచార వృత్తిచేత జీవిస్తుంటారు - అని సురవరం స్త్రీల పరిస్థితి ఆనాటి సమాజంలో ఎట్లా వుందో చెప్తాడు. రాంకుమారీ స్వయంగా చేసిన తప్పేమీ లేదు. మోసగాడయిన ఖాసిం చేతిలో పడిపోయి ఆమె జీవితం సర్వనాశనమైంది. కుటుంబం ఆమెనాదరించలేదు. దిక్కులేని ఆమె వేశ్యావృత్తిలోకి దిగింది. ఒకచోట రాంకుమారి వెంకట్రావుతో -"మీవంటివాండ్లు హిందూసంఘంలో నిండిపోయినప్పుడు నావంటి వాండ్లకు భోగం వృత్తి కాకుంటే ఇంకేమి వృత్తి మిగులుతుంది?" అని ప్రశ్నిస్తుంది.

**ఈ కథ చిన్నగా వున్నా అనేక సంఘటనలతో నంబి నర్సిములు విశేష పాత్ర చిత్రణతో ఉత్కంఠభరితంగా సాగుతుంది. చక్కని పాత్రల చిత్రణ, కథన శైలి ఈ కథలో కన్పిస్తుంది. సన్నివేశాలు, సంభాషణలతో కథ నడుస్తుంది. ప్రజల్లో వున్న మూఢ విశ్వాసాలు ఎట్లా వుంటాయో రచయిత చిత్రించాడు.**

"వింత విడాకులు" కథలో కమలమ్మకు బాల్యవివాహం జరుగుతుంది. భర్త వయస్సు మళ్ళినవాడు. చివరకు నంబి నర్సిములు ఉపాయంతో కమలమ్మ మతం మార్పుకుని ముస్లింగా కమాల్‌బీ అవుతుంది. అప్పుడామెకు భర్త నుంచి విడాకులు దొరుకుతుంది. ఆఖరికి ఆమె రంగనాయకులనే యువకున్ని వివాహమాడుతుంది. ఈ కథ చిన్నగా వున్నా అనేక సంఘటనలతో నంబి నర్సిములు విశేష పాత్ర చిత్రణతో ఉత్కంఠభరితంగా సాగుతుంది. చక్కని పాత్రల చిత్రణ, కథన శైలి ఈ కథలో కన్పిస్తుంది. సన్నివేశాలు, సంభాషణలతో కథ నడుస్తుంది. ప్రజల్లో వున్న మూఢ విశ్వాసాలు ఎట్లా వుంటాయో రచయిత చిత్రించాడు. హిందూమతంలో విడాకులిచ్చే చట్టం లేకపోవటంతో కమలమ్మ ముస్లిం అయి విడాకులు తీసుకున్నట్లుగా రచయిత చిత్రించాడు.

సురవరం ప్రతాపరెడ్డి "పెండ్లి బేరం" కథను 1932లో వ్రాసాడు. గోలకొండ పత్రికలో అచ్చయింది. ఆంధ్రప్రాంతంలో శారదా చట్టం వచ్చినప్పుడు బాల్య వివాహాలు రద్దయ్యాయి. చట్టప్రకారం బాల్య వివాహం చేయటం నేరం. అటువంటిది నైజాంలో లేదు. కాబట్టి బ్రిటీషాంధ్ర నుంచి కొంత మంది నైజాంలోని తెలంగాణలోకి ప్రవేశించి తమ పిల్లల వివాహాలు చేయించేవారట. ఆ వృత్తాంతాన్ని హాస్యవ్యంగ్య ధోరణిలో సురవరం కథగా వ్రాసాడని సంగిశెట్టి శ్రీనివాస్ చెప్పాడు. కానీ పుస్తకంలో లేదు. ఇదే కాక ఇంకా చిత్రగుప్తుడు (1931) కొండను త్రవ్వి ఎలుకను బట్టుట (1932), పక్కా ఇన్సాఫు (1932) అనే సురవరం కథలు సంగిశెట్టికి గోలకొండ పత్రికలో దొరికాయి. అతని దగ్గర వున్నాయి. గోలకొండ పత్రికలను శోధిస్తే సురవరం కథలు ఇంకా దొరికే అవకాశముందని సంగిశెట్టి అంటాడు.

సురవరం ప్రతాపరెడ్డి "సంఘాల పంతులు" కథ వస్తువు శిల్పం దృష్టితో అపూర్వమైంది. నిజాం రాజ్యంలో ఆ కాలంలో ప్రభుత్వాధికారులకు వృత్తి పనివాళ్ళు వెట్టిచాకిరి చేయవలసి వచ్చేది. కోమట్లు ఉచిత సప్లయి ఇయ్యవలసి వచ్చేది. వెట్టిచాకిరిని సప్లైలను నిషేధిస్తూ నిజాం చట్టం చేశాడు. కాని కొనసాగుతూనే వుండేయి. రామసాగరం అనే గ్రామంలో పోలీసు స్టేషను వుంది. అక్కడ 12 మంది పోలీసు జవాన్లు,

ఒక అమీను (ఇన్‌స్పెక్టరు) ఒక జమేదారు వున్నారు. అమీనుకు రెండు గుఱ్ఱాలున్నాయి. వీళ్ళందరికి కావలసిన సామాన్లను కోమట్లు సప్లై చేయాలి. గుఱ్ఱాలకు గడ్డ శనగలు ఇయ్యాలి. అమీన్‌ఇంట్లో మాదిగలు సమస్త చాకిరి చేయాలి. పైగా తన్నులు తినాలి. అటువంటి ఆ ఊరికి కృష్ణా అవతలి తీరం నుంచి ఒక పంతులు వస్తాడు. ప్రజల్లో చైతన్య కలిగిస్తాడు. ప్రజలంతా ఏకమై పోలీసు స్టేషన్‌ను ముట్టడిస్తారు. పోలీసులు దురంతాలు అంతమవుతాయి.

1940లో వ్రాసిన ఈ కథలో ఆనాటి పరిస్థితులు చక్కగా ప్రతిబింబించాయి. ఊరి ప్రజల్లో చైతన్యం తెచ్చిన సంఘాల పంతులు సురవరం ప్రతాపరెడ్డియే!



"వకీలు యెంకయ్య" కథలో సురవరం కొద్దిగ చదువుకున్న వాళ్ళు ప్రజలనెట్లా మోసం చేసేవాళ్ళో చిత్రించారు. "బారిస్టర్ గోపాల కిషన్‌రావు కథలో సురవరం ఇంగ్లండు పోయి వచ్చినవాళ్ళు ఎట్లా కుటుంబాన్ని దేశాన్ని మరిచిపోయి పాశ్చాత్య సంస్కృతి వ్యామోహంలో వడేవాళ్ళో చిత్రించాడు. గోపాలకిషన్‌రావు ఇంగ్లండులో బారిస్టరు చదువు చదివి వస్తాడు. సంప్రదాయంగా పెరిగిన భార్య జానకి అతనికి నచ్చదు. ఆమెను వదిలేసి ఆధునాతనమైన రాజ్యలక్ష్మిని పెండ్లి చేసుకొని వేరే కాపురం పెడ్తాడు. క్రమంగా రాజ్యలక్ష్మి ప్రవర్తన అతనికి నచ్చదు. తన స్నేహితులతో చనువుగా వుండటాన్ని సహించలేడు. అది చూసి రాజ్యలక్ష్మి సొమ్ములతో అజీముల్లా వెంటవెళ్ళిపోతుంది. గోపాలకిషన్‌రావు తన భార్యను తనకిప్పించవలసిందని కోర్టుకు పోతాడు. కోర్టులో రాజ్యలక్ష్మి అతని భార్య కాదని సొమ్ము డబ్బు ఇచ్చి ఇంట్లో పెట్టుకున్నాడని, ఇప్పుడు రాజ్యలక్ష్మి మతం మార్చుకోని అజీముల్లాను నికా చేసుకుందని ఆమె అతని భార్య అని తేలుతుంది. ఓడిపోయిన గోపాలకిషన్‌రావు పాశ్చాత్య వ్యామోహం వదులుతుంది. తిరిగి తల్లిదండ్రులు భార్యదగ్గరికి వెళ్ళిపోతాడు. ఆ రోజుల్లో ఇటువంటి సంఘటనలు చాలా జరిగేవి. ఒద్దిరాజు సీతారామచంద్రరావు కూడా "లండన్ విద్యార్థి" పేరుతో యువకుల పాశ్చాత్య వ్యామోహాన్ని చిత్రించాడు. ఏదో జరిగిన వృత్తాంతాన్ని దృష్టిలో పెట్టుకునే సురవరం ఈ కథను రచించాడు. యువకులు ఇంగ్లండుకు పోయి మాతృదేశాన్ని సంస్కృతి భాషలను మరచిపోయి పాశ్చాత్య సంస్కృతి వ్యామోహంలో పడిపోవటాన్ని విమర్శిస్తూ సురవరం ఈ కథను రచించాడు. తెలుగు కథా సాహిత్యంలో ఇటువంటి ఇతివృత్తంతో తెలంగాణ నుంచే కథలు రావటం ఒక విశేషం.

**జరిగిన వృత్తాంతాన్ని దృష్టిలో పెట్టుకునే సురవరం ఈ కథను రచించాడు. యువకులు ఇంగ్లండుకు పోయి మాతృదేశాన్ని సంస్కృతి భాషలను మరచిపోయి పాశ్చాత్య సంస్కృతి వ్యామోహంలో పడిపోవటాన్ని విమర్శిస్తూ సురవరం ఈ కథను రచించాడు. తెలుగు కథా సాహిత్యంలో ఇటువంటి ఇతివృత్తంతో తెలంగాణ నుంచే కథలు రావటం ఒక విశేషం.**

సురవరం ప్రతాపరెడ్డి మొగలాయి కథలు ప్రజల్లోవ్యాప్తిలో వున్న కథలకు సాహిత్య రూపాలు అయితే "సురవరం కథలు" తొమ్మిది స్వతంత్రమైన కథలు. కాని ఆ కథలు కేవలం కల్పితాలు ఊహాగానాలు కావు. ఆనాడు నైజాం ప్రాంతంలో జరిగిన సంఘటనల మీద ఆధారపడినయి. అందుకే ఆ కథల్లో వాస్తవికత కన్పిస్తుంది. అంతేగాక అవి తెలంగాణ ప్రజా జీవితాన్ని ప్రతిబింబిస్తున్న కథలు. కథ అంటే జరిగిన ఇతివృత్తానికి కళారూపాల్ని ఇయ్యటం. జరగని ఇతివృత్తాన్ని జరగటానికి అవకాశముంది అని చెప్పటం.

అట్లా సురవరం చాలా మట్టుకు జరిగిన ఇతివృత్తాలను తీసుకున్నాడు. వాటిని కథా శిల్పంతో కళారూపాలుగా మలిచాడు. పాత్రల చిత్రణను సురవరం చక్కగా చేసాడు. కొన్ని సన్నివేశాల్లో పాత్రల వేషభాషలను విశదంగా వర్ణించాడు. ఆ వర్ణనల్లో ఆనాటి సంస్కృతి ప్రతిఫలించింది. పాత్రల మనోభావాలను అంతర్ ఘర్షణలను చాలా బాగా చిత్రించాడు. కొడవటిగంటి కుటుంబరావు "రేపటి కథా సాహిత్యం" (అభ్యుదయ -మే, 1956) అనే వ్యాసంలో "తెలంగాణా పోరాటం గురించి తెలంగాణావారు ఆమోదించలేని కథలు

కొన్ని లోగడ వచ్చాయి" అని అన్నాడు. ఆయనన్న మాట చాలా నిజం. అదే విధంగా తెలంగాణా సామాజిక సంబంధాలు ఉద్యమం పార్శ్వాలను చిత్రించే తెలంగాణ రచయితలు వ్రాసిన కథలు బ్రిటీషాంధ్రులకు పరాయి ఇతివృత్తాలుగా అనిపించి ఆమోదాన్ని పొందలేక పోయాయి. తెలంగాణ సామాజిక చారిత్రక భౌగోళిక సందర్భాన్ని వాళ్ళు అర్థం చేసుకోలేకపోయారు. దానితో ఆ కథలు వాళ్ళ అవగాహనకు దూరమయ్యాయి. ఆ విధంగా సురవరం తెలంగాణ సామాజిక రాజకీయ ప్రభుత్వాంగాలకు సంబంధించిన ఇతివృత్తాలను ఎన్నుకొని కథలు వ్రాసాడు. సురవరం కథలు సరళమైన ఇతివృత్తాలతో (Plot) సూటిగా విషయాన్ని చెప్పేయిగా వుంటాయి. రచయిత కథనం పాత్ర సంభాషణలతో కథను నడిపించాడు. రచయిత మధ్యలో ప్రవేశించి "మనమిప్పుడు చూచెదము" వంటి మాటలనటం సురవరం కథల్లో లేదు. దానితో కథలు ప్రత్యక్ష అప్రత్యక్ష కథనాలతో చక్కని కథన శిల్పంతో వున్నాయి.

"వింత విడాకులు" కథలో నంబి నర్సిములు మనోవేదనను చిన్న హుసేనప్ప, మల్లమ్మల ఆలోచనలు సురవరం చాలా చక్కగా వర్ణించాడు. "నిరీక్షణము, వింత విడాకులు" కొంచెం పెద్ద కథలుఅయినా విసుగు పుట్టించేంతగా లేవు. సురవరం కథలు పేజీలకొద్దీ లేకుండా నిజంగా "చిన్న కథలు" అని అనిపించుకుంటాయి.

సురవరం కథల్లోగాని, పత్రికా సంపాదకీయాల్లోగాని, వ్యాసాల్లోగాని చాలా సరళమైన భాషను శైలిని ప్రయోగించాడు. కథల్లో తెలంగాణ నుడికారంతో కూడిన భాషను వాడాడు. అక్కడక్కడ ఉర్దూ పదాలను ముఖ్యంగా ప్రభుత్వపాలన, కోర్టు వ్యవహారాల సందర్భంలో ఆనాడు వ్యాప్తిలో వున్నదాన్నిబట్టి ఉర్దూపదాలను ఎక్కువగా వాడాడు. కథల్లో మాత్రం ప్రజాసామాన్యంలో వ్యాప్తిలో వున్న నౌకరి ఖాళీ, మస్తు, ఖజానా, వాపసు, జిమ్మా, జమా అయినారు. ముక్తసరు వంటి ఉర్దూ పదాలను ప్రయోగించాడు. "ఎక్కా (జట్కా). కొట్టడు (అర్ర) ఏట (మేక) భక్ష్యాలు, పైకం, ఏరాలు, మనుం (పెండ్లి), ఊర్కనే మొదలైన తెలంగాణా పదాలు సురవరం కథల్లో కనిస్తాయి. "కలబలుకుకొని, ఓర్చుకోరానంత గాఢమైన ప్రేమ నాటుకపోయింది, ఎవరిబాట పట్టుకొని వారుపోయి, ఎన్నడు కంపగొట్టిలేచిపోతుందో, వానా కాలపు చెలిమవలె, నీవెట్లా ఏగుతున్నావో, ఓవుకోలేరు, ఆ ముచ్చట మాత్రం నన్నడుగొద్దు, చూచేదానికని బయలు దేరాడు-వంటి తెలంగాణా పలుకుబడులు, జాతీయాలు, నానుడులు సురవరం కథల్లోని భాషలో కన్పిస్తాయి సురవరం ప్రయోగించిన భాష శైలి తెలంగాణ ప్రామాణిక భాషగా గుర్తించాలి. ఆయన భాషలో శైలిలో ఎక్కడా సమాసా లుండవు. అర్థంకాని గందరగోళం వుండదు. భాషశైలి వాడటం ఒక లక్షణంగా గుర్తింపబడింది. ఈ దృష్టితో సురవరం కథలు సలక్షణంగా వున్నాయి. సురవరం ఎక్కడా "దిద్దుబాటు"లో లాగా "కొసమెరుపు" కోసం ప్రయాసపడలేదు. యథార్థజీవిత చిత్రణయే అతని కథల్లోని లక్షణం. ఒక్కొక్క కథలో ముగింపు ఇతివృత్తాన్ని బట్టి వేరువేరుగా వుంటుంది. ఆ విధంగా సురవరం కథలు వాస్తవికత యథార్థ చిత్రణలతో కూడినయి. ఊహా కల్పనలు అనుభూతాత్మకతలు (Impressionism) లేనివి. సమకాలిక సమాజాన్ని రికార్డు చేసేయి. సామాజిక చైతన్యాన్ని కల్గించేయి.

**సురవరం కథలు సరళమైన ఇతివృత్తాలతో (Plot) సూటిగా విషయాన్ని చెప్పేయిగా వుంటాయి. రచయిత కథనం పాత్ర సంభాషణలతో కథను నడిపించాడు. రచయిత మధ్యలో ప్రవేశించి "మనమిప్పుడు చూచెదము" వంటి మాటలనటం సురవరం కథల్లో లేదు. దానితో కథలు ప్రత్యక్ష అప్రత్యక్ష కథనాలతో చక్కని కథన శిల్పంతో వున్నాయి.**




# సంకెళ్ళు లేని స్వేచ్ఛను స్వప్నించిన చలం

**1894-1979**

## కేతు విశ్వనాథరెడ్డి

> చలం వాస్తవికవాదం గురజాడలాగా, శ్రీపాదలాగా సంస్కరణ విమర్శక వాస్తవిక వాదం కాదు. అది క్రియాశీల కాల్పనికావేశంతో కూడిన విప్లవ సదృశ్య వాస్తవికవాదం. వీరేశలింగం సంఘ సంస్కరణోద్యమాన్నీ, బ్రహ్మసమాజ భావాలనూ, గాంధీ జాతీయోద్యమాన్నీ ప్రేమించి, ధిక్కరించి ఒక తాత్విక సంవేదనతో సాగించిన వాస్తవికవాదం చలానిది తెలుగు కథా రచయితల్లో చలానిది ఒక ప్రత్యేక మార్గం. అది ఒక విధంగా విగ్రహవిధ్వంసం మార్గం.

**శ్రీశ్రీ** మహాప్రస్థానం ప్రియులకు, మహాప్రస్థానానికి చలం రాసిన యోగ్యతాపత్రం, సౌందర్య పిపాసులకు చలం రాసిన 'ప్రేమలేఖలు' ఇష్టం, సుఖవాదులకూ, అంతర్ముఖులైన భావుకులకూ చలం మ్యూజింగ్స్ ఇష్టం. ఆత్మీయం. స్త్రీవాదులకు ఆయన కథలు, నవలలు, నాటకాలు ప్రియం. చలం ఆత్మకథ పాఠకులకూ, అన్వేషకులకూ, వరం. ఆధ్యాత్మిక వాదులకు చలం సుధ, యశోద గీతాల్లోని భక్తీ సరళ మార్మిక ఛాయలూ ఇష్టం. చలం మిత్రులకు రాసిన లేఖలు లేఖా సాహిత్య పరిశీలకులకు ఇష్టం. తెలుగు సాహిత్య జీవులందరికీ జలపాత సదృశ్యమైన చలం శైలి ఇష్టం. తెలుగు సాహిత్యంలో చలం ఒక ఉప్పెన. ఆధునిక భారతీయ సాహిత్యాల్లో ఒక గర్వకారణం.

"చలంగారి రచనలు, పాతకాలపు సాంఘిక నీతినీ ఆచారాలనూ తూర్పారబెట్టాయి." అని కొడవటి గంటి కుటుంబరావు అన్నారు. ఆయన గుడిపాటి వెంకటాచలం గారి రచనలు అనే ఒక ప్రత్యేక వ్యాసాన్ని కూడా రాశారు. ఆ వ్యాసంలో "ఇన్స్పిరేషన్ లేక ఉద్రేకంలో రాస్తున్న తెలుగువారిలో మణకదువేడ" నిగ కుటుంబరావు అంటారు. కథాఘట్టం "యొక్క మూడ్" అనుసరించి అక్కడికక్కడ వర్ణనల్లో ఆయనకు మాటలు దొర్లి వస్తాయి. ఇది దాదాపు 'జీనియస్" ఈ జీనియస్ అనేకమంది కవులకు కూడా ఉన్నట్టు కనిపించదు అని కూడా కొ.కు. అంటారు. 1937లో రాసిన వ్యాసం అది. 1968లో మహానుభావుడు అని చలంమీద రా.రా ఒక వ్యాసం రాశారు. ఆ వ్యాసంలో చలమేలేకపోతే మన సాహిత్యంలో వాస్తవికవాదం ఇంతబలంగా వుండేది కాదు అని రా.రా. అంటారు. "చలం గొప్పతనమంతా ఆయన విప్లవాత్మకమైన భావాల్లో" ఆ భావాల వెంటవున్న అగ్ని పర్వత సదృశ్యమైన ఆవేశంలో ఉందని రారా చెబుతూ ఆ మాట అంటారు. "యే కళానియమాలూ పాటించకుండానే సాహిత్య గుణం సంపాయించుకున్న రచనలు చేసినందుకు సకల కళానియమాలూ భగ్నం చేసి కూడా పాఠకుల మన్ననలు పొందగల రచనలు చేసినందుకు ఆయన్ను పొగడవలసింది" అని అంటే చలం, కథను ఒక వాస్తవికవాద భావవాహికగా భావించాడన్నమాట. అయితే చలం వాస్తవికవాదం గురజాడలాగా, శ్రీపాదలాగా సంస్కరణ విమర్శక వాస్తవిక వాదం కాదు. అది క్రియాశీల కాల్పనికావేశంతో కూడిన విప్లవ సదృశ్య వాస్తవికవాదం. వీరేశలింగం సంఘ సంస్కరణోద్యమాన్నీ, బ్రహ్మసమాజ భావాలనూ, గాంధీ జాతీయోద్యమాన్నీ ప్రేమించి, ధిక్కరించి ఒక తాత్విక సంవేదనతో సాగించిన వాస్తవికవాదం చలానిది తెలుగు కథా రచయితల్లో చలానిది ఒక ప్రత్యేక మార్గం.

అది ఒక విధంగా విగ్రహవిధ్వంసం మార్గం.

చలం ఎక్కువగా స్త్రీపురుష అసమ సంబంధాల గురించి కథలు రాశారు. మన సమాజంలోని నీతి, పాతివ్రత్యం, దాంపత్య ధర్మాలు అనేవాటిలోని కూట స్వభావాన్ని విమర్శించారు. మహిళల లైంగిక స్వేచ్ఛకు, మాతృత్వ స్వాతంత్ర్యానికీ, నిశ్చేతన శ్రమకూ, పరాధీనతకూ, పరాయీకరణకూ, కుటుంబ సామాజిక హింసలకూ వ్యతిరేకంగా చలం కథలు రాశారు. సకల పితృస్వామిక సమాజ దుష్ట లక్షణాలనూ, సనాతన సంప్రదాయాలనూ కరకుగా, వ్యంగ్యంగా పాఠకుని హృదయాన్ని తీవ్ర భావ సంక్షుభితం చేసే" ఆవేశబలంతో చలం కథలు రాశారు. ఊపిరి తీసుకోలేని అనితర సాధ్యమైన శైలిలో రాశారు.



చలం రాసిన కథలు రమారమి నూటికి పైగా ఉంటాయి. చలం కథల్ని ప్రచురించడానికి కొన్ని పత్రికలు నిరాకరించిన సందర్భాలున్నాయి. పత్రికల్లో కథలు వస్తున్న నాడు దుమారాలు చెలరేగాయి. కొందరిని చాటుమాటుగా చదువుకునేట్లు చేశాయి. స్త్రీ పురుష సంబంధాలచిత్రణలో చలం కోరిన స్వేచ్ఛ స్త్రీ పరంగా ఉద్రేకం మండుతూ రాసిన రాతలు, హృదయాలను కల్లోలపరిచాయి. అవేవో సొంత విషయాల్లో, కుటుంబ విషయాల్లో జోక్యం కలగ చేసుకున్నట్లు కొందరు భావించారు. అనుకున్న వాటిని బజారుకీడ్చి చర్చకు పెట్టడం చలం నేరమైంది. చలం కథలుతీవ్ర సంచలనాన్ని రేపాయి. తమనీడను తామే చూసుకుని భయంతో నిలువునా ఒణికేటట్లుచేశాయి.

**చలం రాసిన కథలు రమారమి నూటికి పైగా ఉంటాయి. చలం కథల్ని ప్రచురించడానికి కొన్ని పత్రికలు నిరాకరించిన సందర్భాలున్నాయి. పత్రికల్లో కథలు వస్తున్న నాడు దుమారాలు చెలరేగాయి. కొందరిని చాటుమాటుగా చదువుకునేట్లు చేశాయి.**

చలం తనకథల్లో చర్చకు పెట్టిన కొన్ని అంశాల గురించి ఆలోచిద్దాం. ఒక అంశం: పురుషుడికి లాగానే స్త్రీకి తన శరీరం మీద తనకు హక్కు ఉంది. అని. సంప్రదాయం పేర యాంత్రికంగా తయారైన శోభనం రాత్రి, భర్త హింసకు గురి అయిన ఒక యువతి జీవితంలో వచ్చిన పరిణామాలను 'భార్య' అనే కథ చిత్రించింది. తన ఒళ్ళు తనది కాకుండా చేసిన నాగరికత మీద ద్వేషం కలుగుతుంది. 'ఆమె త్యాగం' లోని ప్రధాన పాత్ర వేశ్య ప్రియుడి జబ్బును నయం చేయించడం కోసం అయిన వైద్య ఖర్చుల్ని భరించలేని దుస్థితి ఆమెది. డాక్టర్ వైద్యాన్ని ఉచితంగా చేయడం ఇష్టంలేదు. డాక్టర్ కోరిన శరీరాన్ని చివరకు అప్పగించాలనుకుంటుంది. కానీ ఆమె త్యాగం డాక్టరుకు కనువిప్పు కలిగిస్తుంది. శారీరక కాంక్షకూ, వాత్సల్యానికీ, ప్రేమ విలువలకూ మధ్య తారతమ్య భేదాలను ఈ కథ చాటి చెబుతుంది.

చలం చర్చకు పెట్టిన మరొక అంశం : స్త్రీల కుండే బిడ్డలు కనే హక్కు తల్లి బిడ్డను కనడం, కనిన బిడ్డ మీద వారసత్వంగా పురుషుడికి హక్కు లభించడం మీద రాసిన కథ 'నాయుడుపిల్ల' ఈ కథలోని తల్లి తన గుండెల్ని పిండే ప్రశ్నలు వేస్తుంది. పాలు విడవని పాపను, కన్ను తెరవని పాపను, తల్లి దేహంనుంచి కోసివేసి తల్లి పేగు తుంచి వేసే చట్టాన్ని ఆ తల్లి ప్రశ్నిస్తుంది.

'ఆర్గ్యుమెంటు' కథ గర్భవిచ్ఛిత్తి సమస్యను చిత్రించిన కథ. గర్భవతి అయిన స్త్రీ బిడ్డను కనడమో, కనకపోవడమో, ఆమె ఆర్థికస్థితిగతుల మీదా, ఇష్టానిష్టాల మీదా ఆధారపడి ఉంటుందన్న అంశాన్ని ఈ కథ చర్చిస్తుంది.

సంస్కరణోద్యమం తాకని ఒక వితంతువు కథ 'శేషమ్మ' కథ చదివాక శేషమ్మ లాంటి వితంతువులు వికృత మనస్తత్వాన్ని అలవరుచుకోక తప్పని కుటుంబ సామాజిక దురన్యాయాలమీద మనకు మంట పుడుతుంది. సంస్కరణోద్యమ ప్రభావంతో ఏర్పడిన అసంబద్ధ స్త్రీ జనోద్ధరణ భావాలు, వితంతు వివాహాలు జరిగినా, అవి ప్రేమలేని డొల్ల అని నిరూపించే కథ 'జలసీ'. వితంతువును పెళ్ళాడడం కీర్తి కాంక్షో, మరొక ప్రేరణో కావచ్చు. పెళ్ళాడాక చచ్చిపోయిన మొదటి భర్తను నిత్యం జ్ఞాపకం చేస్తూ, అసూయతో కుళ్ళుపోతుగా భార్యను ప్రతిక్షణం క్షోభకు గురిచేయడం ఎంతటి బాధాకరమో ఈ కథ చిత్రిస్తుంది. ఆదర్శాల మాయ, మత్తు వేరు, గుండె నుండి ఉబికే ప్రేమ

వేరు.

స్త్రీ నిస్సహాయ స్థితినీ, పీడననూ చిత్రించిన కథ 'రెడ్డి రంగమ్మ' పల్లెటూరి రంగమ్మ శీలం బస్తీ నాగరికతా లక్ష్మికి బలి అయిన దుర్ఘటన ఈ కథలో చిత్రితమైంది.

చలం సామాజిక రాజకీయ, సాంస్కృతికోద్యమాలలో ఎప్పుడూ, మమేకం కాలేదు. వాటిని కొన్ని సందర్భాలలో సానుభూతితో చూసినా, వాటిలో లోపాలే ఎక్కువగా ఆయనకు కనిపించాయి. ఆయన కాల్పనికావేశంలో ప్రతిదాన్ని ప్రశ్నించడం ఒక భాగం. ఆయన వాస్తవిక చిత్రణలో ప్రతీదాన్ని వివేచించడం, తర్కించడం ఒక గుణం. అయితే జాతీయోద్యమంలోని వ్యక్తుల త్యాగాలు ఆయన్ను ఆకర్షించాయి. గాంధీలోని చిత్తశుద్ధి ఆయన్ను కదిలించింది. ఆ ఉద్యమంలో కొందరి త్యాగనిరతినీ, నిజాయితీనీ చలం కాదనలేకపోయాడు. బహుశా ఉద్యమాల మీద ఆయన రాసిన రెండు మూడు కథల్లో 'సుశీల' కథను పేర్కొనాలి. వ్యక్తి ఆకర్షణకూ, దేశ ప్రేమకూ మధ్య ఉండే తేడానూ, వ్యామోహానికీ, త్యాగానికీ మధ్య ఉండే భేదాన్నీ సుశీల కథ చర్చిస్తుంది. జాతీయోద్యమంలో డబ్బునూ, ఆరోగ్యాన్ని కోల్పోయిన భర్త, ఆకర్షించిన ప్రియుడికంటే ప్రేమాస్పదుడుగా కన్పించడం సుశీల వ్యక్తిత్వంలోని విశేషం. ఇదే చలం 'ప్రేమ పర్యవసానం' కథలో ఉద్యమాల్లో చేరిన స్త్రీల నియంత్రణను చిత్రించారు. 'హరిజనోద్ధరణ' కథలో ఉద్ధరణ అనేది యాంత్రికంగా అమలు జరిపే ఒకమార్పు అని అభిప్రాయపడ్డారు.

చలం కథల్లో 'ఒక పువ్వు పూసింది' విశిష్టమైంది. అది ఆయన ప్రాతినిధ్య కథ కూడా. స్త్రీ జీవితంలోని వివిధ దశల్ని ప్రకృతిలోని పుష్ప జీవిత దశలుగా ఈ కథలో చలం అమిత ఉద్వేగంతో చిత్రించారు. ఈ కథ ఒక భయంకరాకర్షణ.

చలం కథల్లో 'ఒక పువ్వు పూసింది' విశిష్టమైంది. అది ఆయన ప్రాతినిధ్య కథ కూడా. స్త్రీ జీవితంలోని వివిధ దశల్ని ప్రకృతిలోని పుష్ప జీవిత దశలుగా ఈ కథలో చలం అమిత ఉద్వేగంతో చిత్రించారు. ఈ కథ ఒక భయంకరాకర్షణ.

చలం తన కథల ద్వారా సాధించిన పరమార్థం ఏమిటి? అని చాలామంది ప్రశ్నించారు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన 'అసత్యాలను తీవ్రంగా ఖండించారు' వ్యక్తి స్వేచ్ఛనూ వికాసాన్నీ చాటి చెప్పారు. కథాశిల్పం మీద చలం దీక్షగా దృష్టిపెట్టలేదు. 'ఉత్తమ పురుష' లో ప్రధమపురుషలో కథ రాయడం' మిత్రుల అనుభవాలను కథా రూపంలో రాయడం ఆయన ఎక్కువగా చేశారు. చాలా కథల్లో చలం సూటిగా కథ చెప్పరు. కొన్ని కథల్లో చలం ప్రస్తావన మాటమాటికీ వస్తుంది. పాపఫలాలు కథలో ఒకచోట ఉన్న చలం ప్రస్తావనను ఉదాహరణగా తీసుకోవచ్చు. "కథలోకి ఇద్దరు ఆడవాళ్ళను తీసుకొచ్చి చలం ఇంత సేపూ ఊరుకున్నాడేం? అని తొందరపడుతున్నారా? వొస్తున్నాను. పాఠకులను నిరాశపరిచే పాపం కట్టుకోను" ఇది నిస్సందేహంగా కథా కథనాన్నీ, వాతావరణాన్నీ, పాఠకుడి మనస్థితిని చెదరగొట్టే రచయిత జోక్యం 'తెలుగు నవల' అనే నాటిక రాసి ఆనాటి నవలల్లోని ఇట్లాంటి ధోరణిని విమర్శించిన చలం, ఆవేశగుణం వల్ల రచనా నిగ్రహం కోల్పోయారు. అయితే వర్ణనల్లో – కథా ఘట్టాన్ని అనుసరించి సాగే వర్ణనల్లో మన భావుకత్వాన్ని నిశితం చేసే శబ్ద ప్రపంచం ఉంటుంది. చలం కంఠస్వరంలోని కోపం, ఆవేశం, వ్యంగ్యం, హాస్యం, చెణుకు మనల్ని ఆకర్షిస్తాయి.

స్త్రీ వాద ఉద్యమానికీ, ఇరుకులేని స్వేచ్ఛకూ తన కథల ద్వారా తలుపులు తెరిచిన చలం భారతీయ సాహిత్యాల్లో ఒక గొప్ప ప్రభావ శక్తి.

## సామాజిక న్యాయవాది

**(1922-1993)**

తాను రాస్తున్న కాలంలోని యువ పాఠకుల్నీ, యువ రచయితల్నీ అయస్కాంతంలాగా ఆకర్షించిన రచయిత రాచకొండ విశ్వనాథశాస్త్రి. యువతరానికి ఒక్కడే రావిశాస్త్రి. వారి దృష్టిలో ఆయన ఆరాధ్యుడైన మహారచయిత. అనుసరణీయుడైన కథాశిల్పి. మరొక రకంగా చెప్పాలంటే కళ్లు

చెదరగొట్టి రచనలోకి లాక్కునే రచనా కాంతి మండలం. కవిత్వంలో ఒకప్పుడు దేవులపల్లి కృష్ణశాస్త్రిలాగా, శ్రీశ్రీలాగా, వచన కల్పనా సాహిత్యంలో చలం లాగా, రావిశాస్త్రి ఎందువల్ల 1960, 1970 దశకాల్లోని యువతరాన్ని ప్రభావితం చేసినట్లు?

మాటల్లోనే కృష్ణశాస్త్రి మనసున మల్లెలు పూయించాడు. ఆ లాలిత్యం, ఆ కాల్పనిక భావుకత ఒకప్పటి ఆదర్శం. శ్రీశ్రీ ప్రపంచాగ్నినీ, ప్రపంచార్తినీ, అపూర్వమైన శబ్దశక్తితో మండించాడు. పలికించాడు. అది అప్పటి కవితాజ్వాలా మార్గం. చలం స్త్రీ పురుష సంబంధాల్లో పుట్టిన రాచపుండుకు శస్త్రచికిత్స బహిరంగంగా చేశాడు. అది ఆరాధనీయమైంది. 1960, 70 తరానికీ, తమ విషాదాన్నీ తమ తిరస్కృతినీ, తమకాలంలోని నిజాన్నీ తీవ్రమైన కోపంతో, ఉద్వేగంతో, ప్రతిభతో, చిత్తశుద్ధితో, వచనాన్ని "కవిత్వంగా కూడా మార్చగలిగిన అసాధారణ శక్తితో తెలిపే ఒక సామాజిక న్యాయవాది. ఆయనో రచనా మార్గాన్ని ఆవిష్కరించారు. అనుసరించారు. కొందరికి ఆయన ఒక నిగూఢ ప్రశ్నగా కూడా కన్పించారు.

రావిశాస్త్రి రచయితగా పుడుతూనే దీప్తి పుంజంలో పుట్టలేదు. ఆయన సాహిత్య దృష్టినీ, సాహిత్య శిల్పాన్ని, సాహిత్య లక్ష్యాన్నీ జీవితానుభవాల్లో భాగంగా సహజ పరిశీలనలో అనుభవాల మదింపులో భాగంగా ఏర్పరచుకుంటూ వెళ్ళారు. దీనికి సమకాలిక సాహిత్యోద్యమాలూ, తాను చదివిన సాహిత్యమూ, తన న్యాయవాద వృత్తీ దోహదపడ్డాయి.

1965 నవంబరులో రావిశాస్త్రి 'ఎందుకు రాసేను' అనే ఒక వ్యాసం వచ్చింది. రచయిత పరిణామక్రమం ఆ వ్యాసం ద్వారా మనకు తెలుస్తుంది. అప్పటికే 1952లో ఆయన 'అల్పజీవి' నవల వచ్చింది. అది ఒక నవలా ప్రయోగంగా ప్రసిద్ధిపొందింది. ఈ నవలలోని కథా వస్తువు ఆత్మన్యూనతాభావం. ప్రధాన పాత్ర భయస్థుడైన సుబ్బయ్యా ఒక అధీర నాయకుడు. కథన శిల్పం చైతన్య స్రవంతి ధోరణి. సుబ్బయ్య తన పిరికితనాన్నీ, నంగిరి పింగిరి లక్షణాన్నీ, భయాన్నీ, క్రమంగా దూరం చేసుకోగలిగిన సంస్కారం వైపు వెళ్లగలుగుతాడనే సూచనతో నవల ముగుస్తుంది. ఆయన రాసిన 'కష్టార్జితం' 'ఆఖరి దశ', 'విలువలు' అనే కథలు అంతకు ముందే వచ్చాయి. 'కోర్టుకు రాని సాక్షులు' మొదలుకొని 'మెరుపు మెరిసింది' దాకా 24 కథలు 1952 జూన్ - 1961 జనవరి మధ్యకాలంలో వెలువడ్డాయి. 1961లో ఆరుసారా కథలు వచ్చాయి. మరో ఇరవై కథలు 1961 ఆగస్టు - 1968 మార్చి మధ్యకాలంలో వచ్చాయి. 1957-68 మధ్యలో రావిశాస్త్రి తిరస్కృతి, నిజం, విషాదం నాటకాలు వెలువడ్డాయి. 1968-1993 మధ్యకాలంలో 'రాజు-మహిషి, ప్రేమ మనిషి' 'రత్తాలు - రాంబాబు' 'సొమ్ములు పోనాయండి', 'మూడు కథల బంగారం', 'ఇల్లు' అనే నవలలు వచ్చాయి. 'ఏడో చంద్రుడు' ఆయన చిట్టచివరి అసంపూర్ణ నవల.

**తాను రాస్తున్న కాలంలోని యువ పాఠకుల్నీ, యువ రచయితల్నీ అయస్కాంతంలాగా ఆకర్షించిన రచయిత రాచకొండ విశ్వనాథశాస్త్రి. యువతరానికి ఒక్కడే రావిశాస్త్రి. వారి దృష్టిలో ఆయన ఆరాధ్యుడైన మహారచయిత. అనుసరణీయుడైన కథాశిల్పి. మరొక రకంగా చెప్పాలంటే కళ్లు చెదరగొట్టి రచనలోకి లాక్కునే రచనా కాంతి మండలం.**

రావిశాస్త్రి పదమూడేళ్ళ వయసులో గలివర్స్ ట్రావెల్స్‌లాంటి రచననూ, డిటెక్టివ్‌లనూ రాయాలనుకున్నారు. 1938, 1939 అంటే పదిహేడేళ్ళ వయసులో ఆరకం రాశాడు కూడా. ముందు రాసిన రచనలన్నీ సాహిత్యం మీద అభిరుచి ఉన్న, ఒక యువకుడి ఉత్సాహజనితాలే. అప్పటికే ఆయనకు గురజాడ అన్నా, శ్రీశ్రీ అన్నా, చెహోవ్ అన్నా, చార్లెస్ డికెన్స్ అన్నా ఇష్టం. డికెన్స్ అంటే ఆయనకి ఆరాధన. ఈ తొలి నాళ్ళ రాతలూ, చదువులూ శిక్షణా ఆయనకు తర్వాత తర్వాత ఎంతో ఉపయోగపడ్డాయి.

1961కి ముందురాసిన కథల్లో జీవితంలోని విషాదం ప్రధాన వస్తువు. ఈ కథల్లో కింది మధ్య తరగతికీ, పేదలకూ, వేశ్యలకూ సంబంధించిన, బాధా సర్పద్రష్టుల ఈతిబాధలూ, దైన్యమూ, ఖేదమూ, వాటిని ఎదుర్కోలేని, ఎదుర్కొంటే బాగుండుననే తృష్ణిహింసాత్మక మనస్తత్వ చిత్రణా కన్పిస్తాయి. అవి శ్రీశ్రీ

కవిత్వంలో లాగా పరాజితుల చిత్రాలు. చెదిరిన గుండెలు నదిమే అవతల ఇవతల అందుకైన ఇరుల చిత్రాలు. బాటసారి, భిక్షువర్షీయసి, ఉన్మాది, సంధ్యా సమస్యలు లాంటి శ్రీశ్రీ కవితల్లోని వేదనాత్మక చిత్రాలు.

ఈ కథల్లోని కథా కథనమూ, పాత్రల అంతరంగ చైతన్య చిత్రణా, సరళ వాక్యాల్లో సాగే ఉద్వేగశైలీ, అనుభవాల మద్యపోలికలు తెల్పే ఉపమలూ, ఒక నిర్మాణ సౌందర్యంతో కవిత్వం రూపం ఇవ్వలేని వస్తు, పాత్ర గతమైన ఆలోచనా దృష్టినీ, కథా వాతావరణ పరమైన అనుభూతులనూ ఇస్తాయి. ఈ కథల్లో ముఖ్యంగా ప్రస్తావించుకోవలసినవి: 'కార్నర్ సీటు' 'జరీ అంచు తెల్లచీర', 'విలువలు', 'ఇద్దరు పిల్లలు', 'మూడుస్థలాల్లో', 'పువ్వులు', 'మెరుపు మెరిసింది' అనే కథలు.



కథల్లోని కథా కథనమూ, పాత్రల అంతరంగ చైతన్య చిత్రణా, సరళ వాక్యాల్లో సాగే ఉద్వేగశైలీ, అనుభవాల మద్యపోలికలు తెల్పే ఉపమలూ, ఒక నిర్మాణ సౌందర్యంతో కవిత్వం రూపం ఇవ్వలేని వస్తు, పాత్ర గతమైన ఆలోచనా దృష్టినీ, కథా వాతావరణ పరమైన అనుభూతులనూ ఇస్తాయి.

'కార్నర్ సీటులో' కూర్చున్న ఒక పచ్చకోటువాడి మీద అసూయాద్వేషాలను పెంచుకున్న ప్రయాణీకుడు, ఆ పచ్చకోటువాడి ఆత్మహత్యను చూసి చలించిపోతాడు. మనిషైన అతనికి ఆనందంగా కన్పించే ప్రపంచాన్ని చూసి ఆనందించే అవకాశం పచ్చకోటు వాడికి లేకపోయిందే అని దిగులుపడడం, కార్నర్ సీటు వస్తువు. 'జరీ అంచు తెల్లచీర' విశాలాక్షి తీరని కోరిక నుంచి పుట్టిన విషాద చిత్రణ. ఆకలి తీర్చుకోవడం కోసం రూపాయన్నరకు శరీరాన్ని అమ్ముకున్న ఒక అభాగిని చిత్రణ 'విలువలు' పిల్లల అవసరాలను దరిద్రం కారణంగా ఏ మాత్రం చూడలేని తల్లుల జీవనఘోష 'ఇద్దరు పిల్లలు', సెషన్ కోర్టులో హత్య కారణంగా విచారణలోని ఖైదీ, పారిపోడానికి ప్రయత్నించీ గుండు దెబ్బ తగిలి ఆస్పత్రిలో చికిత్స పొంది, సెంట్రల్ జైల్లో ఉరికి గురైన మూడు స్థలాల చిత్రణ 'మెరుపు మెరిసింది', ముప్పయి ఐదేళ్ల అవివాహిత నీరజ గడ్డ కట్టిన గుండెబంధం, రాటుదేలిన స్వభావ చిత్రణ. లేమి, అశాంతి అయోమయం, ఈరకం సమస్యలు రావిశాస్త్రి ఇతర కథల్లో చిత్రితమయ్యాయి.

1961కి ముందే రావిశాస్త్రి రాజ్యయంత్రాంగాన్ని ఆడించే వారి మూలంగా జరిగే అన్యాయాన్ని గుర్తించారు. 1952లో ఆయన రాసిన కోర్టుకు రాని సాక్షులు అనే కథ దీనికి దృష్టాంతం. ఒక స్త్రీతో కాపురం చేసి, కొడుకును కూడా కని, ఆ స్త్రీని మరొకరి భార్యగా సాక్షాలు చెప్పించిన ఒక పలుకుబడిగల ఆసామీ, సత్యంగా మారిన ఒక అసత్యానికి బలి అయిన ఒక అభాగిని ఈ కథలో కన్పిస్తారు. మరొక పార్శ్వంగా అధికారి అనే కథలో పోలీసు యంత్రాంగంలోని కొందరు వ్యక్తుల జులంను చిత్రించారు. ఇవన్నీ రావిశాస్త్రి సారో కథలు, కథా చిత్రాలు.

తెలుగుకథా సాహిత్యంలో 'సారా కథలు' ఒక మలుపు. రావిశాస్త్రి, అంతకుముందు కథా రచయితలు స్పృశించని ప్రాంతీయ సామాజిక వర్గాలకు సంబంధించిన వ్యక్తులను పాత్రలుగా తన కథల్లో మలిచారు. న్యాయం, పోలీసు యంత్రాంగాలలోని విధానాల లోపాలను బహిర్గతం చేశారు. అధో జగత్తులోని భాషకూ, యాసకూ, సాహిత్య గౌరవాన్ని కల్పించారు. తాగుబోతులూ దొంగ సారా సామ్రాజ్యంలోని దొరలూ, పేదలూ, దేశ దిమ్మరిగాళ్లూ, తార్పుడు గాళ్లూ, వేశ్యలూ కథల్లోకి వచ్చారు. పేదల వ్యతిరేక చర్యలూ, తీర్పులూ వెలుగులోకి వచ్చాయి. నేర విచారణలోని లొసుగులు బయటికి వచ్చాయి. సారా రాజ్యంలో సామాజిక భీభత్సాన్ని సారా కథలు చిత్రించాయి. ఈ కథల్లో "సంఘాన్ని ప్రస్తుతం, కనిపించే శక్తుల దుర్మార్గంలో దౌర్జన్యమూ, దోపిడీ, అబద్ధం, అన్యాయం" స్పష్టంగా కన్పిస్తాయి. వాటిపట్ల వాటిని నివారించే పేదవాడికి సాయం చెయ్యలేని దేవుడి పట్లా విసుగూ, దుఃఖమూ కన్పిస్తాయి. 'పాపి', 'మాయ', 'న్యాయం', 'మోసం', 'పుణ్యం', 'మోక్షం', అనే ఈ ఆరు సారా కథలు మానవులు మానవుల్ని

పెట్టే బాధల్ని చిత్రించడమే కాకుండా, మానవుల్లోని వర్గ స్వభావాన్ని సైతం ఎత్తి చూపాయి.

1961 తర్వాత రావిశాస్త్రి రాసిన కథలు 'మంచి చెడ్డల్లో ఏ కథ?' 'కుక్కపిల్ల' 'అగ్గిపుల్ల', 'సబ్బుబిళ్ళ', 'అరటి తొక్క', 'బల్లచెక్క', 'రొట్టెముక్క', 'హారతి పళ్ళెం', 'తలుపుగొళ్ళెం', అనేవి ఇవిగాక 'ఎండ', 'పిపీలికం', 'వెన్నెలరవ్వ', 'వేతనశర్మ కథ', అనేవీ ముఖ్యమైనవి. పులివైపు ఉండాలో, పులిపవర్లు, అని పిలిచే ఫుల్ పవర్స్ వైపు ఉండాలో, మేకవైపు ఉండాలో, అట్లాగే మంచివైపు ఉండాల్లో చెడ్డవైపు ఉండాలో, నక్కను సమర్థించాలో, కోడిపిల్లల్ని కాపాడాలో, పులిమార్కు సిగరెట్లు నమ్మాలో, గొర్రెమార్కు సిగరెట్లు నమ్మాలో, కొంగల్నీ, పాముల్నీ నమ్మాలో, చేపల్నీ, చలిచీమల్ని విశ్వసించాలో రావిశాస్త్రి తన కథలద్వారా పాఠకులను తీవ్రమైన ఆలోచనలకూ, ఉద్వేగాలకూ గురిచేస్తాడు. మధ్య తరగతి, దిగువ మధ్యతరగతిలోని జీవన సంఘర్షణను ఒక వైపు చిత్రిస్తూ, మరొకవైపు జీతాల మీద చూపున్న ఉద్యోగవర్గాన్ని నిశితంగా విమర్శకు గురిచేస్తారు. ఈ కథల్లో రావిశాస్త్రి 'నేనెందుకు రాసేను' వ్యాసంలో చెప్పినట్లు "పేదవాళ్లను చాలా మటుకు" క్షమించారు. "డబ్బున్నవాళ్ల తప్పుల్ని క్షమించలేదు". "తెలిసి కూడా తన సాటివాడికి ద్రోహం చేసే పేదవాళ్లను" క్షమించలేదు. "డబ్బు సంపాదించేక పేదవాళ్లని" మర్చిపోయిన పేదవాళ్లని క్షమించలేదు."

రావిశాస్త్రి కథల లక్ష్యం సామాజిక న్యాయవాదం. అంటే అది కేవలం న్యాయశాస్త్ర సూత్రాలకు చట్టాలకూ పరిమితమైందికాదు. అట్లాగే మంచి పనులు చెయ్యడం ద్వారా మోక్షం లభిస్తుందనే మతశాస్త్ర వాదం కాదు. చైనీయ తత్త్వశాస్త్రంలోని అన్ని వర్గాలనూ తప్పొప్పులుబట్టి ఫలాన్నీ, శిక్షణనూ సమానంగా ఇచ్చే సంపూర్ణ రాచరిక విధానం కాదు. అది పీడితుల, తాడితుల, పేదల తరపున న్యాయవాదం.

**రావిశాస్త్రి ప్రత్యేకత కంఠస్వరం. విసుగు, దుఃఖం, కోపం, మంట, ఆవేశం, వ్యంగ్యం, ఈ భిన్న స్వరాలు ఎప్పుడెప్పుడు ఏ సన్నివేశపరంగా, ఏ పాత్రపరంగా, కథలో సంభాషణల్లో ఎక్కడెక్కడా పలికించాలో రావిశాస్త్రికి బాగా తెలుసు.**

రావిశాస్త్రి కథాశిల్పంలో భిన్న ప్రయోగాలు కన్పిస్తాయి. కొడవటిగంటి కుటుంబరావు తర్వాత అట్లాంటి మరికొన్ని కొత్తవీ అయిన ప్రయోగాలకు మార్గదర్శి రావిశాస్త్రి. 'మంచిచెడ్డల్లో ఏ కథ'లో కథలోపలి కథలు దాగిన శిల్పం ఉంది. 'పిపీలికం' ఆధునిక కథారూపాన్ని సంతరించుకున్న నీతికథ లేదా ఒక జంతు కథ 'వేతనశర్మ' కథ ఒక అధిక్షేప కథ. షోకు పిల్లి, వ్యంగ్య కథ. 'వెన్నెల' వచన కవిత్వంలో సాగిన కథ.

రావిశాస్త్రి శైలిని గురించీ, వర్ణనలగురించీ కంఠస్వరాన్ని గురించే ఒకటి రెండు మాటలను తప్పకుండా మనం అనుకోవాలి. ఆయన శైలిలో కన్పించే సిమిలీల గురించి ప్రసిద్ధ భాష శాస్త్రవేత్త భద్రిరాజు కృష్ణమూర్తి 'రాచకొండ రచనల్లో సిమిలీ' అని ఒక ప్రత్యేక వ్యాసం రాశారు. మూర్త, అమూర్త అనుభవాల ద్వారా రావిశాస్త్రి దర్శించే పద్ధతిని వివరించారు. ఆయన వర్ణనలు కళానియమాలను ఉల్లంఘించాయని రా.రా. విమర్శించారు. రావిశాస్త్రి ప్రత్యేకత కంఠస్వరం. విసుగు, దుఃఖం, కోపం, మంట, ఆవేశం, వ్యంగ్యం, ఈ భిన్న స్వరాలు ఎప్పుడెప్పుడు ఏ సన్నివేశపరంగా, ఏ పాత్రపరంగా, కథలో సంభాషణల్లో ఎక్కడెక్కడా పలికించాలో రావిశాస్త్రికి బాగా తెలుసు.

తెలుగు సాహిత్యమూ, భారతీయ సాహిత్యాలూ గర్వించ దగిన రచయిత రాచకొండ విశ్వనాథశాస్త్రి, సామాజిక సంవేదలను మరింత నిశితం చేసిన సాహిత్య శక్తి ఆయనది.




# వాస్తవికత పునాదుల మీద రాయలసీమ కథాసౌధం

## సింగమనేని నారాయణ

ఆధునిక సాహిత్య ప్రక్రియలైన కథ, నవల, నాటికల్లాంటివి రాయలసీమలో చాలా ఆలస్యంగా ప్రారంభంకావటాన్ని చాలా మంది గుర్తించే వుంటారు. 1910-45 మధ్యకాలం నాటికే కోస్తాంధ్రప్రాంతంలో తెలుగు కథానిక వస్తువులోనూ, రూపంలోనూ కూడా గొప్ప వికాసం పొంది వుండగా, ఆ దశలో రాయలసీమలో కథానికే ఆవిర్భవించకపోవటం కొంత వింతగా అనిపిస్తుంది. ఇందుకు కారణాలు చాలానే వున్నాయి. రాయలసీమలో ఆధునిక జీవితం చాలా ఆలస్యంగా ప్రారంభం కావటమే ఇందుకు అసలు కారణమనిపిస్తుంది. పారిశ్రామిక వాతావరణం,ఆధునిక విద్య, భాష, రాజకీయాలూ, ఉద్యమాలూ క్రమంగా చోటు చేసుకుంటున్న దశలోనే ఆధునిక భావజాలం, ఆధునిక జీవితం, పరివ్యాప్తమైతాయి. నదీ జలాలు సమృద్ధిగా ఉండటం, వాటి వినియోగం, వ్యవసాయం కూడా పరిశ్రమగా పరిణమించటం, స్త్రీ విద్య, పత్రికలూ, రవాణా సౌకర్యాలూ ఈ క్రమంలో ఆధునికత ప్రారంభమౌతుంది. కోస్తాంధ్ర ప్రాంతంలో 19వ శతాబ్ది మధ్యభాగం నాటికే కృష్ణాబ్యారేజీ నిర్మాణం, నదీజలాల వినియోగం, వ్యవసాయ సంబంధాలలో మార్పులూ, ఈ క్రమంలో తెలుగుదేశంలోని ఇతర ప్రాంతాలతో పోలిస్తే, ఆ ప్రాంతం అభివృద్ధి శీఘ్రతరమై ఉండటాన్ని గుర్తించవచ్చు! ఆ కారణంగానే అక్కడ ఆధునిక విద్య సంఘసంస్కరణోద్యమాలూ, రాజకీయాలూ, చిన్నపాటి

*1910-45 మధ్యకాలం నాటికే కోస్తాంధ్రప్రాంతంలో తెలుగు కథానిక వస్తువులోనూ, రూపంలోనూ కూడా గొప్ప వికాసం పొంది వుండగా, ఆ దశలో రాయలసీమలో కథానికే ఆవిర్భవించకపోవటం కొంత వింతగా అనిపిస్తుంది. ఇందుకు కారణాలు చాలానే వున్నాయి. రాయలసీమలో ఆధునిక జీవితం చాలా ఆలస్యంగా ప్రారంభం కావటమే ఇందుకు అసలు కారణమనిపిస్తుంది.*

నాగరికతకు మూలాధారం నీళ్లు, రాయలసీమలో లేనివి నీళ్లే. నీళ్లున్న ప్రాంతాల వాళ్లకు నీళ్లు లేని ప్రాంతాల వాళ్ల ఈతి బాధలు చెబితే తప్ప అర్థం కావు. ఒక కడివెడు నీళ్లకోసం మైళ్లకు మైళ్లు నడవాల్సి రావటం, గంటల తరబడి పడిగాపులు కాయటం, నీళ్లు చాలక పైర్లు ఎండిపోవడం, వర్షాలు కురువక భూములు బీళ్లుగా ఉండిపోవడం, కళ్లారా చూస్తే తప్ప ఆ విషాదం హృదయాన్ని తాకదు. కుటుంబ జీవనం మొదలుకొని, దేశ జీవనం వరకూ ఆర్థికాన్ని శాసించేది, నాగరికతను తీర్చిదిద్దేవి నీళ్లే. తర తరాలుగా రాయలసీమ వాసులు నీళ్ల కోసం తరించిపోవటాన్ని సంఘసంస్కర్తలూ గుర్తించలేదు. రాజకీయ నాయకులు చలించలేదు. నీళ్లు భూమికగా ఈ తరం రచయితలు శరీరం గగుర్పొడిచే, హృదయాలు కంపించే ఎన్నో కథలు రాశారు.

పరిశ్రమలూ, రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల కంటే ముందుగా నెలకొన్నాయి.

గిడుగు, గురజాడలు వ్యావహారిక భాషోద్యమాన్ని నడుపుతున్న కాలంలో రాయలసీమ వాసులకు వ్యావహారిక భాష అంటే ఏమిటో తెలియదు. గురజాడ కన్యాశుల్కం రాసే నాటికి, రాయలసీమలో ఇంకా సంప్రదాయ కవితే రాజ్యమేలుతుంది. గురజాడ ముత్యాలసరాలు కూర్చేనాటికి రాయలసీమ కవులకు మాత్రాబద్ధ చందస్సులో గేయకవితా ప్రక్రియే తెలియదు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతనే పత్రికలూ, ఆధునిక విద్య బాగా అందుబాటులోకి రావటం వల్ల రాయలసీమ ప్రాంతంలో ఆధునిక సాహిత్య సంచలనం మెల్లగా ప్రారంభమైంది.

రాయలసీమ రచయితలు భాష విషయంలో ఎదుర్కొన్న అసౌకర్యం కూడా ఇందుకు ఒక కారణం! అంతవరకూ సాహిత్య ప్రయోజనాలకు ఉపకరిస్తున్న గ్రాంధిక భాష ఆధునిక కథానికకు బొత్తిగా ఉపయోగపడదు. తమ ప్రాంతపు మాండలిక భాష పట్ల తమకే అనుమానం. దీనికి సాహిత్య గౌరవం లభించదేమోనన్న భయం!

రాయలసీమ రచయితలు భాష విషయంలో ఎదుర్కొన్న అసౌకర్యం కూడా ఇందుకు ఒక కారణం! అంతవరకూ సాహిత్య ప్రయోజనాలకు ఉపకరిస్తున్న గ్రాంధిక భాష ఆధునిక కథానికకు బొత్తిగా ఉపయోగపడదు. తమ ప్రాంతపు మాండలిక భాష పట్ల తమకే అనుమానం. దీనికి సాహిత్య గౌరవం లభించదేమోనన్న భయం! ఇక కథ రాయటానికి కొత్తగా ఒక భాషను నేర్చుకోవాల్సిన విచిత్ర పరిస్థితి ఏర్పడింది. అప్పటికే పత్రికా భాషగా, రచనా భాషగా స్థిరపడివున్న కోస్తాంధ్రభాషను నేర్చుకొని కథలు రాయాల్సిరావటం వల్ల కూడా, రాయలసీమలో కథావేగం కొంత మందగించింది. అందువల్ల శ్రీపాద, దీక్షితులు, కుటుంబరావు, గోపీచంద్, బుచ్చిబాబు, పద్మరాజులాంటి కథకులు, ఆయా ప్రాంతాలలో విరివిగా కథలు రాస్తున్నకాలంలో రాయలసీమలో చెప్పుకోదగ్గ రచయిత ఒక్కడైనా లేడు. ఆ కారణంగా స్వాతంత్ర్యానికి పూర్వం రాయలసీమలో ఆధునిక కథానిక దాదాపు లేనట్టే! స్వాతంత్ర్యానంతరమే రాయలసీమలో కథానిక స్పష్టమైన రూపాన్ని సంతరించుకుందని మనం భావించవచ్చు!

ఆలస్యమైనప్పటికీ రాయలసీమలో కథానిక విషయంలో మంచి ప్రారంభమే జరిగింది. కె.సభాగారిని రాయలసీమ తొలితెలుగు కథకుడిగా గుర్తించవచ్చు! మధురాంతకం గారి మాటల్లో చెప్పాలంటే, 'రెండు బండల మధ్యగల నెరియలో నుంచి అంకురించి తన ఉనికి కోసం మనుగడ కోసం, ప్రకృతితో పోరాడే రావిమొక్కలా ఎదిగి శాఖోపశాఖల మహావృక్షంగా విస్తరిల్లిన రచయిత కె.సభాగారు'

సభాగారు చిత్తూరుజిల్లాలో కథలు ప్రారంభించేకాలం నాటికి అనంతపురం, కడప, కర్నూలు జిల్లాల నుండి కథలు పుట్టుకొచ్చిన దాఖలాలు లేవు. సభాగారి వారసత్వాన్ని స్వీకరించి, చిత్తూరు జిల్లాలో కథారచన సాగించిన వారు మధురాంతకం రాజారాంగారు. రాజారాంగారు తన కథలకు ఒక సొంపైన భాషను తయారు చేసుకున్నారు. కొంత గ్రాంధిక వాసన, కొంత శిష్ట వ్యావహారికం, కొంత మాండలికం కలగలిసిన సుందరమైన భాష రాజారాంగారిది. ఆయన కథలు రాసేకాలం నాటికి రాయలసీమలో ఆయనకు మార్గదర్శకులైన రచయిత ఒక సభాగారు మాత్రమే! ఆయనంత విరివిగా కథలు రాసిన రచయితలు ఇప్పటికీ రాయలసీమలో లేరు. గ్రామసీమల గురించి రాజారాంగారు రాసినన్ని కథలు బహుశా తెలుగులో ఏ రచయితా రాయలేదేమో! రాయలసీమ ప్రాంతీయ జీవిత వాసన వారి కథల్లో గుబాళిస్తూ వుంటుంది. చిత్తూరు జిల్లా ప్రాంతీయ విలక్షణతను ఆయన కథల్లో మనం దర్శించవచ్చు. ఆయన రాసిన ఎడారికోయిల, కూనలమ్మకోన, సర్కస్‌డేరా, జీవన్ముక్తుడు, జీవన ప్రహసనం లాంటి అనేకానేక కథల్లో స్పష్టమైన ప్రాంతీయ ముద్రను గమనించవచ్చు... ఆయన కథనశైలి మౌఖికశైలిలా ఉండటం ఒక ప్రత్యేకత. ఈ శైలితో ప్రభావితులై రచనలు చేసిన వారిలో కేశవరెడ్డిగారిని చెప్పుకోవచ్చు.

రాయలసీమలో కథలు రాస్తున్నవారిని సౌలభ్యం కోసం స్థూలంగా రెండు తరాలుగా మనం

విభజించుకోవచ్చు. 1955-65 దశకంలో కథలు రాయటం ప్రారంభించిన మొదటితరం రచయితలైతే, 1975-85 దశకం నుంచి కథలు రాస్తున్నవారు రెండవతరం రచయితలు - ఇది ఒక చిన్న రేఖావిభజన మాత్రమే. మొదటితరం రచయితల్లో కె. సభా, మధురాంతకం రాజారాం, కలువకొలను సదానంద, పులికంటి, ఆర్.ఎస్.సుదర్శనం, వల్లంపాటి, ఆర్.వసుంధరాదేవి, బి. నాదమునిరాజు, రా.రా. సొదుం జయరాం, కేతు విశ్వనాథ రెడ్డి, పి. రామక్రిష్ణారెడ్డి, వై.సి.వి. రెడ్డి మొదలగువారు చేరుతారు.

*రాయలసీమలో కథలు రాస్తున్నవారిని సౌలభ్యం కోసం స్థూలంగా రెండు తరాలుగా మనం విభజించుకోవచ్చు. **1955-65** దశకంలో కథలు రాయటం ప్రారంభించిన మొదటితరం రచయితలైతే, **1975-85** దశకం నుంచి కథలు రాస్తున్నవారు రెండవతరం రచయితలు - ఇది ఒక చిన్న రేఖావిభజన మాత్రమే.*

రెండవతరం రచయితల్లో డా. కేశవరెడ్డి, డా॥ లంకిపల్లె, మధురాంతకం నరేంద్ర, మహేంద్ర, నామిని, వీరపల్లె వీణావాణి, వి.ఆర్ రాసాని, సింగమనేని, దేవపుత్ర, స్వామి, శాంతినారాయణ, సన్నపురెడ్డి, పాలగిరి విశ్వ ప్రసాద్, దాదాహయత్, తుమ్మల రామకృష్ణ, రాప్తాడు గోపాలకృష్ణ, సుందరరాజు మొదలగువారు వస్తారు. వీరిలో ఇటీవల కథారచన ప్రారంభించిన వారు కూడా కొందరు లేకపోలేదు.

అనంతపురం, కర్నూలు జిల్లాల్లో, మొదటితరం రచయితలు దాదాపు లేరనే చెప్పవచ్చు. అనంతపురం జిల్లాలో జి. రామకృష్ణ అనే జర్నలిస్టు 1943 ప్రాంతంలో చిరంజీవి అన్న చిన్న కథనూ, 1952 ప్రాంతంలో గంజికేంద్రం అన్న ఒక వాస్తవిక జీవన కథను రాశారు. అయితే ఆయన ఆ తర్వాత, ఒకటి రెండు కథలు మాత్రమే రాసి విరమించుకున్నారు.

విచిత్రమేమిటంటే, రాయలసీమలో కథలు రాస్తున్నవాళ్లంతా దాదాపుగా బ్రహ్మణేతరులు కావటం! గ్రామీణ ప్రాంతాల నుండీ, శ్రమజీవన కుటుంబాల నుండీ వచ్చినవాళ్లు కావటం. రాయలసీమలో తరతరాలుగా సంప్రదాయ సాహిత్యాన్ని సృష్టించిన బ్రహ్మణులు ఆధునిక సాహిత్య ప్రక్రియల్లో ప్రవేశించకపోవటం! కోస్తాంధ్రలో కథా రచయితలందరూ గురజాడ మొదలుకొని, పురాణం వరకూ ఏ కొద్దిమందినో మినహాయిస్తే, అందరూ బ్రాహ్మణులు కావటం, రాయలసీమలో కథా రచయితలందరూ దాదాపు బ్రాహ్మణేతరులు కావటం, ఇదొక విచిత్రసన్నివేశం! ఇందుకు కారణాలు పరిశోధకులు అన్వేషించాల్సివుంది!

రాయలసీమ తొలితరం రచయితలు, వస్తువుతోపాటు, కథా నిర్మాణంలో కూడా చాలా జాగ్రత్తను కనబరిచారు. కొడవటిగంటితో ప్రభావితులైన, రా.రా., సొదుం జయరాం, కేతు విశ్వనాథరెడ్డి లాంటి కథకులు నిరాడంబరమైన, నిరలంకారమైన శైలిలో కథలు రాశారు. అనవసరమైన వర్ణనల జోలికి పోకుండా, అనవసరమైన నాటకీయతను చొప్పించకుండా, కథలో పెద్ద మలుపులు లేకుండా, నూటిగా చెప్పటం వీరి కథాశిల్పంలోని ప్రత్యేకత. పాత్రల స్వభావాలను రచయితలే పనిగట్టుకొని చెప్పకుండా, వారి ప్రవర్తన, సంభాషణల ద్వారా వ్యక్తీకరించటం, కథా రచనలో వీరు పాటించిన సంయమనం - చిత్తూరు జిల్లా కథకులశైలి వీరికంటె భిన్నమైనది. సుందరమైన, లలితమైన పదాల పోహళింపుతో, మనోజ్ఞమైన వర్ణనలతో, పొందికైన వాతావరణం మధ్య వయ్యారంగా నడుస్తుంది. వీరి రచనా శైలి, అయితే వస్తువును మింగివేసే శైలీవైవిధ్యాన్ని వీళ్లెవరూ ప్రదర్శించలేదు. రాయలసీమ వాసులకు సహజమైన బోళాతనం వీరి శిల్పంలో కన్పిస్తుంది. నుడికారాలూ, సామెతలూ, లోకోక్తులూ, వీళ్ల కథల్లో విరివిగా చోటు చేసుకున్నాయి. ఈ తరం రచయితలెవ్వరూ తమ కథల్లో మాండలిక భాష పట్ల ప్రత్యేక శ్రద్ధను కనబరచకపోవటం గమనార్హం. కొందరైతే మాండలిక భాషాఛాయలు అసలు కన్పించకుండా జాగ్రత్తపడటం కూడా కనిపిస్తుంది. అందుకు కారణం తమ భాషపట్ల తమకే ఎక్కడో న్యూనతాభావం ఉండటం. పత్రికా భాషను నూటికి నూరుపాళ్ళూ ప్రామాణిక భాషగా ఆమోదించటం.

రెండవతరం రచయితలు కథలు రాసేనాటికి, రాయలసీమలో చెప్పుకోదగ్గ మార్పులు చాలానే వచ్చాయి.

స్కూళ్లూ, కాలేజీలూ, బహుళ సంఖ్యలో పెరిగాయి. సెకండరీస్థాయి వరకూ ఉచిత విద్య లభించటం వల్ల మధ్య తరగతికి విద్య అందుబాటులోకి వచ్చింది. ప్రతి పల్లెకూ కరెంటు వచ్చింది. పల్లె పల్లెకూ రవాణా సౌకర్యాలు ఏర్పడ్డాయి. కపిల మోటల స్థానంలో కరెంటింజన్లు వచ్చాయి. కొంతకాలం గడిచేసరికి గొట్టం బావులు వచ్చాయి. ఇంతకు మునుపు శ్రమను పెట్టుబడిగా మార్చి పంటలు పండించే రైతులు ఇప్పుడు డబ్బును పెట్టుబడిగా చేసి వ్యవసాయం చేయటం వల్ల క్రమంగా చితికిపోతున్నారు. డబ్బు చేతిలో వుంటే తప్ప సేద్యం చేయటం సాధ్యంకాని పరిస్థితి వచ్చింది. ఈ దశలోనే రైతులకు వాణిజ్య పంటలపట్ల ఆసక్తి పెరిగింది. భూమికి విలువ పెరుగుతూ వచ్చింది. బీడుగా వున్న వేల ఎకరాలు కొత్తగా సాగులోకి వచ్చాయి. చిరకాలంగా ఉన్న వ్యవసాయేతర కులాలు వ్యవసాయరంగంలోకి అడుగుపెట్టాయి. భూమి చేతులు మారింది ఈ దశలోనే. ఉత్పత్తి పెరిగింది. అయితే ఉత్పత్తి చేసే రైతు పరిస్థితి రాను రాను దయనీయంగా మారటం జరుగుతున్న పరిణామం! ఇందుకు తోడు ప్రతి రెండు మూడు సంవత్సరాలకూ ఇక్కడ కరువు కరాళనృత్యం చేస్తూనే ఉంది. బావులు ఎండిపోయాయి. బోరింగులూ, గొట్టపుబావులు లేని రైతే ఇప్పుడు లేడు. తాగునీటికి అంతటా ఎద్దడి ఏర్పడింది. రైతులు బ్యాంకుల చుట్టూ, ఆఫీసుల చుట్టూ తిరిగే పరిస్థితి ఏర్పడింది.

ఈ పరిస్థితులు ఇట్లా వుండగా పల్లెల్లో ఓట్ల రాజకీయాల జోరు క్రమంగా పెరిగింది. ఓట్ల కోసం రాజకీయ నాయకులు అమాయకపు పల్లెల్ని రెండు వర్గాలుగా చీల్చటం ప్రారంభించారు. కులం మునుపెన్నడూ లేనంతగా పడగవిప్పింది. ఫ్యాక్షన్ పెరిగింది. ముఠాలు పెరిగాయి. వ్యక్తిగతంగా సైన్యాన్ని నడుపుకొనే ఫ్యాక్షన్ రాజకీయ వేత్తలు పుట్టుకొచ్చారు. ఫ్యాక్షన్ రాజకీయాలలో పల్లెలు అగ్నిగుండాల్లా మారిపోసాగాయి. బాంబుల పేరు తెలియని మారుమూల పల్లెటూళ్లలో కూడా దీపావళి బాణసంచాల్లా బాంబులు పేలుతున్నాయి. ఫ్యాక్షన్ రాజకీయాల్లో చిక్కుకుని చాలా కుటుంబాలు ధ్వంసమయ్యాయి. కొన్ని ప్రాంతాల్లోనయితే ఇళ్లు బూడిదయ్యాయి. ఈ ఫ్యాక్షన్ నాయకులకు అండగా ఒక లంఫెన్ కిరాయిగూండావర్గం పెరగసాగింది. మద్యం చాలా సహజమైన పానీయమైపోయింది. కమ్యూనిస్టు భావజాలం ప్రజలపై ప్రభావాన్ని చూపటం తగ్గిపోసాగింది.

> ఈ రాయలసీమ సామాజిక చిత్రాన్ని రెండవతరం కథా రచయితలు, తొలితరం కథకులతోపాటుగా, ఒక క్రమపరిణామంతో తమ కథల్లో చిత్రించుకుంటూ వస్తున్నారు. మారుతున్న రాయలసీమ సామాజిక సంక్లిష్ట పరిస్థితుల మధ్య కొన్ని కొత్త వస్తువులను ఈ కథకులు కథల్లో తీసుకువచ్చారు.

ఈ రాయలసీమ సామాజిక చిత్రాన్ని రెండవతరం కథా రచయితలు, తొలితరం కథకులతోపాటుగా, ఒక క్రమపరిణామంతో తమ కథల్లో చిత్రించుకుంటూ వస్తున్నారు. మారుతున్న రాయలసీమ సామాజిక సంక్లిష్ట పరిస్థితుల మధ్య కొన్ని కొత్త వస్తువులను ఈ కథకులు కథల్లో తీసుకు వచ్చారు. ప్రాకృతికంగా రాయలసీమ అనుభవిస్తున్న భౌగోళిక దురన్యాయాన్ని తమ కథల్లో చిత్రించటం ప్రారంభించారు. కరువు, తాగునీటి సమస్య, సాగునీటి సమస్య పంటలు పండకపోవడం, పండించిన పంటకు గిట్టుబాటు ధర లభించకపోవటం, దళారీల దోపిడీ ఇవన్నీ కథావస్తువులయ్యాయి. రాయలసీమ ప్రత్యేక సామాజిక, సాంస్కృతిక లక్షణాలను ఈతరం రచయితలు స్పష్టంగా గుర్తించారు.

స్వామి రాసిన నీళ్లు, వానరాలే కథలూ, దాదాహయాత్ రాసిన గుక్కెడు నీళ్లు, సన్నపురెడ్డి రాసిన తడి, కేతువిశ్వనాథరెడ్డి రాసిన వానకురిస్తే, నమ్ముకున్న నేల, సింగమనేని రాసిన ఊబి, విముక్తి, చక్రవేణు రాసిన కసాయికరువు, శాంతి నారాయణ రాసిన కల్లమయిపాయ, మహేంద్రరాసిన ప్రతిజ్ఞ లాంటి ఎన్నో కథలు ఈ పరిస్థితులను ప్రతిబింబిస్తాయి.

కుటుంబంలోని సంబంధాలలో కూడా నీళ్లు వహించే పాత్రను ఎంతో వాస్తవికంగా, చక్కని శిల్పంతో, స్వామి తన నీళ్లు కథలో చిత్రించాడు. ఒక మధ్యతరగతి ఉద్యోగి కుటుంబ కేంద్రంగా స్వామి ఈ కథను నడిపాడు. వాళ్లు నివసించే

చిన్న పట్టణంలో తాగే నీళ్లు, వచ్చేది రోజుకు ఓ గంటసేపు మాత్రమే. అవీ ఏ సాయంత్రమో ఏ అర్ధరాత్రో, తెల్లవారు జామునో వస్తాయి. ఇంట్లో ఆడవాళ్ల జీవనదృష్టి అంతా ఈ నీళ్ళరాకమీదనే! అవి వచ్చినపుడు కూడా తమ భాగానికి ఏ రెండు మూడు బిందెలు మాత్రమే లభిస్తాయి. వాటికోసం వీధిలో పడిగాపులు. ఆ నీళ్లనే రోజంతా ఎంతో పొదుపుగా వాడుకోవాలి. భోజనాలకు కూచునేటప్పుడు తట్టముందు, తాగేనీళ్లు ఒక చెంబులో వుంచుకుంటారు ఆ కుటుంబీకులు. చేతులూ తట్టలూ కడుక్కోనేందుకు ఉప్పునీళ్ళు (బోరింగునీళ్లు) మరో చెంబులో వుంచుకుంటారు. పొరపాటున తాగేనీళ్లతో, చేతులూ, మూతీ, కడుక్కున్నారో, ఆ ఇంటి ఇల్లాలు వాళ్ళతో చేసేది ఒక చిన్నసైజు యుద్ధమే! ఒకపూట వాళ్ల పిల్లాడు పొరపాటున తాగేనీళ్లతో చేయికడుక్కోవటం తల్లి చూసింది. ఇంకేముంది. ఎడంచేత్తో ధనాధనా వాని చెంపల్నీ, వీపునీ, తలనీ, ఎక్కడబడితే అక్కడ ఉతికేసింది' ఆ పిల్లాడు 'అమ్మా! లేదమ్మా! ఇంక ఒలకపోయనమ్మా' 'అంటూ నోరంతా వెల్లబెట్టి ఏడుస్తావుంటే, ఆ తల్లికూడా వాణ్ణి కౌగిలించుకొని భోరునఏడ్చేసింది. ఈ దృశ్యాన్ని ఏ ప్రాంతం రచయిత రాయగలడు? ఇదంతా ఒక ఎత్తయితే నీళ్ళకోసం, నీళ్ల పేరుతో, ఓట్ల కోసం నడిపే రాజకీయాలు ఒక ఎత్తు, వీధి కుళాయి దగ్గర తలలు పగులగొట్టుకొనే వాతావరణం మరో ఎత్తు. ఆ కథ ముగింపు వాక్యం గమనించండి. 'ఎవరు ఎన్ని నీళ్లు వాడతారో తెలిస్తే వాళ్ల, నాగరికత ఏ పాటిదో చెప్పెయ్యవచ్చు! తాగేదానికి ఒక కడవ నీళ్లు నోచుకోనివారికి ఏం నాగరికత వుంటుంది?"....

**ఒకపూట వాళ్ల పిల్లాడు పొరపాటున తాగేనీళ్లతో చేయికడుక్కోవటం తల్లి చూసింది. ఇంకేముంది. ఎడంచేత్తో ధనాధనా వాని చెంపల్నీ, వీపునీ, తలనీ, ఎక్కడబడితే అక్కడ ఉతికేసింది' ఆ పిల్లాడు 'అమ్మా! లేదమ్మా! ఇంక ఒలకపోయనమ్మా' 'అంటూ నోరంతా వెల్లబెట్టి ఏడుస్తావుంటే, ఆ తల్లికూడా వాణ్ణి కౌగిలించుకొని భోరునఏడ్చేసింది.**

దాదాహయాత్ రాసిన గుక్కెడు నీళ్లు కథ గమనించండి. ఒక ముసలిదాని దాహార్తి తీర్చడానికి ఒక పదేళ్ల పసిపిల్ల చెంబుడు నీళ్లకోసం, రెండు మైళ్లు నడిచి, ఒక కోనేరులో చెంబు ముంచబోయి జారిపడి, ఆ కోనేరులో చచ్చిపోయిన దారుణ దృశ్యం గుండెల మీద గుండు ఎత్తుతుంది. ఈ కథలో వినిపించే ఒక వీధిపాటగాడి తంబూరా పాటను పరిశీలించండి. 'గుక్కెడు' నీళ్ళు కోసం బొక్కేవులేరా సిద్దా..! దక్కేనా నీరూ సిద్దా... ఇలాంటి పాటను తంబూరా మీద పాడే పాటగాళ్లు, వేరే ఏ ప్రాంతంలోనైనా ఎందుకుంటారు.

సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి రాసిన తడి కథ ఇదే సమస్యను మరికొంత దూరం తీసుకుపోతుంది. ఈ కథలోని సమస్య సాగునీటి సమస్య! అయితే ఈ కథ నీటి సమస్య దగ్గర ఆగిపోదు. ఎంతో సన్నిహితంగా, ఆత్మీయంగా ఉండాల్సిన అన్నదమ్ముల మధ్య వాళ్ల కుటుంబాల మధ్య గల సహజమైన ప్రేమ సంబంధాలను నీటి సమస్య ఎలా ఛిద్రం చేస్తుందో ఈ కథ చూపెడుతుంది.

రాయలసీమ రైతు, అనేకానేకంగా, ఈ సమస్యల్ని ఎలా అనుభవిస్తున్నాడో, ఎలా నతమతమవుతున్నాడో తెలియచెప్పే కథలు ఈ దశలో అనంతంగా వచ్చాయి. ఒక్క వానకురిస్తే చాలు తండ్రీ! బతికి బయటపడతాము అనుకుంటూ ఆకాశంలో మబ్బులకేసి చూసే అమాయక రైతు ఎదురుచూపులను వానకురిస్తే కథలోనూ, వానలు కురవక... పంటలు పండక, అప్పుల భారం భరించలేక, తాను నమ్ముకున్న నేల తన్ను దగా చేస్తే, దాన్ని తెగనమ్ముకున్న రైతు నిస్సహాయవేదనను తాను నమ్ముకున్న నేల కథలోనూ చూడవచ్చు. మడికి తడిపెట్టడానికి నీళ్లు చాలక, అత్యవసర పరిస్థితుల్లో అప్పటికప్పుడు అప్పుచేసి, బోరువేయిస్తే, నీళ్లకు బదులు బండపడి, విలవిలలాడి పోయిన, చిన్నకారు రైతు దయనీయ స్థితిని సింగమనేని నారాయణ రాసిన ఊబి కథలో గమనించవచ్చు. కరువు కరాళ ద్రష్టలకు చిక్కి, మేపటానికి గడ్డిలేక పశువులను కసాయివాళ్లకు అమ్ముకున్న బీభత్సాన్ని చక్రవేణు కసాయి కరువులో దర్శించవచ్చు.

రాయలసీమ రైతుకు పండే పంటలు అంతంతమాత్రం ! తీరా దాన్ని అమ్మబోతే ఎలాంటి మోసానికి, దోపిడీకి గురౌతున్నాడో తెలియచెప్పే కథలు కూడా ఈ దశలోనే వచ్చాయి. శాంతినారాయణ రాసిన దళారీ, సింగమనేని రాసిన

అడుసు లాంటివి ఇందుకు మంచి ఉదాహరణలు. శాంతి నారాయణ దళారీ కథలో, ఒక మధ్య తరగతి రైతు తాను పండించిన ఉల్లి గడ్డలను మార్కెట్‌కు తోలితే మార్కెట్ వ్యాపారులు, లారీ బ్రోకర్ ఆఫీస్ వాళ్లు, ఒక పద్ధతి ప్రకారం ఎలా దగా చేస్తారో, ఔరా ! ఎంత మోసం.. అనిపించే తీరులో చాలా సహజంగా చెబుతాడు. పండించిన చీనీకాయలకు గిట్టుబాటు ధర లభించకపోగా, మార్కెట్ మాయాజాలంలో చిక్కుకుపోయిన రైతు నిరాశా నిస్పృహలకు లోనై, తాను పెంచి పోషించిన చీనీ చెట్లను తానే నరికి వేసుకున్న రైతు ఆత్మ విధ్వంస గాథను సింగమనేని అడుసు కథలో అక్షరీకరిస్తాడు.

ఇంకా రాయలసీమ రైతు అంతరంగాన్నీ అతనికి భూమితో గల అనుబంధాన్నీ, అతడి జీవన విన్యాసాన్ని, ఆలోచనా విధానాన్ని ఆవిష్కరించిన కథలు వర్తమాన దశాబ్దంలో చాలానే వచ్చాయి. దేవపుత్ర మన్నుతిన్న మనిషి, పులికంటి బంగారు సంకెళ్లు డా. లంకిపల్లె జీవనం, కేతు విశ్వనాథరెడ్డి గడ్డి, సన్నపు రెడ్డి కొత్త దుప్పటి, స్వామి వానరాలే... ఇలా ఎన్నయినా ఉదహరించవచ్చు. రాయలసీమ రైతు జీవన సంచలనాల్ని చిత్రించిన 18 మంది కథకుల కథలు గల సీమ కథలు సంకలనం ఈ దశలోనే వెలువడింది.

> **ఇంకా రాయలసీమ రైతు అంతరంగాన్నీ అతనికి భూమితో గల అనుబంధాన్నీ, అతడి జీవన విన్యాసాన్ని, ఆలోచనా విధానాన్ని ఆవిష్కరించిన కథలు వర్తమాన దశాబ్దంలో చాలానే వచ్చాయి**

రాయలసీమ కథకులలో, రచనా, వ్యాసంగం చేపబట్టిన ప్రారంభదినాల నుండీ, రాయలసీమ సామాజిక మూలాల్ని, ప్రత్యేక సాంస్కృతిక లక్షణాలనూ, విడవకుండా తన కథల్లో చిత్రిస్తూ వస్తున్న కథకుడు కేతు విశ్వనాథరెడ్డి గడ్డు జీవన వాస్తవికతను తన కథల్లో ప్రతిభావంతంగా ఆవిష్కరించటం ఆయన ప్రత్యేకత! పల్లెపట్టులను గురించి రాసినా, పట్టణ జీవితాన్ని గురించి రాసినా, నగర నాగరికతల్ని గురించి రాసినా వాటి మూలాలు, వేర్లు. పల్లెపట్టుల్లోనే దాగి ఉండటం విశ్వనాథరెడ్డి కథల్లోని విశిష్టత.

గ్రామీణ జీవనం పట్ల, రైతాంగం పట్ల, ఆర్తితో, అనుకంపనతో రాసిన ఎందరో కథకులు ఈ దశలో పుట్టుకురావటం విచిత్రం! రైతాంగం గ్రామీణ జీవనం, వస్తువుగా, అసంఖ్యాకమైన కథలు రాయలసీమ నుండే ఎక్కువగా రావటంలోని, వర్తమాన చారిత్రక సందర్భాన్ని ప్రత్యేకంగా గమనించాల్సి వుంది. ఈ చిత్రణంతా ఒక కోణం అయితే, మరోకోణం రాయలసీమలోని ముఠాకక్షలూ, ఫ్యాక్షనిజం, హింసా రాజకీయాలు ! అవి జన జీవితంలో సృష్టిస్తున్న అలజడీ, సంక్షోభమూ! వీటిని కథల్లో చిత్రించడానికి సామాన్యమైన అనుభవమూ, ప్రతిభాచాలదు.

తొలితరం కథకులైన వై.సి.వి. రెడ్డి, కేతు విశ్వనాథరెడ్డి గార్లు రెండు దశాబ్దాల కిందటే రాయలసీమ ముఠాకక్షల నేపథ్యంలో రాసిన కథలు గమనించదగ్గవి. వై.సి.వి. రెడ్డి ఐదు రూపాయలు కథలోనూ, విశ్వనాథరెడ్డి కూలిన బురుజు కథలోనూ ఈ ఛాయలు మనం చూడవచ్చు.

ముఖ్యంగా కడపజిల్లా ఈ ఫ్యాక్షన్స్‌కు పెట్టిందిపేరు. కడప అంటేనే రాష్ట్రంలో చాలా ప్రాంతాల వాళ్లకు బాంబులే గుర్తుకువస్తాయి. ఒక కుటీర పరిశ్రమగా బాంబుల తయారీ కడప జిల్లాలో విస్తరించిందంటే అతిశయోక్తి మాత్రం కాదు. సామాజిక ఆధిపత్యం కోసం జరుగుపోరులో ఒక కులం ఆ జిల్లాల్లో ఫ్యాక్షన్‌కు కేంద్రమైంది. కడప జిల్లా కథకులు ఆ ముఠా కక్షల్ని కేవలం ఒక స్టంటు కథగా చిత్రించిన వాళ్లు కాదు. అందుకు గల ఆర్థిక, రాజకీయ, సామాజిక కారణాలను కూడా తమ కథల్లో వివరించే ప్రయత్నం చేయటం ఆ కథకుల విశిష్టత.

పాలగిరి విశ్వప్రసాద్ రాసిన 'కరువూ వచ్చె కచ్చులూ వచ్చె' కథ కడప జిల్లాలోని గ్రామ కక్షలకు సాక్షమిచ్చే కథ ! వర్షాలు లేక ఒక ప్రక్క పైర్లు ఎండిపోతూ వుంటే, ఆ ఎండిన పైరును, మరో ప్రక్క దొంగగొడ్లు మేయటానికి ప్రయత్నిస్తూ వుంటాయి. కనీసం ఆ పైరునైనా రక్షించుకోవటానికి గ్రామస్తులు కాపలా ఏర్పాటు చేసుకోవాలనుకుంటారు. ఆ గ్రామం మొదటి నుండి కక్షలకు నిలయం! అందరూ కలసి ఏర్పాటు చేసుకున్న ఆ సమావేశంలో మాటా మాటా పెరిగి పాత కక్షలు

భగ్నమంటాయి. బాంబులు పేలుతాయి. హత్యలు జరుగుతాయి. కేసులౌతాయి. అసలు సమస్య గాలికి పోయి ఒకర్ని ఒకరు చంపుకోవటమే లక్ష్యంగా చెలరేగుతారు. కక్షలకూ కరువుకూ గల సంబంధాన్ని ఈ కథలో కథకుడు వివరించే ప్రయత్నం చేస్తాడు. ఈ కథచివర రామిరెడ్డి భార్య వీళ్ళ కక్షా రాజకీయాలను అసహ్యించుకుంటూ వేసిన ప్రశ్నల్లో రచయిత కంఠస్వరం వినిపిస్తుంది. జాగ్రత్తగా అధ్యయనం చేయాల్సిన మంచి కథ ఇది!

దాదాహయాత్ రాసిన 'సెగమంటలు' పట్టణ జీవితంలోకి విస్తరించిన ముఠా కక్షల్ని చిత్రించిన కథ, ఫ్యాక్టరీ కక్షలు, రాజకీయ కక్షలుగా మారటం, వాటి మధ్య సామాన్య పౌరులు నలిగిపోవటం ఇందులోని ఇతివృత్తం ! ఇదే రచయిత రాసిన ఏటి ఒడ్డున చేపలు కథలో, పెన్నేటి ఒడ్డున కాపురముంటూ, పెన్నేటిలో కరిబుజకాయలు పండించుకునే ఒక పెద్ద కుటుంబం, ఆ గ్రామంలోని కక్షల మధ్య అన్యాయంగా ఇరుక్కుపోయి, అక్కడ నుండి పారిపోయిన దీన దృశ్యం కనిపిస్తుంది. వారసత్వం కథ, తండ్రుల నుండీ పిల్లలకు బాంబుల సంస్కృతి వారసత్వంగా ఎలా సంక్రమిస్తుందో చూపెడుతుంది. ఈ మూడు కథల్లో ఫ్యాక్షన్ కారణంగా అందులో సంబంధమే లేని సామాన్యుల జీవితాలు ఎలా ఛిద్రమైపోతాయో రచయిత చిత్రించాడు. ఇంకా డి. రామచంద్రరాజు రాసిన ఏటిదరిమాను కథలో కూడా ఇలాంటి వాతావరణాన్నే గమనించవచ్చు. పి. రామకృష్ణారెడ్డి రాసిన ఎదిగే పెద్దోళ్లూ - నలిగే సన్నోళ్లు కథ చాలా స్పష్టంగా కడపజిల్లా ముఠా కక్షల్ని అందులో బలియైపోతున్న బలహీన వర్గాల ఆక్రోశాన్ని ప్రతిబింబించింది. అనంతపురం జిల్లాలో ఇటీవలి కాలంలో ఫ్యాక్షనిస్టులు సామాజిక శాసనకర్తలుగా మారుతున్న వైనం ఆ జిల్లా జీవితాన్ని జాగ్రత్తగా పరిశీలించిన వారికి అర్థమౌతుంది. ఈ ఫ్యాక్షనిస్టులు తమకు సైన్యంగా ఎలాంటి వాళ్ళన్ని చేరదీస్తున్నారో స్వామి రాసిన నడక కథ హేతుబద్ధంగా వివరిస్తుంది. సోమరితనమూ, వ్యసనాలు వున్న ఒక వర్గం ఈ ఫ్యాక్షన్ వలయంలోకి ఎలా ఆకర్షింపబడుతున్నదో ఈ కథ వివరిస్తుంది. ఈ ఫ్యాక్షనిస్టుల్లో ఒక ముఠా తమ కార్యకలాపాలకు విప్లవం రంగు పులుముకోవటం ఆశ్చర్యమనిపిస్తుంది. ఫ్యాక్షనిస్టుల వల్ల, వాళ్ళ స్వంత కుటుంబాల్లోని స్త్రీలు సైతం ఎలాంటి మానసిక అశాంతికి సాంఘిక అసౌకర్యానికి గురౌతున్నారో శాంతినారాయణ రాసిన గర్భస్రావం కథలో గమనించవచ్చు. ఈ మధ్యనే కర్నూలు జిల్లా నుండి ఫ్యాక్షన్ కథలు అన్న పేరుతో, మూడు కథల చిన్న సంకలనం వచ్చింది. తుమ్మల - రామకృష్ణ, శ్రీనివాసమూర్తి, రాప్తాడు గోపాలకృష్ణ రాసిన ఈ కథల్లో, గ్రామీణ వాతావరణంలో కుటుంబ సంబంధాలలో, ఎలాంటి అవాంఛనీయ ధోరణులు ఈ ఫ్యాక్షనిజం కారణంగా విస్తరిస్తున్నాయో మనం చూడవచ్చు. ఇటీవలే వచ్చిన మధురాంతకం రాజారాం గారి గాలి వీడు నుండీ న్యూయార్క్ దాకా అన్న కథ చిత్తూరు జిల్లా ఫ్యాక్షనిజం నేపథ్యంలో రమణీయంగా నడచిన కథ.

ఈ ఫ్యాక్షనిస్టులు తమకు సైన్యంగా ఎలాంటి వాళ్ళన్ని చేరదీస్తున్నారో స్వామి రాసిన నడక కథ హేతుబద్ధంగా వివరిస్తుంది.

రాయలసీమ ప్రత్యేక సామాజిక అంశాలతో కథలు రాసిన వారిలో ప్రత్యేకించి చెప్పుకోదగ్గ మంచి రచయిత నామిని. ఆత్మకథా మాలికలుగా నామిని ఈ కథాచిత్రాలు చిత్రించినప్పటికీ, కథాశిల్పానికి అతని కథలు ఒదగకపోయినప్పటికీ, చిత్తూరు జిల్లా గ్రామీణ జీవనంలోని, శ్రమజీవన సౌందర్యము, కళాత్మకమైన నిర్మాణంతో, పాఠకుణ్ణి ముగ్ధుణ్ణి చేస్తాయి. ఇంకా పులికంటి కృష్ణారెడ్డి ,వీరపల్లె వీణావాణి, మహేంద్ర, నరేంద్ర, వి.ఆర్. రాసాని, డా॥ లంకిపల్లె రాసిన కథల్లో స్థలకాలల చైతన్యాన్ని మనం గమనించవచ్చు. నరేంద్ర రాసిన అత్యాచారం, కాకులూ, గ్రద్ధలూ, నాలుగుకాళ్ళ మంటపం కథలూ, మహేంద్ర రాసిన ముసలమ్మ మరణం కథలూ, ఆ ప్రాంతపు జీవితాన్ని పాఠకుడి ముందు పరుస్తాయి. డా॥ లంకిపల్లె రాసిన కథలన్నీ కూడా వ్యావసాయిక జీవితానికి సంబంధించినవే కావటం ఒక

విశేషం.

దళితవాదం తెలుగు కథా సాహిత్యంలో వేరూనుకుంటున్న ఈ దశలోనే, రాయలసీమ నుండీ ఈ ధోరణితో ప్రత్యేక ప్రాదేశిక లక్షణాల నేపథ్యంలో మంచి దళిత కథలు పుట్టుకొచ్చాయి. కేవలం వాదం కోసం అల్లిన కథలుగా కాకుండా సామాజిక మూలాల నుండి త్రవ్వి తీసిన కథలుగావటం వీటి ప్రత్యేకత. మాల మాదిగల శ్రమ జీవన మూలాల నుండే, అగ్రకులాల ఆస్తులూ, ఆరోగ్యమూ అభివృద్ధి చెందుతున్నాయని సన్నపురెడ్డి చనుబాలు కథలో, వర్తమాన గ్రామ జీవిత నేపథ్యంలో వివరిస్తాడు. బి.సి.లను కూడా దళితులుగా సంభావించటంలోని ఔచిత్యాన్ని ప్రశ్నిస్తుంది. స్వామిరాసిన ప్రశాంతం కథ.... ఒక హరిజనుడు మంత్రి అయినప్పటికీ అగ్రవర్ణాల చెప్పుచేతల్లో ఉండటంలోని అనివార్యతను నిరూపిస్తుంది. శాంతినారాయణ ఉక్కుపాదం కథ... రాయలసీమ పల్లెల్లో హరిజనులకు ఇప్పటికీ దేవాలయ ప్రవేశంలో అస్పృశ్యతను అగ్రవర్ణాలు పాటించటాన్ని వివరిస్తుంది సింగమనేని మకర ముఖం కథ. ఇంకా దేవపుత్ర రాసిన విలోమం, ఔషధం, సమిధలు కథలూ, స్వామి రాసిన తల్లిమట్టి, హెచ్. సరస్వతి కథలూ, సన్నపురెడ్డి అంటు, పాలగిరి విశ్వప్రసాద్ చెప్పుకింద పూలు, దాదాహయాత్ ఎల్లువ చెప్పుకోదగ్గ మంచి కథలు... ఈ మధ్యనే వచ్చిన నాగప్పగారి సుందరరాజు రాసిన మాదిగోడు కథలు ప్రత్యేకంగా పరిశీలించాల్సిన చక్కని కథలు. కర్నూలు జిల్లాలోని ఒక గ్రామీణ ప్రాంతపు మాదిగల జీవితాన్ని ఆత్మీయంగా, కళాత్మకంగా ఆవిష్కరించిన ఆత్మకథా చిత్రిమాలికలు అవి !

రాయలసీమ నుండి వచ్చిన దళిత కథలన్నీ కూడా, నిర్దిష్ట స్థల కాలాలతో ముడిపడి వుండటం గమనార్హం ఒక వాదం పట్ల ప్రచార దృష్టి లేకుండా, వాస్తవికతా పునాదులతో, కళాత్మకతకు భంగం కలగకుండా ఈ కథలు వుండటం వాటి గొప్పతనం.

రాయలసీమ కథలకు నేడు తెలుగు కథా సాహిత్యంలో ఒక ఆమోదయోగ్యమైన విశిష్టస్థానం ఉన్నది. రాయలసీమ కథకులందరూ మట్టివాసనను అనుభవించినవారు. నేల మీద పాదాలు మోపి నడుస్తున్న వాళ్లు. అతివాద ధోరణులకూ, అవాస్తవిక చిత్రణలకూ, కేవలం కాల్పనిక సృజనకూ అలవాటు పడినవాళ్లు కారు. ఇక్కడ కథా రచన వ్యాపారమయంకాలేదు. సామాజిక సంస్కారతృష్ణ కలిగినవారు, వస్తువు వల్ల మాత్రమే కాదు. కళాత్మకంగా విశ్వసనీయత లోపించకుండా, క్లుప్తత పాటిస్తూ, సంయమనంగా కథలు రాయటం వల్లనే రాయలసీమ కథను ఈనాడు పాఠకులూ, విమర్శకులూ ఆహ్వానిస్తున్నారు.

రాయలసీమ కథకులు స్పృశింపని సామాజిక రంగాలు కొన్ని మిగిలివున్నాయి. పారిశ్రామిక రంగం గురించీ, రాజకీయ రంగం గురించీ ఇక్కడి కథకులు కథారచనను ఇంకా ప్రారంభించవలసి వుంది. ఇంకా స్పష్టమైన కంఠస్వరాన్ని వర్తమానంలో రాస్తున్న యువకథకులు సాధించాల్సి వుంది. సామాజిక వాస్తవికతకు దూరం గాకుండా, తెలుగు కథాసాహిత్యాన్ని సుసంపన్నం చేయటంలో రాయలసీమ కథకుల పాత్ర ఎంతో విశిష్టమైనదీ, విశాలమైనదీ!






ఒకరి ఆలోచనలకూ, భావాలకూ ఒక ధోరణిలో అక్షరరూపాన్ని యివ్వడం శైలి. అది వ్యక్తిగతమైనది. ఎవరిధోరణి వారిదే. వారి వారి అభిరుచులనుబట్టీ, నమ్మకాలను బట్టీ, పరిసరాల ప్రభావాన్నిబట్టీ ఒక్కొక్కరికీ ఒకో ధోరణి అలవడుతుంది. ఈ ధోరణిలోనే అతని శైలి ఒదిగి వుంటుంది.

శైలి అనేది రచనకు పైపై పూసే పూతకాదు. బయట తగిలించే అలంకారాలు కావు. రచనలో మొదటినుంచీ చివరిదాకా అంతర్లీనంగా ఒదిగిపోయి కలగలిసిపోయిన వాక్య రచనాపద్ధతి. మాటల కూర్పులో, వాక్యం విరుపులో, చెప్పే తీరులో తొంగిచూసే రచయిత వ్యక్తిత్వం. చిత్రకారుడు రేఖల విన్యాసంలో, రంగులమేళనంలో; గాయకుడు రాగప్రసారంలో, స్వరప్రచారంలో; నర్తకి అంగవిన్యాసంలో ప్రకటించే ఒకానొక బాణీ, రచయిత తనను తాను పరిచయం చేసుకొనే ముద్ర.

**-శీలా వీర్రాజు**

# తొలితరం తెలంగాణ కథకుడు సీతారాం

ఆచార్య ఎన్. గోపి




**1953 నుండి 65 వరకు - అంటే పన్నెండేళ్ళలో 85 కథలు రాసిన ఘనత సీతారాంది. అన్నీ తెలంగాణ ప్రాంత జీవితాల కథలే. మిగతా ప్రాంతాల గురించి తెలిస్తే కదా! అవి వివిధ ప్రాంతాల మధ్య వినిమయం రోజులు కావు. అప్పుడు రేడియోలు లేవు, కరెంటు లేదు. పత్రికలు లేవు, గ్రంథాలయాలు లేవు. అటువంటి పరిస్థితుల్లో సాహిత్యపరంగా వ్యాసంగం చెయ్యాలి. చీల్చుకొని రావాలి. సిరిసిల్ల, వేములవాడలే ఒయాసిస్సులు. శరత్, ప్రేమ్‌చంద్ అనువాదాలు దొరికేవి. మాలపల్లి, నారాయణరావులు కూడా. బయటి విశాల సాహిత్య ప్రపంచానికి ఇలాంటివే కిటికీలు.**

అవి నిజాం రాష్ట్రానికి బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా ఉన్న రోజులు. అప్పటికింకా ఇప్పటి ఆంధ్రప్రదేశ్ ఏర్పడలేదు. సరే, తెలంగాణ రైతాంగ పోరాటం ముగిసింది. ముగిసిందా? ముగియలేదని చాలామంది వాదన. తెలంగాణ రచయితల సంఘం స్థాపన జరిగి దాశరథి అధ్యక్షుడుగా, సినారె కార్యదర్శిగా సాహిత్య చైతన్యం కోసం ఆరాటపడుతున్న రోజులు. దానికి సిరిసిల్లలో కూడా ఒక శాఖ ఏర్పడింది. సిరిసిల్ల అప్పటికీ ఇప్పటికీ ఉద్యమాల గడ్డ. సిరిసిల్లకు సమీపంలో హనుమాజీ పేట అనే ఊరు. ఆ ఊళ్లో సినారె అనే ఫెనామినా జన్మించి ఉండకపోతే అది తెలంగాణలోని అసంఖ్యాక గ్రామాల్లో ఒకటై ఉండేది. ఆ చిన్న పల్లెలో జ్ఞానపీఠం అందుకునే మొనగాడు ఆవిర్భవిస్తాడనే ఊహకు హేతుబద్ధత లేని రోజులవి. అదే ఊళ్ళో గూడూరి సీతారాం, ఆదిరెడ్డి, కనపర్తి, మిద్దె రాములు పుట్టారు.

ఈ నలుగురు సినారె అనుయాయులు, మిత్రులు సినారె సెలవుల్లో వచ్చినప్పుడు వీరికి సాహిత్యప్రోత్సాహం దొరికేది. వీరిలోంచి సీతారాం విశిష్ట కథకుడుగా రూపొందుతాడని అప్పటికి తెలియదు. 1953 నుండి 65 వరకు - అంటే పన్నెండేళ్ళలో 85 కథలు రాసిన ఘనత సీతారాంది. అన్నీ తెలంగాణ ప్రాంత జీవితాల కథలే. మిగతా ప్రాంతాల గురించి తెలిస్తే కదా! అవి వివిధ ప్రాంతాల మధ్య వినిమయం రోజులు కావు. అప్పుడు రేడియోలు లేవు, కరెంటు లేదు. పత్రికలు లేవు, గ్రంథాలయాలు లేవు. అటువంటి పరిస్థితుల్లో సాహిత్యపరంగా వ్యాసంగం చెయ్యాలి. చీల్చుకొని రావాలి. సిరిసిల్ల, వేములవాడలే ఒయాసిస్సులు. శరత్, ప్రేమ్‌చంద్ అనువాదాలు దొరికేవి. మాలపల్లి, నారాయణరావులు కూడా. బయటి విశాల సాహిత్య ప్రపంచానికి ఇలాంటివే కిటికీలు. ఇక ముడిసరుకు – ప్రాంతీయంగా ఉన్న చుట్టుపక్కల బడుగు బతుకులే. మరి సీతారాం రాసిన అపురూపమైన ఆ 85 కథలు దొరుకుతున్నాయా? లేదు. ఎందుకు? ఎందుకంటే, అప్పటికి వాటిని భద్రపరచాలన్న 'సోయి' (స్పృహ) లేదు. మళ్ళీ ఇన్నాళ్ళకు 'సీతారాం సాహిత్య స్వర్ణోత్సవం' జరపాలని అభిమానులు తలపెడితే పరిస్థితి నిరాశాజనకం. పాత పత్రికలు, పాతసంచికలు, జ్ఞాపకాల పొరల్లోని చిన్న పత్రికలు

ఎక్కడ దొరుకుతాయి? సీతన్న (సీతారాంను అందరూ ప్రేమగా పిలుచుకునే పేరు) మన మధ్యనే తిరుగుతున్నాడు. కానీ, ఆయన కథలు ఎక్కడున్నాయో! అయితే, వదిలేద్దామా? ఎందుకు వదిలేస్తాం. మానేరు రచయితల సంఘం, సిరిసిల్లవారు మిత్రులు సాయంతో 14 కథలు సంపాదించగలిగారు. పుస్తక రూపంలో వెలువరించారు కూడా. త్వరలో జరిగే స్వర్ణోత్సవ కార్యక్రమంలో దీనిని ఆవిష్కరిస్తారు. దీనికి మారసం కార్యదర్శి డా॥ పత్తిపాక మోహన్ చూపుతున్న చొరవ అభినందన పాత్రం.

ఈనాటి తెలంగాణ రెండో సాహిత్య పునరుజ్జీవన పరిస్థితుల్లో ఆనాటి కథలన్నీ ఆణిముత్యాలు. సీతన్నవే కాక సురమౌళి, వట్టికోట ఆళ్వారు స్వామి, ఇరివెంటి కృష్ణమూర్తి, నెల్లుట్ల కేశవస్వామి, పొట్లపల్లి రామారావు, లోకమలహరి తదితరుల కథలు పుస్తకాలకెక్కినవి ఎన్నో ఉన్నాయి. నెల్లుట్ల కేశవస్వామి చార్మినార్ కథలు కాకుండా ఎన్నో కథలు పత్రికల్లో వచ్చి, గ్రంథ రూపంలో రానివి ఉన్నాయి. వారి బంధువులైనా ప్రయత్నించాలి. స్వర్గీయ ఇరివెంటి కథలను నేనాయన ముఖతఃవిన్నాను. మహబూబ్‌నగర మాండలికంలో గుబాళించే కథలవి. వీళ్ళందరూ తొలితరం తెలంగాణా కథకులు, తెలంగాణా ప్రజల జీవన మూలాలనూ, మూల్యాలనూ వీటిలో వెతుక్కోవలసి వుంటుంది. సాహిత్య పరిణామ, వికాస చరిత్రలో ఇది పరామర్శ గ్రంథాలవుతాయి. ఎందుకంటే, ఆనాడు నిత్యజీవితంలో వారు ఎదుర్కొన్న సంఘటనలు, ఫ్యూడల్ భూస్వాముల దౌర్జన్యాలు, కులపీడన, గ్రామ పెత్తందార్ల పెద్దరికం, కులపెద్దల పెత్తనం, రజాకార్ల సంఘటనలు – ఇవన్నీ ఆనాటి కథలకు భిత్తిక. ఆ నేపథ్యంలో చదివితే ఇవి ఎంత విలువైన కథలో ఆనాటి విశ్లేషణలకు అవి ఎంత అవగాహననిస్తాయో తెలుస్తుంది. మరొక సంగతి ఏమిటంటే, తెలంగాణలో మధ్య తరగతే లేదు. ఉన్నవాళ్ళు, లేనివాళ్ళు అనేవి రెండే ఆనాడు.



సీతన్నవే కాక సురమౌళి, వట్టికోట ఆళ్వారు స్వామి, ఇరివెంటి కృష్ణమూర్తి, నెల్లుట్ల కేశవస్వామి, పొట్లపల్లి రామారావు, లోకమలహరి తదితరుల కథలు పుస్తకాలకెక్కినవి ఎన్నో ఉన్నాయి. నెల్లుట్ల కేశవస్వామి చార్మినార్ కథలు కాకుండా ఎన్నో కథలు పత్రికల్లో వచ్చి, గ్రంథ రూపంలో రానివి ఉన్నాయి. వారి బంధువులైనా ప్రయత్నించాలి. స్వర్గీయ ఇరివెంటి కథలను నేనాయన ముఖతఃవిన్నాను. మహబూబ్‌నగర మాండలికంలో గుబాళించే కథలవి. వీళ్ళందరూ తొలితరం తెలంగాణా కథకులు,

మధ్యతరగతి జీవితంలోని తీరిక, మాధుర్యం, శిల్ప సంవిధానాలకు తావిచ్చే సంఘటనల కోసం ఈ కథల్లో వెతికి లాభంలేదు. ఎల్లీఎల్లని బతుకుల్లో అందమే ముంటుంది? కడగండ్లు తప్ప. జీవితమంత నిస్సహాయత ఆనాటి కథల్లో కనిపిస్తుంది. అటువంటి నిస్సహాయత లోంచి తిరుగుబాటు రావడం అనివార్యం. పిల్లి పులిగా మారిన క్రమంలో తెలంగాణా చరిత్రను చూడవలసి ఉంటుంది. మరి సీతన్న కథమాటేమిటి? కీర్తి కాంక్ష లేని ఈ కథల మారాజు కథలను పరిశీలిస్తే మారుమూల పల్లెలు పట్నం షోకుల్లోకి మారుతున్న తీరు కనిపిస్తుంది. కలిగిన కుటుంబమే. కాస్మెటిక్స్ ఊళ్ళోకి ప్రవేశించి ఆ కుటుంబంలోకీ ఆవరించు కుంది. ఆ వ్యామోహంలో పడి భర్తను వదిలెయ్యటం, పౌడర్, సెంటులిచ్చే వాడితో వెళ్ళిపోవడం, గుల్లగా మారి, ఊళ్ళోకి తిరిగొస్తే ఏముంది. శేషజీవితం పిచ్చిదానిలా గడవటం ఇది కథ. ఓ జానపద గీతం ఈ వ్యామోహాన్ని వ్యక్తీకరించింది.

సెన్గసేన్ల నిలుసుని నీవు
సెయిజాపవే పూసలోల్ల రాజమ్మా!
కందిసేన్ల నిలుసుని నీవు
కన్నుగీటవే పూసలోల్ల రాజమ్మా...

అలా కన్ను గీటిన రాజమ్మ తీరే మారిపోయింది. నీ కిరు కిరు చెప్పులకు/ నీ వన్నే నడకలకు / నీకు పిల్లలు కారమ్మో

/ పూసలోల్ల రాజమ్మ – అలా కిర్రు చెప్పులు, వన్నె నడకలు వచ్చిన రాజమ్మను జానపద కవి శపిస్తున్నాడు. నీ నడవడిక ఇలా ఉండే 'నీకు పిల్లలు పుట్టరు' అన్నాడు. ఈ జానపద గీతాన్ని సినారె సినిమా పాటగా మలిచారు. అది బహుళ ప్రాచుర్యాన్ని పొందింది. ఈ కథ పేరు రాజమ్మ రాజిరికం. ఆమె రాజిరికం అలా తెల్లారిందన్నమాట! నారి గాని బతుకు గీత కార్మికుని కుటుంబంలోని అస్తవ్యస్త పరిస్థితుల చిత్రణ. ఆ బతుకుల్లో మమేకమైతే తప్ప రాయలేని కథ. అలాగే సంచారజాతికి (పిచ్చుకుంట్ల) చెందినవారి జీవన పరిణామం లచ్చి కథ. కులవృత్తిలోంచి రిక్షా లాగుడుకు. ఆ సంధి దశ దారుణం. అతని భార్య లచ్చి కష్టమే ఆధారం. లచ్చిపాత్రను ఉదాత్తంగా చిత్రిస్తాడు రచయిత. ఆ రోజుల్లో కరీంనగర్, వరంగల్, నిజామాబాద్ జిల్లాల్లోంచి వలసలు ప్రారంభమైన క్రమంలో బొంబొయి ఒక ఆకర్షణ. రంగడు కథ ఈ వలస క్రమాన్ని హృదయవిదారకంగా చిత్రించింది. మారాజు కథ కూడా బొంబొయి వలస కథే. చీకటి గొడుగులు అనేది స్త్రీ స్వాతంత్ర్యాన్ని గురించిన కథ. అప్పుడు రచయిత కోరిన స్వాతంత్ర్యం వేరు.

గూడూరి సీతారాం కథల్లో ఇరవై శాతం పూర్తి మాండలికంలో రాసినవి. పూర్తి మాండలికంలో రాసిన కథలకు అఖిలాంధ్ర సన్నివేశంలో పరిమితి ఉందని సీతన్న గుర్తిస్తున్నాడు. పూర్తి మాండలికానికి పత్రికల్లో అప్పటికీ ఇప్పటికీ అనాదరణ ఉంది. ఈ కారణం వల్లే. పాత్రోచిత భాషగా పరవాలేదు. అయితే, శ్రీకాకుళం, విజయనగరం తదితర మాండలిక రచనలను ఆదరించినంతగా తెలంగాణ మాండలికం ఆసక్తినైనా నోచుకోలేదని ఈ రచయితల బాధ. ఈ బాధకు తరుణం పోయిందిప్పుడు. జూకంటి జగన్నాథం అన్నట్లు " ఈ కథలు అచ్చమైన తెలుగు భాషా సంస్కృతిలోంచి నిజాయితీతో స్వచ్ఛంగా పూసిన మొగిలి రేకులు. "సీతన్నా శతాయుస్మాన్ భవ!






కథ చిన్న టార్చిలైటు వేసి జీవితరేఖలోని ఒక బిందువును, ఒక జీవిత శకలాన్ని చూపుతుంది

నవలను బూర్జువాసమాజం ప్రపంచ సంస్కృతికిచ్చిన మహత్తరమైన కానుకగా నవలా సాహిత్య విమర్శకులు అభివర్ణిస్తారు. ఆ పద్ధతిలోనే మనం కథను పారిశ్రామిక నాగరికత ప్రపంచ సంస్కృతికిచ్చిన మహత్తరమైన కానుకగా అభివర్ణించవచ్చు.

చెప్పవలసినదాన్నంతా చెప్పటంచేత నిస్సందేహంగా కథకు విలువ తగ్గుతుంది. చెప్పవలసినదాని కంటే ఎక్కువ చెప్పటం కథా ప్రక్రియకే విరుద్ధం. ఈ విషయాన్నే చెకోవ్ ఒక సందర్భంలో చమత్కారంగా చెప్పాడు. 'కథలో చెప్పవలసినదానికంటే తక్కువ చెప్పటం మంచిది. ఎందుకంటే... ఎందుకంటే... ఎందుకో నాకు తెలియదు' అన్నాడు చెకోవ్. 'నాకు తెలీదు' అన్నంత మాత్రం చేత చెకోవ్‌కు నిజంగానే తెలియదనుకోవటం మన అమాయకత్వం మాత్రమే.

కథలో సంఘర్షణతో సంబంధంలేని సంఘటన ఉండదు. అలాగే సంఘటనతో సంబంధం లేని పాత్ర ఉండదు. కాబట్టి సంఘర్షణ, సంఘటన, పాత్ర ఒక అవిభాజ్యమైన త్రయం. ఈ మూడు అంశాలూ ఒకదాన్నొకటి ప్రభావితం చేసుకుంటూ ముందుకు సాగుతాయి.

కథలో పాత్రపోషణ రచయిత 'చెప్పటం' పాఠకుడు 'తెలుసుకోవటం' అన్న సూత్రం మీద జరగదు. కథారచయిత సంఘటనను 'ప్రదర్శిస్తాడు'. పాఠకుడు పాత్రను తన ఊహాశక్తితో అర్థం చేసుకుంటాడు. పాత్రను గురించి అన్ని విషయాలనూ తానే చెప్పే కథారచయిత చాలా తక్కువ రకం కళాకారుడు మాత్రమే. కథాంశాన్ని పాఠకుని ఊహాశక్తికి వదిలిపెట్టని కథ కూడా చాలా తక్కువ రకం కథే.

– వల్లంపాటి వెంకటసుబ్బయ్య

# 5



| | |
|---|---|
| ■ ఉత్తమ కథ | - కొడవటిగంటి కుటుంబరావు<br>- పాలగుమ్మి పద్మరాజు |
| ■ కథాంశాలు | - కేతు విశ్వనాథ రెడ్డి |
| ■ వస్తురూపాలు | - డా॥ పాపినేని శివశంకర్ |
| ■ తెలుగులో విమర్శనాధోరణులు | - రాచపాళెం చంద్రశేఖర రెడ్డి |
| ■ మన చదువుల్లో కథల స్థానం ఏమిటి? | - ప్రొ॥ కృష్ణకుమార్ |
| ■ కాబోయే కథకులకు పనికొచ్చే చిట్కాలు | - ఆరుద్ర |




# ఉత్తమ కథ

## కొడవటిగంటి కుటుంబరావు
## పాలగుమ్మి పద్మరాజు

**కుటుంబరావు** : ఏమండి పద్మరాజుగారూ, మీరు కొత్త కథానిక ఏదైనా రాస్తున్నారా?

**పద్మరాజు** : లేదండి, ఈమధ్య కథానికల మీదకి మనస్సంతగా పోవడం లేదె.

**ప** : ఒహ కారణం, రాసిన కథలకి తగినంత ప్రచారం రాకపోవడమూ,రెండోది రాస్తున్నకొద్దీ దానిమీద మోజు తగ్గడమూనూ.

**కు** : కథల మీద మోజు తగ్గటం అన్నారే నాఅనుభవంలో కూడా కథ రాయాలంటే ముందుండినంత ఉత్సాహం ఇప్పుడు ఉండటం లేదు. దీనికి కారణం కథానిక యువకుల సొమ్మేమోనని నా కనిపిస్తున్నది మీరేమంటారో....

**ప** : కేవలం వయస్సే కారణం అని అనను గాని మీరు చెప్పినది ఒప్పుకుంటాను. నేనొకప్పుడు పద్యాలూ, పాటలూ రాసేవాణ్ణి, ఇప్పుడసలు వాటి మీదకు మనస్సే పోదు. ఈ మనస్సులో వచ్చే మార్పు - అంటే మనిషి అభిరుచుల్లోను భావావేశంలోను, దృక్పథంలోనూ వచ్చే మార్పు ముఖ్య కారణమనుకుంటాను, కొందరు ఎన్నేళ్ళు వచ్చినా భావకవిత్వమూ, చిన్న కథలూ రాయగలిగుండవచ్చు.

**కు** : ఈ విధంగా వార్ధక్యంలో కూడా చిన్నతనంలో లాగే రాయడానికి ప్రయత్నించే వాళ్ళని ఒకరిద్దరిని చూస్తున్నాను; వారిలో మానసిక పరిణామం పూర్తిగా స్తంభించిపోయినట్లు వారి రచనలను చూస్తేనే తెలుస్తుంది. ఇంకొక విషయం కూడా ఉంది. నేను పదిహేను పదహారేళ్ల కిందట రాసిన కొన్ని కథలు తిరిగి చూసుకుంటే వట్టి పిండెల్లాగున్నాయి.

**ప** : మనం వెనక రాసిన కథల్ని ఇప్పుడు మనం విమర్శించుకోటంలో కొంచెం పొరపాటుందనుకుంటాను. ఏ వుత్సాహమైతే మనచేత ఆ కథలు రాయించిందో ఆ వుత్సాహంతో మనకిప్పుడు అంత ప్రమేయం లేకపోవడం మీరన్నదానికి కారణం. కాని ఆ వుత్సాహానికి తప్పకుండా విలువుందని నేనంటాను.

**కు** : విలువ లేకేం, వుంటుంది. ఆ విలువను పాటించే వాళ్లు ఇప్పటికీ వాటిని చదివి సంతోషిస్తూనే ఉంటారు.

**ప** : అదేలెండి. కథానిక యువకుల చేతుల్లోనే బాగా నడుస్తుంది; అని ఒప్పుకోవచ్చు. వయసుమీరిన కొద్దీ లోకాన్ని గురించిన అనుభవం పెరిగి చెప్పదల్చుకున్న విషయం కథానికలో ఇమడ్చడం కష్టమవుతుందనుకుంటాను.

**కు** : అవును పద్మరాజు గారూ, నేనింకా కథానికలు రాస్తూనే వున్నాను గాని కథ ఆలోచించినప్పుడల్లా ఆ పాత్రల వెనుక వుండే వాతావరణమూ మనసత్త్వమూ నా వూహలో తెగ పెరిగి పెద్ద కథ రాయాలనే ప్రేరణ కలుగుతూవుంటుంది. ఒక్కొక్కప్పుడు బుద్ధి నాటకం రాయాలన్నంత దాకా పోతుంది.

**ప** : నాటకాల విషయం వచ్చింది కనుక చెపుతున్నాను. ఈ మధ్య నేను రాసినవన్నీ నాటికలూ, నాటకాలూను. ఇంకో ధోరణిలోకి మనసు పోవటం లేదు. ఇందాకనే నాటకాంతం

సాహిత్యం అని పెద్దలన్నారనుకుంటాను.

**కు :** మీ అనుభవం తెలియదు కాని నేనువొకప్పుడు కథలో శిల్పం తప్ప మరేమీ చూసేవాణ్ణి కాదు. అప్పటి నా ఉద్దేశంలో కథకి శిల్పం తప్ప ఇంకేమీ అవసరంలేదు. ఆ వైఖరి ఇప్పుడు మారిందనుకోండి.

**ప :** ఇప్పుడు మీ అభిప్రాయం, శిల్పం ప్రధానం కాదంటారా?

**కు :** అది కాదు. ఇప్పుడు కథాశిల్పం గురించి నాకు ఏ విధమైన జంకూ లేదు. ఒకప్పుడు 'నా శిల్పం ఎంత బాగుంటుందో చూడండి' అన్నట్టుగా కథ రాసేవాణ్ణి. ఇప్పుడు కేవలం శిల్ప ప్రదర్శన కోసమే కథ రాయటం వట్టి దండుగగా కనిపిస్తోంది.

కాని కథకి శిల్పం ఆయువుపట్టు అని మాత్రం ఆనాడే కాదు ఈనాడు కూడా వొప్పుకుంటాను. కథలో శిల్పం లేకపోయినాక ఇంకెన్నున్నా దండుగే.



**ప :** నా బాధేవిటంటే ఈ విషయం గుర్తించిన కథా రచయితలు చాలా తక్కువ మంది కనిపిస్తున్నారు. ఇప్పుడు వచ్చే పత్రికల్లో కొన్ని వందల కథలు ప్రచురణ అవుతున్నాయి. దాదాపు ఒక్క కథలో కూడా చక్కని శిల్పం కనిపించడం లేదు. చెప్పదలచుకున్న విషయం యెంత నిజమైనా, యెంత వాస్తవికమైనా కథానికలో శిల్పం కనపడకపోతే కథ కుంటుపడుతుంది.

**ప :** మీరు చెప్పినదానికి ఒక ప్రబలమైన కారణం వుందనుకుంటాను. ఈ రోజుల ప్రభావాన్ని బట్టి కథకులు ముఖ్యంగా ఈనాటి యువకులు తమ కథల ద్వారా పరిస్థితులను మార్చాలని చూస్తున్నారే గాని, కథ యొక్క వాస్తవికత శిల్పం మీద యెంత ఆధారపడి వుందో గ్రహించటం లేదు. ఒక ఉదాహరణ చెపుతాను. నేను వట్టి అభూతకల్పనలు కథలుగా రాసే రోజుల్లో అప్పటికే పేరు పడ్డ ఒక కథకుడు నా కథలు చదువుతున్నంతసేపూ అవి నిజమైనట్టే అనిపిస్తుందన్నాడు. ఇది కేవలం శిల్పప్రభావమే అనటానికి నాకేమీ సందేహం లేదు. ఎంత వాస్తవికమైన పాత్రలూ, సంఘటనలూ తీసుకున్నా శిల్పలోపం చేత అవి అవాస్తవికంగా కనపడే అవకాశం లేకపోలేదు.

**ప :** పాత్రలూ సన్నివేశాలూ, వాస్తవికాలైనంత మాత్రాన్ని కథలో వాస్తవికంగా కనిపిస్తాయని ఋజువేం లేదు. మనం సృష్టించేది వాస్తవిక భ్రాంతి గాని వాస్తవం కాదు.

**కు :** అదీ నిజమే. ఇతివృత్తం నుంచి శిల్పాన్ని వేరు చేయటం సాధ్యం కాదని అనుకున్న తర్వాత, శిల్పంతో ప్రమేయం లేకుండా ఇతివృత్తంలోని ఒక పాత్ర గాని ఒక సన్నివేశం గాని యదార్థం అనుకోవటంలో అర్థమే లేదు. ఆ ఉద్దేశంలో అనేకమంది రచయితలు శిల్పాన్ని పోగొట్టుకునేది జీవితంలో తాము గమనించిన కొన్ని విషయాలు తీసుకొని వాటికి బలాత్కారంగా తమ ప్రయోజనం జోడించటం వల్లనే అని.

**ప :** నాకు ఒక్కొక్కప్పుడనిపిస్తుంది, అసలు యదార్థం అనేదే మనిషి మనిషికీ మారుతుందేమో అని, ఒకే సన్నివేశం వుందనుకోండి, అది ముసలివాళ్లకో రకంగాను, చిన్నపిల్లలకి మరో రకంగాను కనిపిస్తుంది. ఒక చిన్న పిల్లవాడు ఒక చావును గురించి కానీ, తల్లిదండ్రుల మధ్య తనకి తెలియని కారణాల వల్ల వచ్చే ఘర్షణల్ని గురించి కాని చెప్పడం ప్రారంభించినపుడు చాలా చిత్రమైన భావన కలుగుతుంది. అలాగే కథాశిల్పంలో ఏ దృష్ట్యా సన్నివేశాల్నీ, పాత్రల్నీ చిత్రించాలో నిర్ణయించుకోడం చాలా ప్రధానమని నాకు తోస్తుంది.

**కు :** అందుకే సందేహం లేదు. అక్కడే రచయిత యొక్క ఆశయం వ్యక్తమయేది కూడాను. మీరన్నట్టు జీవితంలోని ప్రతీ సంఘటనా చూసే వారిని బట్టి వేరు వేరు అంతరార్థంతో కనిపిస్తుంది. ఈ వైవిధ్యాన్ని కథాకారుడు కాచి వడపోసి నిగ్గుతేల్చి ఏ దృక్పథం నుంచి ఆ సంఘటనల్లోని సత్యాన్ని లోకానికి వ్యక్తం చేయాలో నిర్ణయించుకోవాలి. నిర్ణయించుకున్న అనంతరం అతని కథ వివిధ మనస్తత్వాలవారికి ఒకే అనుభూతినివ్వగలగాలి. ఇందులోనే కళ అనేదాని విశాల ప్రయోజనం ఇమిడి ఉంది.

**ప :** నేనిందాక చెప్పిన ఉదాహరణ ఉందనుకోండి. ఒక కుర్రవాడి ద్వారా తల్లిదండ్రుల మధ్య జరిగే ఘర్షణ కథకుడు

చిత్రిస్తున్నాడనుకోండి. అతని రచనని బట్టి ఒక కుర్రవాడి అనుభూతులు కాకుండా అసలు ఆ తల్లిదండ్రుల మధ్య ఏర్పడిన సమస్య, వారి వారి మనస్తత్వాలు కూడా కథలో వ్యక్తం కావాలి. అవి కుర్రవాడి మాటల్లోనే వ్యక్తం కావాలి. ఇదే అన్నిటికంటే కష్టమైన పని.

**కు :** అవును లేని పక్షంలో కథ కాకుల్ని కొట్టి గద్దలకి వేసినట్లవుతుంది. కథకుడి ప్రయోజనం కోసం కథలోని పాత్రలు బలి అవుతాయి. సాధారణంగా కథకుడి ప్రయోజనంలో సాంఘికమైన విలువ లోపించినపుడు ఇటువంటి రచనలు రాయటం జరుగుతుంది. దానిని సహృదయులు ఆదరింపలేరు. శిల్పం దృష్ట్యా కూడా అది మంచి రచన అనిపించుకోదు.

**ప :** ఉత్తమ కథలుగా ప్రఖ్యాతి పొందినవి చదివితే వాటిలో మనకి కొన్ని లక్షణాలు కనిపిస్తాయి. ఒకటి విషయాన్ని సూక్ష్మంగానూ, సూటిగానూ చెప్పడం. సామాన్యంగా కొత్తగా రచన ప్రారంభించే రచయితలు తమకు తోచినవన్నీ విధి విరామం లేకుండా వర్ణించేస్తుంటారు. ఈ సందర్భంలో చెహూవ్ – గోర్కీ కి ఇచ్చిన సలహావొకటి జ్ఞాపకం వొస్తుంది నాకు. ప్రకృతి వర్ణన కథలోని పాత్రలతోటి, సన్నివేశాలతోటి సంబంధం లేకుండా ఉండడం పెద్దలోపం అంటాడతను. గోర్కీ 'పడవ ప్రయాణం' అనే కథలో దీర్ఘంగా నదీ, చెట్లూ, చేమలూ, పడవా అందులోని వ్యక్తూలూ, సూర్యాస్తమయం, చంద్రోదయం దీర్ఘంగా వర్ణించుకుంటూ వెళ్ళాడు. దాన్ని విమర్శిస్తూ చెహూవ్ అన్నాడు; "నువ్వు వెన్నెలనీ, వనాన్నీ వేరేవేరేగా వర్ణిస్తున్నావు; నువ్వు చెయ్యవలసినది వెన్నెలపడి వనం ఎక్కడెక్కడ వెలుగుతోందో, ఆ భాగాలు వర్ణిస్తే చాలు. అప్పుడు వెన్నెలనీ – వనాన్నే కాకుండా ఆ రెంటికీ ఉన్న అనుబంధాన్ని కూడా చెపుతున్నావన్న మాట; అటువంటివి ఏరుకోవడంలోనే కథాశిల్పం వుందీ" – అన్నాడు.



**కు :** శిల్పం చెడకుండా వర్ణనలు చెయ్యటంలో చలంగారు ఒక్కొక్కప్పుడు అద్భుతంగా రాస్తారు. కాని, అప్పుడప్పుడు ఆయన రచనలోనే వర్ణనలు పాత్రల మనస్థితిని మించి వెళ్ళిపోయినట్టు కనిపిస్తుంది. నామట్టుకు నేనెప్పుడూ నా కథలలో ప్రకృతిని పాత్రలకి అనువుగా వుపయోగించుకోలేను. అందుచేత వర్ణనల జోలికిపోను.

**ప :** ఒక్క వర్ణనలే కాదు. ఇతివృత్తానికి సంబంధం లేని ఇతర విషయాల్ని కూడా కథల్లో ఇరికించడం జరుగుతోంది. కొద్దిమంది సిద్ధహస్తులు ఏ విషయాన్ని తీసుకొచ్చినా కథలో దానికి స్థానం కల్పించగల్గుతారు. దానివల్ల విచిత్రమైన ప్రయోజనాల్ని కూడా సాధించగల్గుతారు. మొపాసా 'నెక్‌లేస్" అనే కథలో కాలగతి సూచించడం కోసం ఫ్రాన్స్‌లో జరిగిన రాజకీయ పరిణామాలను కథతో బాటు ఏ సంబంధమూ లేకపోయినా వర్ణించి కథకు అద్భుతంగా ఉపయోగించుకున్నాడు.

**కు :** కాదా మరి? శిల్పంలో పొదుపూ ఉండాలి; ఉపజ్ఞా ఉండాలి. మన కథకుల్లో వేలూరి శివరామశాస్త్రి గారి రచన ఎంత బిగువుగా పొంకంగా ఉంటుందో చూడండి. మంచి కథ ఏది చదివినా అందులో ఒక వ్యర్థపదం వున్నట్టు గాని వొక వాక్యం తేలిపోయినట్టుగాని వుండకూడదు. మరొక విషయం ఏమిటంటే కథని ఏ పాత్ర ద్వారా చెప్పాలో కథకుడికి తెలియాలని మీరిందాకా అన్నారే, – కొందరు కథకులు కథను స్వానుభవంగా చెప్పాలో మరొకరి అనుభవంగా చెప్పాలో కూడా నిర్ణయించుకోలేరు. నేను నేను అని కథ చెప్పుకుపోతూ ఇతర పాత్రలు అనుకున్న విషయాలు, రహస్యంగా చేసే పనులూ విపులంగా వర్ణిస్తారు.

**ప :** దీనికి కారణం రచన మీద కేంద్రీకరణ లేకపోవటం చాలా కథలు ఎక్కడో మొదలవుతాయి. ఎక్కడో ఆఖరవుతాయి. నాకు కథా రచనకి ఒక ప్రధాన సూత్రం వుందనిపిస్తుంది. కథా ప్రారంభం ఏమిటో, కథ ఎన్ని తిరుగుళ్లు తిరిగినా, – చివరిదాకా జ్ఞాపకం వుండాలి.

**కు :** ఈ సూత్రాన్ని అక్షరాలా పాటించినట్టయితే మంచి కథలకి కొన్నిటికి దెబ్బ తగులుతుందేమో అని నా అనుమానం. అయినా ఆ సూత్రంలో ఒక సత్యం లేకపోలేదు. అదేమిటంటే ఒకే చిన్న కథను నాలుగైదు పాత్రల దృక్పథం నుంచి రచింపకూడదనేది. ఆ విధంగా దృక్పథాలు మార్చి

కథ చెప్పటం పెద్ద కథలకీ నవలలకీ సరిపోతుంది. ఈ కారణం చేతనే పాత్రల పరిణామం చిన్న కథలో సాధ్యం కాదు. కాని కొందరు కథకులు కథాశిల్పం తెలుసుకోలేక చిన్న కథలోనే ఒక జీవిత కథని ఇమడ్చటానికి ప్రయత్నిస్తారు.

**ప** : నవలకీ కథానికకీ వున్న పెద్ద భేదం ఇక్కడేనని అనుకుంటాను. ఒక పాత్ర జీవిత కథని ఆమరణమూ వర్ణించినా చిన్న కథలో ఆ పాత్రలోని ఏ ఒక్క విచిత్ర ప్రకృతినో స్పష్టం చేయడం మట్టుకు సాధ్యమవుతుంది. అంతేగాని, అతని మానసిక పరిణామం పూర్తిగా చిత్రించడానికి సాధ్యం కాదు.

**కు** : ఇంతకీ శిల్పానికీ రచనయొక్క ప్రయోజనానికీ అవినాభావం ఉన్నదని గ్రహించినట్టయితే, శిల్పంలో దోషాలన్నిటికీ మూలం కథ ప్రయోజనంలో దొరికిపోతుంది. కనీసం శిల్పం బాగుండి ప్రయోజనం పల్చబడవచ్చుగాని, శిల్పం పల్చబడి ప్రయోజనం విస్పష్టం కావడం సాధ్యం కాదు.



**ప** : రచయితకంటే ప్రయోజనాలకు ఆనాటి సమాజంలో ఉన్న పరిస్థితులకు చాలా దగ్గిర సంబంధం ఉండాలి. లేకపోతే ఆ రచన ఎందుకూ పనికిరాకుండా పోతుంది. తనకోసమే తను రాసుకుంటున్నాను, అనెవరైనా అన్నారంటే అది వట్టి బూటకం. ప్రతీ రచయితా ఒక పాఠకుణ్ణి మనస్సులో పెట్టుకోకుండా అసలు రచన సాగించలేడు.

**కు** : అంతేగదా మరి. కథకుడు ఇతివృత్తం ఎన్నుకోవటంలో గాని దానికి తగిన శిల్పం అమర్చుకోవటంలో గాని పూర్తిగా ఏకాకిగా ఉంటాడు. ఆ కథ రచించటంలో అతను పెట్టుకునే ఆశయం ఒకటే అతణ్ణి సామాజికుణ్ణి చేస్తుంది. అతను ఒంటరిగా తన గదిలో కూర్చొని కథ రాస్తున్నప్పటికీ అతని మీద కథ చదవబోయే సహృదయుడి ప్రభావం అనుక్షణమూ వుంటుంది. ఈ సహృదయుణ్ణి స్పష్టంగా భావన చెయ్యలేని రచయిత తన ప్రయోజనాన్ని కూడా స్పష్టంగా చూడలేడని నిస్సంకోచంగా చెప్పవచ్చు.

**ప** : ఈ సహృదయత అనేది పైపైని ఉండే వాదాలలోగాని, విశ్వాసాల్లోగాని కనిపించే సామ్యంగాదు. అది మనిషి లోలోపల స్థిరంగా వుండే మానవత్వానికి సంబంధించింది. అంచేత రచయిత స్పష్టంగా వ్యక్త పరచే సిద్ధాంతాలతో సానుభూతి లేనివారు కూడా అతని రచనలు చదివి ఆనందించడానికి సాధ్యమౌతుంది.

**కు** : అప్పుడేగదా కళ ద్వారా సంస్కారం అనేది సాధ్యపడేది? ప్రతి రచననీ దాన్ని ఆమోదించేవాళ్లే చదవాలంటే రచన చెయ్యటమే వృధా. ఇంతకన్న ప్రచార సాహిత్యమైనా మెరుగే.

**ప** : ప్రచార సాహిత్యానికీ కళకీ ప్రధానమైన భేదం వుంది. సామాజిక సిద్ధాంతాలు జన బాహుళ్యానికి అనువర్తిస్తాయి. వ్యక్తుల దగ్గిరకి వచ్చేసరికి ఆ సిద్ధాంతాల నిజానిజాలు ఋజువు కావు; వ్యక్తి సమస్య సంఘ సమస్య కొంత దూరదూరంగా వుంటాయి. వ్యక్తి దగ్గిరకి వచ్చేసరికి ప్రతీ సమస్య ఒక నైతిక, ఆధ్యాత్మిక స్వరూపాన్ని పొందుతుంది. అంచేతే సాహిత్య స్వరూపంలో ముఖ్యంగా చిత్రణ జరిగేది ఈ వ్యక్తి యొక్క నైతిక సమస్యకి, సమాజ నియమాలకీ మధ్య వచ్చే ఘర్షణే. సిద్ధాంతాలకి మొత్తం సంఘం ముఖ్యం; కళకి వ్యక్తి ప్రధానం.

**కు** : అందుచేతనే రచయితకు సంఘ సమస్యల్ని గురించి వుండే విశ్వాసాలు నేరుగా రచనలో పెట్టడానికి అవకాశం లేదు. రచన యెప్పుడూ జీవితం నుంచి రావలసిందే గాని సిద్ధాంతాల నుంచి వచ్చే అవకాశం లేదు. కాకపోతే యేమిటంటే జీవితంలో మనుష్యులు ఎదుర్కొనే నైతిక ఆధ్యాత్మిక సమస్యలని తాను అర్థం చేసుకోటానికి ఇతరులకి విస్పష్టంగా చెప్పటానికీ ఈ రచయిత విశ్వసించే సాంఘిక సిద్ధాంతాలు తోడ్పడవచ్చు. ఒక ఉదాహరణ చెప్తాను. ఒక రచయిత ధనికవాదం సంఘానికి ఉపకరించేదని నమ్ముతాడనుకోండి; ఆ రచయిత దృష్టి నుంచి ఒక నిరుద్యోగి ఆర్థిక సమస్య ఒక విధంగా గోచరిస్తుంది ఈ నిరుద్యోగి ఆ విధంగానే చిత్రిస్తాడు కూడా. నిరుద్యోగానికి ప్రధాన కారణం పెట్టుబడిదారీ అని మరొక రచయిత నమ్ముతాడనుకోండి; అతని దృష్టికి నిరుద్యోగి సమస్యలుతీరనివిగాను, నిరంతరం పెరిగేవిగాను గోచరిస్తాయి. ఈ నిరుద్యోగులందరూ సంఘటితపడి పెట్టుబడిదారీని ప్రతిఘటిస్తే తప్ప ఈ సమస్య పరిష్కారమయ్యేది కాదన్నట్టు అతడికి గోచరిస్తుంది.

**ప :** ఏ సిద్ధాంతాల్లో నమ్మకం ఉన్నా సమాజం ఎలా మారాలని రచయిత నమ్ముతున్నా తను చిత్రించే జీవితంతో రచయితకు దగ్గర సంబంధమూ ఆ జీవితాన్ని గురించిన పరిపూర్ణమైన అనుభవమూ ఉండాలి. వట్టి సిద్ధాంతాలే గాని, రైతుల్ని గురించి, కూలీల్ని గురించి ప్రత్యక్షమైన అనుభవం లేక, ఈనాటి కథకుల్లో చాలా మంది కథలు రాయలేకపోతున్నారని నా నమ్మకం.

**కు :** చిత్రం ఏమిటంటే, ఈ రైతుల్తోను కూలీల్తోను సన్నిహిత సంబంధం వున్నవాళ్ళు కూడా సానుభూతి వున్న వాళ్ళు కూడా ఒక్కొక్కప్పుడు సరియైన కథలు రాయలేకపోతున్నారు. వీరిని గురించి ఒకవైపు కొన్ని సిద్ధాంతాలున్నాయి. మరొకవైపు అనుభవం వున్నది. కాని, యీ రెంటినీ సమన్వయించే శక్తి రచయితకుండటం లేదు. దానికి ప్రధాన కారణం యేమిటంటే - రచయితకుండే సానుభూతి వెంట, ఆ రైతు కూలీల జీవితంలోని సత్యాన్ని గ్రహించే శక్తి కూడా లేకపోవటం; ఈ రైతుకూలీ పొద్దస్తమానం చెమలోడున్నాడని విచారిస్తాడు. ఎవరో ఒకరు చెమటోడ్చకుండా పొలాలు పండవనేది గ్రహించలేడు. చెమటోడ్చేవాడు ఎక్కడ అన్యాయానికి గురవుతున్నాడో కనుక్కోలేడు. అన్యాయానికి గురి అవుతున్నాడని మాత్రం తెలుసుకుంటాడు. ఈ రకం సానుభూతీ సిద్ధాంతాలూ మంచి రచనలు చెయ్యటానికి చాలవు. మీరు చెప్పినట్టు తాను రచించే విషయాన్ని గురించి అనుభవంతో పాటు ఆ అనుభవం వెనుక ఉండే జీవిత సత్యాన్ని తెలుసుకునే శక్తి కూడా ఉండాలి.



**ప :** ఒక్క చెమటోడ్చడమే రైతుకూలీ జీవితంలో ముఖ్యఘట్టమని రచయిత అనుకోడం దీనిక్కారణం. రైతుకూలీ ఒక వ్యక్తిగా కాక తన సిద్ధాంతంలో ఇమిడే ఒక భావంగా అతనిక్కనిపిస్తాడు. అంతేకాదు, ఒక రైతుకూలీ తన భార్యాపిల్లలతో ఇరుగుపొరుగులతో పంచుకునే సుఖదుఃఖాలని గురించి కూడా అతను తలపెట్టడు. అంచేత ఒక అసంపూర్ణమైన చిత్రాన్ని ప్రదర్శించడం మాత్రమే జరుగుతుంది.

**కు :** అవునుగాని, ఒకటడుగుతాను చెప్పండి. కళగా ఏ రచనైనా అన్ని రకాల వ్యక్తులకీ ఒకే భావన, అనుభూతీ ఇవ్వాలనుకున్నాంగాని ప్రత్యక్షంగా చూసినట్టయితే ఇది సాధ్యం కానట్టు కనిపిస్తుంది. మీరేమంటారు.

**ప :** పాత్రల చిత్రణా సన్నివేశాల చిత్రణా విషయంలో చదివే అందరికీ కొంచెం ఇంచుమించుగా ఒకటే అనుభూతి కలుగుతుందని అనుకుంటాను. అయితే మీరన్నవాటి వెనక వున్న అంతరార్థం గురించి గాని, రచనలో వ్యక్తమయ్యే సత్యాన్ని గురించిగాని భిన్నాభిప్రాయాలు తప్పకుండా కలుగుతాయి.

**కు :** అవునుగదా. అటువంటప్పుడు రచయిత ఎటువంటి జీవిత సత్యాన్ని చిత్రించాలన్న సమస్య కలగటంలేదా? సంఘంలో వుండే వివిధ వర్గాలలో ఏ వర్గాన్ని తన కళకి సహృదయులుగా ఎంచుకోవాలో తేల్చుకోవాల్సిన అవసరం ఏర్పడుతోంది గదా.

**ప :** రచయిత సమాజంలో భాగమే కనుక అతని సానుభూతి కొంచెం ఇంచుమించుగా ఏదో ఒక వర్గంతో ముడిపడివుంటుంది. అంచేత ఆ వర్గాన్నే అతను మనస్సులో పెట్టుకుని రచన సాగించడం కూడా జరుగుతుంది. ఇంక మిగతా వర్గాలవారికి అతని రచనల్లో వున్న జీవితసాన్నిహిత్యం మట్టుకే నచ్చుతుంది. అతను చిత్రించే జీవిత సత్యంతో మట్టుకు సానుభూతి వుండదు.

**కు :** ఈ రచయిత తన వర్గాన్ని గురించే రాయాలని కూడాలేదు. అనేకమంది ప్రసిద్ధ కథకులు తమకు చాలా దూరంగా వుండే వర్గాలని గురించి కూడా కథలు రాసి, ఆయా జీవితాల్లోని సత్యాన్ని ప్రదర్శింపగలిగారు. దీనికి టాల్‌స్టాయ్ మంచి ఉదాహరణ అనుకుంటాను.

**ప :** మీరన్న జీవితసత్యం టాల్‌స్టాయ్ తరచు తన రచనల్లో యిరికించే సిద్ధాంతాలు కావని నేననుకుంటాను. ఆ సత్యాలు అతని వ్యక్తిగతమైనవి. మీరన్న జీవితసత్యం ఇంతకంటే సూక్ష్మమైనదీ, సూత్రప్రాయంగా చెప్పడానికి వీల్లేనదీ అనుకుంటాను.

**కు :** నిజమే రచనలో ప్రవేశపెట్టడానికి యత్నించే నీతి వేరూ, రచన ద్వారా బయటపడే జీవిత సత్యం వేరూనూ.

మనం అనేక పాత కథలు చదివి, వాటిలో కొత్త నీతులు చూడగలుగుతాం; కాని, నీతి వుండే ప్రతీ కథలోనూ జీవిత సత్యం ఉండవలసిన అవసరం లేదు. రచనలో జీవితసత్యం వ్యక్తం కావాలంటే రచయితకి జీవితం ఎంతబాగా తెలియాలో ఆ జీవితం తాలూకు పరమార్థం కూడా అంత బాగా తెలియాలి.

ప : నీతులూ, సిద్ధాంతాలూ, అలావుంచి రచనల్లో వ్యక్తమయ్యే ఈ జీవితసత్యమే ఒక్కొక్కరికీ ఒక్కొక్క రకంగా అర్థమౌతుందని మనం ఇందాకా అనుకున్నాం. అయితే ఈ భిన్నసత్యాల్లో ఏదో ఒకటి నిజమైనదైయుండాలి. దాన్ని నిర్ధారణ చెయ్యడం ఎలాగ?

**కు :** సంఘంలో ప్రతివ్యక్తీ అనుక్షణమూ తనకు కావలసిన సత్యం గురించి అన్వేషిస్తాడు. నిరుద్యోగి ఉద్యోగం దొరికేచోట్ల చూస్తాడు. పారిశ్రామికుడు తన కింద వున్న ఉద్యోగుల సంఖ్య తగ్గించేందుకు మార్గాలు చూస్తాడు. ఇటువంటి సత్యాలు ఆయా వ్యక్తుల జీవితాలను ముందుకు తీసుకుపోతాయనటానికి సందేహం లేదు. కాని, ఇవి సామాజిక జీవితాన్ని ముందుకు తీసుకుపోతాయనటానికి సత్యాలు మాత్రం కావు; ఒకే దేశంలో ఒక మనిషి నుంచి ఇంకో మనిషి లాభం పొందినప్పుడు దేశంలో వున్న డబ్బు పెరగనట్టు జీవితసత్యం అయినపుడు దానికి రెండు దాఖలాలుండాలి. ఒకటేమిటంటే, సత్యం అనేది అన్ని వర్గాల వారికీ నిర్వివాదంగా కనపడాలి. రెండవది ఆ సత్యం తెలుసుకోవటం వల్ల ప్రతీ వ్యక్తికీ సమాజం స్వరూపాన్ని గురించిన జ్ఞానం విధిగా అభివృద్ధి చెందాలి.

ప : కథల్లో సామాజికమైన సమస్యలు చిత్రించినట్టయితే ఆ జీవితసత్యం అనేది కొంతవరకు గుర్తుపట్టడానికి అవకాశం వుంటుంది. కాని, సాహిత్యంలో గొప్ప స్థానం సంపాదించుకున్న కొద్దిమంది రచనల్లో స్పష్టమైన ప్రయోజనం కాని, ఒక జీవితసత్యం కాని ఎత్తి చూపడానికి కనపడదు. వాటి సాహిత్య ప్రయోజనాన్ని ఎలాగ అంచనా వెయ్యడం.

**కు :** ఇందులో ఒకటుందనుకుంటాను. సామాజిక సమస్యనెత్తుకున్నప్పుడు ఆ సమస్యను కథకుడు సరిగా చిత్రిస్తున్నాడో తారుమారు చేస్తున్నాడో ప్రజలకి సులభంగా తెలిసిపోతుంది. అంతేగాక ఆ సమస్య ఎట్లా పరిష్కారం కావాలనే విషయం జనబాహుళ్యానికి తెలిసివుంటుంది. కాని, స్పష్టమైన ప్రయోజనం కాని, జీవితసత్యం కాని ఎత్తి చూపడానికి కనపడని గొప్ప రచనల్లో రెండు రకాలుంటాయని నా అనుమానం. ఒకటి, రచయిత ప్రతిభావంతుడై ఉండి కూడా, తానే సాంఘిక సత్యాన్ని సరిగా అవగాహన చేసుకోకపోవటం. నిజానికి వాస్తవ జీవితాన్ని గురించి వాస్తవంగా రాయటానికి ఇది అడ్డు కాదు. ఇందుకు గొప్ప ఉదాహరణ గోర్కీ నాటకం: “లోవర్ డెప్త్స్”. అంతర్జాతీయ కథానికల పోటీలో బహుమానం పొందిన మీ ‘గాలివాన’ తీసుకోండి. ఇందులో ప్రత్యేకించి ఒక సాంఘిక సమస్య లేదు. కాని ఆ కథ అంతటా వాస్తవ మనస్తత్వ చిత్రణ గోచరిస్తుంది. అందులో కనిపించే సాంఘిక సత్యం ఏమిటి అంటే ఒక వాక్యంలో చెప్పటం సాధ్యం కాదు. కాని, అటువంటి సాంఘిక సత్యం దానిలో తప్పకుండా వుంది.

ప : అంటే ఏ రచనకైనా బలాన్ని చేకూర్చేది. ఈ జీవిత సత్యమే అనాలి. ఇది మానవత్వమంత విశాలమైంది కూడాను. అంటే కళ నిష్ప్రయోజనమైంది కాదనీ, దానికి జీవితంతో, మనం నివసించే సమాజంతో దగ్గర సంబంధం వుండడమే కాక జీవితాన్ని అర్థం చేసుకోడానికి ఒక దృష్టి పథాన్ని కూడా కలిగించాలి.

**కు :** అంతే మీ కభ్యంతరం లేకపోయినట్టయితే యథార్థమయిన కళ ‘జీవితం యొక్క జీవితం’ అంటాను.

ప : మనం కథానికలతో ప్రారంభించి చాలా విశాలమైన సాహిత్య సమాలోచనలో పడ్డాం. అయితే ఉత్తమ రచనలకి అన్నిటికీ ఉండవలసిన లక్షణాలు సామాన్యంగా ఒకటేగనక ఈ సమాలోచన తప్పదనుకుంటాను. మన చర్చలో తేలిన అంశాల్లో గుర్తుంచుకోవలసినవి; ఇవి అని నాకు తోస్తుంది. ఉత్తమ కథకి మొట్టమొదట ఉండవలసింది శిల్పం. రెండోది వాస్తవికత. మూడోది జీవిత సత్యానికి సంబంధించిన ప్రయోజనం.






# కథాంశాలు

## కేతు విశ్వనాథరెడ్డి

> **ఇతివృత్తం అంటే కార్యకారణ సంబంధముండే, ఉత్సుకతను కలిగించే సంఘటనల పరంపర లేదా సంఘటనల క్రమం. దీన్ని సంఘటనలలో పాల్గొనే వ్యక్తుల చర్యల క్రమం అని కూడా అనవచ్చు. అంతేకాదు ఆయా సంఘటనల్లో పాల్గొనే వ్యక్తుల మధ్య ఘర్షణ అయినా, భావాల మధ్య ఘర్షణ అయినా, కోరికలూ, ఆశయాల మధ్య ఘర్షణ అయినా, వీటిక్రమం ఇతివృత్తం అవుతుంది.**

కథ దేన్ని గురించి? ఎవరి గురించి? కథలోని ముఖ్యాంశాలు ఏమిటి? అవి సంఘటనలుగా ఎట్లా ఏర్పడ్డాయి? ఆ సంఘటనల మధ్య సంబంధాలేమిటి? వాటిలో చిత్రితమైన వారి చిత్తప్రవృత్తులేమిటి? వారి కార్యకలాపాలు ఎక్కడ జరుగుతున్నాయి? ఆ చిత్తవృత్తుల సంబంధాల పర్యవసనాలేమిటి? ఈ ప్రశ్నలకు జవాబులు దొరకాలంటే నవల ఇతివృత్తాన్నీ, పాత్రచిత్రణనూ, వాతావరణాన్నీ మనం పట్టించుకోక తప్పదు. రచయిత వాటిపట్ల ఎటువంటి శ్రద్ధాశక్తులను కనపరచాడో పరిశీలించక తప్పదు.

### 1. ఇతివృత్తం

కథ **(Story)** వేరు ఇతివృత్తం **(Plot)** వేరు. కథ అంటే జరిగిన విషయాల వరుస. జరిగిన విషయాలన్నీ అసక్తికరం కావు. జరిగిన విషయాలన్నిటిలో రచనకు కావలసిన, తగిన కార్యకారణ సంబంధాలూ, చర్యా ఉండకపోవచ్చు. అందువల్ల కేవలం కథ నవల కాదు. ఒక ఇతివృత్తం నవలకు దారితీస్తుంది. ఇతివృత్తం అంటే కార్యకారణ సంబంధముండే, ఉత్సుకతను కలిగించే సంఘటనల పరంపర లేదా సంఘటనల క్రమం. దీన్ని సంఘటనలలో పాల్గొనే వ్యక్తుల చర్యల క్రమం అని కూడా అనవచ్చు. అంతేకాదు ఆయా సంఘటనల్లో పాల్గొనే వ్యక్తుల మధ్య ఘర్షణ అయినా, భావాల మధ్య ఘర్షణ అయినా, కోరికలూ, ఆశయాల మధ్య ఘర్షణ అయినా, వీటిక్రమం ఇతివృత్తం అవుతుంది. ఇతివృత్తంలో ఒక ప్రధానపాత్ర అంటే నాయకుడూ లేదా నాయిక ఉంటే ఉండవచ్చు. లేదా ఒక వర్గం ప్రధానపాత్రగా ఉండవచ్చు.

ప్రధానపాత్ర (అంటే కేంద్రపాత్ర) లేదా ప్రధానవర్గం (అంటే కేంద్రవర్గం) మరొక వ్యక్తితోగాని, సమూహంతోగానీ, వర్గంతోగానీ ప్రత్యర్థిస్థానంలో ఉండవచ్చు. ఒక్కొక్కప్పుడు ప్రకృతిగానీ, సమాజ శక్తులుగానీ, 'విధి' గానీ ప్రత్యర్థి స్థానంలో ఉండవచ్చు. మరిఒక్కప్పుడు ప్రధానపాత్ర అంతఃస్వభావంలోని కొన్ని అంశాలే ప్రత్యర్థి స్థానంలో ఉండవచ్చు. చదరంగంలోని ప్రత్యర్థులనూ, ఒంటిగా గదిలో మనలో మనం కుళ్లు కుంటున్నప్పుడో ఘర్షణపడుతూ ఉన్నపుడో ఉండే మానసిక ప్రపంచాన్నీ ఊహించుకోండి. ఇతివృత్తంలోని ఘర్షణ స్వభావం అర్థమవుతుంది.

ఇతివృత్త నిర్మాణంలో మరొక ప్రధానమైన అంశం సంభావ్యత. ఈ సంభావ్యత అనే మాటనే ఇంగ్లీషులో **(Plausibility, Verisimilitude)** అనే మాటలతో సూచిస్తూ ఉంటారు. సంభావ్యత అంటే వాస్తవంలో సంభవించవచ్చు అనే సంఘటనల క్రమం. పాఠకులను నమ్మించేటట్లు చేసే చిత్రణ. మరీ యాదృచ్ఛికంగా జరిగే ఘటనలూ, కాకతాళీయంగా సంభవించే అంశాలూ, మానవజీవితలో అనలు సంభవించని అద్భుతాలూ సంభావ్యతను దెబ్బతీస్తాయి. విశ్వనాథ సత్యనారాయణ వేయిపడగలులోని పసరిక పాత్ర కన్పించే ఘట్టాల సంభావ్యతను గురించి ఆలోచించండి. సంభావ్యత లక్షణం బోధపడుతుంది. అదొక ప్రతీక అనుకుంటే మొత్తం నవలను ప్రతీక నవల అనాలి.



నవలలో ఇతివృత్త ప్రయోజనాన్ని పరిశీలించేటప్పుడు గుర్తుంచుకోవలసిన ప్రధాన ప్రశ్నలు: 1. కథమూల స్వభావాన్ని వివరించడంలో సంఘటనల మధ్య ఉండే సంబంధం ఏమిటి? 2. ఇతివృత్తం ఆదిమధ్యాంతాల మధ్య ఒక ఐక్యత ఉంటే ఃపరస్పర సంబంధాలతో సమన్వయం ఉందా. లేదా? సంఘటనలు ఎప్పుడు జరిగాయి? ఏం జరగడానికి దోహదం చేస్తున్నాయి.

**ఇతివృత్త నిర్మాణంలో మరొక ప్రధానమైన అంశం సంభావ్యత. ఈ సంభావ్యత అనే మాటనే ఇంగ్లీషులో (Plausibility, Verisimilitude) అనే మాటలతో సూచిస్తూ ఉంటారు. సంభావ్యత అంటే వాస్తవంలో సంభవించవచ్చు అనే సంఘటనల క్రమం. పాఠకులను నమ్మించేటట్లు చేసే చిత్రణ.**

**2. పాత్రచిత్రణ**

పాత్రలు అంటే కథలో ఎదురయ్యే మనుషులు: ఆ మనుషుల జీవితాశయాలూ, ఆశానిరాశలూ, భావోద్వేగాలూ, భావాలూ. ఇతివృత్తానికీ పాత్రలకూ ఒక విడదీయరాని బంధం ఉంటుంది. ఇతివృత్తంలో ప్రధానపాత్ర లేదా ప్రధానవర్గం ఏదో తెలుసుకోవాలంటే ఎట్లా? కథలోని ప్రధాన సంఘటనల్లో కన్పించే వ్యక్తి లేదా వర్గం కేంద్రపాత్ర అన్నమాట, కేంద్రవర్గం అన్నమాట. ఈ కీలక వ్యక్తివల్ల లేదా ఈ కీలక వర్గంవల్ల కథ ముందుకు జరుగుతుంది. సంఘటనల్లో మార్పు వస్తుంది.

ఈ కేంద్ర వ్యక్తిపట్లగానీ, కేంద్రవర్గంపట్లగానీ దృష్టి మార్పుకు గురి అవుతూ ఉంటుంది. నవలలో మనం కేంద్రవ్యక్తి లేదా కేంద్రవర్గాన్ని గుర్తుంచుకునేటప్పుడు వేసుకోవలసిన ప్రశ్నలు : 1. ప్రధానపాత్ర చిత్రణ మనం నమ్మేట్లు ఉందా? ఈ పాత్రలో ఏఏ మార్పులు ఇతివృత్త క్రమంలో జరుగుతున్నాయి? ఈ మార్పుల్లో ఒక పద్ధతి, ఒక నియమం ఉన్నాయా? ఏ హేతువూ లేకుండా మారిపోతున్నాయా? అసలే మారిపోలేదా? పాత్రలు జీవితానికి దగ్గరగా ఉన్నాయా లేదా? కేవలం వ్యక్తి లక్షణాలను గుర్తుకు తెస్తున్నాయా? సామాన్య లక్షణాలను గుర్తుకు తెస్తున్నాయా? ఒకే గుణాన్ని గుర్తుకుతెచ్చే మూసపాత్రలా ఇవి? సంక్లిష్టమైన మానవీయ భావాలకూ, భావోద్వేగాలకూ ఇవి గుర్తులా? చదివిన పుస్తకాల్లోంచి పుట్టాయా? రచయిత అనుభవంలోంచి పుట్టాయా? ఈ పాత్రల సామాజిక మనస్తత్వం ఏమిటి? అంతరంగిక స్వభావం ఏమిటి? ఈ రెంటికీ ఉన్న సంబంధం ఏమిటి?

పాత్రచిత్రణ నమ్మేట్లే ఉండాలంటే, పాత్రలలో కలిగే మార్పులు నమ్మేట్లు ఉండాలంటే, పాత్రలు సంఘ మానవ స్వభావానికి దగ్గరగా ఉండాలంటే ఎట్లా ఉండాలి అనే ప్రశ్న కలగవచ్చు. పాత్రల పరిధినీ, పాత్రల గుణాత్మకమైన మార్పులకు కారణమైన సంఘ పరిస్థితులనూ, ఆ మార్పులు జరుగుతున్న కాలక్రమాన్నీ ఒక క్రమంలో నవలారచయిత చిత్రించగలిగితే ఇది సాధ్యమవుతుంది. సినిమాల్లో తప్ప, అర్భక నవలల్లో తప్ప, కేవలం ఆదర్శ దుష్టపాత్ర, ఆదర్శ మంచిపాత్రగా మారిపోవడం సాధ్యంకాదు.

ప్రధానపాత్ర ప్రాధాన్యం వహించే నవలలను పాత్రచిత్రణ ప్రాధాన్య నవలలు అంటారు. సామాజిక జీవిత చిత్రణ, విశ్లేషణ ప్రాధాన్యం వహించే నవలలను సమాజచిత్రణ నవలలు అంటారు. బుచ్చిబాబు చివరకు మిగిలేది ఒకరకంగా పాత్ర చిత్రణ ప్రధాన నవల. మహీధర రామమోహనరావు రథచక్రాలు సమాజచిత్రణ నవల. (ఈ రకాలు రెండూ సాంఘిక నవలల వర్గంలోకే చేరతాయి. ప్రాధాన్యంలో తేడానుబట్టి ఉపవర్గీకరించుకుంటున్నాం అంతే.)

**3. వాతావరణం**

వాతావరణం అంటే కథ జరిగే కాలం, పరిసరాలు. పరిసరాలు అన్నప్పుడు అవి ప్రకృతి పరిసరాలు కావచ్చు. సంఘ పరిసరాలు కావచ్చు. రెండూ కావచ్చు. వీటిని నవలా రచయిత స్వయంగా చర్చించవచ్చు. కథలో భాగంగా మలచవచ్చు. వీటి ప్రయోజనం ఏమిటి?

ఇతివృత్త సంభావ్యత, పాత్రల సంభావ్యత కాల పరిస్థితులను బట్టి, భౌగోళిక (ప్రకృతి) పరిస్థితులనుబట్టి, సంఘ పరిస్థితులనుబట్టి రూపుదిద్దుకుంటాయి. మహీధర 'స్వయంవరణం'లోని సుధా కామేశ్వరరావులను విజయవాడ, విశాఖ వంటి పట్టణాల్లో ఊహించగలం. కానీ మరీ వెనుకబడిన గ్రామీణ ప్రాంతాల్లో ఊహించలేం. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు రాసిన మాలపల్లి నవలలో చౌదరయ్య వంటి కరకు భూస్వామిని ఒక పెద్ద నగరంలో అట్లాగే ఉంటాడని భావించలేం. తెన్నేటి సూరి రాసిన చెంఘిజ్‌ఖాన్ నవలలో చెంఘిజ్‌ఖాన్‌ను 12, 13 శతాబ్దాల్లో గోబీ ఎడారుల్లాంటి ఎడారుల్లో ఊహించగలం కానీ, 15, 16 శతాబ్దాల్లో హంపీ విజయనగరాల్లో ఊహించలేము.



**తెన్నేటి సూరి రాసిన చెంఘిజ్‌ఖాన్ నవలలో చెంఘిజ్‌ఖాన్‌ను 12, 13 శతాబ్దాల్లో గోబీ ఎడారుల్లాంటి ఎడారుల్లో ఊహించగలం కానీ, 15, 16 శతాబ్దాల్లో హంపీ విజయనగరాల్లో ఊహించలేము.**

అంటే పాత్రలు జీవించిన కాలమూ, భౌగోళిక పరిసరాలూ, సంఘ పరిస్థితులు పాత్రల స్వభావాన్నీ, ఇతర పాత్రలతో సంబంధాన్నీ నిర్ణయిస్తాయన్నమాట. మనకు ఆయా పరిసారాలకూ, పరిస్థితులకూ అనుగుణమైన భావోద్వేగాలనూ కల్గిస్తాయన్నమాట. అంతేకాదు. ఇవి రచనోద్దేశాన్ని వెల్లడిస్తాయి కూడా. వీటి ప్రధాన లక్ష్యం ఇతివృత్త నేపథ్యాన్ని సమకూర్చడం అని మరచిపోకూడదు.

**వస్తు లక్ష్యస్థాయి :**

నవలలోని కథ నుండి రచయిత చెప్పదలచుకున్న అంశమేదో ఉంటుంది. అట్లాంటి అంశాన్ని వస్తు లక్ష్యం అంటాం. కథను నడిపే ముఖ్యమైన భావాన్ని కానీ, కథకు మూలమైన రచయిత ఉద్దేశాన్ని కానీ పరిశీలించటం వస్తు లక్ష్యస్థాయి పరిశీలన అవుతుంది. దీన్నే మనం రచనోద్దేశంఅని అనవచ్చు. కథానికల్లో అయితే దీన్ని కొందరు విమర్శకులు పాయింట్ Point అని పిలుస్తారు.

రచనోద్దేశం రచయిత నవలలోని కథ ద్వారా సామాన్యీకరించిన జీవిత సత్యం అన్ని రకాల నవలల్లోనూ రచనోద్దేశాలు ప్రస్ఫుటంగా కనపడకపోవచ్చు. మొక్కపాటి బారిష్టరు పార్వతీశం వంటి హాస్య నవలలో రచనోద్దేశం హాస్యోత్పాదకతే. అపరాధ పరిశోధ నవలల్లో రచనోద్దేశం అపరాధ పరిశోధనే.

ఈ రచనోద్దేశం ఒక పాత్రను వెల్లడించడం కావచ్చు. అది ప్రకృతిలో, సంఘంలో ఉండే మానవ సంబంధాల ద్వారా వెల్లడి కావచ్చు.

రచనోద్దేశాన్ని ఎట్లా కనుక్కోవటం? ఇందుకు కొన్ని సూత్రాలున్నాయి. అవి

1. ఇతివృత్తం ద్వారా రచయిత జీవితం మీద వెల్లడించదలచుకున్న సాధారణీకరణ అంశం ఏమిటి అనేది ఆలోచించడం 2. ప్రధాన పాత్ర లేదా ప్రధాన పాత్ర మార్పులు పొందడం ద్వారా తెలిసే దేమిటి అనేది ఆలోచించడం 3. కీలకమైన ఘర్షణ ద్వారా తెలిసే దేమిటీ అనేది ఆలోచించడం.

రచనోద్దేశం అనేది ఒక నీతివాక్యం లాగా, ఒక సామెత లాగా, ఒక జాతీయంలాగా, ఒక గంభీరోక్తి లాగా, ఒక పాఠం లాగా ఉండదు, కన్పించదు. అది కథా జీవిత సారంలాగా కనపడుతుంది. రావిశాస్త్రి అల్పజీవి రచనోద్దేశం ఏమిటి అని ఎవరైనా ప్రశ్నించారనుకోండి. పిరికితనమూ, భయమూ మనిషిని దారుణమైన ఆత్మ న్యూనతకు గురిచేస్తాయి. ఆత్మ విమర్శనాజ్ఞానం మంచి మార్గాన వెళ్ళే అవకాశం కల్పించవచ్చు అనేదే అల్పజీవిలోని ప్రధానపాత్ర సుబ్బయ్య ద్వారా రచయిత చెప్పదలచుకున్న రచనోద్దేశం అని జవాబు చెప్పవచ్చు.

**సాహిత్యస్థాయి అంశాలు**

రచయిత పాఠకుల్ని ఆకట్టుకోవడానికి ప్రయత్నించే పద్ధతులు ఇందులో చేరతాయి. ఇవి రచనా నిర్మాణ:,

దృష్టికోణం, రచనా విధానం, కంఠస్వరం అని అన్నాము. వీటిని కొంత వివరంగా పరిశీలించాలి.

**1. రచనా నిర్మాణం:** ఒక కథను జరిగిన కాలక్రమంలో చెప్పడానికీ, వెనకాముందూ తిరగేసి చెప్పడానికీ, ఫ్లాష్ బాక్ పద్ధతిలో చెప్పడానికీ తేడాలున్నాయి. కాలక్రమ పద్ధతిలో కాకుండా నవలలోని సంఘటనలను వెనకా ముందూ తిరగేసి రాయడం ఎందుకు? ఫ్లాష్ బాక్ పద్ధతి ఎందుకు?

నవలా రచయిత పాఠకుల్లో ఉత్సుకతనో, ఉత్కంఠనో కలుగచేయడానికి ఈ పద్ధతి వినియోగిస్తారు. కాకపోతే ఒక జరిగిపోయిన సన్నివేశాన్ని కథా గమనంలో పాత్ర ఆలోచనల ద్వారా తెల్పదలచుకున్నప్పుడు ఉత్తమ పురుష కథన పద్ధతి ద్వారా గానీ, చైతన్య స్రవంతి విధానం ద్వారా గానీ ఫ్లాష్ బ్యాక్ ఉపయోగించుకుంటాడు. కథా సన్నివేశాలను వరసగా గుదిగుర్చడం మామూలు పద్ధతి. తారుమారు చేయడం దృశ్యపద్ధతి. కొడవటిగంటి కుటుంబరావు నవలల్లో సన్నివేశాలు వరుసగా పేర్చుకుంటూ వెళ్ళే కథా కథనమే ప్రధానంగా కన్పిస్తుంది. కుటుంబరావు చదువు నవలను గోపీచంద్ అసమర్థుని జీవయాత్రతో ఈ విషయంలో పోల్చి చూడండి.



> ఒక జరిగిపోయిన సన్నివేశాన్ని కథా గమనంలో పాత్ర ఆలోచనల ద్వారా తెల్పదలచుకున్నప్పుడు ఉత్తమ పురుష కథన పద్ధతి ద్వారా గానీ, చైతన్య స్రవంతి విధానం ద్వారా గానీ ఫ్లాష్ బ్యాక్ ఉపయోగించు కుంటాడు. కథా సన్నివేశాలను వరసగా గుదిగూర్చడం మామూలు పద్ధతి. తారుమారు చేయడం దృశ్య పద్ధతి.

**2. దృష్టికోణం :** కథను చెప్పడానికి రకరకాల పద్ధతులను చేపట్టడం మనం స్థూలంగానైనాగమనించి ఉంటాం. కథ చెపుతున్నది ఎవరు? కథ చెప్పేవాడు మనల్ని ఎంతమాత్రం తెలుసుకోనిస్తున్నాడు? అతను పాత్ర భావోద్వేగాలనూ, ఆలోచనలనూ ఎంతవరకు, ఎట్లా పరిశీలించి మనకు అందచేస్తున్నాడు. ఈ ప్రశ్నలు దృష్టికోణాన్ని, అంటే రచయిత కథనూ, ఇతివృత్తాన్నీ పాఠకులకు అందించే కథన పద్ధతి **(Narrations)** ని తెలియచేస్తాయి. (దృష్టికోణాన్నే కథన పద్ధతిలో చేర్చి చెప్పడం సబబు అనవచ్చు). ఇది నాలుగు రకాలుగా జరుగుతుంది.

**(ఎ) సర్వసాక్షి కథనం (Omniscient Point of view/ narration)** : ఇది ప్రథమ పురుషలో కథ నడిపించే పద్ధతే. కథనుతాను గాకుండా ఇతరుల ద్వారా రచయిత కథను నడిపిస్తాడు. సర్వసాక్షి కథనంలో రచయిత సర్వజ్ఞుడుగా కనబతాడు, వ్యవహరిస్తాడు. అతనికి ఇతివృత్తంలోని పాత్రల బహిరంగ ప్రపంచ సర్వం తెలుసు. ఒకరకంగా ఆ పాత్రలకు తెలియనివి కూడా తెలుసుకోవచ్చు. రచయితకు విస్తృతమైన రచనా పరిధికి అవకాశం కల్పించే కథన పద్ధతి ఇది పాఠకుణ్ణి రచయిత ఉద్దేశించిన వైపుకు తిప్పుకోగలిగిన పద్ధతి ఇది రచయిత అందరి కళ్ళతో అందరినీ, ప్రపంచాన్నీ చూస్తున్నట్లు చెప్పే పద్ధతి ఇది. కందుకూరి వీరేశలింగం రాజశేఖర చరిత్రము ఈ పద్ధతికి ఒక ఉదాహరణ.

**బి) పరిమిత సర్వసాక్షి కథనం (Limited Omniscient):** ఈ పద్ధతిలో ఒకే ఒక వ్యక్తి పాత్రదృష్టి నుంచి కథ నడుస్తుంది. ఇదీ ప్రథమ పురుష కథనమే. అన్ని వేళల్లో ఆ పాత్రవైపు మనం ఉంటాం. ఆ పాత్ర అంతరంగంలో మనం జీవిస్తాం. ఇతర పాత్రలు మనకు అంతగా తెలియవు. ఈ పద్ధతి జీవితానికి దగ్గరగా ఉంటుంది. వాస్తవ జీవితంలో మనం మన కళ్ళతో ఇతరులను చూస్తాం. అందరిక కళ్ళతో మనం అందరినీ ప్రపంచాన్నీ చూడలేము. ఈ పద్ధతిలో ప్రధానపాత్ర అంతరంగ చిత్రణ చేసే చైతన్య స్రవంతి విధానం కూడా ఉంటుంది. నవీన్ అంపశయ్య ఈ రకంగా చేరుతుంది.

**సి) ఉత్తమ పురుష కథనం (First Person point of view)** : కథకుడు తాను స్వయంగా ఎరిగిన కథను చెప్పే పద్ధతి ఇది. రచనలో కథకుడు అంటే 'నేను' ప్రధానపాత్ర కావచ్చు. అప్రధాన పాత్ర కావచ్చు. ఈ 'నేను'కు తెలిసిందే. 'నేను' ఆలోచించిందే పాఠకుడికి తెలిసేది. కథన పరిధి తక్కువైనా పాఠకుణ్ణి రచనకు చాలా సన్నిహితంగా ఈ పద్ధతి ఇస్తుంది. రచయితా, పాఠకుడూ ఈ పద్ధతిలో తాదాత్మ్యం పొందుతారని

చెప్పవచ్చు. విశ్వనాథ సత్యనారాయణ మాబాబు ఈ పద్ధతిలో ఉంటుంది.

**డి) నాటకీయ కథనం** : ఈ పద్ధతి కథనంలో రచయితా పాఠకుడూ ఇద్దరూ ప్రేక్షకులే. చూసినదీ, విన్నదీ మాత్రమే ఈ కథన పద్ధతిలో నమోదు అవుతుంది. పాత్ర మనోభావాల వర్ణన జోలికి ఈ పద్ధతిలో రచయిత వెళ్ళడు. రచయిత వ్యాఖ్యానాలు ఉండవు. ఒక నాటకం లాగా రచయిత కథను మనకు ప్రదర్శిస్తాడు. కథల్లో, చిన్న నవలల్లో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ప్రదర్శించినట్లు చూడగలం.

**4. కంఠస్వరం (Tone)** : ఉపయోగించే మాటల ద్వారా, పదబంధాల ద్వారా, సూచనల ద్వారా, కాకువు ద్వారా కథకుని గొంతును మనం కనిపెట్టవచ్చు. కథను ఒక ప్రేక్షకుడిలాగా గంభీరంగా చెపుతున్నాడా, కథనంలోని వ్యాఖ్యానాలు తాత్త్వికంగా ఉన్నాయా, వ్యంగ్యంగా ఉన్నాయా, హాస్యస్ఫోరకంగా ఉన్నాయా, అతి తీవ్రంగా ఉన్నాయా మనం గమనించవచ్చును. ఇతివృత్తం పట్లా, పాత్రల చర్యల పట్లా రచయిత వైఖరి ఏమిటో తెలుసుకోవచ్చు. మొక్కపాటి బారిస్టరు పార్వతీశం నవలలో రచయిత కంఠస్వరం హాస్యస్ఫోరకం. కుటుంబరావు వారసత్వం నవలలో రచయిత కంఠస్వరం తాత్త్వికం, వ్యంగ్యాత్మకం.



**రచయితలు భిన్న శైలులను భిన్న సందర్భాల్లో వాడతారు. తను కథ చెప్పే శైలివేరు. పాత్రలు మాట్లాడే శైలులు వేరు. కథ చెప్పే సందర్భంలోనూ, పాత్రలు మాట్లాడే శైలుల్లోనూ రకరకాల అంతరువులు కూడా కన్పిస్తాయి. కథలోని వాతావరణం కూడా శైలులను నిర్ణయిస్తుంది.**

**5. రచనా విధానం / శైలి (Style)** : నవలలో రచయితలు భిన్న శైలులను భిన్న సందర్భాల్లో వాడతారు. తను కథ చెప్పే శైలివేరు. పాత్రలు మాట్లాడే శైలులు వేరు. కథ చెప్పే సందర్భంలోనూ, పాత్రలు మాట్లాడే శైలుల్లోనూ రకరకాల అంతరువులు కూడా కన్పిస్తాయి. కథలోని వాతావరణం కూడా శైలులను నిర్ణయిస్తుంది. అంటే గ్రామీణ జీవితాన్ని చిత్రించే నవలలో మాండలికాల ప్రభావం కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. ఒక ప్రత్యేక వృత్తికి సంబంధించిన కథలో ఆ వృత్తి తాలూకు పదజాల ప్రభావం శైలి మీద కన్పిస్తుంది. అల్లం రాజయ్య కొలిమంటుకున్నాది నవలలో శైలులు తెలంగాణా మాండలిక భేదాలు. కొమ్మూరి వేణుగోపాలరావు హౌస్ సర్జన్ నవలలో వైద్యవృత్తిలోని వ్యక్తుల వృత్తిశైలులు కన్పిస్తాయి.

నవలను ఒక పాఠం **(Text)** గా అంటే ఒక క్రమంలో ఏర్పాటైన పదసంపుటిగా అధ్యయనం చేసే పద్ధతి కూడా ఇటీవల వ్యాప్తిలోకి వచ్చింది. అది ప్రత్యేక తరహా పరిశీలన.

**తాత్త్వికస్థాయి అంశాలు**

జీవితం మీద మనకు కొన్ని అభిప్రాయాలు ఉంటాయి. కొన్ని భావాలు ఏర్పడతాయి. రచయితలకు జీవితం పట్ల ఉన్న దృక్పథాన్నే ప్రాపంచిక దృక్పథం అని స్థూలంగా అంటాం. ఈ ప్రాపంచిక దృక్పథం ఏదో ఒక ధోరణికి చెందవచ్చు. నవల జీవిత వ్యాఖ్యానం, మనోరంజక సాధనం అన్నప్పుడు మనం జీవిత వ్యాఖ్యానంలో, మనో రంజకత్వంలో ధోరణి ఏ రకంగా ఉందో పరిశీలించవచ్చు.

**ప్రాపంచిక దృక్పథం :**

నవలలోని ఇతివృత్తం ద్వారా, పాత్రలకున్న జీవితదృష్టుల చిత్రణ ద్వారా, దృష్టికోణం ద్వారా, టోన్ ద్వారా రచయిత ప్రాపంచిక దృక్పథం ఏమిటో తెలిసిపోతుంది. కేవలం మనోరంజక నవలా సాహిత్యంలోనూ, ఫార్ములా నవలల్లోనూ రచయిత ప్రాపంచిక దృక్పథం కొట్టవచ్చినట్లు కనపడకపోవచ్చు. హింసనూ, మూఢ విశ్వాసాలనూ చిత్రించిన నవలల్లో రచయిత ప్రాపంచిక దృష్టి పాశవికం అని వెంటనే చెప్పగలుగుతాం. అభ్యుదయ భావాలను చిత్రించిన నవలల్లో రచయిత ప్రాపంచిక దృష్టి సంఘసంస్కారం అని చెప్పగలుగుతాం. నవలలో రచయిత సృష్టించే ప్రపంచం కల్పనే అయినా ఆ కల్పనకు పునాది వాస్తవం. కాబట్టి వాస్తవ ప్రాపంచిక దృష్టిని ఏర్పరుస్తాయి. ఒక నవల అంతా చదివాక కలిగిన భావాలను మనం విశ్లేషించుకుంటే ఆ నవల మనకు ఏ రకమైన సంస్కారాన్ని ఇస్తుందో తెలిసిపోతుంది. ప్రాపంచిక దృక్పథం అనే మాటను జీవిత దృక్పథం, సామాజిక దృక్పథం అనే మాటలలో కూడా సూచించవచ్చు.

**ధోరణి (Trend)**

కాల్పనిక వాదం **(Romanticism)**, వాస్తవిక వాదం **(Realism)** అనే మాటలను వింటున్నాం. స్వయం వ్యక్తి వికాసాన్నీ, వ్యక్తి స్వేచ్ఛనూ ప్రధానంగా కోరేది కాల్పనికవాదం అని విమర్శకులు అంటారు. స్వయం వ్యక్తి వికాసాన్ని, వ్యక్తి స్వేచ్ఛనూ, ప్రధానంగా సామాజిక దృష్టి కల్గిందీ వాస్తవికతావాదం అంటారు. బాపిరాజు నారాయణరావు నవలనూ, కొడవటిగంటి కుటుంబరావు చదువు నవలనూ పోల్చి చూడండి. విశ్వనాథ చెలియలి కట్టనూ చలం మైదానం నవలనూ పోల్చి చూడండి. ఉన్నవ మాలపల్లినీ, జి.వి. కృష్ణారావు కీలుబొమ్మలు నవలను పోల్చి చూడండి. రచయితలకుండే రాజకీయ, ఆర్థిక, సాంఘిక భావాలే సాహిత్యంలోని ధోరణులను నిర్ణయిస్తాయి, నవలల్లో భావాల తీరు, నవల ఏ ధోరణికి చెందింది అనే దాన్ని నిర్ణయిస్తుంది.



ఇంతవరకు పరిశీలించిన నవల లక్షణాలు, కథానిక లక్షణాలలాగే ఉన్నాయి. కథ, కథానికకూ, నవలకూ, నవలిక (చిన్న నవల) కూ తేడా ఏమిటి? అనే ప్రశ్న ఎదురవుతుంది. కథానిక, నవల, నవలిక వచన కల్పనా కథాసాహిత్యంలోవే. వాటిలోని సామాన్య లక్షణాలు ఇవే కావచ్చు. అయితే మరి తేడా ఎక్కడుంది?

> **నవల లక్షణాలు, కథానిక లక్షణాలలాగే ఉన్నాయి. కథ, కథానికకూ, నవలకూ, నవలిక (చిన్న నవల) కూ తేడా ఏమిటి? అనే ప్రశ్న ఎదురవుతుంది. కథానిక, నవల, నవలిక వచన కల్పనా కథాసాహిత్యంలోవే. వాటిలోని సామాన్య లక్షణాలు ఇవే కావచ్చు. అయితే మరి తేడా ఎక్కడుంది?**

కొడవటిగంటి కుటుంబరావు చిన్న కథను అంటే కథానికను గురించి అంటారుకదా "చిన్నకథలో ఒకే ఒక జీవిత ఘటన చిత్రించబడుతుంది. పాత్ర చిత్రణ ఉంటుంది. కాని అది కూడా ఒక్క ఘటనకే పరిమితమై ఉంటుంది. చిన్నకథను **(Snap shot)** ఫొటోతో పోల్చారు. అందులో జీవితం తాలూకు కదలికలు కనబడవు. పాత్రల మనస్తత్వాలలో పరిణామాలుండవు. ఒకటి రెండు సన్నివేశాలు, పాత్రల మనస్సులలో కల్గే చైతన్యమూ ఉన్నప్పటికి అవి, పైన చెప్పినట్టు, ప్రధాన ఘటనను ఆశ్రయించే ఉంటాయి. ఆ ఘటన యొక్క ప్రభావం పాత్రల చిత్తవృత్తిపై ఏవిధంగా ఉండేది చిత్రితమవుతుంది." (చిన్న నవల, కళాకేళి)

నవల విస్తృత పరిధి ఉన్న రచనగా తేలిపోయింది. ఆ విస్తృతి రెండు లక్షలపదాలు మొదలుకొని 60, 70 వేల పదాల వరకు ఉండవచ్చునంటారు. మరి నవలిక అంటే చిన్న నవల ఎట్లా ఉంటుంది?

"చిన్న కథను పెంచినా, నవలను కుంచించినా చిన్న నవల అవుతుందన్న భావం ఎవరికైనా ఉంటే అది సరి అయిన భావం కాదు. ఇలాంటిఅపోహ కలగడానికి కొన్ని కారణాలు లేకపోలేదు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు "వడ్లగింజలు" కథను మొదట చిన్నకథగా రాసి తరువాత అదేకథను చిన్న నవల రూపంలో రచించారు. కానీ రెండింటి స్వభావమూ ఒకటికాదు. చిన్న నవలలోకి జమీందారి సంస్కృతీ,ఆనాటి వాతావరణమూ, ఆచార వ్యవహారాలు చక్కగాదిగివచ్చాయి. వారి చిన్న కథ మనని తీసుకుపోలేని వాతావరణంలోకి చిన్న నవల తీసుకుపోగలిగింది. ఇదే కథ పెద్దనవల అయి ఉండినా సాధ్యం కాదు. ఎందుచేతనంటే ఈ చిన్న నవలలో, కూడా ప్రధాన ఘటన ఒకటే.

ఇదే నవలకూ, చిన్న నవలకూ ఉండే ముఖ్యమైన తేడా అని నా అభిప్రాయం. చిన్న నవలలో ప్రధాన సంఘటన ఒకటే ఉన్నప్పటికీ, ఆ సంఘటనకు కారణభూతులైన పాత్రల చిత్తవృత్తులకూ,వాటిచుట్టూ ఉండిన వాతావరణానికి తగినంత ప్రాముఖ్యం ఉంటుందని పించినపుడు చిన్నకథ రాయుటంకంటే చిన్న నవల రాయుటం మంచిది'' (కుటుంబరావు, చిన్న నవల, కళాకేళి పత్రిక).

అంటే కేవలం విస్తృతిపరిధి తేడాను నిర్ణయించ దన్నమాట. మాసపత్రికలకు జోడించిన నవలలు అనబడే వాటిని, పుస్తకరూపంలో వచ్చిన ప్రసిద్ధుల రచనలనూ పోల్చి పరిశీలించినపుడు తేడాలు మరింత ప్రస్ఫుటంగా తెలుస్తాయి.

అసలు నవల ప్రయోజనం ఏమిటి అనేది కూడా మనకు చదవగా చదవగా తెలియకపోదు. పరిశీలనగా చదవగా చదవగా పురుషులందు పుణ్యపురుషులు వేరయా అన్నట్లు మన సంస్కారాన్నీ, సాహిత్య సంస్కారాన్ని పెంచే మంచి నవలలు ఏవో పాఠకులకు తెలియకపోవు.






# వస్తురూపాలు

డా॥ పాపినేని శివశంకర్

> వస్తురూపాల గతిని గుర్తించాలంటే కనీసం కొంత కాల వ్యవస్థలోని సాహిత్య క్రమాన్ని పరిగణించాల్సి వుంటుంది. అంటే సాహిత్య గత క్రమంలోనే వస్తు రూపాల గతి క్రమాన్ని అర్థం చేసుకోగలం.

రచనలను విడివిడిగా పరిశీలించినప్పుడు అందులో వస్తు రూపాల స్థితిని మాత్రమే గుర్తించగలం. వస్తురూపాల గతిని గుర్తించాలంటే కనీసం కొంత కాల వ్యవస్థలోని సాహిత్య క్రమాన్ని పరిగణించాల్సి వుంటుంది. అంటే సాహిత్య గత క్రమంలోనే వస్తు రూపాల గతి క్రమాన్ని అర్థం చేసుకోగలం. ఒక కవితలో వస్తురూపాలెలా వుంటాయో పరిశీలించడానికై శ్రీశ్రీ రచించిన 'భిక్షు వర్షీయసి' తీసుకుందాం.

ఒక ముసలి బిచ్చగత్తె దుస్థితి ఈ కవితలోని ఇతివృత్తం. ఈ సమాజంలో దిక్కులేని దీనులకు విషాదాంతమే వుంటుందని కవి గ్రహించిన జీవితానుభవం ఈ ఇతివృత్తానికి ప్రేరణ. తన పరిశీలన కవసరమైన ప్రత్యేక పదార్థాన్నే శ్రీశ్రీ ఇతివృత్తంగా స్వీకరించాడు. అంటే నిలువ నీడ వున్న, వయస్సు మళ్లని, జబ్బు చెయ్యని బిచ్చగత్తె స్థితిని తీసుకుంటే – లేదా ఒక మామూలు బీదరాలిని తీసుకుంటే – కవి పరిశీలన కుదరదు. సమాజంలోని దుర్మార్గాన్ని అప్పుడు శక్తిమంతంగా నిరూపించలేడు. అందుకని ఒక బిచ్చగత్తె ప్రత్యేక స్థితిని తీసుకున్నాడు. 'దారిపక్క చెట్టు కింద' కూర్చున్న ముసలిది ఆమె 'పడిపోయెను జబ్బుచేసి, ఆదుక్కునే శక్తిలేదు' 'దిక్కు లేని దీనురాలు'.

ఆ ముసలి బిచ్చగత్తె పరిస్థితిని కవి ప్రేమతోనూ, సానుభూతితోనూ వ్యాఖ్యానించాడు. (కవితలో కన్పించే భావావేశాలివి). ఈ వ్యాఖ్యానం ద్వారా కవి ఏం చెప్పదలచుకున్నాడు? లేదా అతని ఆశయం ఏమిటి?

"ఆ అవ్వే మరణిస్తే
ఆ పాపం ఎవ్వరిదని
వెర్రిగాలి ప్రశిస్తూ
వెళ్ళిపోయింది!"

కవితలో కీలకమైన వాక్యం ఇది. ఒక అవ్వ దిక్కులేకుండా దారిపక్క మరణిస్తే ఆ పాపం ఈ సమాజానిదే అని శ్రీశ్రీ ఒక నైతిక నిర్ధారణ చేశాడు. అయితే ఆ నిర్ధారణను మొరటుగా బహిర్గతం చెయ్యకుండా ఒక ప్రశ్న ద్వారా కళాత్మకంగా (వ్యంగ్యంగా) సూచించాడు. కవి చెప్పదలచుకున్నదిదే.

ఈ కవితా వస్తువును శ్రీశ్రీ సూక్ష్మమైన దృశ్యచిత్రణతో,

నేపథ్యచిత్రణతో ఆవిష్కరించాడు. దారి పక్క చెట్టు. పక్కనే బండరాయి 'ఏముకముక్క కొరుక్కుంటున్న కుక్క' 'ఒక ఈగను పడవేసుకు తొందరగా తొలగిన తొండ' గాలి వీస్తున్నది, 'దుమ్ము రేగెనంతలోన' గాలికి ఎంగిలాకు ఎగిరి వచ్చింది. అంతటా చిమ్మ చీకట్లు కమ్మాయి. ఈ అంశాలన్నీ సారూప్యాలు. ఒక అంశం లాగా మరో అంశం ఒక క్రమంలో అక్కడి వాతావరణాన్ని బరువుగా చేస్తున్నాయి. ప్రణాళికబద్ధమైన నేపథ్యం చిత్రణ ఇది. ఈ నేపథ్యంపై బిచ్చగత్తె దృశ్యాన్ని చిత్రించాడు శ్రీశ్రీ. అంటే వేర్వేరు విభాగాల మధ్య సహ సంబంధం కల్పించాడు.

తన ప్రాథమిక ఆశయానికి అనుగుణంగా శ్రీశ్రీ ఇక్కడ బిచ్చగత్తె దృశ్యాన్ని అనుసంధించాడు. ఆ ముసలిది 'మూలుగుతూ, ముసురుతున్న ఈగలతో వేగలేక'పోతున్నది. తల తెల్లబడిపోయింది. 'ముడుతలు తేరిన దేహం. కాంతిలేని గాజుకళ్లు తన కన్నా శవం నయం' 'ఏళ్లు ముదిరి, కీళ్లు కదలి, బతుకంటే కోర్కె సడలి' పడి వున్నది. ఇక్కడ ఆ ముసలి మీద మనకు సానుభూతి కలగడాని కవసరమైన అర్థవంతమైన – ఏ అంశాన్నీ శ్రీశ్రీ వదిలి పెట్టలేదు. ప్రతి అంశం ఏదో ఒక ఆలోచనాత్మకమైన, రసాత్మకమైన ప్రయోజనం సాధిస్తున్నది. ఇదే ఔచిత్యం. ఔచిత్యమే కూర్పు యొక్క ప్రధాన ప్రమాణం.

రూప సౌందర్యం వస్తువును మింగెయ్యకుండానూ జాగ్రత్తపడ్డాడు. శ్రీశ్రీ 'మహా ప్రస్థానం' లోని ఎన్నో కవితల్లో శబ్దంతో సయ్యాటలాడినవాడు ఇక్కడ శబ్దాలంకారాల జోలికే పోలేదు. మనసు కరగాల్సిన సన్ని వేశాలకు రంగు లెక్కువ పులమటం ఆ వస్తువులో కవి లీనం కాకపోవడానికి గుర్తు. ఆ బిచ్చగత్తె ఆరిన కుంపటి విధాన – ముగ్గుబుట్ట వంటి తలతో గాజుకళ్లతో – బండరాతి పగిదిగా – పడి వుందని నాలుగు పోలికలు మాత్రమే శ్రీశ్రీ చెప్పాడు. ఇవి తప్ప ఏ భావ చిత్రాలూ లేవు. అంతటా స్వభావోక్తే. అంతటా సున్నితమైన భావాల కనుగుణంగా సరళమైన భాషే.

కవిత కోసం శ్రీశ్రీ గ్రహించిన రచనా ప్రక్రియ గేయ పద్ధతిలో మాత్రచ్ఛందస్సులో వుంది. పాదానికి పన్నెండు మాత్రల చొప్పున సాగే గేయం ఇది. 'వెర్రి గాలి ప్రశ్నిస్తూ వెళ్ళిపోయింది' అన్న చోట చివరిపాదంలో మాత్రం ఆలోచనా విరామం కోసమా అన్నట్టు ఏడు మాత్రలే వేశాడు. ఈ విధంగా శ్రీశ్రీ 'భిక్షు వర్షీయసి' వస్తు రూపాల సమతౌల్యం గల రచన.



నివాళి

## ప్రజా రచయిత రావూరి భరద్వాజ



కేవలం 7వ తరగతి మాత్రమే చదువుకుని భారతదేశపు అత్యున్నత సాహిత్య పురస్కారం జ్ఞానపీఠ అందుకున్నారు రావూరి భరద్వాజ. ప్రజాదృష్టితో రచనలు చేసిన ఆయన 2013 అక్టోబరు 18న కన్నుమూశారు.

కృష్ణాజిల్లాలోని మొగులూరు గ్రామంలో జులై5, 1927న భరద్వాజ జన్మించారు. పేద కుటుంబంలో జన్మించిన ఆయన అష్టకష్టాలు అనుభవిస్తూ ప్రతిభావంతులుగా ఎదిగారు. చిన్నతనం నుండే రచనలు చేసిన అయన అనేక పత్రికలలో పనిచేశారు. చివరకు ఆకాశవాణిలో స్థిరపడ్డారు. 1962 ప్రాంతంలో ఆయన రాసిన 'పాకుడురాళ్ళు' నవల, జీవనసమరం పుస్తకాలు ఆయనకు ప్రాచుర్యం తెచ్చాయి. 'జీవనసమరం' లో సామాన్యుల జీవితాలను శక్తివంతంగా రచించారు. ఈ పుస్తకానికి 1983లో కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారాన్ని అందుకున్నారు. సినీరంగం కథాంశంగా రచించిన 'పాకుడురాళ్ళు' నవల సంచలనం కలిగించింది. సినీ నటుల జీవితంలోని తెరవెనక జరిగే కఠోర వాస్తవాలను అత్యంత సహజంగా ఈ నవల చిత్రించింది. కవిత్వం, కథ, నవల, నాటకం, వంటి వివిధ ప్రక్రియలలో 187కు పైగా పుస్తకాలను రాశారు. 2013లో జ్ఞానపీఠ అందుకునే నాటికే సోవియట్ ల్యాండ్ నెహ్రూ వంటి అనేక పురస్కారాలను పొందారు. ఎంత ఎదిగినప్పటికీ అత్యంత వినయంగా ఉంటూ అందరినీ అలరించారు. సాహితీస్రవంతి, సాహిత్యప్రస్థానం తరపున రావూరి భరద్వాజకు జోహార్లర్పిస్తున్నాం.

కథ
ప్రత్యేకసంచిక

# తెలుగులో విమర్శనాధోరణులు




-రాచపాలెం చంద్రశేఖర రెడ్డి

> మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకు ఆలోచనాపరమైన, దృక్పథానికి సంబంధించిన నిబద్ధత ఉంది తప్ప, సాహిత్యపరమైన సరిహద్దులు లేవు. నన్నయ్య నుంచి నేటిదాకా ఎవరి సాహిత్యం మీదనైనా ఎప్పటి సాహిత్యంమీదనైనా మార్క్సిస్ట్ దృక్పథంతో విమర్శ రాయవచ్చు.

"మార్క్సిస్ట్ విమర్శ పరిశీలిస్తున్న సాహిత్యం వల్ల నిర్వచింపబడదు. పరిశీలించే పద్ధతి వల్ల నిర్వచింప బడుతుంది". (సుబ్బారావు, సి.వి. విభాత సంధ్యలు - ముందుమాట)

ఏది మార్క్సిస్ట్ విమర్శ అన్న ప్రశ్నకు ఈ వాక్యం సమాధానం. మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకు ఆలోచనాపరమైన, దృక్పథానికి సంబంధించిన నిబద్ధత ఉంది తప్ప, సాహిత్యపరమైన సరిహద్దులు లేవు. నన్నయ్య నుంచి నేటిదాకా ఎవరి సాహిత్యం మీదనైనా ఎప్పటి సాహిత్యంమీదనైనా మార్క్సిస్ట్ దృక్పథంతో విమర్శ రాయవచ్చు. నన్నయ మీద దివాకర్ల, పింగళి, విశ్వనాథాదులు విమర్శలు రాశారు. ఇవాళ పాలకుర్తి రామమూర్తి, కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్ళైలు రాస్తున్నారు. కాని వీళ్ళది మార్క్సిస్ట్ విమర్శ కాదు. కారణం వీళ్ళు భౌతికవాదులు కారు. కె.కె. రంగనాథాచార్యులు, కె.వి. రమణారెడ్డి వంటి వాళ్ళు నన్నయ్య మీద రాసింది మార్క్సిస్ట్ సాహిత్యవిమర్శ. శ్రీశ్రీమీద అద్దేపల్లి, మిరియాల రామకృష్ణలు రాసింది మార్క్సిస్ట్ విమర్శ అనిపించుకోలేదు. వరవరరావు, కె.వి.ఆర్., రా.రా., జె.సి. జగన్మోహనాచార్యులు వంటివాళ్ళు రాసింది మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ. షేక్స్పియర్ మార్క్సిస్ట్ రచయిత కాదు. కాని కార్ల్‌మార్క్స్ ఆయన నాటకాల్ని బాగా అధ్యయనం చేశారు. టాల్‌స్టాయ్ మార్క్సిస్ట్ రచయిత కాదు. లెనిన్ ఆయన సాహిత్యాన్ని శాస్త్రీయంగా వ్యాఖ్యానించారు. అందువల్ల మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకు అంటరాని సాహిత్యం లేదు. ఆలోచనా విధానమే ప్రధానం.

"మార్క్సిస్ట్ దృక్పథంలో సాహిత్యాన్ని పరిశీలించటమంటే ప్రకృతిని, చరిత్రను, సాహిత్యాన్ని గతితార్కిక భౌతికవాదపరంగా పరిశీలించమని అర్థం" (చేకూరి శ్రీనివాసరావు: అభ్యుదయ -విమర్శ విశేష సంచిక)

**మనకిప్పుడు మూడు విమర్శనాధోరణులున్నాయి**

**1. భారతీయ సంప్రదాయ ఆలంకారిక విమర్శ ధోరణి**

**2. పాశ్చాత్య విమర్శ ధోరణి**

**3. మార్క్సిస్ట్ విమర్శ ధోరణి**

వీటిలో మొదటి రెండూ ఏ దేశపు సాహిత్యాన్నైనా, ఏ కాలం సాహిత్యాన్నైనా, ఎవరి సాహిత్యాన్నైనా సమగ్రంగా విమర్శించే శక్తి లేనివి. అవి చాలావరకు రూప పరామర్శకే పరిమితమౌతాయి. పాశ్చాత్య విమర్శ వస్తువు దగ్గరికి వచ్చినా వ్యక్తివాదంగా ఉంటుంది. పైగా పాశ్చాత్య సాహిత్య విమర్శ పద్ధతులు చాలా వేగంగా మారిపోతున్నాయి. వాటిని పట్టుకోవటం మిగతా ప్రపంచానికి వీలుకావడం లేదు.

భారతీయ అలంకార శాస్త్రాలు కావ్యసిద్ధాంతగ్రంథాలే అయినా విమర్శకు కూడా అవే ప్రమాణగ్రంథాలౌతున్నాయి. వాటిని ప్రమాణాలుగా పెట్టుకొని ప్రాచీన సాహిత్యాన్నే సంపూర్ణంగా విమర్శించలేము. ఆధునిక సాహిత్యానికి అవి అసలు ఉపయోగపడవు. సమగ్ర సాహిత్య అధ్యయనానికి పనికి వచ్చేది మార్క్సిస్ట్ విమర్శ మాత్రమే. అయితే భారతీయ అలంకారిక శాస్త్రంలాగా, పాశ్చాత్య అలంకారశాస్త్రంలాగా, మార్క్సిస్ట్ విమర్శకు ఒక సమగ్ర సిద్ధాంత గ్రంథం లేదు. మార్క్స్, ఏంగెల్స్, లెనిన్, మావో వంటివాళ్ళు వివిధ సమయాలలో సాహిత్యం గురించి వెలిబుచ్చిన అభిప్రాయాలే సిద్ధాంతాలుగా ఉపయోగపడతున్నాయి. గోర్కీ, ప్లెఖనోవ్, ఎర్నెస్ట్ ఫిశ్చర్, కాడ్వెల్, జార్జిథాంప్సన్, జార్జిలూకాస్ వంటివారు రూపొందించిన సిద్ధాంత గ్రంథాలున్నాయి. వీటి వెలుగులో మనం ఎప్పటి సాహిత్యాన్నైనా ఎక్కడి సాహిత్యాన్నైనా సమగ్రంగా విమర్శించడానికి వీలవుతుంది. ఇప్పటిదాకా లభిస్తున్న సాహిత్య విమర్శ సిద్ధాంతాల్లో మార్క్సిజమ్ సమగ్ర సాహిత్య అధ్యయానికి తోడ్పడేదశలో ఉంది.

మార్క్సిజానికి తాత్విక పునాది గతితార్కిక భౌతికవాదం. మార్క్సిస్ట్ విమర్శకు కూడా అదే ఆధారం. మార్క్సిస్ట్ విమర్శలో మొట్టమొదట గుర్తించవలసిన విషయం మార్క్సిజం. సాహిత్యానికి సమాజానికీ విడదీయరాని సంబంధముందని చెబుతుంది గనుక, మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ కళ కళకోసం అనే సిద్ధాంతాన్ని పూర్తిగా తిరస్కరిస్తుంది. అంతేకాదు సాహిత్యాన్ని విమర్శించడానికి సాహిత్య ప్రమాణాలే అవసరం అనే పిడివాదాన్ని కూడా తిరస్కరిస్తుంది. సాహిత్యాన్ని విమర్శించడానికి సాహిత్య ప్రమాణాలతోపాటు 'సాహిత్యేతర' ప్రమాణాలను కూడా సమానంగా స్వీకరిస్తుంది మార్క్సిస్ట్ విమర్శ. ఈ కారణంగానే మార్క్సిస్ట్ విమర్శ సమగ్ర విమర్శ అవుతున్నది.

మార్క్సిస్ట్ తత్వశాస్త్రం ఆర్థికశక్తులు సమాజానికి పునాదిఅని, తత్వశాస్త్రమూ, కళలూ, నీతిశాస్త్రం, రాజనీతి శాస్త్రం, మతం వంటివి ఉపరితలాంశాలనీ, అవి సామాజిక చైతన్య రూపాలని చెబుతుంది. మార్క్సిస్ట్ విమర్శ సాహిత్యాన్ని పునాదిని ప్రతిబింబించే రూపాలని చెబుతుంది. మార్క్సిస్ట్ విమర్శ సాహిత్యాన్ని పునాదిని ప్రతిబింబించే ఉపరితలాంశంగా, ఒక సామాజిక చైతన్యరూపంగా గుర్తించి పరిశీలిస్తుంది. ఆర్థికశక్తులు నిర్ణయించే మానవసంబంధాలనే సాహిత్యంలో మార్క్సిస్ట్ విమర్శకులు అన్వేషిస్తారు. మార్క్సిస్ట్ విమర్శకుల దృష్టిలో సాహిత్యానికి స్వతంత్ర ప్రతిపత్తి ఉండదు. మిగతా సామాజిక చైతన్యరూపాలతో, సామాజిక రంగాలతో కలిపి సాహిత్యాన్ని అధ్యయనం చేస్తుంది మార్క్సిస్ట్ విమర్శ.



**భారతీయ అలంకార శాస్త్రాలు కావ్యసిద్ధాంతగ్రంథాలే అయినా విమర్శకు కూడా అవే ప్రమాణ గ్రంథాలౌతున్నాయి. వాటిని ప్రమాణాలుగా పెట్టుకొని ప్రాచీన సాహిత్యాన్నే సంపూర్ణంగా విమర్శించ లేము. ఆధునిక సాహిత్యానికి అవి అసలు ఉపయోగపడవు.**

మార్క్సిజం ప్రకారం సాహిత్యం ప్రతిఫలన కళగా సమాజానికి పునాది అయిన ఆర్థిక శక్తుల్ని ప్రతిఫలిస్తుంది గనక, మార్క్సిస్ట్ విమర్శ సాహిత్యం ఆ ఆర్థిక శక్తుల్ని ఎలా ప్రతిఫలించిందో పరిశీలిస్తుంది. తద్వారా సాహిత్యం నిర్వహించిన సామాజిక భూమికను నిర్వచిస్తుంది.

మార్క్సిజం రచనలో వస్తువు, శిల్పం అని రెండు అంగాలుంటాయని, వస్తువు రచయిత తీసుకునే జీవితాంశమైతే, శిల్పం ఆ జీవితాన్ని చెప్పే విధానమని భావిస్తుంది. వస్తువు రచనలో ప్రముఖమైందని, దానికి వాహకము శిల్పమని, అట్లని శిల్పం నివారింపదగింది కావని మార్క్సిజం చెబుతుంది. A true work of art and a work of literature is always an invention in form and discovery in content (అఇయెనిడ్ అయొనోవ్). అందువల్ల మార్క్సిస్ట్ విమర్శ సాహిత్యంలో మొదట వస్తువును

ఆసక్తిగా పరిశీలిస్తుంది. తర్వాత ఆ వస్తువును వ్యక్తం చేసిన శిల్పాన్ని పట్టించుకుంటుంది. చివర వస్తు శిల్పాల సమన్వయాన్ని గురించి ఆలోచిస్తుంది. అయితే తెలుగులో మార్క్సిస్ట్ దృక్పథంలో వస్తువిమర్శ వచ్చినంతగా రూపవిమర్శ రాలేదన్న విమర్శ ఉంది. మార్క్సిజం ప్రకారం ప్రకృతిలో ప్రతిదీ మారుతుంది. సమాజం మారుతుంది. దాని ప్రతిబింబమైన సాహిత్యమూ మారుతుంది. అందులోని వస్తురూపాలూ మారతాయి. మార్క్సిస్ట్ విమర్శ ఒక రచన ఏ చారిత్రక దశకు ప్రతిబింబమో ఆలోచిస్తుంది. ఆ చారిత్రక దశను చిత్రించడానికి రచయిత ఎన్నుకున్న ప్రక్రియ, అనుసరించిన శిల్పం ఆ వస్తువుకు సరిపోయాయా అని పరీక్షిస్తుంది.



మార్క్సిజం ప్రకారం చరిత్రంతా వర్గపోరాటాల చరిత్ర. సాహిత్యం ఆ పోరాటాలకు కళారూపం. అందువల్ల మార్క్సిస్ట్ విమర్శ సాహిత్యంలో ప్రతిబింబించేది. ఏ వర్గజీవితమో మొదట నిర్ణయిస్తుంది. ఆ వర్గజీవిత చిత్రణకు తగిన శిల్పాన్ని ఎలా వాడుకున్నదో నిర్ధారిస్తుంది. మార్క్సిజానికి జీవితంగాని, మనిషిగాని అమూర్తాలు కావు. ఏకఖండాలు కావు. వైరుధ్యాల సమూహాలు, సమాజం విరుద్ధ శక్తుల నిలయం. మనిషి వర్గ పీడితుడు. అందుకే మార్క్సిస్ట్ విమర్శ ఏ రచనను తీసుకున్నా మొదట అందులో చిత్రింపబడిన జీవితం ఏ వర్గానిది అన్న దానిని గురించి పరిశీలిస్తుంది. దీనిని పాక్షికదృష్టి అని మార్క్సిస్ట్ వ్యతిరేకులు అంటున్నారు. ఇది అశాస్త్రీయమైన ఆరోపణ. మార్క్సిస్ట్ విమర్శ సాహిత్యంలోని పాత్రలకు నిర్దిష్ట సాంఘిక ఆర్థిక శక్తులకు ప్రతినిధులుగా ప్రతీకలుగా పరిశీలిస్తుంది.

మార్క్సిస్ట్ విమర్శ సాహిత్యంలో మొదట వస్తువును ఆసక్తిగా పరిశీలిస్తుంది. తర్వాత ఆ వస్తువును వ్యక్తం చేసిన శిల్పాన్ని పట్టించుకుంటుంది. చివర వస్తు శిల్పాల సమన్వయాన్ని గురించి ఆలోచిస్తుంది. అయితే తెలుగులో మార్క్సిస్ట్ దృక్పథంలో వస్తువిమర్శ వచ్చినంతగా రూపవిమర్శ రాలేదన్న విమర్శ ఉంది.

మార్క్సిస్ట్ విమర్శకుడికి రచయితల ప్రాపంచిక దృక్పథం చాలా ముఖ్యమైంది. ప్రతి రచయితకు ఒక ప్రాపంచిక దృక్పథముంటుంది. దానికనుగుణంగానే రచయిత రచన చేస్తాడు. మార్క్సిస్ట్ విమర్శ మొదట రచయిత ప్రాపంచిక దృక్పథాన్ని నిర్ణయిస్తుంది. దానిననుసరించి అతడెన్నుకున్న వస్తువును, దానిని అర్థం చేసుకున్న తీరును విశ్లేషిస్తుంది. రచయిత భౌతికవాదా? భావవాదా? అని పరిశీలించమే దృక్పథ విమర్శ.

మార్క్సిస్ట్ విమర్శ సాహిత్యచరిత్రను సామాజిక చరిత్రలో భాగంగా చూస్తుంది. సాహిత్యానికి స్వతంత్ర ప్రతిపత్తి ఉందని మార్క్సిజం చెప్పదు. మిగతా సామాజిక చైతన్య రూపాలకు అనుగుణంగానే సాహిత్యం కూడా రూపొందుతుందని, మార్క్సిజం చెబుతుంది. గనుక మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ కూడా సాహిత్యాన్ని మిగతా సామాజిక చైతన్య రూపాల పరిణామాల నేపథ్యంలోనే విశ్లేషిస్తుంది. అయితే సాహిత్యేతర కళా, సామాజిక రంగాలతో సాహిత్యాన్ని సమన్వయం చేసే పని మందకొడిగానే సాగుతున్నది. మార్క్సిజానికి కాలం చెల్లిందంటూ పెట్టుబడిదారీ దేశాలవాళ్లు, వాళ్ళ వికృత మానసపుత్రులు ప్రచారం చేస్తున్నా అప్పటికీ సాహిత్యోద్యమానికి అదే మెరుగైన ఆధారం.

తెలుగు అభ్యుదయ సాహిత్యం పుట్టుకతోపాటు ఆ సాహిత్య విమర్శ కూడా పుట్టింది. అభ్యుదయ సాహిత్యకాలంనుండి ప్రాచీన సాహిత్యం మీద పునర్మూల్యాంకనం, వర్తమాన సాహిత్యం మీద మూల్యాంకనం మొదలయ్యాయి. అలా తెలుగులోకి మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ ప్రవేశించింది. తెలుగు మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకు ఆరు దశాబ్దాల చరిత్ర ఉంది. 1946 మే నెల 11 నుండి జూన్ 10 వరకు నెలరోజుల పాటు తెనాలి ప్రాంతం పెదపూడిలో జరిగిన సాహిత్య పాఠశాలలో మద్దుకూరి చంద్రశేఖరరావు ఆంధ్రసాహిత్యంలో కొత్తపోకడలు, అనే అంశం మీద చెప్పిన పాఠం తొలి తెలుగు మార్క్సిస్ట్ సాహిత్య విమర్శగా గుర్తింపు పొందింది. అయితే ఇది హఠాత్ సంభవం కాదు. అంతకు ముందటి మూడు మూడున్నర దశాబ్దాల పురిటినొప్పుల్లోంచి ఆ పాఠం పుట్టింది.

1914 నాటి కట్టమంచి ‘కవిత్వతత్త్వ విచారము’ సమాజానికి సాహిత్యానికీ, వస్తువుకు శిల్పానికి మధ్య ఉండు విడదీయరాని సంబంధాన్ని గుర్తించింది. “భాషా చరిత్రమును దేశచరిత్రమును నిత్యసంయోగములు” వస్తుస్వరూపములు భావములు పరస్పర నిర్ణీతములు”, “విషయము శైలి రెండు ముఖ్యములు'', ‘‘వికృతులు లేని పాత్రములు జడ సమానములు”, “శాస్త్రాదేశ రచనలు విరములు”, ఈ అభిప్రాయాలతో ఏ ఆధునిక సాహిత్య విమర్శకునికీ విరోధం ఉండదు. మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకులు నేటికీ ఈ అభిప్రాయాల్ని చెబుతూనే ఉన్నారు. ఈ అభిప్రాయాలు కలిగిన కట్టమంచిది సామాజిక విమర్శేకాని మార్క్సిస్ట్ విమర్శ కాదు. ఎందుకంటే ఆయనకు సమాజ సాహిత్య సంబంధాలు తెలుసుగానీ, సమాజంలోని వర్గసంబంధాలు, అవి సాహిత్యంలో ప్రతిబింబించడం తెలియదు గనక. కట్టమంచి తర్వాత అంతటి పేరుగల విమర్శకులు రాళ్ళపల్లి, ప్రబంధ సాహిత్యమంతా ఊహాజనితమని ఆధునిక సాహిత్య విమర్శకమ్మన్యులు కొట్టిపారేస్తుంటే, “వ్రాసిన కవి సత్యమైయుండగా, అతడు జీవించి సంచరించి చూచి అనుభవించిన సంఘము కన్నులయెదుట సత్యమై యుండగా అతడు వ్రాసిన కావ్యములలో మాత్రము అంతయును అసత్యమే యుండుట అసాధ్యము” అని ‘రాయలనాటి రసికత’లో ప్రబంధ సాహిత్యానికున్న సామాజిక స్వభావాన్ని సమర్థించారు. అయినా ఆయనది మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకాదు. రాయలనాటి సాహిత్యంలో ప్రతిబింబిస్తున్న జీవితం-రసికత-నాటి ప్రజలందరిదీ అనుకోవడంలో వాస్తవికత లేదు. త్రిపురనేని మధుసూదనరావు రాసిన ‘మధ్యయుగ సాహిత్యం’ అనే వ్యాసం మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ అవుతుంది. అయినప్పటికీ కట్టమంచి, రాళ్ళపల్లి, సురవరం, పుట్టపర్తివంటివాళ్ళ విమర్శలు మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకు పూర్వరంగాన్ని సిద్ధం చేశాయని చెప్పవచ్చు.



ప్రథమాంధ్ర అభ్యుదయ రచయితల మహాసభ సంచికలో రాటకొండ నరసింహారెడ్డి ‘అభ్యుదయ సాహిత్యం ఎలా ఉండాలి? శ్రీ కృష్ణ ‘సారస్వత సమాలోచన’ వ్యాసాలున్నాయి. రాటకొండ దేశంలోని సంపదలు ఉత్పత్తిసాధనాలు కొందరి చేతుల్లో ఉండే స్థితి పోవడానికి ప్రపంచ ప్రజలతో చేయి కలపాలని, ఆ చైతన్యాన్ని సాహిత్యం కలిగించాలని చెప్పారు. కృష్ణ విభిన్నకాలాల సాహిత్యం వర్గాధిపత్యానికి ఎలా గురయ్యిందో వివరించారు. 1937లోనే కొడవటిగంటి ‘సాహిత్యం ఎందుకు? మొదలైన వ్యాసాలు రాశారు. “ప్రజలను సాహిత్యం నుంచీ సాహిత్యాన్ని రాజకీయాలనుంచీ రాజకీయాలను ప్రజలనుంచీ కాపాడాలని రకరకాల వాళ్ళు చేసే ప్రయత్నాలను చూస్తే ముచ్చటేస్తుంది.'' అని గుర్తించారు. “సాహిత్యకళలకి చెందిన శిల్పం యొక్క ఆశయం ప్రజలను మభ్యపెట్టడం కాదు. వారి దృష్టిని జీవితకష్టసుఖాల దగ్గర నుంచి మరల్చి వాటి వెనక ఉండే కారణాల మీదికి మరల్చటం” అని నిర్ధారించారు. ‘‘సాహిత్యం సాంఘిక చైతన్యంలో ఒక శాఖ” అని పేర్కొన్నారు. జి.వి. కృష్ణారావు ‘సాహిత్య జగత్తు’ 1938నాటిది. కావ్యజగత్తు నుంచి బాహ్య జగత్తురాదు. బాహ్యజగత్తు నుంచి కావ్యజగత్తు వస్తుందన్నారు. మద్దుకూరి చంద్రశేఖరరావు 1994 మార్చిలో ‘నవ్యాంధ్ర సాహిత్య వీథులు’ గ్రంథాన్ని సమీక్షిస్తూ సాహిత్య చరిత్రలో రచనలో చారిత్రక దృక్పథం ప్రాధాన్యాన్ని నొక్కిచెప్పారు. 1935-47 మధ్యకాలంలోనే శ్రీశ్రీ గురజాడ మీద రాసిన వ్యాసాలు తెలుగు సాహిత్య విమర్శకు కొత్త చూపునిచ్చాయి. “వీరిది (రామప్పంతులు, లుబ్ధావధాన్లు మొదలైన) శిథిలీకృత మౌతున్న ఒకానొక సాంఘిక వ్యవస్థ యొక్క కరాళనృత్యం” “ఎమిలీజోల సృష్టించిన నానా అనే పందొమ్మిదవ శతాబ్దపు పరాసు వేశ్య వసంతసేనగా ప్రారంభించి మధురవాణిగా మారుతుంది” అని చారిత్రక అంతర్జాతీయ దృక్పథాలను

**మద్దుకూరి చంద్రశేఖరరావు 1994 మార్చిలో ‘నవ్యాంధ్ర సాహిత్య వీథులు’ గ్రంథాన్ని సమీక్షిస్తూ సాహిత్య చరిత్రలో రచనలో చారిత్రక దృక్పథం ప్రాధాన్యాన్ని నొక్కిచెప్పారు. 1935-47 మధ్య కాలంలోనే శ్రీశ్రీ గురజాడ మీద రాసిన వ్యాసాలు తెలుగు సాహిత్య విమర్శకు కొత్త చూపునిచ్చాయి.**

ప్రదర్శించారు. ఇలా మద్దుకూరి సాహిత్య పాఠశాల పాఠం నాటికి మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకు బలమైన పునాది ఏర్పడి ఉంది. మద్దుకూరి చంద్రశేఖరరావు ప్రసంగపాఠం మీద పుచ్చలపల్లి సుందరయ్య చేసిన వ్యాఖ్యలు కూడా ఇందులో భాగం. మద్దుకూరి చంద్రశేఖరరావు 'ఆంధ్ర సాహిత్యంలో కొత్త పోకడలు' వ్యాసంలో మార్క్సిస్ట్ దృక్పథాన్ని అక్కడక్కడ ఓవర్‌సింప్లిఫై చేశారని పేర్కొంటూ, ఆ వ్యాసంలోని చాలా అభిప్రాయాలను సవరిస్తూనే అదొక "వ్యాసరాజం అన్నాడు పుచ్చలపల్లి. మద్దుకూరి 1944లోనే రాసిన "సాహిత్యం - రాయిస్టులు" అనే వ్యాసంలో రాయిస్టులను అమార్క్సియులుగా నిర్వచించారు. కురుగంటి "నవ్యాంధ్ర సాహిత్యవీథులు" (1944) గ్రంథాన్ని సవరించే ప్రయత్నం చేశారు. దీనిమీదనే పుచ్చలపల్లి స్పందించారు.



మార్క్సిస్ట్ సాహిత్య విమర్శను సుసంపన్నం చేసిన విమర్శకులలో, కొడవటిగంటి అగ్రగామి. 'కళలు శాస్త్రీయ విజ్ఞానం' సాహిత్యవ్యాసాలు' అనే రెండు గ్రంథాలు తెలుగు సాహిత్య విమర్శను చాలా ముందుకు తీసుకెళ్ళాయి. నవ్యసాహిత్యమంటే ప్రొలిటేరియన్ సాహిత్యమనే అవగాహనతో కొడవటిగంటి నవల, కథానిక వంటి ప్రక్రియల మీద, అనేక మంది రచయితల మీద నిగ్రహంతో కూడిన వాస్తవికవాద విమర్శలు చేశారు. "ఎవరూ చెప్పకుండానే సాహిత్యం తనని సృష్టించే వర్గం యొక్క సాంఘిక భావాలను ప్రతిబింబిస్తుంది". "విప్లవ బీజాలు లేని సాహిత్యం ఆలోచనలు రేకెత్తించదు." "నేను పురాణాలను చరిత్రగానే భావిస్తాను" వంటి సూత్రీకరణలు ఆలోచనాత్మకాలు. కొడవటిగంటి కన్యాశుల్కం నాటకం మీద రాసిపెట్టుకున్న నోట్సు ఎంతో ఉపయోగకరమైనది. సాహిత్యాన్ని ఒక సాటిలేని సామాజిక శక్తిగా భావించే కొకు సాహిత్య విమర్శ ఎవరు చదివినా ఆలోచించగలరు. అర్ధశతాబ్దకాలం కొడవటిగంటి అభ్యుదయ విప్లవ దృక్పథాలతో రాసిన విమర్శ చరిత్రాత్మకమైనది. "సాహిత్యం రాజకీయాలకు అతీతంగా ఉండాలని వాదించడం మోసం చెయ్యడమో మోసపోవడమో అవుతుంద"న్నారు. "కళల వల్ల సమాజంలో కలిగే చైతన్యం ఎంత ముఖ్యమైనదో జీవిత గతి ప్రభావం చేత కళలలో కలగవలసిన చైతన్యం కూడా అంత ముఖ్యమైనదే"నన్నారు. ప్రజల సాహిత్యానికి ప్రాణం ప్రజల భాష అన్నారు.

**అర్ధశతాబ్దకాలం కొడవటిగంటి అభ్యుదయ విప్లవ దృక్పథాలతో రాసిన విమర్శ చరిత్రాత్మకమైనది. "సాహిత్యం రాజకీయాలకు అతీతంగా ఉండాలని వాదించడం మోసం చెయ్యడమో మోసపోవడమో అవుతుంద"న్నారు. "కళల వల్ల సమాజంలో కలిగే చైతన్యం ఎంత ముఖ్యమైనదో జీవిత గతి ప్రభావం చేత కళలలో కలగవలసిన చైతన్యం కూడా అంత ముఖ్యమైనదే"నన్నారు.**

ఇటీవల మరణించిన మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకుడు త్రిపురనేని మధుసూదనరావు, మూడు దశాబ్దాలు గొప్ప మేధావిగా, వక్తగా, విమర్శకుడుగా బతికారు. మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకు ఆలోచనతోపాటు ఆవేశాన్ని జోడించి ఈయన రాసిన విమర్శ వ్యాసాలు గొప్ప సైద్ధాంతిక పత్రాలు. మార్క్సిస్ట్ విమర్శకునిలోని నిర్దాక్షిణ్యత రా.రా తర్వాత త్రిపురనేనిలోనే స్పష్టంగా కనిపిస్తుంది. సాహిత్యం, చైతన్యం, సాహిత్యంలో వస్తుశిల్పాలు, విశ్వనాథ సాహిత్యం - విష సంస్కృతి - వంటివి ఈయన విమర్శ గ్రంథాలు. తత్వశాస్త్రం ఆధారంగా సాహిత్య విమర్శ చెయ్యడంలో మేటి త్రిపురనేని. "వర్ణతీతమైన కళ అంటూ వుండదు. సాహిత్యం విప్లవానికి దోహదం చేయగలుగుతుంది. కానీ విప్లవానికి కారణం కాలేదు. "రామానుజుని శ్రీవైష్ణవం ప్రబంధాలకు తాత్విక ప్రాతిపదిక" "సామాజిక ఆర్థిక వ్యవస్థలో వచ్చే మార్పులే కవిత్వంలో మార్పులకి కారణం" "సాహిత్య చరిత్రని సామాజిక చరిత్రలో భాగంగానే అధ్యయనం చెయ్యాలి" వంటి సూత్రీకరణలు యువ విమర్శకులకు అనుసరణీయాలు. సాహిత్యయుగ విభజన, సాహిత్య అధ్యయనం, సాహిత్య ప్రయోజనం, ఉద్యమ సాహిత్యం, యుగసాహిత్యం వంటి అనేక అంశాలను శాస్త్రీయంగా విశ్లేషించారు. త్రిపురనేని. సంస్కృతంలోని కావ్య సంప్రదాయ దృక్పథం నుంచి తెలుగు సాహిత్య చరిత్ర రాయటం, రస సిద్ధాంతం ప్రమాణంగా తెలుగు సాహిత్యంపై విమర్శ రాయటం

నిరర్థకమైన పని అని ఆయన అభిప్రాయం. నవ్య సంప్రదాయ వాదాన్ని నిర్ద్వంద్వంగా తిరస్కరించారు. పూర్వం అధికార వర్గంగా ఉండి ప్రజల్ని సాంస్కృతికంగా పీడించి సర్వసౌఖ్యాలనూ అనుభవించిన వాడి బలహీన వారసుల మృత్యుగీతమే నవ్యసంప్రదాయవాదమని నిర్వచించారు. సాహిత్య చరిత్రలో యుగకర్తల సంప్రదాయం శాస్త్రీయమైంది కాదని వాదించారు. అనువాద కావ్యాల్లో కనిపించే సాంఘిక జీవితం తెలుగుదేశపు సాంఘిక జీవితం కాదు అన్నారు.

శ్రీశ్రీ చేత క్రూరుడైన విమర్శకుడుగా పేరు తెచ్చుకున్న విమర్శకుడు రా.రా. 1965-85 మధ్యకాలంలో తెలుగు సాహిత్య విమర్శకు పదును, వేగం కలిగించిన మార్క్సిస్ట్ రా.రా. బహుశా సాహిత్య విమర్శలో దయాదాక్షిణ్యాలను దూరంగా పెట్టిన వాళ్ళలో కట్టమంచి తర్వాత రా.రా.నే పేర్కొనాలి. "సారస్వత వివేచన", "వ్యక్తి స్వాతంత్ర్యం" సమాజ శ్రేయస్సు" అనేవ్యాస సంకలనాలు మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకు దిశానిర్దేశం చేశాయని చెప్పవచ్చు. నిశితమైన విశ్లేషణ, పదునైన భాష రాజీలేని దృక్పథం, మొహమాటం లేని వాదం రారా విమర్శ లక్షణాలు. కొల్లాయి గట్టితేనేమి - అనే రాజకీయ నవలను చారిత్రక నవలగా విశ్లేషించడం మార్క్సిస్టుగా రారా ప్రదర్శించిన మౌలికతకు నిదర్శనం. "జీవితాన్ని అర్థం చేసుకోడానికి మానవుడు చేసే ప్రయత్నంలో ఒక భాగమే సాహిత్యం", "సాహిత్యమంతా ప్రచారమే అనేమాట నిజమే. కాని ప్రచారమంతా సాహిత్యం కాదు" "మనువునీ పరాశరునీ నమ్మేవానికి ఆధునిక దృష్టి అలవడదు" మొదలైన సూత్రీకరణలు రారా మన కందించిన విమర్శ సూత్రాలు. అద్దేపల్లి వంటి విమర్శకులను తీవ్రంగా విమర్శించిన రారా త్రిపురనేని విమర్శకు గురయ్యారు. మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకులలోని నిజాయితీకి వీళ్ళిద్దరూ గొప్ప ప్రతినిధులు.

సాదుం రామ్మోహన్ , ఆర్వీయార్, రాంభట్ల కృష్ణమూర్తి అభ్యుదయ సాహిత్య విమర్శకులలో ఒక త్రయం వంటివారు. సాహిత్యవలోకన, సాహిత్యంలో శిల్పం - అనే గ్రంథాల ద్వారా రామ్మోహన్ తెలుగు సాహిత్య విమర్శకు సామాజిక స్వభావం కల్పించారు. వస్తువుపట్ల గౌరవమున్నా, మార్క్సిస్ట్ సాహిత్య విమర్శలో వస్తు విమర్శే ప్రధానమైపోతుంటే, శిల్ప విషయాన్ని ఎక్కువగా పట్టించుకున్నారు. రామ్మోహన్. "ఉత్తమ కథకుని ప్రధాన లక్షణం వస్తువుకూ శిల్పానికీ సమాన విలువ ఇవ్వడం" అనే అవగాహనతో రామ్మోహన్, నవలా కథా సాహిత్యాలను విస్తృతంగా పరిశీలించారు. "సాహిత్యతత్వం" అనే గ్రంథంతో అభ్యుదయ విమర్శకునిగా ప్రసిద్ధులైనారు. ఆర్వీయార్? సాహిత్య సిద్ధాంతం, ఆధునిక సాహిత్య ధోరణులు, కె.కె. శైలివంటి అనేకాంశాలను విశ్లేషించడంలో ఆర్వీయార్ ప్రగతిశీల దృక్పథం అడుగడుగునా వ్యక్తమౌతుంది.



**అభ్యుదయ సాహిత్య విమర్శకులలో వల్లంపాటి వెంకట సుబ్బయ్యది తనదైన మార్గం. సాహిత్య వ్యాసాలతోపాటు, నవలాశిల్పం, కథాశిల్పం, విమర్శ శిల్పం అనే గ్రంథాల ద్వారా వల్లంపాటి నవలా కథా విమర్శలను సైద్ధాంతికంగాను, అన్వయాత్మకంగానూ పరిశీలించారు.**

అభ్యుదయ సాహిత్య విమర్శకులలో వల్లంపాటి వెంకట సుబ్బయ్యది తనదైన మార్గం. సాహిత్య వ్యాసాలతోపాటు, నవలాశిల్పం, కథాశిల్పం, విమర్శ శిల్పం అనే గ్రంథాల ద్వారా వల్లంపాటి నవలా కథా విమర్శలను సైద్ధాంతికంగాను, అన్వయాత్మకంగానూ పరిశీలించారు. ఆయన గ్రంథాలు నేటి యువ విమర్శకులకు పరిశోధకులకు మంచి ఆధార గ్రంథాలయ్యాయి. పాశ్చాత్య విమర్శ సూత్రాలను జీర్ణించుకున్న మార్క్సిస్ట్ విమర్శ విధానంతో వల్లంపాటి విశ్లేషణలను ఓర్వలేని సనాతనులు ఆయనకు విదేశీముద్ర వే

అవమానించారు. "మన ప్రాచీన ఋషికవుల్లో ఎవరూ తటస్థులు కారు" అనగలగడాన్ని ఆయనకు మార్క్సిజమ్ నేర్పింది. వై. విజయకుమార్ (సాహిత్యం - వాస్తవికత), శ్రీ కృష్ణ (సాహిత్యం - రాజకీయం) చేకూరి శ్రీనివాసరావు (శ్రమ-సౌందర్యం), సారథి (మార్క్సిస్ట్ సాహిత్య సిద్ధాంతం - ఒక పరిశీలన)వంటి విమర్శకులు మార్క్సిస్ట్ సాహిత్య

విమర్శకు సైద్ధాంతికంగా దోహదం చేశారు. వీళ్ళకు కొనసాగింపుగా బి. సూర్యసాగర్ రాసిన 'సాహిత్యం-సౌందర్యం' అనే గొప్ప గ్రంథం వచ్చింది. సైన్సు ఉపాధ్యాయులైన సూర్యసాగర్ మార్క్సిస్ట్ సాహిత్య సిద్ధాంతాలను ఈ గ్రంథంలో చర్చించారు. "ప్రజాసాహిత్యం ఆవశ్యసాధనం, అది మానవుని స్వేచ్ఛను సాధించే సాధనం" అన్నది సూర్యసాగర్ అవగాహన.

కొలకలూరి ఇనాక్ (ఆధునికాంధ్ర సాహిత్య విమర్శ సూత్రం), కేతు విశ్వనాథరెడ్డి (దృష్టి), సంజీవమ్మ (సాహిత్యవ్యాసాలు(వంటి విమర్శకులు మార్క్సిస్ట్ సాహిత్య విమర్శను పరిపుష్టం చేయడంలో కృషిచేశారు. కొలకలూరి చారిత్రక దృష్టి, కేతు యాంత్రోపొలజికల్ దృష్టి, సంజీవమ్మ సామాజిక దృష్టి తెలుగు సాహిత్యవిమర్శకు కొత్త వెలుగులు తెచ్చాయి. కాత్యాయనీ విద్మహే, పాపినేని శివశంకర్ ఎస్వీ సత్యనారాయణ వంటి ఇటీవలి విమర్శకులు తెలుగు మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకు చేస్తున్న దోహదం గుర్తింపదగింది. ఎన్? వేణుగోపాల్ - కథాసందర్భం, వి.చెంచయ్య-సాహిత్య దృక్పథం, వరవరరావు రాసిన అనేక వ్యాసాలు, ముందుమాటలు జె.సి. 'కవిత్వం-గతితార్కికత' విప్లవసాహిత్యవిమర్శ సూత్రాలను పట్టిస్తాయి. సాహిత్య సందర్భాలను సామాజిక సందర్భాలకు అన్వయించే పద్ధతికి వీళ్ళ రచనలు మంచి ఉదాహరణలు.

కాళీపట్నం రామారావు 'యజ్ఞం' మీద వచ్చిన విమర్శగ్రంథం 'కథా యజ్ఞం', తుమ్మేటి రఘోత్తమరెడ్డి 'పనిపిల్ల' కథమీద వచ్చిన విమర్శగ్రంథం 'ఎవరీ పనిపిల్ల'- ఈ రెండూ తెలుగు కథాసాహిత్య విమర్శలో మైలురాళ్ళు.

చేకూరి రామారావు ఇటీవల ప్రచురించిన విమర్శగ్రంథాలలో అనేకం మార్క్సిస్ట్ విమర్శ సూత్రాలు ఆధారంగా రాసినవే. ఇటీవల ఆయన మార్క్సిస్టులతో వాదాలలోకి దిగినా, ఆయన విమర్శ సామాజిక స్వభావం గొప్పది. భాషాశాస్త్ర దృష్టిని, సామాజిక దృష్టిని సమన్వయం చేసుకుని చేరా ఒక దశలో ఏకైక విమర్శకులుగా నిలబడి రాశారు. ఆధునిక సాహిత్య విమర్శరీతులు', 'మహీధర' రెండు నవలలు వంటివ్యాసాలు నాలాంటి వాళ్ళకు మార్గదర్శకాలయ్యాయి. తిక్కన కావ్యశిల్పానంతర కేతవరపు రామకోటిశాస్త్రి చేసిన కృషి అపారమైనది. కాత్యాయనీ విద్మహే ప్రతి ఏడాదీ ప్రచురిస్తున్న ఆయన కొత్త విమర్శగ్రంథాలు తెలుగు సాహిత్య విమర్శ ఎదుగుదలకు సూచికలు. అభ్యుదయ కవి కుందుర్తి అభ్యుదయ కవిత్వ ప్రచారానికి, వచన కవిత్వం విస్తృతికి దోహదం చేస్తూ అనే వ్యాసాలు రాశారు. ఇంటర్వ్యూలు ఇచ్చారు. 'అతడు-ఆమె-మనం' అనే ఓల్గా రాసిన చిన్న పుస్తకం ఉద్యమ సాహిత్యాన్ని అందులో ప్రతిబింబించే స్త్రీ పురుష సంబంధాలను చారిత్రక క్రమంలో చూసే విధానానికి మంచి ఉదాహరణ. ఎ.బి.కె. ప్రసాద్ రాసిన సాహితీ సంపాదకీయాలు అపురూపమైనవి. ప్రపంచ సాహిత్యాన్ని ఒక చిన్న అవకాశంలో పరిచయం చేసే నైపుణ్యం అయనకే చెల్లు.



చేరా ఒక దశలో ఏకైక విమర్శకులుగా నిలబడి రాశారు. ఆధునిక సాహిత్య విమర్శరీతులు', 'మహీధర' రెండు నవలలు వంటివ్యాసాలు నాలాంటి వాళ్ళకు మార్గదర్శకాలయ్యాయి. తిక్కన కావ్యశిల్పానంతర కేతవరపు రామకోటిశాస్త్రి చేసిన కృషి అపారమైనది.

కె.వి. రమణారెడ్డి 'కవికోకిల' 'మహోదయం' గ్రంథాలలో కవి జీవిత సాహిత్య సమన్వయ విమర్శను మార్క్సిస్ట్ దృష్టితో చేశారు. ఆయన వ్యాససంకలనం 'ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర, జగన్నాథ రథచక్రాల్, మార్క్సిస్ట్ కళా సిద్ధాంతాలు, నిశీధి, అక్షరతూణీరం మొదలైన గ్రంథాలు మార్క్సిస్ట్ సాహిత్య విమర్శను ముందుకు నడిపినవి. సి.వి. సుబ్బారావు సంకలనం చేసిన "విభాత సంధ్యలు' తెలుగు సాహిత్య విమర్శలో గొప్ప మార్క్సిస్ట్ ప్రయోగం. సామాజిక శాస్త్రాల నేపథ్యంలో కన్యాశుల్కం, చదువు మొదలైన రచనల మీద హరగోపాల్,

అర్.ఎస్.రావు మొదలైనవాళ్ళు రాసిన విమర్శ వ్యాసాలు తెలుగు మార్క్సిస్ట్ సాహిత్య విమర్శలో కొత్త గవాక్షాన్ని తెరిచాయి. వలసపాలనలో మొదలై ఇప్పటికీ కొనసాగుతున్న మన సామాజికాభివృద్ధి క్రమస్వభావం మీద దాని ఫలితాల మీద కన్యాశుల్కం నాటకం ఒక నిశితమైన విమర్శ అన్నారు. అర్.ఎస్. రావు. 'చదువు' నవలను విద్యావ్యవస్థ మీద ఒక వ్యాఖ్యగానే కాక ఆనాటి సమాజంలో అన్ని రంగాలలో వస్తున్న మార్పులకు సూచికగా కూడా పరిగణించాలన్నారు హరగోపాల్. 'కొమురం బీం' నవల ప్రతిబించించిన సాంఘిక చరిత్రకంటే చరిత్ర రచనకు సంబంధించి అది లేవనెత్తిన ప్రశ్నలు ముఖ్యమైనవి అన్నారు. సి.వి. సుబ్బారావు, కె.బాలగోపాల్ రూపం-సారం ఈ మార్గంలో అనేక విలువైన మార్క్సిజం విశ్లేషణలు చేస్తూ వచ్చిన గ్రంథం.

తెలుగులో సాహిత్య విమర్శ ఎదిగిందా? అంటూ రెండు మూడుసార్లు చర్చలు జరిగాయి. ఎదుగుదలకు ఒక కొలమానం ఉండదు. వచ్చిన విమర్శంతా గొప్పగా లేకపోవచ్చు. అప్పుడు సిద్ధాంతాలతో ఆధునిక పంక్తిలో దుప్పట్లు పరుచుకునే వాళ్ళను వదిలిపెడితే, మార్క్సిస్టు సాహిత్య విమర్శకులు బాధ్యతాయుతంగానే రాస్తున్నారు. పులుముడువాదుల వక్రీకరణల్ని, ఇతరాధునికుల దెప్పి పొడుపుల్ని తమలోనే ఉన్న వైరుధ్యాల ప్రతిస్పందనల్ని భరిస్తూ మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకులు ముందుకెళుతున్నారు. మూల్యాంకనం పునర్మూల్యాంకనం రెండు నేత్రాలుగా తెలుగు మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ పురోగమిస్తున్నది.

"మొత్తంగా చూస్తే అధ్యయన పద్ధతిలోనూ, విమర్శనా ప్రపంచంలోనూ మార్క్సిస్ట్ విమర్శ ఇతర ధోరణులకంటే ఒకటి రెండడుగులు ముందుకు వేసింది" (సి.వి. సుబ్బారావు: విభాత సంధ్యలు - ముందుమాట)



## కథాసూత్రాలు

కథలోని సంఘర్షణ రచయిత దృక్పథానికి సంకేతం. మరొక రకంగా చెప్పాలంటే ఎలాంటి సంఘర్షణా లేని కథను రాసిన రచయితకు ఒక నిర్దిష్ట జీవితదృక్పథం లేదని చెప్పవచ్చు. జీవితంలోని ముఖ్యమైన సంఘర్షణల జోలికి పోకుండా జీవితపు పైపై మెరుగుల్ని చిత్రిస్తూ కథలు రాసిన రచయితలు తెలుగులో చాలామందే ఉన్నారు. ఎలాంటి సంఘర్షణనూ చిత్రించని కథలు కాలక్షేపం కథలు లేదా వ్యాపార కథలు.

సంఘర్షణను గురించి ఆలోచించేటప్పుడు దాని పరిష్కారాన్ని గురించి కూడా ఆలోచించాలి. కథలోని సంఘర్షణకు రచయిత పరిష్కారాన్ని చూపించాలా, అక్కరలేదా అన్న చర్చ అన్నిభాషల్లోనూ ఎంతో కాలంగా సాగుతూనే ఉంది. తప్పకుండా పరిష్కారాన్ని చూపించాలి అని కానీ, లేదా చూపించకూడదు అని కానీ వాదించటం మొరటువాదాలు. పరిష్కారం కథలో నుంచే సహజంగా రూపొందాలి. పరిష్కారాన్ని బలవంతంగా కథ మీద రుద్దటం శిల్పపరంగా బాధ్యతా రాహిత్యం మాత్రమే. అంతేకాకుండా అన్ని కథలకూ పరిష్కారాన్ని చూపించటం సాధ్యం కాదు.

- వల్లంపాటి వెంకటసుబ్బయ్య

వస్తువునుబట్టి వర్ణనలూ మారుతుంటాయి. కొన్ని రకాల వస్తువులకు వర్ణనలు అట్టే అక్కరలేదు. కొన్నిటికి ఓ మాదిరిగా కావాలి. మరికొన్నిటికి కాస్త ఎక్కువగానే వుండాలి. వర్ణనలేని కథ రంగులేని చిత్రం. అది రేఖాచిత్రం. రేఖా చిత్రం కూడా గొప్పగా వుండొచ్చు. రంగులు రేఖలకు ప్రాణంపోస్తాయి వర్ణనలు కూడా అంతే, అయితే ఊరికే రంగులు పులిమేసినంత మాత్రం చేత అది సిద్ధించదు. బేలన్సు చేసుకోవాలి.

-శీలా వీర్రాజు

# మన చదువుల్లో కథల స్థానం ఏమిటి?

**-ప్రొ॥ కృష్ణకుమార్**




*కథలు చెప్పుకోవడం మన సమాజపు సహస్రాబ్దాల సంప్రదాయం, వారసత్వం! ఒకటీ రెండా? వేలాది సాంప్రదాయక కథలు చెవి నుంచి చెవికి, గుండె నుంచి గుండెకు ఎన్ని శతాబ్దాల పాటు ఎక్కిపొయ్యాయో! అంత దూరం నేనాశించడం లేదు గానీ కనీసం ముప్పై కథలు చెప్పగల్గితే మన ఒకటిరెండు తరగతుల పిల్లలు ఎన్నో విలువలు నేర్చుకొంటారు. ఇతర సబ్జక్టులతో పాటు కథలకింత చోటివ్వగల్గితే ఎన్నో విషయాలు పిల్లలకు తెలుస్తాయి.*

మన స్కూళ్ళలో ఒకటీ రెండు తరగతులకైనా రోజూ ఒక పీరియడ్ కథలు చెప్పుకోడానికుంటే ఎంత బావుంటుంది! ప్చ్!మన పిల్లలు ఆ మాత్రం భాగ్యానికైనా నోచుకోలేక పోతున్నారు. ఈ అవకాశమే వుంటే బడిలో చేరిన పిల్లలు బడి నుంచి జారిపోకుండా సగం సమస్య పరిష్కార మయ్యేది. ‘ కథలు చెప్పుకొంటే డ్రాపౌట్ తగ్గుతారా’ అని నన్ను చాలా మంది ఎగతాళిగా చూడొచ్చు. ఇంత పెద్ద సమస్యను ఇంత తక్కువగా పరిగణిస్తున్నాని నన్ను ఎద్దేవా చెయ్యొచ్చు. ఇలాంటి సలహా నేనిచ్చినపుడు నాపట్ల వెటకారంగా (సానుభూతితోనూ) చూచిన సీనియర్ అధికార్ల నెందరినో నేనెరుగుదును. ఏం చేద్దాం మరి? వారి ‘అపార పరిపాలనానుభవం’ వాళ్ళనలా తయారుచేసింది! ఒకప్పుడు ఈ అధికార్లూ నాలానే ఎంతో కొంత ఆలోచించి వుండక పోరు. కానీ పాపం వాళ్ళు సీనియర్లయి పొయ్యాక ఇలా మారిపోయ్యారు!

ఇంతకన్నా ఘోరం ఏమంటే మన ఉపాధ్యాయ శిక్షణా సంస్థల్లో కథలకు కాసింత చోటయినా చిక్కడం లేదు. కాకుంటే ‘ కథల ప్రాధాన్యం’ మీద మొత్తం శిక్షణా కోర్సుల్లో ఎక్కడయినా ఓ పాఠం ఉంటే వుండొచ్చు. అంతకంటే కొంచెం లోతుకు పోయిన పాపాన ఈ సంస్థలెప్పుడూ పోవు.

నాకో తీరని కల వుంది. అదేమంటే మన టీచర్లకు కనీసార్హతగా ముప్పై కథలయినా తడుముకోకుండా చెప్పడం వుండే రోజు ఎప్పుడొస్తుందా అని. మన ప్రాచీన కథల మీద ఈ మాత్రం పట్టు వుండే టీచర్లుంటే ఎంత అద్భుతంగా వుంటుందో గదా అని ! ‘పట్టు’ అంటే గందరగోళపరచకుండా, గజిబిజి చెయ్యకుండా సాఫీగా చెప్పగల్గడం అన్నమాట.

కథలు చెప్పుకోవడం మన సమాజపు సహస్రాబ్దాల సంప్రదాయం, వారసత్వం! ఒకటీ రెండా? వేలాది సాంప్రదాయక కథలు చెవి నుంచి చెవికి, గుండె నుంచి గుండెకు ఎన్ని శతాబ్దాల పాటు ఎక్కిపొయ్యాయో! అంత దూరం నేనాశించడం లేదు గానీ కనీసం ముప్పై కథలు చెప్పగల్గితే మన ఒకటిరెండు తరగతుల పిల్లలు ఎన్నో విలువలు

నేర్చుకొంటారు. ఇతర సబ్జక్టులతో పాటు కథలకింత చోటివ్వగల్గితే ఎన్నో విషయాలు పిల్లలకు తెలుస్తాయి. మనం చెప్పే ఇతరు పాఠ్యాంశాలు కూడా కావల్సినన్ని తెలుస్తాయి.

**కథ లెక్కడ దొరుకుతాయి?**

సాంప్రదాయిక కథలంటే ఏమిటి? వీటి ప్రాధాన్యత ఏమిటి? దీన్ని మనం పరిశీలించాలి. ఈ కాలపు కుర్ర టీచర్లను కథలు చెప్పమంటే పిల్లల పత్రికల్ని తిరగేస్తున్నారు. కామిక్స్‌ను, వాస్తవగాథల్ని, చివరికి పెద్ద పెద్ద జోక్స్‌ను సైతం పిల్లలకి కథలుగా చెప్పడానికి పూనుకొంటున్నారు. ఇవన్నీ కథల జాబితాలోనే వస్తాయా? వస్తే రావచ్చు. కానీ మన ఆరేడేళ్ళ పిల్లల్ని ఇవి మన పాత కథలంత ప్రభావితం చేస్తాయా అనేది మాత్రం అనుమానాస్పదం.

మన సాంప్రదాయక కథలకు కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి. ఆ లక్షణాలు ప్రస్తుత పత్రికల్లో వస్తున్న కథల్లో కన్పించడం లేదు. మంచి కథకుండే లక్షణాలేమిటి? వీటిని తర్వాత పరిశీలిద్దాం. దీనికి ముందు ఇలాంటి మంచి కథలెక్కడ దొరుకుతాయో చూద్దాం.

పంచతంత్రం, జాతక కథలు, మహాభారతం, అరేబియన్ నైట్స్, విక్రమాదిత్య కథలు, వివిధ ప్రాంతాల జానపద కథలు మనకు ఎన్ని మంచి కథల్నయినా అందిస్తాయి. ఇదొక పెద్ద భాండాగారం. కొంచెం కష్టపడగల్గితే కథా సరిత్సాగరం, గులిస్తాన్, బోస్టన్, బీర్బల్, తెనాలి రామలింగడు, జానపదాలు లాంటివి కావల్సినన్ని దొరుకుతాయి. ఒక్క మన దేశానికే గాదు ప్రపంచమంతా మంచి కథలు కోకొల్లలు. ' ఇంత పరిశోధన మాకెక్కడ సాధ్యం' అని మీరనవచ్చు. కథలు చెప్పాలనే అనుకొంటే మంచి కథల్ని ఎన్నుకోవడం, వెతుక్కోవడం చాలా చిన్నపని అని నా అభిప్రాయం.

పంచతంత్రం, జాతక కథలు, మహాభారతం, అరేబియన్ నైట్స్, విక్రమాదిత్య కథలు, వివిధ ప్రాంతాల జానపద కథలు మనకు ఎన్ని మంచి కథల్నయినా అందిస్తాయి. ఇదొక పెద్ద భాండాగారం. కొంచెం కష్టపడగల్గితే కథా సరిత్సాగరం, గులిస్తాన్, బోస్టన్, బీర్బల్, తెనాలి రామలింగడు, జానపదాలు లాంటివి కావల్సినన్ని దొరుకుతాయి.

**మంచి కథ ఎలా వుంటుంది?**

ఏది మంచికథ అని నన్నెవరైనా ప్రశ్నిస్తే పిల్లలు తరతరాల నుంచి దేన్ని అద్భుతంగా ఆస్వాదిస్తున్నారో అదే మంచి కథ అని నేను జవాబిస్తాను. ఇక్కడ న్యాయ నిర్ణేతలు పిల్లలే తప్ప మనం కాదని నా దృఢ విశ్వాసం. మన పంచతంత్రంలోని ' సింహం కుందేలు' కథనే తీసుకోండి. దీన్ని మనం చాలా సీదాసాదా కథగా భావిస్తాం. కానీ లోతుల్లోకి వెళ్ళితే ఇందులోని మంచి కథ లక్షణాల్ని మనం పసిగట్టవచ్చు. ఈ కథలోని మలుపుల్ని ఇప్పుడు కొంచెం పరిశీలిద్దాం.

మన బుజ్జి కుందేలు సింహానికి కవళంగా వెళ్ళాల్సిన దుర్దినం వచ్చింది. తీరిగ్గా కుందేలు సింహం గుహ దగ్గరకెళ్ళేప్పటికి ఆకలితో సింహం నకనకలాడిపోతోంది. మిన్నూ మన్నూ తెలిసే స్థితిలో లేదది. ఇప్పుడు మన కుందేలు తన అబద్ధాల పురాణాన్ని ప్రారంభించాలి. సింహంతో కనీసం మాట్లాడ్డానికయినా తగిన సందర్భమేనా యిది? ఏ మాత్రం కాదని కథ వినే వాళ్ళందరికీ తెలును. అయినా కుందేలు తానెందుకు ఆలస్యంగా రావల్సి వచ్చిందో, దారిలో తనని మరో సింహం ఎలా అడ్డగించిందో ప్రాణాలకు తెగించి చెప్పింది. ఆకలి కంటే కోపం తీవ్రమైందని కుందేలుకు తెలుసు. సరిగ్గా ఆ పాయింటునే అది పట్టుకొంది. పెత్తందార్లకు అహంకారం ఎక్కువ. అది ఏ మాత్రం దెబ్బతిన్నా వాళ్ళు ఓర్చుకోలేరు. అందుకే సింహం ఆకల్ని అవతలబెట్టి శత్రువు సంగతి తేల్చుకోవాలని కుందేలు వెంట నడిచింది. గుడ్డి బావి దగ్గరికి చేరింది.

మళ్ళీ ఇది కుందేలుకు కష్టకాలం (కథలో ఇదో మలుపు). ఇక్కడ కూడా కుందేలు తెలివిగా సింహం తెలివితక్కువ ఆవేశం మీదా, అసూయ మీద ఆధారపడింది. సింహం బావిలోకి చూచి తన బింబాన్ని శత్రుసింహం అనుకొని దూకి దిక్కులేని చావు చచ్చింది.

ఇన్నాళ్ళూ ఇంత ప్రచారం పొందిన ఈ కథను ఇంకొంచెం లోతుగా పరిశీలిద్దాం. ఈ కథా వస్తువేమీ

సామాన్యమైంది కాదు. దుర్మార్గమైన అధికార పిశాచం ముందు ప్రాణాల్ని నుంచి బయటపడ్డం దాదాపు అసాధ్యమైన వేళ కుందేలు లాంటి బడుగు ప్రాణి పాపం ఏం చెయ్యాలి? అనేది ఇక్కడున్న సమస్య. నిజానికిది చాలా పెద్ద విషయం. సాధారణంగా ఇంత పెద్ద విషయాల్ని మనం పిల్లలకు దూరంగా వుంచాలనుకొంటాం. విచిత్రమేమంటే పిల్లలు ఇంత పెద్ద విషయాన్నే ఇష్టపడతారు! ఎందుకిష్టపడతారు? దాన్ని తర్వాత పరిశీలిద్దాం.

ఇక్కడ మరో అంశం కూడా మనం పరిశీలించాలి. ఒక బక్క ప్రాణి మహా బలవంతుడైన ఒక శత్రువు బారిన పడి కష్టాల్లో చిక్కుకొన్న సందర్భమిది. ఇందులోంచి బయటపడ్డానికి ఈ బక్క జీవి ఒక ఎత్తుగడ వేసింది. ఈ ఎత్తుగడలో ఏ మాత్రం ' నీతి' లేదు. మరో సందర్భంలో ఇలాంటి అబద్దాలు చెపితే మనం కుందేల్ని టక్కరి కుందేలు కింద లెక్కగడతాం. కానీ ఇక్కడ ఈ బడుగు ప్రాణి అసాధారణమైన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించింది. అమోఘమైన ధైర్యాన్నీ, ఆత్మ విశ్వాసాన్ని చూపింది. చిట్టచివరి దాకా ఏ మాత్రం తొణక్కుండా నిలబడికార్యం సాధించింది. ఇందుకోసం ఒక పెత్తందారుతో సాధారణ బడుగు వ్యక్తి మాట్లాడినట్టే భయం భయంగా మాట్లాడింది. అనుకొన్న పని నెరవేర్చుకొంది.

**కథ నడిచే కొలదీ కుందేలు వారికి పెద్ద ఆకర్షణగా మారుతుంది. కుందేలు ఒక ఎత్తుగడ పన్నింది. అది ఫలించింది. దీంతో తన సమస్యనేగాదు అందరి సమస్యనూ కుందేలు పరిష్కరించింది. పిల్లలు ఇలాంటి పరిష్కారాన్నే ప్రేమిస్తారు. కుందేలు ఎత్తుగడలో పిల్లలకు ఇచ్చే మరో అంశం కూడా వుంది.**

ఈ కథ నడకను కూడా మనం పరిశీలించాలి. కథారంభంలో జంతువులు సింహంతో కుదుర్చుకొన్న ఒప్పందం ఫలితంగా ఒక వింత శాంతి నెలకొంటుంది. పైకి కాలం నజావుగా నడున్తున్నట్లు కన్పించినా ఇది దినదినగండమే. ఉన్నట్టుండి కుందేలు వంతు రావడంతో అసలు కథ తెరమీదికి వచ్చేస్తుంది.

ఇక మన కథ ఒక్క క్షణం కూడా ఆగకుండా చకచకా సాగిపోతుంది. మన కుందేలు ఈ కష్టం నుంచి బయటపడాలంటే ఒక్క నిమిషం వ్యర్థం చేసినా కొంప మునుగుతుంది. అదొక ఎత్తుగడ వేసింది. ఆ ఎత్తుగడేమీ నల్లేరు మీద నడక కాదు. మహా ప్రమాదకరమైంది. అయినా కుందేలు దానికే పూనుకొంది. శ్రోతకిక్కడ గుక్క తిప్పుకొనే వీలుండదు. ఏ మాత్రం తటపటాయింపుకు అవకాశం ఉండదు. అతడిప్పుడు కుందేలు పక్షపాతి. అది ఏం చేసినా అతనికది ఎంత న్యాయంగా వుంటుంది! ప్రతిదీ మన శ్రోత కుందేలు వైపు నుంచే ఆలోచించడం మొదలు పెడతాడు!

ఈ కథని పిల్లలెందుకంతగా ఇష్టపడుతున్నారో గుర్తించడానికి ఈ పరిశీలన సరిపోతుందనుకొంటాను. తమను అందులో చూచుకొని మమైకం కాగల ఒక పాత్ర, ఒక హీరో ఈ కథలో వారికి చిక్కింది. అదే కుందేలు, పిల్లల రోజువారీ జీవితంలో కూడా కుందేలు ఎదుర్కొన్న సవాళ్ళ వంటివి ఎన్నో ఎదురవుతుంటాయి.

పిల్లలు చిన్నవాళ్ళు, బలహీనులు, ఎక్కువ సందర్భాల్లో వాళ్ళకిష్టం లేనిదాన్ని వాళ్ళు చెయ్యాల్సి వస్తుంటుంది. అధికారం శారీరకాధిక్యత గల వారి వల్ల వాళ్ళెప్పుడూ కష్టాల పాలవుతుంటారు. భయాందోళనలకు గురవుతుంటారు. కుందేలు ఎదుర్కొనే సవాళ్ళతో పిల్లలెదుర్కొనే సవాళ్ళకెంతో సామ్యం వుంది. దీన్ని మనం ఎప్పుడూ గుర్తించం. మన పద్ధతిలో మనం అధికారమంతా మన చేతిలోనే పెట్టుకొని వాళ్ళతో నిత్యవ్యవహారాలు జరుపుతుంటాం.

హఠాత్తుగా ఒక బంధువో, మరొకరో చనిపోతే పిల్లల మీద అది ఎంత ప్రభావం కల్గిస్తుందో, వాళ్ళెంత ఆందోళనకు గురవుతారో మనం గుర్తించం. అలాగే వాళ్ళు తమ కంటే శక్తివంతులైన పెద్దలతో పడే ఘర్షణను కూడా మనం గమనించం.

అందువల్లనే కథా ప్రారంభంలోనే పిల్లలు కుందేలులో తమను చూచుకొంటారు. కథ నడిచే కొలదీ కుందేలు వారికి పెద్ద ఆకర్షణగా మారుతుంది. కుందేలు

ఒక ఎత్తుగడ పన్నింది. అది ఫలించింది. దీంతో తన సమస్యనేగాదు అందరి సమస్యనూ కుందేలు పరిష్కరించింది. పిల్లలు ఇలాంటి పరిష్కారాన్నే ప్రేమిస్తారు. కుందేలు ఎత్తుగడలో పిల్లలకు ఇచ్చే మరో అంశం కూడా వుంది. అదేమంటే ఏదో ఒక సాకు చెప్పి అది తప్పించుకొన జూడ్డం. ఎందుకు ఆలస్యమైంది? అని సింహం అడిగితే కుందేలు చెప్పిన సాకు పిల్లల్ని ఎందుకాకర్షిస్తుందో చెప్పగలరా? ఎందుకేముంది పిల్లలు కూడా ఇలా సాకులు చెప్పి ' కష్టాల్నించి' బయటపడేవాళ్ళే గదా! అందుకని ఈ ఎత్తుగడతో కుందేలు తనను కాపాడుకోవడమే గాదు సింహాన్ని అంతం చేసింది. శత్రువును హతమారిస్తే తప్ప పాపం కుందేలు ప్రమాదం నుంచి బయటపడలేదు. అంటే ఈ కథ మనుగడ కోసం సాహసంతో చేసే విధ్వంసాన్ని నాటకీయంగా మన ముందు పెడుతోంది. ఇందులో ఏమి నీతి వుంది? మనుగడకోసం చేసే పోరాటం తప్ప ఇందులో ఏ నీతి లేదు. పిల్లల వైపు నుంచి చూస్తే తప్ప నిజానికి కథలో మనం అభినందించదగ్గది ఏదీ లేదు. పెద్దలుగా మనం చూస్తే ఈ కథ నీతిలేని కథ. కుందేలు చేసింది పచ్చి మోసం తప్ప మరేమీ కాదు.

**కథల ప్రయోజనం ఏమిటి?**

అంటే పిల్లలకు చెప్పడానికి ఎన్నుకొనే మంచి కథల్లో నీతి తప్పనిసరి కాదన్నమాట! అయితే సింహం - కుందేలు కథలో ప్రత్యక్ష నీతి గాకపోయినా పరోక్షనీతి లేకపోలేదు. పిల్లల్ని భావోద్రేకానికి గురిచేసే అంశం ఇందులో ఒకటి వుంది. ఒక ప్రమాదం ముంచుకొచ్చినపుడు ఎంత నిబ్బరంగా నిదానంగా వుండాలో అది చెపుతుంది. సరైన ఆలోచన చురుకుదనం అప్పుడే సాధ్యమని కూడా ఈ కథ చెపుతుంది.

కానీ సాంప్రదాయకార్థంలో ఇలాంటి పరోక్ష నీతిని కథా నీతిగా లెక్కించలేము. నీతి స్పష్టంగా వుండాలి గానీ ఏదో డొంక తిరుగుడుగా వెతికి వెతికి చూస్తే తప్ప కనబడకుండేదిగా వుండకూడదు.

ఈ చర్చా సారంశం ఏమిటి? పిల్లల్లో నైతిక విలువల్ని పెంచడం మన సాంప్రదాయక కథల ప్రధానోద్దేశం కాదు. కథలు చెప్పడం వల్ల వచ్చే అసలైన లాభాలు వేరే వున్నాయి. ఇప్పుడు వాటిని చూద్దాం.

**మంచి శ్రవణం**

మంచి శ్రోత అంటే ఎవరు? చివరి దాకా వినేవాడే మంచి శ్రోత. కానీ చాలా మంది అలా చివరిదాకా వినరు. మనం పిచ్చాపాటీ మాట్లాడేటపుడు కూడా చాలామంది మధ్యలోనే అడ్డం వస్తుంటారు. మనం చెప్పబొయ్యేది ముందే తెలిసి వాళ్ళిలా చేస్తే కొంత అర్థం చేసుకోవచ్చు కానీ అసలు వీళ్ళకి అంతదూరం వినడానికే ఓపిక ఉండదు. పెద్ద పెద్ద మేనేజిమెంటు, పరిపాలనా కోర్సుల్లో సైతం ఈ రోజుల్లో ఓపిగ్గా వినడాన్ని ఓ నైపుణ్యంగానే గాక ఓ మంచి లక్షణంగా కూడా పరిగణిస్తున్నారు. కథలు చెప్పడం చాలా చిన్న వయస్సు నుంచే ఇలా జాగ్రత్తగా ఓపిగ్గా వినే లక్షణాన్ని పెంపొందిస్తుంది. పెద్దయ్యాక ఇది ఎంతో ఉపయోగపడుతుంది. కథలు చెప్పడం వినడం ఒక మహత్తర సంప్రదాయంగా గల మన దేశంలో ఎదుటి వాడిని ఓపిగ్గా వినేవాళ్ళ సంఖ్య ఈ రోజుల్లో తగ్గిపోవడం చాలా విచిత్రంగా అన్పించవచ్చు. కాదిది వాస్తవం. చిన్న వయస్సులో పిల్లలకు కథలు చెప్పకపోవడం దీనికొక ప్రధాన కారణమని నా అభిప్రాయం. నాగరికత పెరిగాక పిల్లలకు కథలు చెప్పడానికి మనకు తీరిక చిక్కడం లేదు. దీని ఫలితం మనల్ని ఈ దుస్థితికి తెచ్చింది.

**పెద్ద పెద్ద మేనేజిమెంటు, పరిపాలనా కోర్సుల్లో సైతం ఈ రోజుల్లో ఓపిగ్గా వినడాన్ని ఓ నైపుణ్యంగానే గాక ఓ మంచి లక్షణంగా కూడా పరిగణిస్తున్నారు. కథలు చెప్పడం చాలా చిన్న వయస్సు నుంచే ఇలా జాగ్రత్తగా ఓపిగ్గా వినే లక్షణాన్ని పెంపొందిస్తుంది.**

**ఊహించడం, తర్కించడం**

తమకు నచ్చిన కథను పిల్లలు మళ్ళీ మళ్ళీ వినాలనుకొంటారు. తమకు తెలియకుండా ఇలాంటి కథల పట్ల వాళ్ళు మక్కువ పెంచుకొంటారు. రెండోసారో మూడోసారో కథ వింటున్నప్పుడు తర్వాత ఏం జరుగుతుందో

ముందే వాళ్ళు చెప్పగల్గుతారు. ఇలా జరగబోయేది ముందుగా చెప్పగల్గడం ఒక సామర్థ్యం. మళ్ళీ మళ్ళీ ఒకే కథ వినడం వల్ల ఇలాంటి సామర్థ్యం పెరుగుతుంది. వాళ్ళ ఆత్మ విశ్వాసం పెరుగుతుంది. వాళ్ళ సర్వతోముఖాభివృద్ధికిది దోహదపడుతుంది. మొదటి రెండు తరగతుల పిల్లలు చదవడం నేర్చుకొనేదశలో ఈ 'ముందుగా చెప్పగల్గడం' అనే సామర్థ్యం ఎంతైనా ఉపయోగపడుతుంది.

గణితం నేర్చుకోవడంలో కూడా ఈ సామర్థ్యం విలువ ఎనలేనిది. గణిత సూత్రాలన్నీ 'ముందుగా ఊహించి చెప్పగల్గడం' మీదనే కదా ఆధారపడతాయి. అందువల్ల గణిత అభ్యసనానికీ ఈ కథా శ్రవణ సామర్థ్యానికి మధ్య ఓ సామ్యం, సంబంధం వుందని నా అభిప్రాయం. కథకు కూడా కొన్ని నిబంధనలు, పద్ధతులు వుంటాయి. వాటిని పిల్లలు కథలు వినే కొద్దీ పట్టుకొంటారు. ఇలా పట్టుకొనే కొద్దీ వాళ్ళు ముందుగా ఏం జరగబొయ్యేదీ ఊహించి మరింత బాగా చెప్పగల్గుతారు. అలాంటి పిల్లలు గణిత సూత్రాల్ని కూడా ఇంతే బాగా పట్టుకోగలుగుతారు.

**తాము ఎప్పుడూ పాల్గొనని సందర్భాలను, చూడని మనుషులను, పాత్రలను వాళ్ళు కథల్లో చూస్తారు. ఇలాంటి వాటితో మనకేం పని అని మీరనుకోవచ్చు. కానీ ఇవి కూడా మన జీవితంలో భాగాలు! వాటిని ఎప్పుడూ మనం చూడకున్నా అవి మనల్ని, మన ఆలోచనల్ని కదిలిస్తాయి. చిన్న వయస్సులో ఈ కదలిక మరింత ఎక్కువగా వుంటుంది.**

**మరో ప్రపంచం**

పిల్లలు తమ చుట్టూ చూస్తున్న ప్రపంచాన్ని కథలు విస్తృత పరుస్తాయి. తాము ఎప్పుడూ పాల్గొనని సందర్భాలను, చూడని మనుషులను, పాత్రలను వాళ్ళు కథల్లో చూస్తారు. ఇలాంటి వాటితో మనకేం పని అని మీరనుకోవచ్చు. కానీ ఇవి కూడా మన జీవితంలో భాగాలు! వాటిని ఎప్పుడూ మనం చూడకున్నా అవి మనల్ని, మన ఆలోచనల్ని కదిలిస్తాయి. చిన్న వయస్సులో ఈ కదలిక మరింత ఎక్కువగా వుంటుంది. జీవితాంతం ఈ క్రమం కొనసాగుతూనే వుంటుంది. తమ చుట్టూ ఒక్క చెడ్డమనిషి కూడా లేకున్నా పిల్లలు చెడ్డవాళ్ళను గురించి ఆలోచిస్తారు. అలాగే అసాధారణ ప్రతిభావంతుల్నీ, బుద్ధిమంతుల్నీ, అందగాళ్ళనూ కలుసుకొనే ఛాన్సు తమకెప్పుడైనా దక్కకపోతుందా అని ఆరాటపడతారు. ఆదర్శమూర్తుల్ని అభిమానించడం పిల్లల మనస్తత్వంలో ఒక భాగం. అలాగే ప్రమాదాలన్నా, దుష్టశక్తులన్నా భయపడ్డం కూడా వాళ్ళ స్వభావంలో భాగం. మన సాంప్రదాయక కథలు పిల్లల ఈ మనస్తత్వాని కనుగుణంగా వుండటం వల్లనే ఇంతకాలం పిల్లల్నిలా ఆకర్షింపగల్గుతున్నాయి. అక్షర ప్రపంచంలోకి ఇంకా అడుగు పెట్టని బిడ్డ ఓ అమ్మమ్మ కథలో అద్భుతమైన మరో ప్రపంచాన్ని చూస్తుంది. అది తన వాస్తవ ప్రపంచం కంటే ఎంతో విస్తృతంగా వుంటుంది. పిల్లలకు కథల్లో కన్పించే ఈ మరో ప్రపంచం గజిబిజిగా గందరగోళంగా వుండదు. అందులో ఓ క్రమ బద్ధత ఉంటుంది. ఆ క్రమబద్ధతలోనే కొన్ని నైతిక విలువ లుంటాయి. కానీ ఆ విలువలు మనం నమ్మే సాంప్రదాయకార్థంలో వుండవు. ఆ కథల్లో వంచితుడే గెలుస్తాడు. అయితే ఇలా గెలవడానికి వాడు కొన్ని పద్ధతులు పాటిస్తాడు. అవి అనైతికమైనవిగా మనకు సాంప్రదాయ కార్థంలో కన్పించవచ్చు. ఆకలితో నకనకలాడే సింహానికి కుందేలు చెప్పిన అబద్ధాలు ఇలాంటివే.

**నూతన పదజాలం**

కథలు చెప్పడం పిల్లల భాషా ప్రపంచాన్ని ఎలా విస్తృతం చేస్తుందో కూడా మనం చూడొచ్చు. మాటలు పూర్తిగా వ్యక్తిగత ఆస్తి, ఆ మాటలతో ప్రపంచానికి మనం పేర్లు పెట్టే తీరు కూడా వ్యక్తిగతమైనదే. కానీ ఇదే పదజాలం సామాజిక ఆస్తి కూడా. ఎందుకంటే మన అనుభవాల్ని ఇతరులతో పంచుకోవడానికి ఈ మాటలే ఆధారం పదాలకున్న ఈ వ్యక్తిగత, సామాజిక లక్షణాలే పదాల అర్థాల్ని నిర్ధారిస్తాయి. ఉదాహరణకు పిల్లవాడికి 'ఆకలి' అంటే ఏమిటో అనుభవం నుంచి తెలుసు. దీన్నుంచే సింహం 'ఆకలి'తో వున్నపుడు ఎలా వుండి ఉంటుందో పిల్లవాడు గ్రహించగలడు. ఇలా 'ఆకలి' అనే తనకు తెలిసిన పదం సింహానికి కూడా వర్తింప

చేసుకునేలా ఈ కథ శ్రోతకు సహకరిస్తుంది. మరికొన్ని కథలు వినేకొలదీ మరికొన్ని పదాల సామాజికార్థాలు పిల్లలకు తెలుస్తాయి. తన స్వంత పదజాలాన్ని ఇతరులకు వర్తింప జేసుకొనే క్రమం వేగిరమవుతుంది. తర్వాత 'చదవడం'లోకి వెళ్ళే పిల్లలకు ఇది చాలా ఉపకరిస్తుంది.

పైన మనం చెప్పుకొన్న నాలుగు కథాప్రయోజనాల్లోని అంశాలు చదవడాని క్కూడా వర్తిస్తాయి. పిల్లలు చదివేకొలదీ భాషాసూత్రాలను, నిర్మాణాన్ని అర్థం చేసుకో గల్గుతారు. ముందుగా ఊహించి చెప్పగల్గడం పెరిగే కొలదీ చదవడంలో సామర్థ్యం పెరుగుతుంది. భాషా నిర్మాణంలో సూత్రాలతో పరిచయం పెరిగే కొద్దీ వాక్యంలో తర్వాత ఏమీ వచ్చేదీ పిల్లలు గ్రహిస్తారు. ఇలా చూస్తే కథలు చెప్పడం పిల్లల భాషా జ్ఞానాన్ని పెంచడానికి అమోఘంగా ఉపకరిస్తుంది!

**పిల్లలు చదివేకొలదీ భాషాసూత్రాలను, నిర్మాణాన్ని అర్థం చేసుకో గల్గుతారు. ముందుగా ఊహించి చెప్పగల్గడం పెరిగే కొలదీ చదవడంలో సామర్థ్యం పెరుగుతుంది. భాషా నిర్మాణంలో సూత్రాలతో పరిచయం పెరిగే కొద్దీ వాక్యంలో తర్వాత ఏమీ వచ్చేదీ పిల్లలు గ్రహిస్తారు.**

**కథా నైపుణ్యం**

కథలు చెప్పాలనుకొన్నపుడు మనకా కథ బాగా మనసుకు పట్టి వుండాలి. అందులో తడబాటు ఏమి వుండకూడదు. తడబడితే మధ్యలో కొతుకు కన్పిస్తే కథను ఖూనీ చేసినట్టే లెక్క. బాగా మనసుకు పట్టిన కథ అయితే మనం సాఫీగా చెప్పగలం. అలా చెప్పగల్గి నప్పుడే కథ చెప్పేవారికీ, వినేవారికీ మధ్య ఒక సజీవ సంబంధం వుంటుంది.

అలాగే కథ బాగా మన మనసుకు పట్టి ఉంటే ఆ కథకు సంబంధించిన ఒక స్కెచ్ మన మనస్సులో ఉంటుంది. అప్పుడు శ్రోతల పరిస్థితిని బట్టి మనం ఇష్టం వచ్చినట్లు దాన్ని మార్చుకోగలం. ఒక్కోసారి కథను పెంచాల్సి వస్తుంది. ఒక్కోసారి తగ్గించాల్సి వస్తుంది. కుందేలు సింహం ముందు నిలబడ్డప్పుడు కథను మనం సాగదియ్యలేం. అక్కడే వేగంగా కథ నడవాలి. సింహం ఆకలితో నకనక లాడుతూ ఆలోచిస్తున్నప్పుడు కథను మనం నెమ్మదిగా చెప్పొచ్చు. అలాగే కుందేలు భయం భయంగా తన ఎత్తుగడను నెమరేసుకొంటూ అడవిలోంచి వస్తున్నపుడు కథను అంత వేగంగా చెప్పాల్సిన అవసరం వుండదు. ఇదంతా మనకు కథ మీద వున్న పట్టునుబట్టి వుంటుంది.

ఇక కథలోని సంభాషణల సంగతేమిటి? వాటినెలా చెప్పాలి అనే ప్రశ్నలున్నాయి. దీనికి మనం పలు మార్గాల్ని రెండు రకాల స్వరాలతో పలకొచ్చు. హావభావాల్ని ప్రదర్శిస్తూ చెప్పొచ్చు. చిన్నసైజు తోలుబొమ్మల్ని ఆడిస్తూ చెప్పడం వల్ల సంభాషణలు చాలా రక్తికడతాయి. ఒక్కో పాత్రను గురించి చెపుతున్నపుడు తరగతి గదికి ఈవైపు నుంచి ఆవైపునకు పచార్లు చేస్తూ చెప్పొచ్చు. ఇలా ఎన్నో సృజనాత్మకత పద్ధతుల్ని పాటించవచ్చు. ఇవన్నీ పిల్లలకు చాలా ఉత్తేజాన్నిస్తాయి. ఒకే కథను ప్రతి సంవత్సరం చెప్పాల్సిరావచ్చు. ఒకే కథను ఒకే సంవత్సరంలో పలుసార్లు చెప్పాల్సి రావచ్చు. దీనికి తగ్గట్టుగా మనం తయారు కావాలి. ఒక కళగా కథా కథనాన్ని అధ్యయనం చెయ్యాలి. అలవరచుకోవాలి. ఇది ప్రతి టీచరుకూ ఒక తప్పనిసరి సవాలు.

కథలు చెప్పడం తన జీవితంలో విడదీయరాని భాగమైతే ఏ టీచరు జీవితమూ నిస్సారంగా వుండదని నా గట్టి నమ్మకం. ఇది జరగాలంటే ప్రాథమిక పాఠశాలల పాఠ్యాంశాల పట్ల మన దృక్పథంలో కూడా తీవ్రమైన మార్పు రావాలని నా దృఢ విశ్వాసం.





# కాబోయే కథకులకు పనికొచ్చే చిట్కాలు

## ఆరుద్ర

బొమ్మలు : బాపు

మనం చదివే చాలా కథలకన్నా, మనం రాసే కథలే మనకి బాగుంటున్నాయి. అయినా మనం పంపించే కథలు ఈ పత్రికలవాళ్లు ప్రచురించరేం? అని మీరెప్పుడైనా బాధపడ్డారా? ఇప్పుడూ పడుతున్నారా? పడకండి. ధైర్యం చేతబట్టుకొని, కాళ్లు నిలదొక్కుకోండి.




మీరు పంపించే కథలు మీ కొక్కరికే బాగుంటే చాలదు. అందరికీ బాగుండాలి. అప్పుడే సంపాదకులు వాటిని ప్రచురిస్తారు. బాగున్న కథల్ని పత్రికలవాళ్లు కళ్ళకద్దుకొని మరీ ప్రచురిస్తారు. వేసినవాటికి తృణమో, పణమో పారితోషికం కూడా ఇస్తారు. (పూర్వం రమారమీ తృణమే ఇచ్చేవారు. ఇప్పుడు పణం ఇస్తున్నారు)

బాగా ఉండేటట్టు కథ రాయాలంటే దానికి అనుభవం కావాలి.

"చాల్లేవయ్యా! ఆపాటి అనుభవం మాకూ ఉంది. ఊకొట్టడం వచ్చినదగ్గర్నుంచీ కథలు వింటున్నాం. కూడ బలుక్కొని చదవడం మొదలెట్టిన దగ్గర్నుంచీ కథలు చదివేస్తున్నాం. కాంపోజిషన్లు రాయడం మొదలెట్టిన మర్నాటి నుంచి కథలూ రాస్తున్నాం. ఇంతకన్నా ఇంకేం కావాలి?" అని మీలో ఏ ఒక్కరైనా అనగలిగితే మీకు అనుభవ ముందని తప్పకుండా ఒప్పుకుంటాను. చిన్నప్పట్నుంచీ కథలు వినాలనీ, చదవాలనీ, వ్రాయాలనీ తహతహ ఉన్నవాళ్లు మంచి కథకులవడానికి అవకాశాలున్నాయి.

భాగవతం రాసిన బమ్మెర పోతరాజుగారు మాత్రం ఎలా రాశారు? విబుధవరులవల్ల విన్నంత, కన్నంత, తెలియవచ్చినంత తేట పరిచారు. ఆహా! దొరికింది కీలకం! ఇదే మంచి కథలు రాయడానికి సూత్రం! కథ రాసేవాడు, ముందు బోలెడంత వినాలి. లాకాయి లూకాయివాళ్ళు

చెప్పేదికాదు. విబుధవరులు చెప్పేది. ఆ తరవాత కనాలి. (అప్పుడే కథలు కనకూడదు, ఆమాటకొస్తే కలలూ కనకూడదు. లోకాన్ని చూడాలి) కన్న తరవాత తెలుసుకోవాలి. కన్నవీ, విన్నవీ తెలుసుకున్నవీ కలగలుపు చేసేసి చెప్పాలి. (మామ్మూలుగా కాదు, తేటపరచాలి) అలాచేస్తే అందరూ భాగవతమంత బాగుండే రచనలు చేయగలరు.




"అబ్బే! అంత పెద్ద ఆశలేంలేవు. నేను ఛస్తే బమ్మెర పోతరాజుగారంతవాణ్ణి కాలేను. ఏదో చిన్న కథ రాసి, అది పత్రికలో పడితే నాపేరు చూసి మురిసిపోదామని ముచ్చట పడుతున్నాను" అంటారా? మీరింక కథలు రాయక్కర్లేదు. మీ ముచ్చట తీర్చడానికి మీరు రాసిన కథ బాగున్నా (మీకు) బాగు లేకపోయినా (అందరికీ) ఏ సంపాదకుడూ ప్రచురించి, ఇతర పాఠకుల్ని ఇబ్బంది పెట్టలేడు. అచ్చులో మీ పేరు చూసుకోడానికి అనేకానేక మార్గాంతరాలున్నాయి. మంచి నిధులకు విరాళాలివ్వండి. మీ పేరు అచ్చులో చూడొచ్చు. లేదా మరో మార్గముంది;

ఈ మార్గం మాత్రం తొక్కకండి. చిక్కులు పడతారు. మొదటి అచ్చులోపడి, తరవాత ఉచ్చులోనూ పడతారు.




పేరు తెచ్చుకోవలసిందే! (చెడ్డ పేరు కాదు. మంచి పేరు)

పెద్ద ఆశయాలుంటేనే గాని; చిన్న (మెత్తు) పేరు సైతం రమ్మన్నారాదు. బమ్మెర పోతరాజుగారి ఉపమానమే మళ్ళీ తీసుకుందాం. ఆయన భాగవతం రాశారంటే ఎలా రాశారు? గంటం పట్టుకొని తాటాకుల మీద చెక్కారు. దానికెంత ఓపిక కావాలి. బోలెడంత. ఆయన కున్నంత ప్రజ్ఞ లేకపోయినా, అంత ఓపికా మీకూ ఉంటే మీరూ కథకులవుతారు.

"అభ్యాసం కూసు విద్య" అన్నారు? పెద్దలు. సాధనమున పనులు సమకూరు 'ధరలోన' అని కూడా వాళ్లే అన్నారని ఎందరెందరో ఉద్ఘాటిస్తున్నారు. మీరు కథకులవడానికి సాధనాలేమిటో ఆలోచిద్దాం.

కథ రాయాలంటే ఏం కావాలి? కథే కావాలి. చెప్పడానికేం లేకపోతే చెప్పేం ప్రయోజనం కొంత మంది గొప్ప కథకులు ఏం లేకపోయినా గొప్ప గొప్పగా చెప్పేస్తారు. వాళ్ళు ఏమిటి వ్రాశారని కాదు. ఎలా వ్రాశారని మనం చదువుతాం. వాళ్ళలాగా చెయ్యి తిరిగాక అలా మీరూ రాయొచ్చుగాని ప్రస్తుతం కథ ఉన్న కథలే రాయండి.

సరే. కథ కావాలి. ఇది ఇంతకుముందు ఎవరూ ఎక్కడా రాయనిదైతే చాలా మంచిది. దేనిమీద రాయడం అని బాధపడకండి. హాస్యమాడేవాళ్లు 'దేనిమీద అని ప్రశ్నేమిటి అందరూ కాగితంమీదే రాస్తారు' అని సమాధానం చెప్తారు.



అబ్బ! గోడమీద కథ రాయడం చాలా కష్టం.

పూర్వం అలంకార శాస్త్రజ్ఞులు ఫలానా ఫలానా విషయాల గురించే వ్రాయాలి, అంటూ అనుశాసనం చేశారు. కాబట్టి ఇబ్బందిలేదు. ఇప్పుడో అన్నీ కావ్య వస్తువులే!

"కుక్క పిల్లా
అగ్గి పుల్లా
సబ్బు బిళ్లా
కాదేదీ కవిత కనర్హం"

అన్నాడు ఆధునిక కవి. దేని గురించైనా మనం రాయొచ్చు. "ఒక కుక్కపిల్ల సైకిల్‌కింద పడింది. కుయ్యోమని అరిచింది. ఆ అరుపు పక్కనున్న ఆఫీసులోని గుమస్తా విన్నాడు. వింటూ, పరధ్యానంగా హెడ్‌గుమాస్తా పైన కలం విదిలించాడు. సిరాపడింది. హెడ్ గుమాస్తాకి కోపం మొచ్చింది. గద్దించాడు. గుమాస్తా గాభరా పడ్డాడు. సిరాబుడ్డి మీద పడ్డాడు. ఫైలు పాడైంది. అతడు చిరాకుగా ఉన్నాడు. అప్పుడే పెద్ద ఆఫీసరొచ్చాడు. ఆయన హెడ్ గుమాస్తాని పిలిచాడు. చిరాకులో ఆయన వినిపించుకోలేదు" ఇలా ఎంత గొలుసైనా అల్లుకుపోవచ్చును" పెద్ద ఆఫీసరు చిన్న గుమాస్తాని తరవాత మెచ్చుకున్నాడు. సిరా ఏ ఫైలు మీద పడి పేజీలని అలికేసిందో, ఆ పేజీలలో దొంగలెక్కలున్నాయి అవి తనిఖీ చేసేవాళ్ళకి అంతు చిక్కలేదు. అనుమానించారు. ఆ ఫైలు పోలీసు లేబరేటరీకి పంపించారు. నేరం బయటపడింది. పెద్ద ఆఫీసరుకి, హెడ్ గుమాస్తాకి శిక్ష పడింది. చిన్న గుమాస్తాకి ప్రమోషనొచ్చింది. అతడు సంతోషంగా యింటికి వెడుతూఉంటే సైకిల్‌కిందపడ్డ కుక్క ఎదురొచ్చింది. నీ మూలాన నాకు ప్రమోషన్ అని దాన్ని అతడు సమీపించి లాలించాడు. అది అతని చెయ్యి కరిచింది. అతడు వెధవకుక్క? అని రాయితో కొట్టాడు. అది పారిపోతూ కారుకిందపడి చచ్చిపోయింది. చిన్న గుమాస్తా దాన్ని చూసి ఏమనుకున్నాడు....?



చూశారా మీకే ఉదాహరణ చెప్పాలని ఇంత కథ అల్లేశాను. ఇలాగ మీరూ అల్లొచ్చు. ఈ కుక్క కథ టూకీగా చెప్పాలంటే ఇలా చెప్పొనా ఇదే చిలువలూ, పలవలూ చెక్కి, పెద్ద కథని చేయవచ్చు.

జీవితంలో జరిగిన చిన్న సంఘటన తీసుకొని ఎవరైనా ఇలా రాయవచ్చు. అయితే తీసుకున్న దాన్ని కొత్త కోణంలోంచి చూడాలి. లేదా కొత్త రకంగా చెప్పాలి. పాత సంఘటనల్ని, పాత పద్ధతిలోనే చెప్తే ఎవరిక్కావాలి?

చెప్పిందే చెప్పి, చెప్పిందే చెప్పి, మళ్ళా చెప్పి కొంతమంది హరిదాసులు సైతం రక్తికట్టిస్తారు. విన్నవాళ్లే విని, విన్నవాళ్ళే విని, మళ్ళా మళ్ళా ఆనందించారంటే ఆ చెప్పడంలో గొప్పతనముందని మనం చెప్పుకోవాలి.




చెప్పేతీరు, తేటతెల్లంగా ఉండాలి. సూటిగా ఉండాలి. మన అమ్మమ్మలూ, నాయనమ్మలూ చెప్పగా మనం విన్న మొట్టమొదటి కథ ఒకటి తీసుకుందాం. "అనగనగా ఒకరాజు. ఆరాజుకేడుగురు కొడుకులు. ఆ ఏడుగురు కొడుకులూ వేటకెళ్ళి.... ఈ కథ మీకూ తెలుసు కాబట్టి అంతా రాయను. ఈ కథలో వున్న సుగుణమేమిటి? పాత్రల్ని ప్రవేశపెట్టడంలో డొంక తిరుగుడులేదు. తికమకలేదు. తెలిసిన పాత్రల ద్వారా తెలియని పాత్రల్ని కథకుడు ప్రవేశపెడుతున్నాడు. అదీ తేటతెల్లంగా కథ చెప్పేతీరు.

ఈ ఏడు చేపల కథలోనే మరొక సుగుణముంది. అది:- కొసమెరుపు. చివర చీమ చెప్పే సమాధానం మనకి నవ్వు పుట్టిస్తుంది. కథ అయిపోయిందనిపిస్తుంది. ప్రతి కథలోనూ ఈ గుణముండాలి. ప్రఖ్యాత కథానిక రచయిత 'ఓహెన్రీ' చిట్ట చివర తాను తిప్పదలిచే మలుపు మొట్ట మొదట ఆలోచించుకొని కథ రాసేవాడట. మీరూ అలా ఆలోచించడం ఒక పద్ధతే.

అంతాన్ని ఆదిలోనే వూహించకపోయినా, మధ్యలో వూహించినా మంచిదే. కుంచాన్ని నిలువుగా కొలవడానికి వీల్లేకపోతే, అడ్డంగా కొలిచినా కొన్ని గింజలు నిలుస్తాయి. ఇందాకా మీకు ఉదాహరణకింద కుక్క కథ చెప్పాను. అందులో కొంత అల్లగానే కొస మెరుపేమిటీ అని అవ్యక్తంగానే ఆలోచించాను. తనకి ఉపకారం చేసిన కుక్కపిల్లకి గుమస్తా కృతజ్ఞత చెప్పడంతో కథ అంతం చేద్దామనుకున్నాను. ఇది మరీ రోటీనుగా ఉందని, అది అతని చెయ్యి కరిచిందని చెప్పాను. ఇప్పుడు అనవసరంగా కుక్కపిల్ల విలన్ అయిపోయిందే అని నాకూ బాధ కలిగింది. కరిచిన కుక్కని ఎవడూ క్షమించడు. అందుకే గుమస్తా దాన్ని కొట్టాడన్నాను. అది కారుకిందపడి చచ్చిపోయిందన్నాను. అప్పుడు గుమస్తా ఏమనుకున్నాడో మీరే వూహించుకోండన్నాను. ఇప్పుడు పాఠకులు కూడా కథలో పాల్గొంటారు.




ఇలా అంచెలవారీగా ఆలోచించి కథ రాయడానికి మీరూ సిద్ధంగా ఉన్నారా? సరే మీతో కలిసి సహాయం చేస్తాను. కథా వస్తువు నెంచుకున్నాక, క్రమాన్ని ఆలోచించుకున్నాక కాగితం మీద పెట్టడమే తరువాయి. కథ చెప్పడానికి భాష కావాలిగా. ఎలాంటి భాషలో చెప్పడం? మనకొచ్చినంత భాషలోనే ఎలా మాట్లాడుకుంటే అలా రాయవచ్చుననే వరం గిడుగు రామమూర్తిగారి ధర్మమా అని లభించింది. దాన్ని సద్వినియోగం చేసుకుందాం.

'నిజం చెప్పడానికి ఉన్నమాటలు చాలు. అబద్ధమాడడానికే మాటలకోసం వెతకాలి. అని (బహుశా) చలంగారు (కాబోలు) అన్నారు. తెలియని మాటలు ఉపయోగించవద్దు.

వాడినమాట అక్కడ ఆ సందర్భంలో అవసరమా కాదా అని కూడా ఆలోచించాలి. మాటల్ని తూచి వాడమన్నారు.



మాటల్ని తూచడ మెలాగ. "అవేం ఘన, ద్రవ, వాయు పదార్థాలా తూచడానికి..?" అనుకోవద్దు. మాటల్ని తూచి వాడగలిగినవాడే సమర్థుడని చెప్పాలి. 'కీ లెరిగి వాత, వీ లెరిగి చేత' అన్నట్టు వాడినమాట అతికినట్టుండాలి. ఆ మాట వాక్యంలో ముందొచ్చినా, వెనకొచ్చినా పనికిరాదు. ఒక ఉదాహరణ చెప్తాను.

"సీతా! నిన్ను ప్రేమిస్తున్నాను.
నీవు నిరాకరిస్తే చచ్చిపోతాను"
ఆమె నిరాకరించింది.
అతడు చచ్చిపోయాడు,
అరవై ఏళ్ళ తరువాత.




ఆఖర్నొస్తేనే జోకు. ' ఆమె నిరాకరించింది. అరవై ఏళ్ళ తరువాత అతడు చచ్చిపోయాడు' అన్నామనుకోండి గమ్మత్తేముంది?

ఇప్పుడు ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంపాదకులు తిరస్కరించిన ఒక కథలోంచి మరో ఉదాహరణ యిస్తాను.

"ప్రేమ... ఈ రోజులలో మరీ కేవలం యువతీ యువకులకు అది పర్యాయపదమయింది......."

పర్యాయపదంకాదు, ఊతపదమైంది అనాలి. రచయిత తాను వాడే మాట ఏమిటో ఆలోచించకుండా వాడేయకూడదు.

తిరస్కరించిన కథలలోంచి ఎన్నైనా ఉదాహరణలు యివ్వవచ్చు. అయితే కథలు ఎలా రాయాలో మీకు చెప్పదలచుకున్నాను గాని, రాయకూడదో కాదు. అందుకే రాసే పద్ధతే చెప్తాను.

సరే! కథా వస్తువు దొరికింది. భాష నిర్ణయించుకున్నాం. ఎత్తుగడ ఎలా చేయడం. ఇది గడ్డు సమస్యే. దీన్నే కృత్యాద్యవస్థ అంటారు. నేను మీకు చెప్పిన కుక్కపిల్ల కథే తీసుకుందాం. దీన్ని ఎక్కడైనా మొదలు పెట్టవచ్చు. గుమస్తా పేరేమిటి పెడదాం? (గురునాధం అందాం) ఫైళ్లలో కాగితాలు పెట్టడంతో మొదలు పెడదామా? లేదా, రోడ్డుమీద కుక్కపిల్ల తిరుగుతూ ఉండడంతో మొదలెడదామా!

కథలో 'యూనిటీ ఆఫ్ టైం?' అనీ, 'యూనిటీ ఆఫ్ స్పేస్' అనీ రెండు ఉంటాయంటారు. వీటి గురించి ముందు ముందు తెలుసుకోవచ్చు. కథ ఆద్యంతాలలో ఏకత్వం కావాలన్నది ఒక లక్షణం. కథ రోడ్డు మీద మొదలెట్టి రోడ్డు మీద అంతం చెయ్యడం బాగుంటుంది. అందుచేత కుక్కపిల్లతోనే మొదలెడదాం.

రోడ్డుని వర్ణించుదామా! శుభం. అయితే ఒకటి జ్ఞాపకం పెట్టుకోండి. అనవసరపు వర్ణనలు మంచిది కాదు. చదివేవాళ్ళకి విసుగూ, మనకి శ్రమ. నా చిన్నప్పుడో సుభాషితం చదివాను. ఇప్పటికీ మరిచిపోను. అదీ కథలు రాసేవాళ్ళకి సలహాయే.

"గదిలో ఒక పిస్తోలు ఉందని కథలోచెప్తే, కథ అయిపోయేలోపున అది పేలాలి. లేకపోతే అది ఉన్నట్టు చెప్పడం దండుగ" అని చెఖోవ్(కాబోలు) చెప్పినట్టు నార్లవారు (బహుశా) రాశారు. ఎవరు చెప్పారో నేను మరిచిపోయినా చెప్పింది మరచిపోలేదు.

రోడ్డుని వర్ణిస్తూ, కార్లూ, సైకిళ్లూ చిత్త మొచ్చినట్టూ పోతున్నాయి. అని చెబ్దాం. ఏమంటే కొంతసేపుపోయాక




మొదట సైకిల్ కిందా తరువాత కారుకింద కుక్కపిల్లా పడుతుంది. మన కథకి అవసరం కనుక వర్ణిద్దాం.

అయితే ఉత్తవర్ణన ఏం బాగుంటుంది. కొంచెం చమత్కారం కావాలి. "మహానగరంలో మనుష్యులు కార్లమీద పోతారు. కార్లూ మనుషులమీదపోతాయి" "అందాం. ఎలా మొదలెట్టినా పాఠకుడిలో ఉత్సాహం కలిగి కుతూహలం కలిగేటట్లు మొదలెట్టాలి.

(జాన్‌పెన్ అనే) ఒక నవలా రచయిత (టెమ్టేషన్ అనే) ఒక నవల ఇలా మొదలెట్టాడు. "నేను పుట్టడానికి అర్నెల్ల ముందునుంచీ, నన్ను చంపడానికి హత్యాప్రయత్నాలు జరిగాయి."

ఈ ఎత్తుగడ ఎంత బాగుంది. కుతూహలం కలిగిస్తుంది. ఇంకో వాక్యంలో ఆ హత్యాప్రయత్నాలు చేసేది వాళ్ళ అమ్మేనన్నాడు. మరికొంత కుతూహలం. ఒక సాంఘిక సమస్య, బోలెడంత పాతకథ అన్నీ వచ్చేశాయి. అయ్యోపాపం అని మొదటే అనిపిస్తుంది.

ఇటువంటి సెంటిమెంటుని కథ ఎత్తుగడలో ఈ రచయిత వాడితే చచ్చి, స్వర్గాన ఉన్న నారాయణబాబు ఒక గేయం చివరలో చచ్చిపోయిన పురిటి కందు యొక్క గాజుకళ్లు 'మా అమ్మే చంపింది! మా అమ్మే చంపింది' అని నేరారోపణ చేస్తున్నట్టు వర్ణించాడు.

కథ మొదట్లో కుతూహలాన్నీ, చివర ఆలోచనల్లనీ కలిగించాలి. మధ్యలో చెప్పేది రక్తి కట్టిస్తూ, చెప్పుకుపోవాలి.

ఈ మాత్రం కిటుకులు చెప్పాను కనుక ఇక మీరే ఆలోచించండి. రాయండి.



- రాసిన కథ పేజీకి ఒక ప్రక్కనే రాయండి. ఇది పత్రికల వాళ్ళసౌకర్యం కోసం (అబ్బే - రెండో ప్రక్క వాళ్ళేం రాసుకోరు.)
- రాసిన కథలో కామాలూ, పుల్‌స్టాపులూ మీరే పెట్టడం మంచిది. (సంపాదకుడు కాంపోజిషన్లు దిద్దే ఉపాధ్యాయుడు కాదు.)
- కథని ఈ కొసనుంచీ ఆకొసదాకా పొడుగ్గా రాసేయకండి. పేరాగ్రాపులుండాలి. మరీ ఒక వాక్యం ఒక పేరాగ్రాపు కింద వ్రాయకండి. (పేరాలుగా కథని ఎందుకు విభజించారో కూడా చెప్పమంటారా? అన్నీ చెప్పేస్తే అంతట మీరేం తెలుసుకుంటారు. పది మంచి కథలు చదివి ఊహించండి.)
- రాసిన కథని పత్రికలో అచ్చువెయ్యడానికి మీరేం డబ్బు యివ్వక్కర్లేదు. మీ కథ వేసుకుంటే వాళ్లు మీకిస్తారు (తృణంకాదు, పణం!) అందుచేత 'మేమెంత డబ్బు కట్టాలి?. అని ఉత్తరాలు రాయకండి.
- మీ కథ సంపాదకుడికి నచ్చకపోతే, అది అతడు బుట్ట దాఖలా చేస్తాడు. మీకు తిరిగి పంపించేయాలంటే స్టాంపులు జతచేసి పంపిండి. (ఎంత బరువుకి ఎన్ని స్టాంపులో తెలుసుకని మరీ.)
- మీరు రాసిన కథ మీరే చదివి వినిపిస్తే గాని, తెలియని దస్తూరీలో రాయకండి. (ఒకానొక డాక్టరుగారు పెళ్ళానికి ఉత్తరం రాశాడట. ఈ దస్తూరి తెలియక మందులషాపు కెళ్ళి మందులు కట్టేవాణ్ణి చదవమందట. అతగాడు మనసులోనే చదువుకొని లోపలకెళ్ళి ఒక మందు తీసుకొచ్చి, చేతిలోపెట్టి మూడు రూపాయలు ఖరీదన్నాడట!!)
- రాసిన కథ వెంటనే పత్రికలో పడకపోతే నిరుత్సాహపడకండి. మీ రచనలు ఎన్ని తిరిగి వచ్చేసినా బాధపడకండి (ఆదిలో నా రచనలకూ అదే గతి పట్టింది. అప్పుడు తెగ బాధపడినా, ఇప్పుడు సంతోషిస్తున్నాను. ఏమంటే అవి ఆనాడు అచ్చుపడితే వాటిని ఇవాళ నేనే చదువుకొని సిగ్గు పడతాను)




**(ఆరుద్ర గారి వ్యాసం 1995 ఆగస్టు రచన సాహిత్య పత్రిక నుండి తీసుకున్నది. ఇతర కొన్ని అభిప్రాయాలు వివిధ పుస్తకాల ముందుమాటల నుండి తీసుకున్నవి. ఈ కూర్పు అంతా కథా కార్యశాల విద్యార్థులకు ఉచితంగా అందజేయడం కోసమే. ఆయా రచయితలందరికీ కృతజ్ఞతలు)**



## సెప్టెంబర్ 29, 2013న సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో నిర్వహించిన
# కథా కార్యశాలకు హాజరయి కథలు రాసి పంపిన వారు

| క్ర.సం | రచయిత | కథపేరు | గ్రామం& జిల్లా | ఫోన్ నెం. |
|---|---|---|---|---|
| 1 | నూనెల శ్రీనివాసరావు | నిర్లిప్తత | విశాఖపట్నం | 9032883206 |
| 2 | ఉడుము ఝాన్సీ | 'సరి' (గా) దిద్దు | నూజివీడు, కృష్ణా జిల్లా | jhansi.hcu@gmail.com |
| 3 | కన్నెగంటి అనసూయ | 'అమ్మ తర్వాతే..' | హైదరాబాద్ | 9246541249 |
| 4 | అమాతి రవీంద్ర | 'ఉత్తరం' | హైదరాబాద్ | 9849909896 |
| 5 | వేదుల రామకృష్ణ | దైవకణం | హైదరాబాద్ | 9989033403 |
| 6 | శ్రీపాది రామచంద్రయ్య | ప్రేమంటే ద్వేషంరా | కోదాడ, నల్లగొండ | 9912147336 |
| 7 | డా. డి. శమంతకమణి | సుస్మృతి | విజయవాడ | 9491962638 |
| 8 | పి.యస్. శ్రీనివాస రావు | కర్ఫ్యూ రోజు | విజయనగరం | |
| 9 | వురిమళ్ల సునంద | దత్తత | ఖమ్మం | 9441815722 |
| 10 | సంకల్ప (వి.బి. శంకర్) | జంపింగ్ సిగ్నల్ | హైదరాబాద్ | 9441264516 |
| 11 | మణి వడ్లమాని | అసూయ | హైదరాబాద్ | |
| 12 | సిహెచ్. కళ్యాణ చక్రవర్తి | లాభంలేదు ఇక రాయాల్సిందే | హైదరాబాద్ | 9348579774 |
| 13. | యడవల్లి శైలజ | హృదయ సంధ్యారాగ కుసుమం | ఖమ్మం | 9394171299 |
| 14. | అరిపిరాల సత్యప్రసాద్ | వెలుగు చుక్క | హైదరాబాద్ | 9966907771 |
| 15. | నన్దిగామ రామమోహన్ | మమతల మాగాణి | హైదరాబాద్ | 9246188821 |
| 16. | ఓగిరాల శ్రీదేవి | అమృతమూర్తి | హైదరాబాద్ | 9550900444 |
| 17 | వేదుల రామకృష్ణ | రెండు శవాలు (అనువాద కథ) | హైదరాబాద్ | 9989033403 |
| 18. | అనురాధ (సుజలమూర్తి గంటి) | అభిజిత్ | హైదరాబాద్ | 7702319351 |
| 19. | సాహిత్యప్రకాశ్ | అత్తారింటికి దారేది? | హైదరాబాద్ | 9703287555 |
| 20. | సాహిత్యప్రకాశ్ | ఆదర్శం | హైదరాబాద్ | 9703287555 |
| 21. | పి. చిరంజీవి రావు | విధిరాత | హైదరాబాద్ | 9908145984 |
| 22. | డా. నాగరాజు అసిలేటి | నువ్వు అక్కడే - నేను ఇక్కడే | హైదరాబాద్ | 9553929394 |
| 23. | వి. తేజశ్రీ | తెల్లారింది మావో మావ | ఖమ్మం | 9502883808 |
| 24. | మహతి | అనగనగ ఒక నిరుద్యోగి | | 9502883808 |
| 25. | డా. డి. శమంతకమణి | ఛమేలి | విజయవాడ | 9491962638 |
| 26. | మోహిత కౌండిన్య | అయిదు వరాలు (అనువాద కథ) | | |
| 27. | సల్ల విజయకుమార్ | లిల్లీ కథ | హైదరాబాద్ | 9014846651 |
| 28. | మౌనశ్రీ మల్లిక్ | అసుర సంధ్య | హైదరాబాద్ | 9394881004 |
| 29. | నెల్లూరు విజయకుమార్ | భూలోకం | హైదరాబాద్ | 9705850413 |
| 30. | పురాణం శ్రీనివాస శాస్త్రి | ఇరుకు | హైదరాబాద్ | 8977889588 |
| 31. | ఎం. సురేందర్ | మేఘో తరంగమై | హైదరాబాద్ | 9010307121 |
| 32. | మణి వడ్లమాని | పూజా సుమాలు | | |
| 33. | పులిగడ్డ విశ్వనాథ రావు | గుడ్డి దాసరి | హైదరాబాద్ | 9491384480 |
| 34. | సుతారపు వెంకట్ | ఐశ్వర్య మోహం | హైదరాబాద్ | 9848958690 |
| 35. | శాంతిశ్రీ | వివక్ష | హైదరాబాద్ | 9866371283 |
| 36. | స్వాతిశ్రీపాద | ప్రేమేరా అన్నిటికీ మూలం | హైదరాబాద్ | 8297248988 |
| 37. | స్వాతిశ్రీపాద | గెస్ట్ రూమ్ | హైదరాబాద్ | 8297248988 |

**గమనిక : ఈ కథలలో ఎంపిక చేసిన వాటిని రాబోయే ప్రస్థానం సంచికలలో వీలువెంబడి ప్రచురించడం లేదా చర్చించడం జరుగుతుంది.**

**- ఎడిటర్**



# కథనశాల కొత్తపుంతలు

– సత్యాజీ

హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞానకేంద్రంలో – కథనోత్సాహం వెల్లివిరిసింది! సాహితీ స్రవంతి నిర్వహించిన 'కథా కార్యశాల' ఔత్సాహిక రచయితల్లో ఉత్తేజం నింపింది. తెలుగు కథ పుట్టిననాటినుంచి ఇప్పటిదాకా ఎన్నెన్ని మలుపులు తిరిగిందీ. ఎన్నెన్ని శిఖరాలు అధిరోహించిందీ కళ్లకు కట్టింది. శైలిలో, నిర్మాణంలో, ఎత్తుగడలో, వస్తు సేకరణలో ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలో నేర్పింది. ఔత్సాహికులకు కథోత్సాహాన్నీ, కథాప్రియులకు కమనీయ అనుభవాన్నీ ఇచ్చింది. తెలుగు కథావనంలో కొత్తగా గుబాళిస్తున్న యువకథా కారులకు సరికొత్త ఉత్తేజం ప్రసాదించింది.

## స్పందన

### ఉత్తేజాన్నిచ్చిన స్పందన

దీనికి కొద్దిరోజుల ముందు సాహితీస్రవంతి హైదరబాద్ నగర కమిటీ మిత్రుల మధ్య చర్చ. ఏదొక ప్రయోజనకర సాహిత్య కార్యక్రమం నిర్వహించాలనేది ఆలోచన. అప్పటికే సాహిత్యశాల జరిపిన అనుభవం ఉంది. కవితారచనపై కార్యశాల నిర్వహించిన ఉత్సాహం ఉంది.

'ఈసారి కథారచనపై నిర్వహిస్తే ఎలా వుంటుంది.?'

'బాగుంటుంది.'

'ఎంతమంది వస్తారు?'

'ఓ 40, 50 మంది రావొచ్చు. 30 మంది వచ్చినా సక్సెసే!'

'కార్యశాలలో ఏఏ అంశాలుండాలి?' – ఫలానా ఫలానా.....

'బోధకులుగా ఎవరెవరిని పిలవాలి?' – ఫలానా ఫలానా.....

కథాకార్యశాల నిర్వహించాలనే నిర్ణయం జరిగింది. ఔత్సాహికులను ఆహ్వానిస్తూ పత్రికల్లో ప్రకటనలు... అందుబాట్లో ఉన్న చిరునామాలకు ఆహ్వానపత్రాలు... అంతా వారం రోజుల్లో వెంటవెంటనే..... ఒకరి నుంచి ఒకరికి సమాచారం బట్వాడా అయింది. ఫేసుబుక్కుల్లో, రచయితల బ్లాగుల్లో.... కథాకార్యశాల అందరికీ ఆహ్వానం పలికింది! అన్ని జిల్లాల నుంచి... ముఖ్యంగా రచయితల నగరం హైదరాబాద్ నుంచి ఫోన్లలో పేర్ల నమోదుకు మంచి స్పందన వచ్చింది. 80 మంది కచ్చితంగా వస్తారని కార్యశాలకు ముందురోజు వేసుకున్న అంచనాను.... ఇంకో 40 కలుపుకోవొచ్చని కార్యశాలకు గంట ముందు సవరించు కున్నారు నిర్వాహకులు. నమోదు పూర్తయ్యేసరికి ఆ సంఖ్య 202కి చేరింది. వాహ్.... ఊహించని స్పందన. అంచనాకు అందని అత్యధిక హాజరుతో కార్యశాల సగం సక్సెస్...!!



### కిటకిటలాడిన 'కథా'ప్రాంగణం

దాదాపుగా ప్రకటిత సమయానికే ప్రారంభ సభ ఆరంభమైంది! లబ్ధప్రతిష్ఠులు, ఔత్సాహికులు, కథాభిమానులూ హాలంతా నిండుగా ఆశీనులయ్యారు. ఆలస్యంగా వచ్చినవారు ఖాళీ కుర్చీలు కనబడక ఆశాభంగం చెందారు. ప్రారంభ సభకు అధ్యక్షత వహించారు సాహితీ స్రవంతి కార్యదర్శి వొరప్రసాద్. సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు, ప్రజాశక్తి సంపాదకులు తెలకపల్లి రవి ప్రారంభ ఉపన్యాసం చేశారు. అందరినీ కార్యశాలకు సమాయత్తం చేస్తూ.... ప్రవాహంలా సాగింది ప్రసంగం. రచయితల సామాజిక కర్తవ్యాన్ని గుర్తు చేశారు. తెలుగు కథ ప్రస్థానాన్ని, ప్రయోజనకర పాత్రని వివరించారు. జనజీవితం కేంద్రంగా కథ వుండాలని, పదికాలాల పాటు నిలిచేవి ఇలాంటి కథలేనని సోదాహరణంగా చెప్పారు. అలాంటి కథలకు, కథకులకు ఈ కథాకార్యశాల దోహదకారి అవుతుందని ఆశిస్తూ... తొలి పలుకులు ముగించారు.

తరువాత అంశాలవారీగా కథాకార్యశాల మొదలయ్యింది!

**తొలి అంశం:** కథాప్రస్థానం. వక్త ప్రముఖ రచయిత్రి ఓల్గా 'ఇప్పటి రచయితలు తెలుగు కథ చరిత్ర తెలుసుకోవాలి. ఏ కాలంలో స్పందించారో, ఏఏ ప్రయోజనాలు సాధించాలో అర్థం చేసుకోవాలి. అప్పుడే ఇప్పుడున్న పరిస్థితుల్లో మనమేం చేయాలో అవగతం అవుతుంది' అని ప్రారంభించారు. బండారు అచ్చమాంబ, గురజాడ మొదలుకొని నేటితరం దాకా ఎవరెలా రాశారో వివరించారు. ఒక్కొక్కరిని ఒక్కొక్క కథలోంచి పరిచయం చేస్తూ... మాట్లాడారు. తెలుగు కథా పరిణామ క్రమాన్ని కళ్లకు కట్టించారు. 'ఇప్పుడు ప్రపంచీకరణ అంతటా భూతంలా ఆవహిస్తోంది. దాని ప్రభావాలను, పర్యవసానాలను రచయితలు అర్థం చేసుకొని - కథలుగా మలచాలి. అదే ఇప్పటి సామాజిక కర్తవ్యం.' అని ప్రబోధించారు.

స్పందన

తరువాత కథకుల ప్రశ్నలకు జవాబులు చెప్పారు. 'కథా వస్తువు' అంశంపై రచయిత లెనిన్ ధనిశెట్టి మాట్లాడారు. తనకిది తొలి ప్రసంగం అంటూనే లోతైన విషయాలు చెప్పారు. 'కథకు వస్తువు ఆత్మ వంటిది అని నిఘంటు అర్థాలను ఉటంకించారు. 'ప్రజా మాధ్యమాలు, ప్రజాజీవితం సజీవమైన కథా వస్తువులను ప్రసాదిస్తాయి. కాబట్టి - వాటితో మమేకం కావడం అత్యవసర' అని నొక్కి వక్కాణించారు. 'ఇప్పుడు చూస్తుండగానే ఆర్థిక విధానాల్లో, సాంకేతిక సౌలభ్యాల్లో అనేక మార్పులు వచ్చేస్తున్నాయి. మన ఆలోచనలు, అధ్యయనం వాటికన్నా స్పీడుగా సాగాలి. అప్పుడే వాటిలోని కథావస్తువుని పసిగట్టి - ప్రతిభావంతంగా రాయగలం. రచయిత తనకు పరిచయం ఉన్న జీవితం గురించి రాయడం ఉత్తమం. స్టీరియో టైపు కథాంశాలు అసలు వద్దే వద్దు.' అని ఉద్బోధించారు. 'కథానిర్మాణం'పై రచయిత మహ్మద్ ఖదీర్‌బాబు వివరించారు. పఠనానికి అసౌకర్యంగా లేనిది మంచి నిర్మాణం... ప్రతి వాక్యానికి కళనద్దడం ద్వారా దానిని సాధించవచ్చు.... అని చెప్పారు. ఏం రాయాలి? ఏం రాయకూడదు? ఏం రాయనవసరం లేదు? అనే మూడు అంశాలపై రచయితకు అవగాహన ఉండాలని సూచించారు. మంచి వస్తువు, మంచి శిల్పం కలిస్తే - మంచి కథ అవుతుందని చెప్పారు. నిరంతరం పరిశీలన ద్వారా మంచి కథలను, మంచి కథానిర్మాణాన్ని సాధించవచ్చునని అన్నారు. ఆ తరువాత... ప్రకటిత షెడ్యూల్లో లేని సినీ రచయిత జనార్ధన మహర్షి 11 నిమిషాల పాటు 'సినిమా రచన'పై ఆసక్తిదాయకంగా మాట్లాడారు. ఒకే కథాంశాన్ని ఒక్కొక్కరు ఒక్కోలా.... 40 మంది 40 కోణాల్లో రాయవచ్చని ఉదాహరణ సహితంగా చెప్పారు. కథ అల్లడం మనిషికి సహజంగా అబ్బిన విద్య అని అన్నారు.



**బాలల కథలు... కథా విశ్లేషణలు**

తరువాత భోజన విరామం.... బఫే పద్ధతిలో ఆరగిస్తూ... రచయితల పరస్పర పలకరింపులూ పరిచయాలతో సుందరయ్య విజ్ఞాన కేంద్రం టెర్రాస్ కళకళలాడింది. ఎవరి కంచం వారే కడుక్కునే సుందరయ్య విజ్ఞాన కేంద్రం ఒరవడి చాలామందికి కొత్తగా అనిపించింది. 'ఇది చాలా మంచి పద్ధతి' అని ఇద్దరు ముగ్గురు రచయితలు వ్యాఖ్యానించారు. మినీ హాలు కిటకిటలాడడం వల్ల, అదనపు కుర్చీలకు అవకాశం లేకపోవడం వల్ల - తరువాత సెషన్ ఎస్వీకేలోనే విశాలంగా ఉన్న మరొక హాల్లోకి మార్చారు. ఈ సెషన్లో 'బాలల సాహిత్యం'పై జరిగిన సదస్సుకు హైదరాబాద్ నగర కమిటీ ప్రధాన కార్యదర్శి జి. యాదగిరి రావు ఆహ్వానం పలికారు, శాంతిశ్రీ అధ్యక్షత వహించగా, ప్రముఖ రచయిత పి. చంద్రశేఖర్ ఆజాద్ మాట్లాడారు. 'ప్రతి పౌరుడు రచయితా బాలసాహిత్యం మీదుగానే ప్రయాణిస్తారు. పెద్ద పెద్ద రచయితలంతా ఒకప్పుడు పిల్లల కథా ప్రేమికులే... పిల్లల కథా రచయితలే...' అంటూ ప్రసంగం ప్రారంభించారు. మనం పిల్లలను నిశితంగా పరిశీలించాలి. వారి మాటలూ చేతలూ గమనించాలి. వారు మనకెన్నో కథావస్తువులను ప్రసాదిస్తారు. వాటిని ఆసక్తికరంగా అల్లితే మంచి కథలు తయారవుతాయి.' అని తన అనుభవాలను వివరించారు. 'కథావిమర్శ'పై సాహితీ విమర్శకులు తెలకపల్లి రవి మాట్లాడుతూ - మంచి కథకు ఏ ఏ లక్షణాలుండాలో చెప్పారు. విధానాలకు, విలువలకు కట్టుబడడం; వికృతాలను ఖండించటం, విభిన్నంగా చెప్పడం రచనకు ప్రయోజనాన్ని చేకూర్చుతాయని వివరించారు. ఏ

రచనకైనా క్లుప్తత, స్పష్టత, ఆప్తత అవసరమని పేర్కొన్నారు. అధ్యయనం, నిరంతరం సాధన ద్వారా మంచి కథకులుగా రాణించవచ్చునని విడమర్చి చెప్పారు. తరువాత కథకులు అడిగిన ప్రశ్నలకు జవాబులు చెబుతూ - సంభాషించారు.

మూడో సెషన్‌గా స్వీయకథా విశ్లేషణ సాయంత్రం 5.30 గంటలకు మొదలైంది. కథకులు స్వయంగా తమ కథానేపథ్యాన్ని, కథా నిర్మాణ క్రమాన్ని, తమను ప్రభావితం చేసిన అంశాలను, కథాసృజనకు తాము చేసిన పరిశ్రమను ఆసక్తిదాయకంగా వివ రించారు. మాట్లాడిన ఆరుగురూ ఆరు రకాల అనుభవాలను హృద్యంగా కళ్లకు కట్టించారు. ఈ సెషన్లో రచయితలు కుప్పిలి పద్మ, (టీ జంక్షన్), యాళ్ల అచ్యుతరామయ్య (గుప్పెడు గింజలు), రహమతుల్లా (బా), వేంపల్లి షరీఫ్ (పర్దా), శిరంశెట్టి కాంతారావు (అడవి లోపల), జి.ఉమా మహేశ్వర్ (వాటర్) మాట్లాడారు. స్వీయకథ విశ్లేషణ కథాకార్యశాలకు ప్రత్యేక ఆకర్షణగా నిలిచింది. సాహితీ స్రవంతి ప్రధాన కార్యదర్శి కె. ఆనందాచారి ఆ విభాగానికి సమన్వయకర్తగా వ్యవహరించారు.

### ఉట్టిపడిన యువజనోత్తేజం

202 మంది రచయితలు హాజరైన ఈ కథాకార్యశాలలో దాదాపు సగం మంది యువతీ యువకులు కావడం చాలా మందిని ఉత్తేజపరిచింది. 'ఇది మంచి పరిణామం. ఇంత మంది యువతీయువకులు కథను ప్రేమించటం సంతోషకరం.' అని సీనియర్ రచయితలు సంతోషం వ్యక్తం చేశారు. హైదరాబాద్ నగరంలోని విశ్వవిద్యాలయాలనుంచి, వివిధ జిల్లాల నుంచి యువతీయువకులు ఈ కార్యశాలకు హాజరయ్యారు. చాలామంది పత్రికల్లో వచ్చిన ప్రకటన చూసి, కార్యశాలకు రావడం విశేషం. బస్సులు తిరక్కపోయినా అనేక ఇబ్బందులు పడి, రైల్లో, నిద్ర లేని ప్రయాణం చేసి, విజ్ఞానకేంద్రానికి చేరాడు ప్రకాశం జిల్లా పమిడిపాడుకు చెందిన కిశోర్. కథారచనపై ఉన్న ఆసక్తితో మహబూబ్‌నగర్ నుంచి ప్రత్యేకంగా వచ్చారు పాతికేళ్ళ ట్రెయినీ డిఎస్పీ నాగేంద్ర... ఇలా ఇంకా అనేకమంది... ఎంతో ఆసక్తితో హాజరై... కార్యశాల ముగిసేదాకా అమితాసక్తితో మమేకమైపోయారు. కథ గురించి తెలిసిన తృప్తితో, కథాసాగరంలో మునిగితేలిన అనుభూతితో, కథామృతాన్ని మనసారా గోలిన పరవశంతో కార్యశాల నుంచి ఆనందంగా వెళ్లారు.




సందేహం లేదు... ఈ కార్యశాల ఇచ్చిన స్ఫూర్తితో, ధారాపాతంగా లోలోపలికి ప్రవహించిన కథనోత్సాహంతో - వచ్చినవారిలో చాలామంది ఈపాటికే కలం పట్టి ఉంటారు. రేపోమాపో ఆ కథలు తెలుగు లోగిళ్లలోకి చేరతాయి. ఈ కథాకథనాలను మనసారా ఆస్వాదించటానికి మనం సమాయత్తం కావాలిప్పుడు. ఉత్తేజ వాతావరణంలో కార్యశాలను ముగిస్తూ - ఔత్సాహికులు ఎవరైన తమ స్పందనలు తెలపవచ్చు అని నిర్వాహకులు ఆహ్వానించినప్పుడు - వేదిక మీదికి ఉత్సాహంగా వచ్చాడు కె.వెంకటేశ్వర్లు. 'ఇప్పుడు కథ రాయడమంటే భయం పోయింది' అన్నాడు. ఈ స్పందన ఒక్కటి చాలు కదా, కథాకార్యశాల సూపర్ హిట్ అని చెప్పటానికి....!



# బాధ్యతను పెంచిన వర్క్‌షాప్

- శాంతిశ్రీ

సాహితీ స్రవంతి హైదరాబాద్ నగర కమిటీ నుండి కవిత్వం వర్క్‌షాప్ నిర్వహించాం. ఊహించిన దానికన్నా ఎక్కువమందే వచ్చారు. రాష్ట్రం నలుమూలల నుండీ కొద్దిమంది హాజరయ్యారు. మాకు చాలా సంతోషం వేసింది. ఆ అనుభవంతో కథల వర్క్‌షాప్ కూడా నిర్వహించాలనుకున్నాం. ఇది కూడా మేము ఊహించిన దానికన్నా, అందులోనూ రాష్ట్రంలో అననుకూల పరిస్థితులున్నా విజయవంతమైంది. ఒకటి కుల, మత, ప్రాంతీయ భేదాలు లేకుండా సాహిత్య సువాసనలు కలిగిన వాళ్లంతా ఒక్కటే అని మరోసారి నిరూపించారు. రెండోది సాహితీస్రవంతి చేసే కార్యక్రమాలు ప్రయోజన కరమైనవని రుజువైంది. మూడోది సాహిత్యంలో శిక్షణ కోసం నేటి తరం ఎంతగా ఎదురు చూస్తుందో అర్థమైంది.

ఓల్గా, ఖదీర్‌బాబు, లెనిన్ ధనిశెట్టి కథ గురించి కొంత అవగాహన కలిగించారు. మధ్యాహ్నం జరిగిన బాలసాహిత్యంలో కథలు ఎలా రాయాలి? నాటి నేటి పిల్లల ఆలోచనల్లో వచ్చిన మార్పుల్ని వివరించారు చంద్రశేఖర్ ఆజాద్. నేటి పిల్లల ఆలోచనల్లో లాజిక్‌కు అనుగుణంగా నాటి కథల్ని ఎలా రీమేక్ చేస్తుందీ చెప్పారు.

ఆ తర్వాత జరిగిన సెషన్‌లో ఉదయం సెషన్‌లోని లోటుపాట్లను తెలకపల్లి రవి గారు భర్తీ చేశారు. 8 'వి'లతో ఆయన చెప్పిన తీరు అందర్నీ ఆకట్టుకుంది. అంశం కథా విశ్లేషణ అయినా ఆ ఒక్క 'వి' కే పరిమితం కాకుండా కథకు సంబంధించిన మిగిలిన 7 'వి'లను ఆయన సవివరంగా చెప్పారు. దీనితో ఉదయం సెషన్ తర్వాత ఉన్న సందేహాలు కూడా తీరిపోయాయి. చివరిగా సాయంత్రం జరిగిన కథా విశ్లేషణ కథకు ముగింపు ఎంత ముఖ్యమో వర్క్‌షాపు ముగింపూ సెషన్ 'స్వీయ కథా విశ్లేషణ' కూడా అంత ప్రముఖంగా జరిగింది. ఐదుగురు కవులు తమ తమ కథల విశ్లేషణతో కథకు ఎలాంటి కథా వస్తువుల్ని తీసుకోవాలి? కథ నిర్మాణం ఎలా ఉండాలి? నేపథ్యం ఎలా ఉండాలి? తదితర అంశాలన్నీ ఉదయం నుండి విన్న అన్ని సెషన్‌ల సారాంశం దీనికి ఉదాహరణల్లా ఈ సెషన్ నిలిచింది. ప్రతి ఒక్కరి కథ కదిలించేదిగా, సామాజిక దృష్టి కోణం ఉన్నవన్నది గమనించాల్సిన విశేషం.

యాళ్ల అచ్యుతరామయ్య చెప్పిన కథలో పేదరికానికితో బాల్యం ఏవిధంగా బలవుతుందో ఆయన కంటతడితో అందరిలో గుండె తడి కలిగించారు. కుప్పిలి పద్మ నేటి సమాజంలో స్త్రీ కోణం హృద్యంగా విశ్లేషించారు. బారహమతుల్లా తన తండ్రి గురించి కథ రాయడం ద్వారా ఆయన్ని ఎలా జ్ఞాపకం చేసుకుందీ వివరించారు. వేంపల్లి షరీఫ్ తనదైన దృష్టికోణంలో నిత్యజీవితంలో వాళ్ల నాయనమ్మ ఎదుర్కొన్న సాంప్రదాయ సంక్లిష్టతల్ని తన కథలో పేర్కొన్న తీరు వివరించారు. ఆ తర్వాత కథ ప్రచురించక ముందు వాళ్ల నాయనమ్మ చనిపోవడాన్ని తను బాధపడుతూ చెప్పిన తీరు ప్రతి ఒక్కర్నీ కదలించింది. ఒక్కోసారి మన కుటుంబ నేపథ్యంలోంచి కథా వస్తువు తీసుకుంటే ఎదురయ్యే ఇబ్బందుల్నీ ఈ విశ్లేషణలో షరీఫ్ వివరించారు. ఉమామహేశ్వరరావు 'నీటి' గురించిన సామాజిక కోణాన్ని చక్కగా విశ్లేషించారు. పెరుగుట విరుగుట కొరకే అన్నట్లు... పెట్టుబడిదారీ వ్యవస్థ ఒక దశకు చేరేటప్పటికీ తన పతనాన్ని తాను తవ్వుకుంటుందన్న మార్క్స్ విశ్లేషణకు వాస్తవ రూపం ఈ కథలో మనకు ప్రతిఫలిస్తుంది.

స్పందన

ఒక మహిళ మెట్లపై నుండి పడి, తలకు దెబ్బ తగిలితే నిర్వాహకులు చూపిన శ్రద్ధకు ఫేస్‌బుక్‌లో స్పందనను పెట్టారు. ఆమె కూడా చివరి వరకూ ఉండటం, వర్క్‌షాపు ప్రాధాన్యతను స్పష్టం చేసినట్లైంది. ఒక గర్భిణి కూడా నిండు నెలలతో వర్క్‌షాపు మొదటి నుండి అయిపోయే వరకు అంతే శ్రద్ధతో వినడం చూస్తే వర్క్‌షాపు విశిష్టతను వేరే చెప్పాల్సిన పనిలేదు. బోధించిన వారికీ, వినడానికి వచ్చిన వారందరికీ సాహితీస్రవంతి నగర కమిటీ తరఫున పేరు పేరునా ధన్యవాదాలు తెలుపుతున్నాం. ఇలాంటి వర్క్‌షాపులు మరిన్ని చేయడానికి మమ్మల్ని ప్రోత్సహించిన మీ అందరికీ వందనాలు.



# కుతూహలాన్ని పెంచిన కార్యశాల



- వల్లభాపురం జనార్దన

హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞానకేంద్రలో 29 సెప్టెంబర్ 2013న జరిగిన "కథా కార్యశాల" ఔత్సాహిక యువ రచయిత్రులు - యువ రచయితల్లో కథలు రాయగలమనే నమ్మకాన్ని పెంచితే, చేయి తిరిగిన ప్రముఖ రచయితలకు తమ రచనా ప్రయాణంలో మరిచిపోలేని మధురానుభూతిని పంచింది.

నేను కవిని - చాలాకాలం నుండి కవిత్వం రాస్తున్నాను. కథ కూడా రాయాలని అప్పుడప్పుడూ కుతూహలం పుట్టేది. నాలో కథ రాయాలనే కుతూహలం రేగినప్పుడల్లా నాలోని విమర్శకుడు నీవు కథ రాయలేవు. ఆ సత్తా నీకు లేదని మొట్టికాయలు వేసేవాడు. అందువల్ల కథ రాయటాన్ని ఎప్పటికప్పుడు తరువాతి కథ వెండితెరపై చూడండన్నట్లుగా కథారచనా ప్రయత్నానికి కామాలు పెడుతూ ఉండేవాణ్ణి. కథా రచయితను కావాలనే కలను పండించుకోవాలనే పట్టుదల పెరిగి నాలోని విమర్శకుని నోరు మూయించాలనే తపనతో కథా రచనకు శ్రీకారం చుట్టి మూడు నాలుగు కథలు ఆగస్టులో రాశాను. కథల పోటీకి పంపాను. నా "బహుమతి" కథకు 2013 నోముల కథా పురస్కారం వచ్చింది. నేను రాసిన కథకు పురస్కారం వచ్చింది కదా ఇంకేం. నేను ప్రముఖ రచయితల జాబితాలో చేరిపోయానని పొంగిపోయి చంకలు గుద్దుకోలేదు. ఎందుకంటే రచనలో నా బలమూ - బలహీనత కూడా నాకు తెలుసు. కథా రచన గురించి నేర్చుకోవాల్సిన విషయాలు అధ్యయనం చేయాల్సిన అంశాలు చాలా ఉన్నాయనే స్పృహ నాకుంది. ఆ దిశగా నేను ప్రయాణం చేయాలనుకుంటున్న సమయంలో "కాగల కార్యం గంధర్వులు చేశారనే" నానుడిగా నాకో అవకాశం అంది వచ్చింది. అది సాహితీస్రవంతి "కథా కార్యశాల" రూపంలో హిమాలయ శిఖరాన్నెక్కబోతున్నానన్నంత ఆనందంతో కథా కార్యశాలలో పాల్గొన్నాను.




''కథా కార్యశాల'' ప్రారంభ సభాధ్యక్షులు వొర(ప్రసాద్ పలుకులు కథా రచనావర్షంలో తడవాలనుకున్న నా మనస్సును తొలకరి చినుకుల్లా తాకాయి. సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు - ప్రజాశక్తి సంపాదకులు తెలకపల్లి రవి ప్రారంభోపన్యాసం బట్ట తడుపు చినుకుల్లా కాకుండా నా మనసు పొలంలో అదునుకు పదును వానగా కురిసింది.

కథా కార్యశాలలో ప్రముఖ రచయిత్రి ఓల్గా - లెనిన్ ధనిశెట్టి, మహమ్మద్ ఖదీర్‌బాబు, చంద్రశేఖర్ ఆజాద్, తెలకపల్లి రవి మొదలగువారు తెలుగు కథాప్రస్థానం - కథా వస్తువు- కథా నిర్మాణం బాలసాహిత్యం రచనకు మెళకువలు - కథా విమర్శ అను అంశాలను బోధించారు. తరువాత కుప్పిలి పద్మ, యాళ్ళ అచ్యుతరామయ్య, రహమతుల్లా, వేంపల్లి షరీఫ్, శిరంశెట్టి కాంతారావు, జి. ఉమామహేశ్వర్‌లు కథ రాయడంలో తాము పడిన పురిటినొప్పులను కథ రాసిన తర్వాత పొందిన అనుభూతిని విశ్లేషణాత్మకంగా వివరించారు.

ఉదయం గం॥10.30 ని॥ లనుండి రాత్రి 8 గం॥ దాకా సాగిన కార్యశాల ప్రతి అడుగూ ఉత్తేజాన్ని నింపింది. ప్రముఖ రచయిత్రి ఓల్గా, తెలకపల్లి రవి, లెనిన్ ధనిశెట్టి, మహమ్మద్ ఖదీర్‌బాబు, చంద్రశేఖర్ ఆజాద్‌ల ప్రసంగాలు నాలో నిద్రపోతున్న సృజనాత్మకత అనే బల్బుకు విద్యుత్తువాహం అందించి వెలుగులు చిమ్మడానికి కారణమైన మీటలాగా వ్యవహరించాయి.

తొలి కథకులు బండారు అచ్చమాంబ, గురజాడల నుండి ఆయా కాలాల్లో కథ తిరిగిన మలుపులు ఎదిగిన రూపం తెలుసుకోవడంతోపాటు ఓ కథా రచయితగా ఇప్పటి పరిస్థితులకు ఎలా స్పందించాలి? ఏం చేయాలి? అన్న

అవగాహనను పంచుకొనడంతో పాటు కథా రచనకు కీలకమైన వస్తువు యొక్క ప్రాముఖ్యతను గ్రహించాను. అంతే కాదు. ఉద్యమాలతో మమేకం కాకపోతే ఉబుసుపోక కథలే వస్తాయని సమాజానికి దిశానిర్దేశం చేసే కథలు రావన్నది తెలుసుకున్నాను. చదువరి చదవడానికి ఇబ్బందిపడే విధంగా ఉండకుండా ఆకట్టుకొని చదివించగల వాఖ్యానిర్మాణం అలవరచుకుంటేనే మంచి కథకుడు అవుతాడని కథ ఎలా రాయకూడదో? ఏం రాయకూడదో? రాస్తే ఎలా రాయాలి? అన్న ప్రాథమిక నిర్మాణ సూత్రాలతో పాటు నిరంతర పరిశీలన రచయితకు ఉండాలన్నది నేర్చుకున్నాను.

తెలకపల్లి రవి చెప్పిన విమర్శ అంశాల నుండి కథా రచయిత విలువలకు కట్టుబడి ఉండాలని, సమాజానికి చేటు చేసే వికృత పరిణామాలను ఖండించే తెగువ ఉండాలని, కథను కొత్త పంథాలో చెప్పే ప్రయత్నం చేస్తేనే మంచి కథా రచయిత కాగలదన్న పాఠం నేర్చుకున్నాను.

కుప్పిలి పద్మ, శిరంశెట్టి కాంతారావు, వేంపల్లి షరీఫ్ రహమతుల్లా, యాళ్ళ అచ్యుత రామయ్య, జి. ఉమామహేశ్వర్ రావుల స్వీయకథా విశ్లేషణలో ఒక కథను రాసే ముందు రచయిత ఎంత ప్రసవవేదన పడితే అంత మంచి కథ వస్తుందన్న విషయం తెలుసుకోవడంతోపాటు వారి అనుభూతుల్లో పాలుపంచుకున్నాను.

మొత్తంగా చూస్తే "కథా కార్యశాల" యువ రచయిత్రుల, యువ రచయితలకు కథా రచనా ప్రపంచంలో నడువగల మనోస్థైర్యాన్నీ మెళకువలను అందించడంతోపాటు చేయి తిరిగిన రచయితల్లో కూడా తమ అనుభూతులను పునశ్చరణ చేసుకొని ఇతోధిక పట్టుదలతో కథలను రాయడానికి రీఛార్జ్ బ్యాటరీగా పనిచేసిందని అనుకుంటున్నాను. కథా కార్యశాల ప్రయోజనం నెరవేరిందని నిర్వాహకులు మౌనం వహించకుండా విరివిగా కార్యశాలలు నడిపితే కథా సాహిత్యం కొత్త పుంతలు తొక్కే వీలుందని కూడా అనుకుంటున్నాను. అంతే కాదు ఈ కథా కార్యశాల నాలో కథా రచనను ఆపకుండా కొనసాగించాలనే అభిలాషను కలిగించిందనటంలో ఎంత మాత్రం అతిశయోక్తి లేదు.




ఒకే సంఘటన చుట్టూ కథ అల్లుకుపోయి భావంలో భిన్నత్వం రాకుండా ఒక ఐక్యతతో వుండే రచన 'చిన్నకథ'.

– కళ్యాణసుందరీ జగన్నాథ్

ఒక అవస్థని గానీ, ఒక అనుభవాన్ని గానీ ఒక వైచిత్ర్యాన్ని గానీ ఒక మనస్తత్వాన్ని గానీ చిత్రింది కథ.

– హితశ్రీ

వాస్తవిక కథా శిల్పమంటే వస్తువుకు విధేయమైన శిల్పం. వస్తువును పాఠకుడి దగ్గరికి చేరవేసే సాధనంగా మాత్రమే పనిచేసే శిల్పం. పాఠకుడు జీవితాన్ని అవగాహన చేసుకోడానికి చేసే ప్రయాణంలో దివిటీగా ఉపయోగపడే శిల్పం. జీవితావగాహనా మహా ప్రయాణంలో కాలికి ముళ్ళ తీగల్లాగా అడ్డుపడని శిల్పం. జీవితంలోని కార్యకారణ సంబంధాలను విప్పిచెప్పే శిల్పం. తాను ఉంటూనే తనను తాను అదృశ్యంగా ఉంచుకునే శిల్పం. వస్తువు ఉనికిని అదృశ్యం చేసే శిల్పం కాదు. ఇది తెలుగు రచయితలకు బాగా ఒంట బట్టిన శిల్పం.

–రాచపాళెం చంద్రశేఖర రెడ్డి



# కవిగా నిలవాలనుకున్నావా? కథ రాయి !

– జంధ్యాల రఘుబాబు




"కవిగా నిలవాలనుకున్నావా అయితే కథ రాయి"

ఇది సాహితీస్రవంతి నిర్వహించిన కథా కార్యశాల హాజరయ్యాక నాలో కలిగిన అనుభూతి, ప్రేరణ, అభిప్రాయం.

ఎంతటి కవిగానీ, ఒకరోజు హాయిగా ఒక అంశంపై నిష్ణాతులు మాట్లాడుతూ ఉంటే లోకాన్నంతా మరచిపోయి, అదీ లోకం కోసమేనండీ, వింటూ కూచోవడం చక్కని అనుభూతి. భోజనాలు కూడా ఏర్పాటు ఉంది కాబట్టి దిగులే లేదు.



వందల్లో కవితలు, ఇతరత్రా వ్యంగ్య రచనలు, పదుల్లో కథలు, పిల్లల కథలు, ఓ రెండు అనువాదాలు. ఇలాంటి పరిస్థితుల్లో "కథలు రాస్తేనే కాని కవిగా మనుగడ సాగించటం కష్టం" అనిపించింది. ఇది నా గొడవ.

కొన్ని ఉపన్యాసాలు బాగున్నాయి. కొన్ని బాగాలేవు అని కొందరనుకోవచ్చు. ఏవైనా అన్నీ కథపైనే కదా! ఇద్దరు కవులు కలిస్తేనే మాటలు, వాదులాటలూ సహజం. అలాంటిది ఒకేసారి వేదికపై అందరు ఉంటే ఇక పరిస్థితేమిటి? జనార్ధన మహర్షిగారు, తెలకపల్లి రవిగారు చెప్పిన అంశాలు కథా కార్యశాలకు మంచి రూపునిచ్చాయి, సరిచేశాయి.

"యువత బాగా చెడిపోతుంది, వారిని ఎవరైనా రక్షిస్తే బాగుంటుంది" అని మిత్రులు, బంధువులు ఏదో ఒక సందర్భంలో మనతో అంటూనే ఉంటారు. ఆ యువతను వెనకేసుకొస్తే "నీకు పరిస్థితి పూర్తిగా తెలియదు" అని కూడా అనవచ్చు. ఇటువంటి వారందరికీ సమాధానం ఈ 'కథా కార్యశాల' దానికి హాజరయిన యువత అందరికీ ప్రేరణ. తమ వద్దకే వచ్చి చెప్పమని సెంట్రల్ యూనివర్శిటీ విద్యార్థుల కోరిక. ఇంతకంటే ఆ "ముందు యుగం దూతల" గురించి ఏం చెప్పాలి. "ఓ బంధుమిత్రుల్లారా, ఇకనైనా యువతపై మీ అభిప్రాయం మార్చుకోండి" అని చెప్పాలనుంది.

కార్యశాల కాబట్టి వచ్చిన వారితో ఏదైనా క్లాస్‌వర్క్‌లాంటిది చేయించి ఉంటే బాగుణ్ణు అని కొందరన్నారు, లోపల అనుకున్నారు. కానీ ఉపాధ్యాయులుగా అక్కడికొచ్చిన వారి అనుభవాలు విద్యార్థుల అనుభూతి చూసిన తరువాత రేపు సమాజం లోకి వెళ్ళి వారు కచ్చితంగా రాస్తారు. అదే వారి హోంవర్క్, క్లాస్ వర్క్ అనిపించింది. నవలపైనో, నాటకం పైనో కార్యశాల నిర్వహించి వారితో అక్కడికక్కడే ఓ నవల, ఓ నాటకం రాయించగలమా? అన్నారెవరో. వచ్చినవారు తిరిగి తమ ఇళ్ళకుపోయి ఈ కార్యశాల ఇచ్చిన స్ఫూర్తితో రచనలు చేస్తారు. కచ్చితంగా.

స్వీయ కథల విశ్లేషణ' వినిపించిన ఆరుగురు రచయితలూ తాము ఆ కథ ఎందుకు రాసిందీ, ఎలా రాసిందీ, చెబుతున్నప్పుడు కొందరి స్వరాలు గద్గదంగా మారటం జీవితాంతమూ గుర్తుండిపోయే అనుభవం. నిజంగా కథ రాస్తే ఇలా ఉండాలి. అనిపించింది. ఆ ఆరుగురికీ పేరుపేరునా అభినందనలు. ఏదో సంఖ్య కోసం పుంఖానుపుంఖాలుగా రాయటం అవసరం లేదని కూడా ఆ 'స్వీయ కథా విశ్లేషణ' తెలియజేసింది.

ఈ కథా కార్యశాలపై అభిప్రాయం రాస్తూ, అది నిర్వహించిన హైదరాబాదు నగర కమిటీకి అభినందనలు తెలపకుంటే ఏం బాగుంటుంది చెప్పండి! వారికి ప్రత్యేకంగా శుభాభి నందనలు.



# ఊహ - వాస్తవం

- డా॥ దుట్టా శమంతకమణి

"ఇదో ఊహల ప్రపంచం"

"అంటే?"

"మీ ఆలోచనలకు అక్షర రూపం ఇస్తారు... వాస్తవానికి కాస్త దూరంగా ఉంటారు".... కథా కార్యశాలకు నాతో వచ్చిన సాకేత్ కామెంట్ అది.

పొత్తిళ్లలో తొలిసారిగా నా కళ్ళకు కనిపించిన బిడ్డ రూపమే అగుపించేది ఇన్నాళ్లు. తనదైన ఆలోచనలతో, వ్యక్తిత్వంతో నూనూగు మీసాలతో ఎదుగుతున్న నవయువకుడిగా అనిపించాడు.

జన్మనిచ్చింది, ఎంచుకున్న జీవన విధానానికి అనుగుణంగా పెంచుతున్నదీ నేనే. కానీ ఆ






కామెంట్‌లో, సమాజ ప్రభావం, ప్రతిదీ వ్యాపార వస్తువుగా మార్చి, వినిమయ సంస్కృతికి ప్రజలను బానిసలను చేస్తున్న మన ప్రస్తుత సమాజం ప్రభావం కూడా భాగమైంది అని నాకు గాఢంగా అన్పించింది.

నాలో గతంలోలేని ఆలోచనల పరంపర. ప్రతి క్షణాన్ని డబ్బు రూపంలోకి మార్చుకుని బ్రతికే చాలామందికి సంగీతం, సాహిత్యం, థియేటర్, సమాజసేవంటూ జీవితాన్ని గడిపేవారు, పిచ్చివాళ్లులాగా కాకపోయినా... సంపాదన చేతగాని వాళ్లని ఓ చులకన భావం వుంటుంది. అలాగే... మనిషిగా పుట్టి, బ్రతకడంతోపాటు... జీవించడం తెలిసిన వారికి, అద్భుతంగా గాకపోయినా, అర్థవంతంగా తమ జీవితాలను నడుపుకోవడం తెలుస్తుంది. రచయితలు, కళాకారులు ఈ కోవలోనివారే.

కథల రచన, ఎంపిక, బహుమతి విధానాల పట్ల, వాదాల కనుగుణంగా అక్షరాలకు అవధులు ఏర్పరచుకుంటున్న రచయితల, రచయిత్రుల పట్ల నాకెన్నో సందేహాలు... పెద్దలెవరైనా పత్రికాముఖంగా చెబుతారా అని చాలా పత్రికల పెద్దలకు గతంలో రాశాను. స్పందన శూన్యం. నాకు ప్రశ్నలు సంధించడం తెలియలేదు? లేక నా ప్రశ్నలకు జవాబులు లేవా? ఇవి ఇన్నేళ్లూ అంతర్లీనంగా నన్ను పీడించిన సందేహాలు wave length కలిసిందో, లేక సాహితీస్రవంతి వారికి నేటి తరానికి దిశానిర్దేశనం చేయాలనిపించిందో "కథాకార్యశాల' ప్రకటన కన్పించింది.

సమయం తక్కువ. దూరం ఎక్కువ. బస్సులా... బంద్. రైళ్లు.... రెండు నెలల వరకూ ఫుల్. జనరల్‌లో అంతంత దూరం ప్రయాణం. అమ్మో ఎలా? భారతీయరైల్వేలో భాగం కాబట్టి... ఎలాగో కష్టపడి రిజర్వేషన్ సంపాదించి భాగ్యనగరం

చేరాం. నిర్దేశించిన సమయానికి కాస్త అటు ఇటుగా మేము ఆడిటోరియం చేరేసరికి అది ఫుల్. ఫీల్ గుడ్ భావన. అక్షర హాలికులందరిలో మనం కూడా ఒకరం కదా!

ఎవరి వాదాలు వారివి. ఎవరి పంథా వారిది. ఎంచుకున్న మార్గం వేరైనా చేరే గమ్యం ఒక్కటే. అదే 52 అక్షరాల అమరిక. తెలుగుభాషకు లిపి ఏర్పడిన నాటినుండీ నేటివరకు ఎందరెందరో అక్షరయోధులు సమాజ పరిణామాలు, సాంఘిక దురాచారాలు జాతికి దీపాలవంటి వారి చరిత్రలు, చరిత్ర చీకటిలో నిశ్శబ్దంగా ఒదిగిన వాస్తవాలు. జీవన పోరాటాలు, జీవిత మాధుర్యాలు, శోకమైనా, శ్లోకమైనా అన్నీ ఆ అక్షరాలలోనే. సందేహాలు, సమాధానాలు, పుంఖాను పుంఖాలుగా కాకపోయినా అనుభవజ్ఞుల స్వానుభావాల నుండీ చాలావరకూ తీరాయి సందేహాలు.

స్పందన

స్వీయకథా విశ్లేషణ... ఆ ఏముంటుందిలే అన్న మనస్సులోని తేలిక భావన తొలగిపోయింది. ఆఖరి సెషన్ అన్నింటికన్నా బావుందనిపించింది. కాలాతీతమైనా... కాసిని ముక్కలు చెప్పాలనిపించింది. స్పందన తెలియచేశాము కదా ఇంక రాసేదేముంది అనుకున్న నాకు నా గర్భఫలం చేసిన వ్యాఖ్య... కలవరపరచలేదుగానీ, తరతరాల మధ్య నిరంతరం జరిగే సంఘర్షణ రూపం అనిపించింది. అతిగా కాకపోయినా సాహిత్యాన్ని అప్పుడప్పుడూ చదివే నా కొడుకులాంటి నేటి తరాల ప్రతినిధులకు విజ్ఞానశాస్త్రంతో పాటు మానవ హృదయాల శాస్త్రాల అవసరం ఎంతో ఉందనిపించింది. తోడుగా వచ్చాడుగా అందుకే బహుమతిగా "వికసిత" అందించాను. అంత వేగంగా చదువుతాడని ఊహించని నాకు షాక్ ఇస్తూ... శ్రద్ధగా చదివి, రెండోరోజు సాయంత్రం... నీలాంటి పేరెంట్స్ చెప్పని ఎన్నో విషయాలను ఈ రచయిత చెప్పారు. ఇట్స్ గుడ్ అన్నాడు. ఓ క్షణం ఆనందం.

వెంటనే మా ప్రపంచం ఊహల ప్రపంచం అన్నావుగా ఇప్పుడేమంటావు అన్నాను? రచయిత కాలానికనుగుణంగా రచన చేశారు. సిద్ధాంతాన్ని, విజ్ఞానాన్ని, ప్రేమను కలిపి చక్కగా చెప్పారు. మా తరానికి కావల్సింది .... ఇలాంటి పుస్తకాలు తప్ప, పుంఖానుపుంఖాలు రాసి సమయాన్ని వృథాచేసే రచనలు కాదు. చేతనయితే నువ్వు కూడా ఆ ప్రయత్నం చేయి అంటూ దుప్పటి ముసుగుతన్నాడు. వాడన్నట్లు నేను రచనలు చేయగలనో, లేదో కాలం నిర్ణయిస్తుంది. కానీ నేటి తరానికి కావల్సిందేమిటో సూటిగా చెప్పాడనిపించింది.

ఇదండీ కథాకార్యశాలకు.... కొడుకుతో వచ్చిన నా అనుభవం.

---

# స్పందన ఊహించలేదు

సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో గత సంవత్సరం నిర్వహించిన 'కవితా కార్యశాల' విజయవంతమైనప్పుడే, వచ్చే సంవత్సరం ఖచ్చితంగా 'కథా కార్యశాల' నిర్వహించాలనే అభిప్రాయం దాదాపు కమిటీ సభ్యులంతా వెలిబుచ్చారు. నగరకమిటీ నెలనెలా 'జనకవనం' నిర్వహిస్తూనే, కార్యశాలను దృష్టిలో పెట్టుకొని ప్రణాళికను రూపొందిస్తూ రావడం జరిగింది. ఆగస్టు నెలలో రెండు దఫాలుగా కమిటీ సమావేశమై, సెప్టెంబర్ 29న కథా కార్యశాల నిర్వహించాలని, అందుకు ముఖ్య అతిథిగా ఎవరు, ముఖ్యమైన అంశాలు, వాటికి ప్రధాన వక్తలెవరనే అంశాల్ని నిర్ణయించడం జరిగింది. అంతే, ఆ క్షణం నుండీ సభ్యులంతా తమకు కేటాయించిన పనుల్లో నిమగ్నమైపోయారు.

మేమూహించిన దానికంటే అధికంగా, కథారచయితల నుండి, సాహితీ అభిమానుల్నుండి, పాఠకుల్నుండీ మరీ ముఖ్యంగా సెంట్రల్‌యూనివర్శిటీ, ఉస్మానియా విశ్వవిద్యాలయం విద్యార్థుల్నుండి లభించిన స్పందన మా కష్టమంతా మరిచిపోయేలా చేసింది. అంతే కాకుండా ఇలాంటి మరిన్ని కార్యక్రమాల్ని మరింత విజయవంతంగా నిర్వహించగలమనే ఆత్మవిశ్వాసాన్ని కూడా కలిగించింది. రాష్ట్రంలో నెలకొన్న పరిస్థితుల దృష్ట్యా రవాణాసౌకర్యాలు సరిగాలేకున్నాగానీ స్త్రీలు సైతం ఇతర జిల్లాల నుంచి ఎంతో వ్యయప్రయాసలకోర్చి రావడమే కాకుండా, దాదాపు రాత్రి 8 గంటలు కావస్తున్నా కార్యశాల ముగిసేదాకా ఉండడం మాకెంతో ఆనందాన్నిచ్చింది.

- ఎస్ఎస్‌బి గేరా

## స్పందన

# ఆలోచింపజేసింది

సాహితీ స్రవంతి కథా కార్యశాల అనుభవజ్ఞులైన సీనియర్ కథా రచయితల్ని సైతం ఆకట్టుకొని ఆలోచింపజేసేలా సాగింది. ముఖ్యంగా లెనిన్ ధనిశెట్టి, ఓల్గా అభిప్రాయాలు కార్యశాలకు హాజరైన ఆకట్టుకున్నాయి. 'అలాగే 100 సినిమాలకు రచన చేయడం కన్నా ఒక కథ రాయడం కష్టం' అన్న జనార్ధన్ మహర్షి అభిప్రాయం నూటికి నూరుశాతం కరెక్టు. కాబోయే కథకులు కథ(ల)ను చదవడం, కథ(ల)ను పరిశీలించడం, ఏం రాయాలి? ఎలా రాయాలి, సాధన చేయడం ఎలా చేయాలి...? వంటి చాలా విలువైన అభిప్రాయాలు చెప్పారు. స్వీయకథకుల అభిప్రాయాలు.. మొత్తం కార్యక్రమానికే హైలైట్;

**–తంగిరాల చక్రవర్తి**

---

**అభినందనలు**

హైదరాబాద్‌లో సాహితీస్రవంతి నగర కమిటీ ఆధ్వర్యంలో 'కథా కార్యశాల' నిర్వహించడం అభినందనీయం. 'తెలుగు జాతి' ఒక ప్రత్యేక పరిస్థితులలో ఉన్న ఈ తరుణంలో రాష్ట్రం మొత్తంగా 200 మంది రచయితలను సాహితీ అభిమానులను సమీకరించడం, రాత్రి 8,00 గం॥ వరకూ.. కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వహించడం మన "సాహితీస్రవంతి"కి తెలుగు సాహితీలోకంలో ఉన్న అభిమానాన్ని తెలియజేస్తుంది.

కథకుల స్వీయకథ విశ్లేషణ కార్యక్రమం యొక్క మొత్తం లక్ష్యాన్ని నెరవేర్చిందనుకుంటున్నాను. రహమతుల్లా, వేంపల్లి షరీఫ్, కుప్పిలిపద్మ, శిరంశెట్టి కాంతారావు, అచ్యుత రామయ్య, ఉమామహేశ్వర్ మొదలగు మిత్రుల స్వీయకథా విశ్లేషణ ఒక పాఠంలా భావించవచ్చు. మంచి కథా రచయితలుగా ఎదిగిన వారి స్వీయ అనుభావాలు తమ తమ జీవితాల నుండి ప్రారంభమై సామాజిక జీవితంలోకి ప్రవహించినట్లుగా ఉన్నాయి. అంటే ముందుగా స్వీయజీవిత చిత్రణతో కథారచన ప్రారంభమైతే బావుంటుందని వారి అనుభవం నుంచే కాకుండా, చాలా మంది జీవితాల నుండి కూడా అలాగే ప్రారంభమైందని కథకుల జీవిత చరిత్రలు చదివితే తెలుస్తుంది. సాహిత్య కారులుగా ఎదగటానికి ప్రత్యేక శిక్షణలంటూ ఉండవు, ఇలాంటి కార్యశాలలు, అనుభవాలు, చరిత్ర అధ్యయనం ద్వారా పుస్తకాల అధ్యయనం ద్వారా మాత్రమే సాధ్యం. కవి, రచయిత, విమర్శకుడు కథకుడు,ఏ ప్రక్రియలోనైన రాణించేందుకు ఇవి ఉపయోగ పడతాయని నా అభిప్రాయం.

**– రౌతు రవి**

**కథా సాహిత్యంలో శాస్త్రీయ ప్రయోగం**

సాహితీస్రవంతి ఆధ్వర్యంలో నగరంలో నిర్వహించిన కథాకార్యశాల కథాసాహిత్యంలో లోతైన విషయాలను చర్చించింది. కథల్లోని అనేక కోణాలను విశ్లేషించింది. వస్తువు, శిల్పం, శైలి వివరించడంతో కథలు రాయాలను కొనేవారికి కాకుండా, కథా సాహిత్యంలో ఇదివరకే ఉన్నవారికీ ఉపయోగపడిందనడంలో ఆశ్చర్యమేమి లేదు. కథలు సమకాలీన సంగతులు, సమస్యలు ఇతివృత్తంగా చేసుకొని రాయడమే కాకుండా, మానవీయ విలువల్ని పెంపొందించాల్సిన అవసరాన్ని కథాకార్యశాల కథకులకు గుర్తుచేసిందనిపించింది. ప్రసిద్ధ రచయితల కథలను పరిచయం చేయడం, చర్చించడం మరువలేని అనుభూతి, కథకు కావలసిన వస్తువును ఎంపిక చేసుకోవడం మొదలు ఆద్యంతం కొనసాగించాల్సిన తీరు చెప్పడం వల్ల కథల్లోను అన్ని విషయాలను స్పృశించినట్లపించింది. కథాసాహిత్యంలో రాష్ట్రంలో ఎవ్వరూ చేయని, శాస్త్రీయ ప్రయోగం చేసి విజయవంతం చేశారనడంలో సందేహం లేదు.

**– కెంగారమోహన్**




Iam Maheswara Rao. Iam very interest about writing stories but I dont know how to write, I am fresher for writing stories no experience on that but I got ONE YEAR experience in a SINGLE DAY... that credit goes to KATHA KARYASALA and thanks to SAHITI SRAVANTI (ఇ-మెయిల్ ద్వారా)

- mahemavillapalli@gmail.com

**మంచి కార్యక్రమం**

కథా కార్యశాల చక్కగా సాగింది. కథాప్రస్థానంపై ఓల్గా గారి ప్రసంగం ఆలోచనాత్మకం. నిర్మాణంపై ఖదీర్‌బాబు సూచనలు తప్పక ఉపకరిస్తాయి.

కవిత్వంపై కూడా తగిన వారితో పాఠశాల నిర్వహిస్తే బాగుంటుంది.

కథారచనపై మంచి కార్యక్రమాన్ని రూపకల్పన చేసి నిర్వహించిన సాహితీస్రవంతి సభ్యులకు అభినందనలు.

- మంత్రి కృష్ణమోహన్

**ప్రతీ జిల్లాలో నిర్వహించాలి**

సుందరయ్య విజ్ఞానకేంద్రంలో జరిగిన కథకుల వర్క్‌షాప్ ఆహ్లాదకరంగా జరిగింది. ఔత్సాహిక కథకులకోసం నిర్వహించిన ఈ వర్క్‌షాప్ పూర్తిస్థాయిలో సఫలమైందని చెప్పలేం. ముఖ్యంగా ఔత్సాహిక కథకుల పాత్ర ఇందులో ఏమీలేదు.

అది అలావుంచితే ఔత్సాహిక కథకులకు కథలు ఎలా వ్రాయాలి? వస్తువు ఎలా స్వీకరించాలి? అందులోని మెలకువలు గురించి తెలియజెప్పాలి. వారి సందేహాలకు ప్రముఖ కథకులతో సమాధానాలు చెప్పించాలి. అటువంటి ప్రయత్నం ఏమీ జరగలేదు.

కేవలం పాతకాలం కథకుల గురించేగాక అసలు తెలుగులో పఠనాసక్తి కలిగించిన చందమామ, బాలమిత్ర వంటి పిల్లల కథల గురించి, కొవ్వలి నవలల గురించి గూడా కాబోయే కథకులకు తెలియజెప్పాలి.

కథల గురించి చెప్పేటప్పుడు గురజాడ, శ్రీపాద. రావిశాస్త్రి వంటి లబ్ధప్రతిష్టుల గురించి మాత్రమేగాక ఇప్పటితరం కథకుల గురించి, వస్తున్న కథా సంకలనాలు, పత్రికలలో ఎటువంటి కథలు ప్రచురిస్తున్నారు. ఇటువంటి వాటి మీద చర్చలు జరపాలి.

ఇకముందు నిర్వహించబోయే కథా కార్యశాలలో ఔత్సాహిక కథకులను గుర్తించి, వారిని గూడా కార్యక్రమాలలో భాగస్వాములను చేసి ప్రోత్సహించాలి. అందువలన ఎంతో ఉపయోగం వుంటుంది. ముందు ముందు కథా కార్యశాల ప్రతి జిల్లాలోనూ ఏర్పాటు చేసి ముందుకు సాగాలని ఆకాంక్ష.

- సి. హెచ్. శివరామప్రసాద్, (వాణిశ్రీ)

**మంచి ఆలోచన**

కథాకార్యశాల చర్చావేదిక రచయితలకు ప్రయోజనకరంగా వుంది. ఇది మంచి ఆలోచన! మీ ఆహ్వానాన్ని అందుకొని యువరచయితలతోపాటు వయోవృద్ధులు కూడా ఎంతో ఉత్సాహంగా, ఆసక్తిగా సుందరయ్య విజ్ఞానకేంద్రానికి వచ్చి కథా కార్యశాల చర్చావేదికలో పాల్గొని ఎనిమిదిగంటలపాటు ప్రసంగాలు ఆద్యంతం శ్రద్ధగా ఆలకించారు. ప్రశ్నలు అడిగి సందేహాలు తీర్చుకున్నారు. నిర్వాహకులు ఆశించిన దానికంటే ఎక్కువ మంది వచ్చి సభని విజయవంతంచేశారు. ఇది మంచి భవిష్యత్తుకు సూచన.

ఇలాగే తెలుగునాడులోని అన్ని పట్టణాలలో కూడా ఇలాంటి చర్చావేదికలు సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ఏర్పాటుచేస్తే అభ్యుదయ, హేతువాద, సామాజిక విజ్ఞానయుతమైన రచనల స్థాయి, ప్రమాణాలు విస్తృతం అవుతాయి. మూఢ నమ్మకాలవైపు యువత మొగ్గుచూపకుండా కొంతైనా తగ్గించవచ్చు.

స్పందన

– పారుపల్లి వెంకటేశ్వరరావు

**గుండెనిండా సంతృప్తి**

...కథలు రాద్దామని అభిప్రాయం ఎంతోకాలం నుంచి ఉన్నా కథలేం రాస్తాములే! ఇప్పటికే రాసేవాళ్ళు చాలామంది ఉన్నారు కదా! మనం కొత్తగా ఊడబొడిచేదేముంది? ఉద్ధరించే దేముంది? అన్న నిర్లిప్తత (నిర్లిప్తత అనే కన్నా రాయడం ఆరంభించినా విజయవంతంగా పూర్తిచేయగలమా అన్న భావన అనేయచ్చు) తో ఉద్దేశ్యానికి రెడ్‌సిగ్నల్ పడింది. కానీ ఉన్నట్లుండి రోజువారీ పేపర్ల తిరగవేతలో 'సాహితీ స్రవంతి' కథా కార్యశాల' పిలుపుకు ఆకర్షితున్నై సుందరయ్య విజ్ఞానకేంద్రానికి పరుగులు తీసేలా చేసింది. వాస్తవానికి నేనోచోట అలా అటూ, ఇటూ వెళ్ళకుండా అన్ని గంటలు (ఉదయం 10 నుంచి రాత్రి 8 గంటలు... అంటే దాదాపు పది గంటలపాటు) ఒకేచోట ఉండడం మొదటిసారి. అయితే అన్ని గంటల వినియోగం 'సద్వినియోగమే'నని మాత్రం ఘంటాపథంగా కాకున్నా గుండెనిండా సంతృప్తిచెందిన స్వరంతో చెప్పగలను.

– వి.బి. శంకర్

## ఫేస్‌బుక్ కామెంట్స్

***కథా కార్యశాల విశేషాలను అరిపిరాల సత్యప్రసాద్ ఫేస్‌బుక్‌లో రాశారు. వాటిని ఫాలో అవుతూ పలువురు తమ స్పందనలను పోస్ట్ చేశారు. కథా కార్యశాలకు హాజరైన కొందరు ఈ ఫేస్‌బుక్ చర్చల్లో సందడి చేశారు. స్వీయ కథా విశ్లేషణ చేసిన రచయితల కథలు టీ జంక్షన్, పర్దా, వాటర్ వంటి కథలను కూడా పోస్టింగ్ చేసి చర్చించారు. వాటిలో మచ్చుకు కొన్ని...***

**అనుభవాల పేటికలు**

సాహితీస్రవంతి కథా కార్యశాల, చాల చక్కటి కార్యక్రమం. ముఖ్యంగా రచయితగా ఎదగాలి అన్న మా లాంటి వారికి ఈ కార్యక్రమం ఎంతో దోహదపడింది.

ఓల్గా, ఖదీర్‌బాబు, లెనిన్, తెలకపల్లి రవి, కుప్పిలిపద్మ, సాహిత్యప్రకాష్, ఉమమహేశ్వరరావు, యాళ్ల అచ్యుతరామయ్య, వీరు కాకుండా మరో ఇద్దరు గెస్ట్‌గా గుడి(నవల) దేవాలయం (సినిమా) రచయిత అయిన జనార్ధన్ మహర్షి వీరందరిని ఒకేసారి కలవడం నిజంగా మర్చిపోలేని అనుభూతి. ఈ కార్యశాల ద్వారా ఎన్నో విషయాలు తెలుసుకున్నాము. మరెన్నో పరిచయాలు, ప్రసిద్ధ, వర్ధమాన రచయితలతో ముఖాముఖిలు, వారి అనుభవాల పేటికలను తెరిచారు. అందులోంచి ఎవరికి నచ్చినవి వారిని తీసుకొమ్మని చెప్పారు.

– మణి వడ్లమాని

**అద్భుతం**

నిజంగా నిన్నటి కార్యక్రమం అత్యద్భుతం.. అరిపిరాల సత్యప్రసాద్‌గారు. మీరు నాకు తెలియదు కాబట్టి మిస్ అయ్యాను. షరీఫ్‌గారిని కలిసాము. చాలా ఆనందం కలిగింది. మిత్రులు సుజల గంటి గారు, మణి వడ్లమాని గారు చాలా మంచి కంపెనీ ఇచ్చారు. ఇలాంటి కార్యక్రమాలు మరిన్ని నగరంలో విరివిగా జరిగితే చాలా బావుంటుంది అన్న ఫీలింగ్ కలిగింది. నిర్వాహకులు ఎంతో బాగా జరిపించారు. ఉదయం వెళ్ళగానే టీ ఏర్పాటు చేయబడి ఉన్నది. ఆ తర్వాత కార్యక్రమం

## స్పందన

జరుగుతూ ఉండగానే బిస్కట్లు, టీ ఇచ్చారు. రెండు గంటలకి చక్కని విందు భోజనం మళ్ళీ సాయంత్రం స్నాక్స్, టీ... అసలు కార్యక్రమమే ఓ చక్కని విందు అయితే మధ్య మధ్యలో ఈ విందులు కూడా. అన్నిటికీ మించి నా స్నేహితురాలు సుజాత తిమ్మన కు తలమీద గాయం తగిలితే వారు తీసుకున్న శ్రద్ధకు ఇవే నా నమోవాకాలు... వెంటనే దగ్గరుండి డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్ళి కట్టు కట్టించి, ఇంజక్షన్ చేయించి తీసుకు వచ్చారు... అంతేకాక ఎంతమందో సాహితీమిత్రులు అనుక్షణం సుజాతను పరామర్శిస్తూనే ఉన్నారు. సభాముఖంగా కూడా ఆమెను, ఆమె శ్రద్ధను ప్రశంసించారు. అందరికీ ఎన్నెన్నో ధన్యవాదాలు.....

**- నందూరి సుందరి నాగమణి**

### ఆనందించా....

కార్యశాల వారికి ఫోన్ చేశా... ఏమండి.. కొంచెం లేట్ అయినా రావచ్చా అని.. దానికేం... రండి అన్నారు. చక...చక... తయారు అయిపోయా ఉదయం 11.30 ని॥ కల్లా వచ్చేశాను... అప్పుడే ఓల్గాగారి... ప్రసంగం ప్రారంభమయ్యింది.... కూర్చున్నా... విన్నా.. మధ్యలో టీ.. ఇచ్చారు. బిస్కెట్లు పెట్టారు. తిని త్రాగి అందర్నీ గమనిస్తూ.. కూర్చున్నా... కాసేపు బావుందే అనిపించింది. కాసేపు ఆఁ! కరెక్ట్ ప్రోగ్రాంకే వచ్చాము అనిపించింది. ఇంతలో చిన్న కునుకు పట్టింది. లేచేసరికి.. భోజన విరామం అన్నారు. ఆ తరువాత మళ్ళీ మూడో అంతస్తుకి మారమన్నారు. అందరి మాటలు విన్నా... ఏం చెయ్యాల్లో... ఏం చెయ్యకూడదో... వాళ్ళు.... వాళ్ళ అనుభవాల్ని విన్నా స్వీయకథల విశ్లేషణలు సాగుతుండగా.. మెల్లిగా ఇంటిదారి పట్టా.. మొత్తానికి ఓ కార్యక్రమం.. చూశా, విన్నా.. ఆనందించా.. ఆవేశం చెందా.. విసుగుచెందా, అవునా.. అలాగా అనుకొన్నా....

**- చంద్రమౌళి కళ్యాణ చక్రవర్తి**

### విలువైన సందేశం

సాహితి స్రవంతి, హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో జరిగిన "కథా కార్యశాల" మాకు ఉపయోగకరంగా ఉంది. మేం కూడా కథ రాయగలం అనిపించింది. మాలో అటువంటి నమ్మకం, ఆత్మవిశ్వాసం కలిగించినందుకు కృతజ్ఞతలు.

**- యడవల్లి శైలజ**

### శిక్షణ చాలా గొప్పది

వ్రాయాలి, వ్రాయాలి అని తపించిపోయే ఔత్సాహిక కథారచయితలకు మీరిచ్చిన శిక్షణ అపూర్వం, అత్యద్భుతం, సముద్రంలో కొట్టుకుపోతున్నవాడికి ఒక నావ దొరికినట్లు, భావనా సముద్రంలో కొట్టుమిట్టాడుతూ, ఎలా మొదలు పెట్టాలి? ఎలా నడిపించాలి, ఎలా ముగించాలో తెలియక అల్లాడుతున్న భావి రచయితలకు మీరిచ్చిన శిక్షణ చాలా గొప్పది.

**- శ్రీపాది రామచంద్రయ్య**

### ఆశగా వచ్చాను

ఎంతోమంది కథకుల నుంచి కథారచనపట్ల వారికున్న జ్ఞానాన్ని, అనుభవాన్ని వినవచ్చని ఎంతో ఆశగా నేను వచ్చాను. రచయితలు తమ కథలను ఎలా రాస్తున్నారో, దానికి కావలసిన ముడి సరుకును ఎలా సేకరిస్తున్నారో, తాము ఎంచుకున్న ఇతివృత్తంపై ఎలాంటి పరిశ్రమ చేసి దాన్ని మరింత అభివృద్ధి చేస్తుంటారో తదితర అంశాలను విందామని వచ్చాను. అయితే సమయాభావం వల్ల నిర్వాహకులు ఈ అంశానికి అంత ప్రాముఖ్యం ఇవ్వలేదనిపించింది. ఇక ఖదీర్‌బాబుగారు చెప్పిన విషయాలు బాగా ఉన్నాయి. అలాగే తమ సొంత కథల గురించి చివరిలో కొద్దిమంది రచయితలు చెప్పిన కథవెనుక

కథలు బాగా ఉన్నాయి. మున్ముందు ఇలాంటి కార్యశాలను నిర్వహించినప్పుడు మరింత ఎక్కువ మంది కథకులతో తాము రాసిన ఒకట్రెండు మంచి కథలను ఎంపిక చేయించి, వారెలా రాశారో కూలంకషంగా చెప్పిస్తే బాగుంటుంది. రాష్ట్రమంతా ప్రత్యేకవాదం, సమైక్యవాదం మధ్య గొడవగా ఉన్నప్పటికీ దాదాపు అన్ని ప్రాంతాల నుంచి కథకులు ఈ కార్యక్రమంలో వచ్చి పాల్గొనడం సంతోషాన్ని కలిగించింది. తెలుగు భాషను సాహిత్యాన్ని ప్రేమించేవారికి ఇదెంతో ఆనందం కలిగించింది.

స్పందన

– కె. రఘు

### హృదయానికి హత్తుకుంది

స్వీయకథా విశ్లేషణా రచయితలు తమ ఆలోచనలను మలిచి రూపుదిద్ది ఊపిరిలూదిన కథలను వివరిస్తూ కన్నీటిపర్యంతమైన ఆ సెషన్ హృదయానికి హత్తుకుంది. నిష్ణాతులైన రచయితలు, ఒక దండులా చేరిన వర్ధమాన రచయితలకు తర్ఫీదులిచ్చి, కలమూ కాగితము చేతిలో పెట్టి పదండి రాయండి అక్షర ఆయుధాలను సంధించండి అంటు చైతన్యపరిచిన కథాకార్యశాల ఒక్కరోజు కాకుండా రెండు మూడు రోజులు తరచూ సాగాలని నా మనవి.

– చక్రపాణి నోముల

### రాయిస్తారేమో అనుకున్నాను

ఆద్యంతం – ఉదయం నుండి సాయంత్రం వరకు నిర్వహించబడిన 'కథా కార్యశాలకు' రాష్ట్ర నలుమూలల నుండి సుమారు 200 మంది వరకు రావడం అందులో నేను ఖమ్మం నుండి రావడం జరిగింది. రాత్రి 8 గం॥ వరకు వచ్చిన వారందరూ, ఎంతో ఆసక్తిగా ఆసాంతం అందరు చెప్పిన అంశాలను వినడం ముఖ్యమైనవి నోటుబుక్‌లో వ్రాసుకోవడం జరిగింది. ఇంత గొప్పగా నిర్వహించబడిన 'కథా కార్యశాలకు' సమయం సరిపోలేదనిపించింది. మాతో ఈ కార్యశాలలో కథలు రాయిస్తారేమో లేదా మేము రాసుకొని వచ్చిన కథలను చదివి అందులోని లోపాలు వస్తువు, శిల్పం, కథా కథనం లాంటివి సరిదిద్ది సరియైన సూచనలు, సలహాలు ఇస్తారని అనుకున్నాను. ఆ విషయంలో నేను కొంత నిరాశకు లోనయ్యాను.

– పురిమళ్ల సునంద

### కార్యశాలలు మరిన్ని పెట్టాలి

నిజంగా ఇటువంటి కార్యక్రమం ఒక్కరోజులో అయ్యేది కాదు. దీన్ని మరోకరోజు పొడిగించి కొత్తగా కథలు వ్రాయాలనుకునేవారితో కథలు వ్రాయించి వాటిని సభలోనే సరిదిద్ది ఇంకా ఎన్నో మెలకువలను నేర్పిస్తే బాగుంటుందని మా అభిప్రాయం. అంతే కాదు ఇటువంటి కార్యశాలలు మరిన్ని పెట్టాలని కొత్త రచయితలకు ఊపిరిపోయాలని మిమ్ములను ప్రార్ధిస్తున్నాను.

– నూనెల శ్రీనివాసరావు

### కథా రచనకు పురిగొల్పింది

కథా కార్యశాలకు వచ్చాక కథానిక పట్ల అవగాహన కలిగింది. ఉత్తమ కథా రచయితగా ఎదగాలంటే పాఠకుని హృదయాన్ని అర్థం చేసుకోవాలనే విషయాన్ని 'కథా కార్యశాల'లో ప్రసంగించిన కథా రచయితల అనుభవాల ఆధారంగా తెలుసుకున్నాను. కవిత్వం మాత్రమే రాసే నన్ను ఈ కార్యశాల కథా రచనకు పురిగొల్పింది. కథకునిగా మార్చింది. సాహితీ ప్రస్థానం మాసపత్రికగానే కాకుండా ఇలాంటి సాహితీ సదస్సులను మరిన్ని నిర్వహించి మాలాంటి యువతీ యువకులకు శిక్షణా సంస్థగా మారాలని కోరుతూ, 'కథా కార్యశాల' నిర్వాహకులకు ధన్యవాదములు తెలుపుతున్నాను.

– సల్ల విజయ కుమార్

## స్పందన

### ప్రేరణ కలిగింది

కథా కార్యశాల కార్యక్రమం మమ్మల్నెంతోగానో ఆకట్టుకొంది. ఒక విధంగా చెప్పాలంటే నా జీవితాశయంలో ఇదీ ఒక భాగమయ్యేలా చేసింది. ఈ కార్యక్రమంలో నేను 'కథ ఎలా రాయాలి'? అనే అంశం గల బ్రోచర్ చదివాను. అందులోని ఆరుద్రగారి కొన్ని సూచనలు నన్నెంతగానో ప్రభావితం చేశాయి. ఈ కార్యక్రమ ప్రేరణతో నేను ఒక కథానిక రాశాను. నేను రాసిన ఈ మొట్టమొదటి కథానికకు ప్రేరణ అందించిన ఈ కార్యక్రమ నిర్వాహకులకు నా నమస్కారాలు. చిన్న అంశంతో కూడా కథను ఎలా మలుపులు తిప్పవచ్చు అన్న విషయాలు నేను తెలుసుకొన్నాను. ఇటువంటి కథా కార్యశాలలు మరెన్నో నిర్వహించాల్సిన అవసరం ఉంది.

– ఎం. సురేందర్

### కథకు ఉద్యమాలే ఊపిరి కావాలని చాటిన సభ

సుందరయ్య విజ్ఞానకేంద్రంలో ఈ సభ జరుగుతున్న హాలులోకి అడుగుపెడుతూనే ఆశ్చర్యానికి లోనయ్యాను. ఎందుకంటే హైదరాబాద్‌లో వతనుగా మూడు నాలుగు చోట్లకు మినహా సాహిత్య సభలు జరిగే మరే ఏ ఇతర చోట్లకూ అంతమంది జనం రావడం చాలా అరుదు. 'కోకిలం' సాహితీ సాంస్కృతిక సంస్థ ఆర్గనైజర్లలో ఒకడిగా నాకు సాహిత్యసభ ఎలా ఉంటుందో బాగా తెలుసు. 40 మందికి మించి జనం ఉండకపోవచ్చని అనుకొన్న నాకు ఆ సభలో ఆ రోజు ఆదిలోనే చాలా మంది రచయితలతో సహా 200 మందిదాకా జనం కనపడి ఆశ్చర్యపోయాను. సరే... మంచి సభ మిస్సవకుండా వచ్చామని సంతోషించాను. ముఖ్యంగా కథా వస్తువు, శిల్పం, సామాజిక ఉద్యమాల కోణం గురించి విస్తృతంగా వక్తలు తమ ప్రసంగాల్లో సమాధాన పూర్వకంగా ప్రస్తావనలు చేస్తూ చర్చ సాగించారు. తెలకపల్లి రవి 'ఉద్యమాలు లేకుండా మానవ నాగరికతలో అభివృద్ధి లేనేలేద'ని కుండబద్దలు కొట్టినట్టు ప్రకటన చేసి చర్చకు సామాజిక కోణాన్ని స్పష్టపరిచారు. సభకు చాలా మంది వర్ధమాన, వర్తమాన, ప్రముఖ కథారచయితలు హాజరై నిండుదనం చేకూర్చారు. మొత్తానికి సాహితీస్రవంతి వారి ఆనాటి కథా కార్యశాల చాలా కాలం గుర్తుండేలా దిగ్విజయంగా, ప్రయోజనకరంగా సాగింది.

– పురాణం శ్రీనివాస శాస్త్రి

రకరకాల అనుభవాల్నిస్తూ, ఎప్పట్నుంచో రాయాలనున్నా, పెన్ను పెట్టలేకపోవడానికి అడ్డంకులైన పరిస్థితుల్ని విశ్లేషించుకునేందుకు తోడ్పడింది. కథలు రాయడానికి టెక్నిక్‌లను సూచించే ఆరుద్ర చిన్న పొత్తం అందించడం ముదావహం.

– శ్రీనివాసరావు

మీరు నిర్వహించిన కథా కార్యశాలకు హాజరయ్యాను. ప్రమాణ పత్రం తీసుకొని సాయంత్రం ఇంటికి వచ్చేశాను. ఈ రోజు సాయంకాలం మీ వద్ద నుండి ఫోన్ వచ్చింది. చెప్పొద్దూ, చాలా సంతోషమైంది. నేర్చుకున్న విషయాలు మరువనీయకుండా మా చేత కథలు రాయించడానికి మీరు ఇస్తున్న ప్రోత్సాహం ఎంతో ఉత్సాహాన్ని, ధైర్యాన్ని ఇస్తోంది.

– మోహిత

### నాకు నేనుగా హాజరయిన సభ

నా పాతికేండ్ల వయస్సులో నాకుగా నేను అనుకుని హాజరైన సాహితీ సభ ఇదే మొదటిది. నేను మా నాన్నతో చాలా సమావేశాలకు హాజరయ్యాను. అవన్నీ మా నాన్న నన్ను తీసుకెళ్ళినవి. కాని ఇదే నేను మొదటగా ఇష్టంతో ఒక్కడిగా స్వంతంగా పోయిన తెలుగు సాహిత్య సమావేశము. నా బిటెక్, ఎంబిఏ క్లాస్‌మేట్స్‌లలో ఎవరికీ ఈ మాత్రం అన్నా తెలుగు సాహిత్యంతో సంబంధం లేదు. ముఖ్యంగా ఇంగ్లీషు మీడియం పిల్లలం, ఇంజనీరింగ్, మెడిసిన్ పిల్లలం తెలుగు సాహిత్యం

స్పందన

జోలికి అస్సలే పోలేదు. పోలేని చదువుల ఒత్తిడి మాది. మా తల్లిదండ్రులు కూడా ఆ ప్రపంచాన్ని మాకస్సలికే పరిచయం చేయరు. మా భవిష్యత్తు, కెరీర్ దృష్ట్యా చెయ్యలేరు కూడా. తెలుగు కథ తెలుగు సాహిత్యము, తెలుగు భాష, తెలుగు సంస్కృతి లాంటి ఎన్నో తెలుగు జాతి గురించిన విషయాలు పరిచయం చేసారు.

- మేరాజ్

### ఫలప్రదం కథా కార్యశాల

వర్క్‌షాప్‌లో పాల్గొన్న వారికి ముందుగా ఆరుద్ర గారి 'కాబోయే కథకులకు పనికొచ్చే చిట్కాలు' పుస్తకం, చివరన సర్టిఫికెట్ల ప్రధానం జరిగింది. దాదాపుగా 10 గం॥ ల పాటు కొనసాగిన కథా కార్యశాల ఎన్నో మెలకువల్ని నేర్పింది. ఎందరెందరితోనూ పరిచయ భాగ్యాన్ని కలగజేసింది. ఏ ఉద్దేశ్యంతో అయితే కార్యక్రమం నిర్వహించారో అది వందకు వందశాతం నెరవేరిందని ప్రగాఢంగా విశ్వసిస్తున్నాను. ఈ కథా కార్యశాలలో నా కథా సంపుటి "నయనం ఆలపించి" అవిష్కరించేందుకు అవకాశం కల్పించిన సాహితీ స్రవంతి వారికి నా ధన్యవాదాలు.

- సాహిత్య ప్రకాశ్

### ఎంతో ఉపయోగం

కథా కార్యశాల నాకెంతో ఉపయోగపడింది... కథా వస్తువు ఎలా ఎన్నుకోవాలి, ఏ విధంగా రచన సాగాలో, ఎటువంటి కథలు వ్రాస్తే పాఠకులకు దగ్గర కాగలుగుతారో వంటి విషయాలను తెలుసుకోగలిగాను.

-ఎస్. విజయలక్ష్మి

### మంచి ఉత్తేజాన్నిచ్చింది

ఇలాంటి కార్యక్రమాలు నిర్వహించడం వల్ల విద్యార్థులకు, పరిశోధకులకు, యువ రచయితలకు కథారచన పట్ల అభిరుచిని పెంపొందించవచ్చు. ఇలాంటి కార్యక్రమాలు మరిన్నింటిని సాహితీస్రవంతి వారు నిర్వహించాలని కోరుతున్నాను.

-పి. గోపినాథ్ రాథోడ్

## ఒక పాఠక అనుభవం

పత్రికలలో 'కథ కార్యశాల' ప్రకటన చూసిన వెంటనే ఒక ఉత్సాహానికి లోనయ్యాను. మొదటి నుండి కథలు అంటే ఇష్టం. కథలు రాయడం మరీ ఇష్టం. అందుకే ఆసక్తి కలిగింది. సాధారణంగా 'సుందరయ్య విజ్ఞానకేంద్రం' పరిసరాల్లో ఒక స్ఫూర్తివంతమైన గాలి వీస్తుంది. అక్కడికి అనేక రకాలయిన పుస్తకప్రియులు సాహితీప్రియులు, పాఠకులు చేరుకుంటారు. అక్కడ భిన్నత్వంలో ఏకత్వం కనిపిస్తుంది. అదొక కూడలి. ఎలాంటి ఆలోచనలు లేకుండా ఖాళీ హృదయంతో రాత్రి డ్యూటీ ముగించుకొని, కథ కార్యశాలలో అడుగుపెట్టాను. ఓల్గా ప్రారంభ ఉపన్యాసం నుండి వేంపల్లి షరీఫ్ కథ నేపథ్యం కథ పఠనం వరకు అందరి ఉపన్యాసాలు చాలా శ్రద్ధగా విని బయలుదేరాను. రోజు మొత్తం ఉదయం నుండి రాత్రి వరకు పాఠకులు, రచయితలు అందరు చాలా ఓపికతో ఉండడం అసలు నిండు రోజు నిర్వహించిన కథలకోసం కదలకుండా కూర్చునే పరిస్థితి వచ్చింది. ముఖ్యంగా నన్ను లెనిన్ ధనశెట్టి ఉపన్యాసం కుదిపివేసింది. చాలా ఉపయోగకరంగా ఉంది. కథాశిల్పం గురించి చాలా విస్తృతంగా వివరించారు.

#### ఉపన్యాసం ఉత్సాహం ఇచ్చింది

కథ కార్యశాల వ్యక్తిగతంగా నాకు చాలా ఉపయోగకరంగా ఉంది. ప్రతివారు కథకులే. కథలు రాయగలరు, కథలు చెప్పగలరు అనే ఒక స్పృహను కలిగించింది. అనేక భావాలు భావజాలాలు ఉన్నప్పటికి కథలు అంటే ఆసక్తి ఉండి రాయాలి అనుకునేవారికి తొలి పాఠశాలగా, శిక్షణశాలగా ఎంతో ఉపయోగకరంగా ఉంది. ఇలాంటి కార్యశాలలు అనేకం జరగాలి. ఒక స్ఫూర్తిని రగిలించాలి అనిపించింది. కొంత జ్ఞానాన్ని పొందాను అనే అనుభవంతో వెళ్ళిపోయాను మిత్రుడు ఇంద్రవెల్లి రమేష్‌తో కలిసి.

-మోతుకూరు శ్రీనివాస్

# అవసరాలు, అవకాశాలూ

- వారప్రసాద్

సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో నిర్వహించిన కథ కార్యశాల ఊహించని స్థాయిలో విజయవంతమైంది. వివిధ సాహిత్య ప్రక్రియలలో మార్గదర్శకత్వం కోసం ఔత్సాహికులు ఎంత ఆసక్తిగా ఎదురుచూస్తున్నారో ఈ కథా కార్యశాల రుజువు చేసింది. గత సంవత్సరం వచన కవితా ప్రక్రియ పట్ల అవగాహన పెంపొందించడానికి ఇదే సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో జరిగిన కవిత్వశాలలో కూడా ఈ విధమైన స్పందనే చూశాం. వంద రూపాయలు చెల్లించి ఈ శిక్షణా కార్యక్రమాలలో ఔత్సాహికులు పాల్గొంటున్నారంటే తెలుగు సాహిత్యం వికాసం కోసం కృషి చేసే వారందరికీ సంతోషం కలుగుతుంది. ఇటువంటి కార్యక్రమాలు దీర్ఘకాలికంగా నిర్వహించాల్సిన అవసరాన్ని కూడా తెలియజేస్తుంది.

రచన చేయాలన్న అభిలాష కలిగి ఉండటం భాష అభివృద్ధికి దోహదం చేస్తుంది. తెలుగు భాష వికాసానికి పాటుపడుతున్న వారంతా ఇటువంటి వారికి మార్గదర్శకత్వం చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఒకప్పుడు ఇటువంటి శిక్షణలు లేకపోవచ్చు. స్వయంకృషితో తొలి నవలలు, తొలి కావ్యాలు, తొలి కథలు, తొలి నాటకాలు రాసి ఉండవచ్చు. ఇప్పుడు ఆ అవసరం లేదు. ముందు తరాల రచయితలు అనేక రచనలు చేసి కొత్తగా రాసేవారి కోసం బాటలు పరిచారు. ఆ బాటలను అధ్యయనం చేసి అవగాహన కల్పించుకుంటే రచనలు చేయవచ్చు. గత రచనల సృష్టితో కొన్ని ప్రమాణాలు ఏర్పడ్డాయి. ఆ ప్రమాణాల గురించిన అవగాహన కొత్తగా రాసేవారికి ఉండాలి. మన రాష్ట్రంలోని తెలుగు విశ్వవిద్యాలయంతో పాటు, వివిధ విశ్వవిద్యాలయాలు ఆ ప్రయత్నం కొంతమేరకు చేస్తున్నాయి. కాని సంఖ్యరీత్యా పరిమితమే. కేవలం విశ్వవిద్యాలయ విద్యార్థులకే కాకుండా ఆసక్తి గల ఇతరులకు కూడా ఇటువంటి శిక్షణా తరగతులు ఏర్పాటు అవసరం ఈ రోజు కనపడుతుంది. ఆ దిశగా విశ్వవిద్యాలయాలు ప్రయత్నం చేయాలి.

అలాగే వివిధ సాహితీసంస్థలు కూడా ఇటువంటి కృషిచేయాలి. చాలా తక్కువ సంఖ్యలో కొన్ని సంస్థలు ఇటువంటి ప్రయత్నాలు చేయకపోలేదు. కానీ ఆ కృషి సరిపోదు. ప్రస్తుతం సాహితీస్రవంతి తన శక్తిమేరకు రాష్ట్రవ్యాప్తంగా ఇటువంటి సాహిత్యశాలలు, కథాశాలలు, వచన కవిత్వశాలలు నిర్వహించింది. నిర్వహిస్తున్నది.

ఇటువంటి కథాకార్యశాలలు, సాహిత్యశాలలు, కవిత్వశాలలను మరింత ప్రయోజనకరంగా నిర్వహించాల్సిన అవసరం ఉంది. అందుకోసం ప్రత్యేక కృషి చేయాలి. అందుబాటులోకి వస్తున్న నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని, కంప్యూటరైజేషన్‌ను ఉపయోగించుకుని ఈ శిక్షణా కార్యక్రమాల్ని రూపొందించాలి. ప్రభుత్వ ఆధ్వర్యంలో పెద్దయెత్తున ఇటువంటి కార్యక్రమాలు జరగాలి. ఈ కృషిలో రాష్ట్రంలో ఉన్న క్రియాశీల సాహితీసంస్థలకు భాగస్వామ్యం కల్పించాలి.

తెలుగు భాష వికాసానికి ఇటువంటి శిక్షణా కార్యక్రమాలు ఇతోధికంగా దోహదం చేస్తాయి. భాషా వికాసానికి కృషిచేయడమంటే ఇటువంటి కార్యక్రమాలు నిర్వహించడం కూడా చాలా ప్రధానం. సాహిత్యం అంతిమంగా సామాజిక సంస్కారాన్ని పెంచడానికి దోహదం చేస్తుంది. అది దృష్టిలో పెట్టుకున్న ఇటువంటి శిక్షణలకు సామాజిక చైతన్యం అంతిమ లక్ష్యంగా ఉండాలి.

ఇటీవల కథానిక ప్రక్రియకు ఆకర్షణ పెరిగింది. రాసిన వాటిని ప్రచురించే అవకాశాలు కూడా పెరిగాయి. ఇంటర్నెట్ విస్తరించడం కొత్త అవకాశాలకు నాంది పలికింది. ఫేస్‌బుక్ లాంటి సోషల్ నెట్‌వర్క్‌లలో, సొంత బ్లాగ్‌లలో, వెబ్‌సైట్‌లలో విస్తృతంగా తమ భావాలను అక్షరీకరించే వారి సంఖ్య ఊహించని రీతిలో రోజురోజుకూ పెరుగుతున్నది. ఇంటర్నెట్‌లో తెలుగువ్యాప్తి విస్మయపరిచే విధంగా ఉంది. వీటన్నింటినీ దృష్టిలో పెట్టుకున్నప్పుడు తెలుగు భాష, సాహిత్యం మరింతగా వికసిస్తాయనడంలో సందేహం లేదు. అయితే ఈ ఇంటర్నెట్ సౌలభ్యం తెలుగు భాషకు కొత్తపదాలను అందించే అవకాశం ఉంది. ఈ క్రమంలో భాషపట్ల అవగాహన పెంచేలా ప్రభుత్వం ఒక యంత్రాంగం ఏర్పాటు చేయాలి. ఇంటర్నెట్‌లో ఉపయోగించే భాషను జాగ్రత్తగా ఎంపికచేసుకునేలా మార్గదర్శకత్వం వహించాలి. అందుకోసం తెలుగు భాషాభిమానులు, సాహితీవేత్తలు ప్రభుత్వం మీద ఒత్తిడి తీసుకురావాలి. ఇటువంటి చర్యలు మాత్రమే తెలుగు సాహిత్యం సుసంపన్నం కావడానికి దోహదం చేస్తాయి.

# సెంటర్ ఫర్ డెవలప్‌మెంట్ స్టడీస్ - ఎపిఎఆర్‌డి




### సీడీఎస్-ఎపిఎఆర్‌డి గురించి :

సీడీఎస్-అపార్డ్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే జి.ఓ.ఎంఎస్ నం.397, పిఆర్&ఆర్‌డి(ఆర్‌డి-1) డిపార్ట్‌మెంట్, తేదీ 27-12-2000 ద్వారా ఏర్పరచబడినది మరియు ఎ.పి. (తెలంగాణా ఏరియా) పబ్లిక్ సొసైటీ యాక్ట్ 1352 ఎఫ్ (రిజిస్ట్రేషన్ నం. 2/2001, తేదీ 18-01-2001) కింద సొసైటీగా రిజిస్టర్ చేయబడినది.

ఇది మానవవనరుల అభివృద్ధి మరియు అభివృద్ధి అధ్యయనాలు ధ్యేయంగా పనిచేసే ఒక లాభాపేక్ష లేని సంస్థ. శ్రీ.కె.చంద్రమౌళి, ఐ.ఎ.ఎస్ (రిటైర్డ్) డైరెక్టర్ జనరల్ హోదాలో సీడీఎస్ - అపార్డ్‌కు నేతృత్వం వహిస్తున్నారు.

### అవలోకనం :

### పథకాల నిర్వహణ:

అయా బాహ్య సంస్థల తరఫున పథకాలు అమలు చేసింది. యూనిసెఫ్ (UNICEF) : 2003లో పూర్తయిన నీరు మరియు పారిశుధ్య పథకం. రాయల్ నెదర్లాండ్స్ ఎంబసీ: 31-12-2004న పూర్తయిన వాటర్ కన్జర్వేషన్ మిషన్ (డబ్ల్యుసిఎం)పథకం. డిఎఫ్ఐడి:31-12-2007న పూర్తయిన ఆంధ్రప్రదేశ్ గ్రామీణ వృత్తుల పథకం (ఎపిఆర్ఎప్‌పి). 31-12-2008 న పూర్తయిన ఎస్ఇఆర్‌పి గిరిప్రగతి కార్యక్రమం. యుఎన్‌డిపి: దేశవ్యాప్త ఉపయోగం కోసం ఎన్ఆర్ఇజిఎస్ మీద 4 మాడ్యూల్స్, 3 ఫిలమ్స్ సిద్ధం చేసేందుకు 2008లో మైక్రో క్యాపిటల్ గ్రాంట్ ఇచ్చింది. ఈ కార్యం పూర్తి చేయబడింది.

### అనేక కాంట్రాక్టు పొజిషన్ల కోసం నియామకాలు :

సీడీఎస్-అపార్డ్ గ్రామీణ అభివృద్ధి విభాగం కోసం 1961 ఇంజినీరింగ్ కన్సల్టెంట్స్,ఉద్యాన విభాగంలో 809 మంది క్షేత్ర స్థాయి విధినిర్వాహకులు ఎ.పి కమ్యూనిటీ బెస్ట్ ట్యాంక్ మేనేజ్‌మెంట్ ప్రోగ్రాం (ఐ&సిఎడి విభాగం) లో 113 మంది అసిస్టెంట్ ప్రాజెక్ట్ డైరెక్టర్స్, ఉపాధి కల్పన మరియు మార్కెటింగ్ మిషన్ (ఇజిఎంఎం)లో 120 మంది విధినిర్వాహకులు, గ్రామీణ బీదరిక నిర్మూలన సొసైటీ (ఎస్ఇఆర్‌పి)లో 110 మంది టెక్నికల్ కన్సల్టెంట్స్ కోసం 2009-13 మధ్య కాలంలో నియామకాలు నిర్వహించింది.

### శిక్షణ కార్యక్రమాల నిర్వహణ

ఎన్‌జివోలు (ప్రభుత్వేతర సంస్థలు), పౌర సమాజ సంస్థలు, విశ్వ విద్యాలయాల విధినిర్వాహకుల కోసం దిగువ పేర్కొన్న శిక్షణ కార్యక్రమాలు నిర్వహించడమైనది.

- గ్రామీణ అభివృద్ధి పరిశోధన కోసం మెథడాలజీ
- అభివృద్ధి కార్యక్రమాలలో ప్రజల ప్రాతినిధ్యం మరియు కమ్యూనిటీ మొబిలైజేషన్
- అభివృద్ధి భావన మరియు సహస్రాబ్ది అభివృద్ధి లక్ష్యాలు
- పౌరుల సాధికారత
- ఆర్‌టిఐపై శిక్షలు
- కెరీర్ డెవలప్‌మెంట్ కోసం సామర్థ్య నిర్మాణంపై బిఎస్‌విల కోసం శిక్షణ

### పుస్తకాల ప్రచురణ:

"ఇంటిగ్రేటెడ్ వాటర్‌షెడ్ డెవలప్‌మెంట్" అనే పుస్తకాన్ని ఎనిమిది వాల్యూములుగా సీడీఎస్-అపార్డ్ ప్రచురించింది.




### రాష్ట్ర శిక్షణ మరియు వనరుల కేంద్రం :

న్యూఢిల్లీలోని నేషనల్ ఎయిడ్స్ కంట్రోల్ ఆర్గనైజేషన్ 2010లో సీడీ ఎస్-అపార్డ్‌కు స్టేట్ ట్రెయినింగ్ & రిసోర్స్ సెంటర్ (ఎస్‌టిఆర్‌సి)ను మంజూరు చేసింది. ఆంధ్రప్రదేశ్‌లో హెచ్ఐవి/ఎయిడ్స్ నివారణ కోసం ఎన్‌స్‌జివోలకు చెందిన అనేక మంది విధినిర్వాహకులకు ఎస్‌టిఆర్‌సి శిక్షణలు నిర్వహిస్తుంది.

### విద్యార్థులకు ఇంటెర్న్‌షిప్ :

నాగార్జున యూనివర్సిటీ ఎంబీఏ విద్యార్థులు, జేవియర్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్ (భునేశ్వర్) రూరల్ మేనేజ్‌మెంట్ విద్యార్థులు సీడీఎస్‌లో ఇంటెర్న్‌షిప్ చేశారు. తెలంగాణ యూనివర్సిటీకి చెందిన 20 మంది ఎంఎస్‌డబ్ల్యు విద్యార్థులు తమ ప్రాజెక్ట్ వర్క్‌ను సీడీఎస్‌లో పూర్తి చేసుకున్నారు.

### రీసెర్చ్ స్టడీస్ :

సీడీఎస్-అపార్డ్ దిగువ పేర్కొన్న రీసెర్చ్ అధ్యయనాలు నిర్వహిస్తోంది

- గ్రామీణ ప్రాంతాల్లో కిశోర బాలికల్లో పోషకాహార స్థాయిల మదింపు
- హరిత విప్లవం వర్సెస్ క్రాప్ హాలిడే
- పని ప్రదేశాల్లో మహిళలపై వేధింపులు
- ఒక గ్రామం ప్రస్తుతం ఎలా ఉందీ, పదేళ్ల క్రితం ఎలా ఉందీ అనే అంశంపై తులనాత్మక అధ్యయనం
- లింగభేదం మరియు ఎంజిఎన్ఆర్ఇజిఎస్
- ఏఆర్‌టిపై పిఎల్‌హెచ్ఐవి పోషకాహార స్థాయి మదింపు
- తీవ్రవాదం హింసాకాండ బాధిత కుటుంబాల మరియు ప్రభుత్వానికి లొంగిపోయిన తీవ్రవాదుల కుటుంబాల సామాజిక ఆర్థిక స్థితిగతులు (ఎ.పి. ప్రభుత్వం కోసం ఆ అధ్యయనం నిర్వహించబడుతోంది.

### సంప్రదించండి :

సెంటర్ ఫర్ డెవలప్‌మెంట్ స్టడీస్ - ఎపిఎఆర్‌డి
శిఖరాగ్రం,
రాజేంద్రనగర్
హైదరాబాద్-30
ఆంధ్రప్రదేశ్, ఇండియా
ఫోన్ : 040 24590111
ఇ మెయిల్ : cdsapard@gmail.com
www.apard.gov.in





| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | VPVMO_IA 109 |
| పుస్తకం పేరు | Cinnanoo |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 201 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Gayathri |
| పేజీలు విడదీసినది | Gayathri |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |